శ్రీరస్తు

# జైమిని భారతము

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి

కృతము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే బ్రకటితము.

 [*Price* Rs. 2—8—6

శ్రీరస్తు

# జైమినిభారతము

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి

కృతము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము.

1953

# పీఠిక

పిల్లలమఱ్ఱివంశసంభూతుఁడై, గాదయామాత్యునికుమారుఁడై, పెదవీరన్నకనుజుఁడై, భారతీతీర్థులకు శిష్యుఁడై యొప్పునీపినవీరభద్రన జైమినిభారతాశ్వమేధపర్వమును దెనిఁగించిన సత్కవిశిరోమణి. ఈతనికవిత్వ మసమానమై, గంభీరతాత్పర్యాలంకృతమై యొప్పుచున్నది. ఈసత్కవి శృంగారశాకుంతల మనునామాంతరము గల శకుంతలాపరిణయమును రచించెను. ఇవిగాక మఱియుఁ బెక్కుగ్రంథములు రచించినట్లు శకుంతలాపరిణయమునందలి యీపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

సీ. "రచియించినాఁడవు రమణీయవాగ్రీతి
నవరసదర్పణం బభినవముగఁ
బలికినాఁడవు తేటపడఁజేసి నారదీ
యము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీవిశేషంబున
మాఘమాహాత్మ్యంబు మంజుఫణితిఁ
గావించినాఁడవు ఘనబుద్ధిమానసో
ల్లాససారము సముల్లసితశయ్య
తే. భారతీతీర్థయతిసార్వభౌమగురుకృ
పాతిశయలబ్ధకవితావిభూతి గలిగి
గౌరవముఁ గాంచినాఁడవు కవులచేత
విపులచాటూక్తి నిర్నిద్ర వీరభద్ర."

అశ్వమేధపర్వమును సాళువగుండ నృసింహభూపాలున కంకితము చేసెను.

పినవీరభద్రున భారతకవులతో సరిపోల్పఁ దగినవాఁడు. ఇటీవలికవు లీతనికవిత్వమును మేలుబంతిగాఁ గైకొనియున్నా రనుట నిర్వివాదాంశము. ఇతఁడు స్వప్నములో భగవంతుఁడు ప్రత్యక్షమయి జైమినిభారతమును దెనిఁగించి నాభక్తుఁడగు నృసింహనరవిభునకు నంకితముచేయు మని యనుజ్ఞయిచ్చిన ట్లేల చెప్పుకొనలేదో తెలియరాకున్నది. ఎందఱికో స్వప్నమునఁ దోఁచి గ్రంథరచనకుఁ బ్రోత్సాహముచేసిన కరుణానీరధి భగవంతుఁ డీమహాకవి కేల ప్రత్యక్షము కాలేదో బోధపడకున్నది.

సామాన్యముగఁ గవులు తమయభీష్టదేవతకరుణవలనఁ దమకుఁ గవితాశక్తి యలవడినట్లు చెప్పుకొనునాచార ముండఁగా నీమహాత్ముఁడు తాను భారతీతీర్థశ్రీచరణకరుణాపాత్రుఁ డయినట్లు చెప్పుకొనుటం జూడ నీతనికి గురువునందు దృఢభక్తి గల దని స్పష్టమగుచున్నది.

"భావజ్ఞులకుఁ బరాపశ్యంతి మధ్యమావైఖరు లేదేవివర్ణసరణి"

అను సరస్వతీధ్యానఘట్టమునుబట్టి చూడఁగా నీతఁడు శారదామంత్రోపాసకుఁ డనియు, మంత్రతంత్రరహస్యవేత్త యనియుఁ దేటపడుచున్నది.

ఈకృవి తనకవిత్వమునుగూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

"అల్లనవిచ్చుచెంగలువలందు రజం బనుకప్పురంబుపైఁ
జల్లఁగఁ జల్లనై వలచుసౌరభముల్ వెదచల్లుభావముల్
పల్లవహస్తచన్నుఁగవపయ్యెద జీబుగఁ దోఁచుభాతిగాఁ
బిల్లలమఱ్ఱివీరన యభిజ్ఞుఁడు చెప్పఁగ నేర్చుఁ గబ్బముల్."

ఈతని యన్నయుఁ దండ్రియుఁ దాతయుఁ గవులైనట్లు ఈక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

క. "తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువనభాసురకృతిని
ర్మాతలం పిల్లలమఱ్ఱివి
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁగలరే సుకవుల్."

గ్రంథమంతయుఁ జదివిచూడఁగాఁ బై పద్యములలోని యర్థము సార్థక మని స్పష్టము గాకమాన దని మూటికి ముమ్మాటికి నిరాఘాటముగాఁ జెప్పవచ్చును. శ్రీనాథాదిసత్కవు లితని కాలమునకు రమారమి సమకాలమున నుండినవారు కాఁబట్టి పూర్వకవిస్తుతిలో వారినిఁ జేర్పలేదు. అప్పటికి భారతకవులు నాచనసోమన ప్రాచీను లని తోఁచుచున్నది.

కవిచరిత్రమువలన నీతఁడు రమారమి నాలుగువందల నలువది సంవత్సరముల క్రిందట నున్నవాఁ డని తేలుచున్నది. కృతిపతి కాలము మొదలగువిషయము లిట ననవసరము గావునఁ జర్చింపలేదు.

ఈ పినవీరభద్రనమహిమలనుగూర్చినకథలను బలువురు పలువిధములుగఁ జెప్పుచున్నారు. అం దొక్కదానినిమాత్రము

వ్రాసెదను. సాళువగుండ నృసింహభూపతి యొకనాఁడు జైమిని భారతమునందలి యశ్వమేధపర్వమును దెనిఁగింపఁగలవా రెవ్వరని సభలో నడుగఁ బండితులందఱు నేకవాక్యముగఁ బిల్లలమఱ్ఱి పినవీరభద్రన నివురుగప్పిన నిప్పువలెఁ దనమహిమ గానరాకుండ నున్నాఁడనియు, నతఁ డిప్పనికి వలఁతియనియుఁ జెప్పఁగా నానరపతి సబహుమానముగా గారవించి కొంతకాలము గడువుపెట్టి యీకృతి రచింపు మని పంపెనఁట.

ఆగడువులోపల నీతఁ డక్కార్యమును జేయక తన కిచ్చవచ్చినట్లు తిరుగుచుండెనఁట. పెదవీరన యెన్నిసారులు హెచ్చరించినను జెవిని వేసికొనక తిరుగుచుండఁగా గ్రంథమును వినిపించవలసినదినము మఱుదిన మైనట్లు అన్న మరల హెచ్చరించెనఁట. ఆరాత్రి యక్కవి భుజింపక తనపడకగదిని బరిశుద్ధముచేయించి దర్భాసనములు వేసి తలుపు మూసి కూర్చుండి శారదాంబను ధ్యానింపఁగా నాదేవి ప్రత్యక్షమై గ్రంథము వ్రాయ నారంభించెనఁట. గంటముచప్పుడు పదిమంది వ్రాయుచున్నట్లు కాఁగా పెదవీరన యిది యేమిచిత్ర మని మనసు నిలుపఁజాలక తలుపురంధ్రములనుండి తొంగిచూడఁగా నాదేవి బావగారు తొంగిచూచుచున్నా రని లేచిపోయెనఁట. పినవీరభద్రన కొఱఁతపడియున్న కొద్దిభాగమును బూర్తిచేసి మఱుదినము సకాలమునకు రాజసభకుఁ గొంపోయి సమర్పించెనఁట. రాత్రిసంగతి యెట్లో పండితులకుం దెలిసి సభలోఁ బ్రస్తావింపఁగా నీకవి "వాణి నారాణి" యని యుత్తరము

చెప్పెనఁట. నీరాణి వాణియైనది వాస్తవమే యని మే మెట్లు నమ్మవచ్చు నని రా జడుగునంతలో నవరత్నమయము లగు కంకణము మెఱయఁ దనహస్తమును శారదాంబ తెరలో నుండి కనఁబఱచి యీతనిమాట సత్యము, సత్యము, సత్య మని పలికెనఁట. ఆ యద్భుతవృత్తాంతమున కెల్ల రాశ్చర్యపరవశులై కవిని గౌరవించిరఁట.

"ప్రణవపీఠమున మంత్రపరంపరలు గొల్వ నుండు నేదేవి పేరోలగంబు

* * * * *

అమ్మహాదేవి వాగ్దేవి నభినుతింతు."

అని తనభక్తిని శారదాంబావిషయమునఁ గనఁబఱచిన యీసత్కవి "వాణి నారాణి" యని చెప్ప నెట్లు సాహసించెనో తెలియ రాకున్నది. వాణీ లక్ష్మీ భవానులయందు మాతృభావము గలిగియుండుట సర్వజనులకు నైజమైయుండ గురుదేవతాభక్తిపరాయణుం డగు నిమ్మహాత్ముఁడు "వాణి నారాణి" యని నోటఁ జెప్పియుండునా యని సందేహము గలుగుచున్నది. ఈకథయందలి సత్యము భగవంతుఁడే యెఱుఁగును. చక్కఁగ నాలోచింప నీకవి శారదాభక్తుఁ డనియు, శారదోపాసకుం డనియు స్పష్టము కాకమానదు.

ఇంతట నీవిషయము నుజ్జగించి యిక్కవికవితాశక్తిని విచారింతము. సంస్కృతమున కిది యొకపరివర్తనమో మూలము దొరకనందునఁ జెప్ప వీలుపడదు. ఇక్కవికవిత్వముమాత్ర మసమాన మైనది. ఇందు సంస్కృతాంధ్రపదములు సమానముగ

నున్నవి. కొన్ని తావుల దీర్ఘసమాసములతోఁ బద్యములు వెలయుచున్నవి. కొన్ని తావుల సులలితాంధ్రపదములు చెన్నువహించుచున్నవి. గంగాప్రవాహమువలె నీకవిత పవిత్రమై గంభీరభావాలంకృతమై శ్రవణానందప్రదమై యలరారుచున్నది.

ఈ క్రిందిపద్యములవలన నీవిషయములు తేటపడఁగలవు.

సంస్కృతపదవైచిత్ర్యము

సీ. "స్ఫాటికమణిశిలాప్రత్యగ్రరచనాతిబంధురప్రాకారభాసురంబు
పాతాళజలఝరీపర్యాప్తకల్లోలసుకుమారపరిఖాశోభితంబు
కనకసౌధాంచలకలితముక్తాఫలరాజలీలాగ్రతారాగణంబు
శక్రనీలశిలావిశాలగోపురరోచిరసమయజనితమిథ్యాతపంబు
తే. భువనకాసారకహ్లారపద్మకుముద, పుండరీకనీలోత్పలషండసురభి
విపులమధుకరకలనాదవిజితపుష్ప, చాపనినదంబు భద్రావతీపురంబు."

- ౧ ఆశ్వా. ౮ పద్యము.

మ. "అని చాణూరబకాంతకుల్ సముచితవ్యాపారులై ముందటం
గని యుత్ఫుల్లసరోజహల్లకపరాగస్ఫారవీచీఘటా
కనదుత్తుంగజితరాజహంసబకచక్రక్రౌంచసంచారముల్
జనితాంతఃపరితాపవారణసుధాసారమ్ముఁ గాసారమున్."

3 ఆశ్వా. ౭౮ పద్యము.

తెలుఁగుపదములు

సీ. "కొరగించెడు కొండగోఁగుఁబువ్వులచాయ
దీవన్నె గోర్పడం బెట్టు కలిగె

మెఱుఁగుఁజుక్కలచాయ మించు నీతెల్లని
గురువిందపే రెందుఁ గూర్చుకొంటి
నిగురుగప్పునిచంద్రనిప్పుకైవడి నున్న
దీకొడ్డిభూస నీకెవ్వఁ డిచ్చెఁ
బొలసినగబ్బుకంపులు పోఁడుముట్టెడు
నీనల్లతిరునామ మెచట దొరకె
తే. జడలు మెడమీఁద వ్రేలెడుజల్లితోఁక
నేఁడ సవరించుకొంటివి బోడకోడె
యనుచు నాడెడుమూఢవాక్యముల కలరి,
శ్రీధరుఁడు వారిఁ గృప నాదరించె నపుడు."

3 ఆశ్వా. ౭౪ పద్యము.

ఉ. "భృంగి దలంపఁగాఁ బరమభృత్యుఁడు నర్మసఖుల్ పిశాచముల్
కంగటికాలు నమ్మఁదగుకైదువు రక్షలు శల్యఖండముల్
జంగిలిగిబ్బవారువము సర్వము నీగతి సెన్నిచూచినన్
మంగళ మేమిఁ బ్రాఁతి పురమర్దన నీకెపుడున్ జయోన్నతుల్."

౫ ఆశ్వా. ౦౫ పద్యము.

శ్లేషకవిత్వమునందుఁగూడ నీసత్కవికిఁ జమత్కృతి కల దని యీపద్యమే చాటుచున్నది.

క. "కువలయమనోజ్ఞయుఁను స
త్కవిసేవితయును సుధాప్రకాశయు నై రా
ఘవుకీర్తిఁ బోలు జాహ్నవి
నవనిజ గని ధన్య నైతి నని కొనియాడెన్."

౬ ఆశ్వా. ౫౯ పద్యము.

ఇక్కవి పెక్కునీతులను జమత్కారముగఁ బద్యముల యం దిమిడ్చియున్నాఁడు. అందు గొన్నింటినిమాత్ర ముదాహ రించుచున్నాను.

క. "కలనన్ మనవారెల్లను
బొలిసిరి నీదుర్ణయమునఁ బోయినయవి పె
ద్దలె నాకును 'స్త్రీబుద్ధిః
ప్రళయాంతక' యనెడి పలు కబద్ధం బగునే."

౪ ఆశ్వా. ౫౭ పద్యము.

క. "జనవరుఁడు పురాణములం
దనఘా 'యభ్యాగతస్స్వయం విష్ణువు' నా
వినఁబడు నినుఁ జూచిననా
జనార్దనునిఁ జూచినట్ల సంతస మయ్యెన్."

౭ ఆశ్వా. ౨౦౪ పద్యము.

తే. "చింతతో 'నటవ్యాం నారసింహ' యనుచు
నూటయెనిమిదిమాఱు లెన్నుకొనివరుస."

౭ ఆశ్వా. ౨౧౦ పద్యము

క. "నీయెడ మముబోంట్లకు నే
లా యేసంశయము 'దుర్బలస్య బలం రా
జా' యని పలుకువిశిష్ట
న్యాయము గలుగుట మదార్తి హరియింపఁదగున్."

౭ ఆశ్వా. ౨౧౪ పద్యము.

ఈక్రిందిప్రయోగమువలన నిక్కవికి సంస్కృతవ్యాకృతి పాండిత్యము కల దని వ్యక్త మగుచున్నది.

మ. "ప్రద్యుమ్నుం డనుశాల్వపాటునకు సుగ్రాంపట్న్యుఁడై......'

౫ ఆశ్వా. ౧౮౬ పద్యము.

ఇమ్మహాకవిప్రయోగమున నేలొకో వ్యాకరణవిరుద్ధప్రయోగములు కొన్ని కానవచ్చుచున్నవి. అందుం గొన్నింటి నుదాహరించుచున్నాఁడను.

## క్త్వార్థకేకారసంధులు

'రథావతరణంబొనరిం చెనురేగుదెంచిరన్.' — ౫ ఆశ్వా. ౯౧ పద్యము.

'ఎదిరిం చాకర్ణరుక్పుంఖమండనుఁడై ' — ౪ ఆశ్వా. ౧౮౦ పద్యము.

'మూఁడు బలునారసముల్ దొడి గాత
పత్రముల్.' — ౭ ఆశ్వా. ౭ పద్యము.

'పుత్రా యొఱఁ గిట్లు చేయు పితృహాస్య' — ౭ ఆశ్వా. ౫౬ పద్యము.

'మ్రొఖుం చరిఁ జూచి' — ౭ ఆశ్వా ౧౬౭ పద్యము.

'ప్రయాసమొం దనిమిషరాట్సుతుండు.' — ౮ ఆశ్వా. ౧౨౫ పద్యము.

## తత్సమసంధులు

'దనుజగృహీతసీతఁ దనదారని క్రమ్మఱఁ
దెచ్చి యేలఁగన్.' — ౬ ఆశ్వా. ౨౯ పద్యము.

'మనుజేశునితలి పీరమా తఁట.' — ౬ ఆశ్వా. ౧౧౮ పద్యము.

## మఱికొన్ని వింతప్రయోగములు

'చుట్టుక' ... 3 ఆ. ... ౧౦3 పద్యము.

'కట్టుక' ... 3 ఆ. ... ౧౦౯ పద్యము.

| | | | | |
|---|---|---|---|---|
| 'పట్టుక' | ... | ౪ ఆ. | ... | ౧౨౩ పద్యము. |
| 'తోలుక' | ... | ౭ ఆ. | ... | ౮౨ పద్యము. |
| 'అలందుక' | ... | ౭ ఆ | ... | ౧౧౬ పద్యము. |
| 'ఎత్తుక' | ... | ౮ ఆ. | ... | ౨౪ పద్యము. |

కువర్ణకమునకు ముందు ఉకారాంతశబ్దములకు నగాగమముఁ జేర్పమికి.

"కుళిందనందనుఁడు పెట్టిన పత్రికచూపి రాజుకున్." } ౮ ఆశ్వా. ౫౭ పద్యము.

ఈతప్పు పోతనగారికవిత్వమున ననేకస్థలములఁ గాననగు.

ఈలాటియపప్రయోగములు కొన్ని యున్నను ఈసత్కవి కవిత్వము సర్వసుజనశ్లాఘాపాత్రమైయున్న దనుట కిసుమంతయు సందియము లేదు. షోడశకలాపరిపూర్ణుఁ డగుచంద్రుని కొక్క కళంకమువలన లోపము గలుగునా.

ఈ పినవీరభద్రన పద్యములను మేలుబంతిగాఁ గొందఱు కవులు గ్రహించి రనుట యీ క్రిందిపద్యములవలనఁ దేట పడును.

సీ. "విపులబాహాశక్తి విఱిచెఁ బురారికో
దండంబు నానిమిత్తంబకాదె
చలపట్టి వైదేయుశాంబరీమృగముమ
స్తముఁ ద్రుంచె నానిమిత్తంబకాదె
పాథోధిగిరులచే బంధించి కపిసేన
దాఁటించె నానిమిత్తంబకాదె

కదనరంగమున జగద్ద్రోహిఁ బంక్తికంధరుఁ
గూల్చె నానిమిత్తంబ కాదె
తే. యట్టిరాముఁడు తాన నన్నడవిలోన
దించి రమ్మని నన్నుఁ బుత్తెంచె నట్ల
తీర్చితివి నీవు నన్ను ప్రతిజ్ఞ నెఱయఁ
బొమ్ము తమ్ముఁడ సాకేతపురమునకును."

జైమినిభా. ౬ ఆశ్వా. ౭౧ పద్యము.

సీ. "దర్పించి పరమేశు ధన్వంబు విఱుచుట
నీనిమిత్తమెకదే నీలవేణి
యొలమితోఁ గపిరాజు చెలిమి పాటించుట
నీకోసమేకదే నీరజాక్షి
విబుధేంద్రసుతుఁ బొంచి వ్రేసి నిర్జించుట
నీకొఱకేకదే నిర్మలాంగి
క్రోధించి సాగరక్షోభంబు సేయుట
నీపనికేకదే నీపురంధ్రి
తే. బ్రహ్మకులజునిఁ బౌలస్త్యపతి గెలుచుట
నిన్నుఁ గైకొంటకేకదే వన్నెలాడి
యకట యవియెల్ల నెంచక యొకటి రెండు
తప్పులకు నన్ను నెడఁబాయఁ దగునె నీకు"

ఉత్తరరామాయణము, ౮ ఆ. ౧౦౩ ప.

తే. "అనుదినము నిట్లు ప్రాతికూల్యము భజింపఁ
జండికళమున ముని బ్రహ్మచర్యనియమ
మునకు గృహమేధివర్తనమునకుఁ దొలఁగి
రెంటికిని జెడ్డరేవనిరీతి యయ్యె."

జైమిని భా. ४ ఆశ్వా. ౮౭ పద్యము.

ఉ. "నీచనుఁడోయి సంకుమదనిర్భరవాసన మేన నూన న
య్యా చిరసౌఖ్యముల్ గనుట యొండెఁ దపం బొనరించి పాపముల్
రాచుట యొండెఁ గా కిహపరంబుల కూరక దూరమై వయః
శ్రీ చనరెంటికిం జెడిన రేవణ సాదు నె నీరజేక్షణా."

మనుచరిత్రము, 3 ఆ. ౧౦౧ ప.

ఇ ట్లెన్నియో యుదాహరణములు చూపవచ్చును. గ్రంథవిస్తరభీతిచే మానితిని. ఇమ్మహాత్మునిఁగూర్చి యెన్నియో విషయములు వ్రాయవలసియున్నవి. "అతి సర్వత్ర వర్జయే" త్తని యున్నది గదా. స్థాలీపులాకన్యాయము ననుసరించి కొన్నింటి వ్రాసితి. సజ్జనులు మన్నింతురు గాక. కవిత్వమునుగూర్చి యెంత వ్రాసినను అతిశయోక్తి గాదు. ఈగ్రంథమే సహస్రముఖముల నీయనమహిమను గొనియాడుచున్నది. గ్రంథమును సాంతముగఁ బఠించి సరసులు తృప్తినొందుదురుగాక.

ఈ విమర్శమువలన నెన్నియో ముద్రణస్ఖాలిత్యములను దొలఁగింపఁబడినవి. ప్రమాదము లింకను నుండవచ్చును. అవి యింకొకసారి ముద్రణసమయమునఁ దొలఁగిపోఁగల వని సజ్జనులకు విన్నవించుచు నింతటితో విరమించుచున్నాఁడను.

ఇట్లు,
బుధజనవిధేయుండు,
జనమంచి శేషాద్రిశర్మ.

# జైమినీభారతము వచనము

పినవీరభద్రకవి తరువాత నీగ్రంథమును వచనముగా సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు రచియించియున్నాఁడు. ఈతఁడు అహల్యాసంక్రందన మను శృంగారప్రబంధమును సారంగధరచరిత్ర యను వచనకావ్యమునుగూడ రచియించి యున్నాఁడు. క్రీ. శ. 1704-31 వఱకు మధురనేలిన విజయ రంగచొక్కనాయకుని యాస్థాని.

వేంకటకృష్ణప్పనాయకుఁ డీ జైమినిభారతమును వచనముగా రచియించునపుడు మూలసంస్కృతగ్రంథము ననుసరింపక, పినవీరభద్రకవి పద్యగద్యరచననే యనుసరించి రచించి యున్నాఁడు. ఈ క్రింది యుదాహరణములు చూడనగును.

గీ. పంకనిర్మగ్నమగు గోవు పరికరించి
సుకరముగ నుద్ధరించు గోపకునిమాడ్కి
ముదము దైవార నుద్ధరింపుదువుగాక
పంకనిర్మగ్న నన్ను గోపాలతిలక ! (వీరభద్రకవి.)

పంకనిర్మగ్నంబైన ధేనువును గోపాలకుచందంబున శోకపంకనిర్మగ్నులమైన మమ్ము నుద్ధరింపుము. (వేం. కృ. నా.)

క. కలనగ మనవా రెల్లరుఁ
బొలిసిరి నీదుర్నయమునఁ బోయిన యవి పె

ద్దలె నాకుచు స్త్రీబుద్ధిః
ప్రళయాంతక యనెడి పలు కబద్ధం బగునే.

నీదుర్నయంపుబోధనచే యుద్ధమునకుం బోయిన నాకుం గల వారెల్లరును సమసిపోయిరి. 'స్త్రీబుద్ధిః ప్రళయాంతక' యనెడి పలుకే యథార్థంబయ్యె. (వేం. కృ. నా.)

పై విధముగా పినవీరభద్రుని సమాసములు, జాతీయములు సామెతలును యథామాతృకముగా వచనమున వేంకటకృష్ణనాయకుఁడు రచియించియున్నాఁడు. ఉదాహరణములింకను జూపవలసిన గ్రంథమంతయు నుదాహరింపవలసివచ్చును. వచనగ్రంథమును నాంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించినారు.

## మూలము - పరివర్తనము

ముందటిపీఠిక 7-వ పుటలో "సంస్కృతమున కిది యెట్టిపరివర్తనమో మూలము దొరకనందునఁ జెప్ప వీలుపడదు" అని వ్రాయఁబడినది. సంస్కృతమూలమును నెట్లనువదించినదియుఁ దెలియుటకు నొకయుదాహరణము నిచ్చుచున్నాను.

శ్లో. స్థూలోదరం భీమసేనం వరం వరయ శోభనే,
త్వం తుళంభలిగచ్ఛాశు భీమాదంతవివర్జితమ్.
భీమస్తు ప్రత్యువాచేదం రాక్షసీమే గృహే ప్రియా
వారయిష్యతి మాయాతు భక్షయిష్యతి త్వాం హ సా.
తస్మాత్ కృష్ణగతాస్సంతు సర్వాః దంతవివర్జితాః .
కృష్ణాభిసక్త చిత్తానాం సర్వత్ర సుఖమేవ హి.

గీ. కలయఁబడి మూపు వీపునఁ దోలఁగఁ ద్రోయ
రాని సందడి నడచు పౌరవ్రజంబు
నరయుచును వచ్చు వృద్ధవేశ్యాజనంబుఁ
జూచినవ్వుచు హరి వాయుసుతుని కనియె.

ఉ. వీరిఁ బరిగ్రహింపు మిదివేళ సమానలు నీకు భీషణా
కార కఠోరమన్మథవికారగుణంబుల నన్న నవ్వి య
మ్మారుతి పల్కె నిట్టి కొఱమాలిన జంతలఁ జక్కఁబెట్ట నీ
భారము వన్నె కెక్కు దురవస్థలు నీకరలాలనంబులన్.

పినవీరభద్రకవి చాలవఱకు మూలమునను సరించినాఁడని చెప్పనగును.

ని. వేంకటరావు.

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము


| | | పుట. |
|---|---|---|
| ఇష్టదేవతాస్తుతి | ... | 1 |
| కవివంశప్రశంస | ... | 5 |
| కృతిపతివంశవర్ణనము | ... | 7 |
| షష్ఠ్యంతములు | ... | 13 |
| కథాప్రారంభము | ... | 14 |
| ధర్మజునికడకు వ్యాసులు వచ్చుట | ... | ,, |
| వ్యాసుఁడు ధర్మజున కశ్వమేధముఁ జేయ ననుజ్ఞ యిచ్చుట | .. | 16 |
| అశ్వమేధవిధానము వ్యాసుఁడు ధర్మజునకుం దెల్పుట | ... | 19 |
| భీముఁ డశ్వముం దెచ్చెద నని ప్రతిజ్ఞ చేయుట | ... | 21 |
| ధర్మరాజుకడకుఁ గృష్ణుండు వచ్చుట | ... | 27 |
| కృష్ణుఁడు భీమునిగుణంబులు ధర్మజునకుం దెల్పుట | ... | 30 |
| కృష్ణభీమసేనులసరసాలాపము | ... | 31 |
| భీమాదులు భద్రావతీపురంబున కరుగుట | ... | 34 |


## ద్వితీయాశ్వాసము


| | | |
|---|---|---|
| భీమాదులు భద్రావతీనగరంబుఁ జేరుట | ... | 36 |
| భీమాదులు యజ్ఞాశ్వంబును జూచుట | ... | 41 |
| మేఘవర్ణుఁడు సైన్యంబుల మార్కొనుట | ... | 42 |

పుట.
ఇంద్రుండు మేఘవర్ణునికడకు దూతను బంపుట ... 43
మేఘవర్ణుఁడు రాజసైన్యముతోఁ బోరుట ... 45
వృషకేతుఁడు సేనలం దునుముట ... 46
యౌవనాశ్వుండు వృషకేతునితోఁ బోరుట ... 49
వృషకేతుఁడు మూర్ఛిల్లుట ... 54
సువేగభీమసేనుల ద్వంద్వయుద్ధము ... 57
యౌవనాశ్వుని వృషకేతనుం డుద్ధరించుట ... 58
యౌవనాశ్వుండు భీమాదులతోఁ ఖురంబున కరుగుట ... 60
ముక్తపదగ్రస్తము ... 67

తృతీయాశ్వాసము

భీముఁ డన్నకుఁ దమవిజయంబు నెఱింగించుట ... 68
యౌవనాశ్వుండు సైన్యంబుతో హస్తిపురంబునకు వచ్చుట ... 70
వ్యాసులు ధర్మజునకు ధర్మంబులు చెప్పుట ... 73
వ్యాసులు ధర్మజునకు జారస్త్రీలక్షణంబులు చెప్పుట ... 74
వ్యాసులు ధర్మజునకు స్థిరలక్ష్మీయోగం బగువిధంబుఁ దెల్పుట 77
ధర్మరాజు భీముని ద్వారకకుం బంపుట ... 78
శ్రీకృష్ణుండు భీమునివెంట హస్తిపురంబున కేగుట ... 81
శ్రీకృష్ణుండు సైన్యంబుతో సరోవరతీరంబున విడియుట ... 83
శ్రీకృష్ణునిసన్నిధికి గోపకులు వచ్చుట ... 85
శ్రీకృష్ణుండు హస్తిపురంబు ప్రవేశించుట ... 88
అనుసాళ్వుఁడు మఖాశ్వంబు నపహరించుట ... 90
అనుసాళ్వుఁడు కృష్ణుని మూర్ఛనొందించుట ... 94
అర్జునుఁడు యజ్ఞాశ్వమువెంట నరుగుట ... 96

పుట.

## చతుర్థాశ్వాసము


| | |
|---|---|
| నీలధ్వజమహారాజుయుద్ధము ... | 100 |
| అర్జునునిసైన్యంబు నగ్నిదేవుఁడు కాల్చుట ... | 103 |
| నీలధ్వజునకు నగ్నిదేవుఁ డల్లుఁ డైనవిధము ... | 106 |
| నీలధ్వజార్జునుల ద్వంద్వయుద్ధము ... | 110 |
| అర్జునుని గంగ శపించుట ... | 113 |
| అర్జునుండు సౌబరియాశ్రమంబునకుం బోవుట ... | 114 |
| సౌబరిమహాముని యర్జునున కుద్దాలకమునిచరిత్రంబు చెప్పుట ... | 116 |
| హంసధ్వజమహారాజుయుద్ధము ... | 121 |
| సుధన్వుండు యుద్ధంబునకు రాక తడయుట ... | 123 |
| సుధన్వుఁడు తప్తతైలకటాహమునఁ బడి బ్రదుకుట ... | 126 |


## పంచమాశ్వాసము


| | |
|---|---|
| వృషకేతుఁడు సుధన్వునితో యుద్ధముఁ జేయుట ... | 133 |
| ప్రద్యుమ్నాదులు సుధన్వునితో యుద్ధంబు చేయుట ... | 34 |
| అర్జునుఁడు సుధన్వునితోఁ బోరుట ... | 137 |
| అర్జునుఁడు సుధన్వుని దృతీయశరంబుచే ఖండించుట ... | 141 |
| సురథుం డర్జునితో యుద్ధముఁ జేయుట ... | 143 |
| సురథుం డర్జునునిచేఁ దెగుట ... | 147 |
| శ్రీకృష్ణుఁడు గరుత్మంతుని రక్షించుట ... | 148 |
| హంసధ్వజునితో నర్జునుఁడు స్నేహము చేయుట ... | 150 |
| యజ్ఞాశ్వము గోడిగయై వ్యాఘ్రరూపముఁ దాల్చుట ... | 151 |
| స్త్రీమండలవృత్తాంతము ... | 153 |
| ప్రమీల యర్జునునితో యుద్ధముఁ జేయుట ... | 155 |

| | | పుట. |
|---|---|---|
| వృకదేశవృత్తాంతము | ... | 157 |
| భీషణుం డర్జునునితో ననిచేయుట | ... | 161 |
| భీషణుండు మడియుట | ... | 162 |
| అర్జునుఁడు బభ్రువాహనుని దిరస్కరించుట | ... | 167 |
| బభ్రువాహనుఁ డర్జునసైన్యంబు దైన్యంబు నొందించుట | ... | 169 |


## షష్ఠాశ్వాసము


| | | |
|---|---|---|
| శ్రీరామచరిత్రము | ... | 176 |
| శ్రీరాములు దుస్స్వప్నముఁ గనుట | ... | 179 |
| శ్రీరాములు చారులచేఁ బౌరులవృత్తాంతంబు దెలియుట | ... | 181 |
| శ్రీరాములు సోదరులతో జానకి నెడఁబాసెద ననుట | ... | 183 |
| లక్ష్మణుఁడు సీతాదేవి నరణ్యమునకుఁ గొనిపోవుట | ... | 186 |
| జానకి మార్గమున దుశ్శకునములు కనుట | ... | 188 |
| లక్ష్మణుఁడు సీతకు రామాజ్ఞ నెఱింగించుట | ... | 190 |
| సీత తనదురవస్థ లక్ష్మణునితోఁ జెప్పి శోకించుట | ... | 191 |
| వాల్మీకియాశ్రమంబున సీత కుశలవులం గనుట | ... | 193 |
| శ్రీరాము లశ్వమేధంబుఁ జేయ నారంభించుట | ... | 197 |
| లవుం డధ్వరఘోటకంబు బంధించుట | ... | 200 |
| మూర్ఛితుఁ డైన లవునకు కుశుఁడు దోడ్పడుట | ... | 204 |
| కుశునియుద్ధము | ... | ,, |
| శత్రుఘ్నుఁడు కుశునిచేఁ బడుట | ... | 206 |
| రాముఁడు సౌమిత్రిని యుద్ధమున కనుపుట | ... | 208 |
| సమరంబున లక్ష్మణుఁడు నిహతుం డగుట | ... | 215 |
| శ్రీరాముఁడు లక్ష్మణుంగూర్చి పలవరించుట | ... | 217 |
| భరతాదులు యుద్ధంబునకు వెడలుట | ... | 219 |

పుట.
భరతుఁడు బడుటఁ దెలిసి శ్రీరాముఁడు యుద్ధభూమికి వెడలుట 222
శ్రీరాముఁడు మూర్ఛితుఁ డగుట ... 224
వాల్మీకి శ్రీరాములను స్తోత్రముఁ జేయుట ... 226
శ్రీరాములు సోదరపుత్రసైన్యసమేతముగా నయోధ్యాపురంబు చేరుట 230

## సప్తమాశ్వాసము

అర్జునుఁడు తనకుఁ దోఁచుదుర్నిమిత్తంబులు వృషకేతనుతోఁ జెప్పుట 235
అర్జునుఁడు వృషకేతనుని మరణంబునకు శోకించుట ... 239
బభ్రువాహనుం డర్జునుఁ దెగనేయుట ... 242
అర్జునునిమరణంబు విని చిత్రాంగదాదు లగునంతఃపురస్త్రీలు దుఃఖించుట 243
ఉలూచి చిత్రాంగద నూరార్చి మృతసంజీవనీరత్నంబు దెచ్చుటకు
పుండరీకుని పాతాళంబున కనుచుట ... 247
పుండరీకుఁడు శేషునిచేఁ దిరస్కృతుండై మరల నులూచికడకు వచ్చుట 251
బభ్రువాహనుఁడు నురగులతోడి యుద్ధంబున కేగుట ... 252
బభ్రువాహనుఁడు నురగుల నోడించి జీవమణి గొనివచ్చుట 253
నాగకుమారులచే నపహరింపఁబడిన యర్జునుతల గానక చిత్రాంగ
దాదులు శోకించుట ... 255
శ్రీకృష్ణుఁడు మొదలగువా రర్జునుకడకు వచ్చుట ... 256
శ్రీకృష్ణుం డర్జునుని బ్రదికించుట ... 257
నకులధ్వజుఁడు పాండవహయంబుఁ బట్టుట ... 261
కృష్ణార్జునులు తామ్రధ్వజునితోఁ బోరుట ... 262
సుచిత్రార్జునుల ద్వంద్వయుద్ధము ... 267
తామ్రకేతునితో నర్జునుఁడు పోరుట ... 269
తామ్రధ్వజుఁడు కృష్ణార్జునుల జయించి హయంబుఁ గొని పురంబునకుఁ
బోవుట ... 270

పుట.

కృష్ణార్జునులు మాయావిప్రరూపంబుల మణిపురంబు ప్రవేశించుట 272
రాజు విప్రకార్యార్థంబు దనశరీరంబు నిచ్చుట ... 277
కృష్ణార్జునులు స్వస్వరూపంబుతోఁ బ్రత్యక్షం బగుట ... 280

## అష్టమాశ్వాసము

వీరవర్మ పాండవహయంబుఁ బట్టుట ... 284
కృష్ణుఁడు విజయునకు యమునివృత్తాంతంబు చెప్పుట ... 285
వీరవర్మ కృష్ణుని తనపురంబునకుఁ దోడ్కొని పోవుట ... 289
నారదుఁడు చంద్రహాసునివృత్తాంతంబు దెల్పుట ... 291
చంద్రహాసుఁడు రాజ్యంబు చేయుట ... 295
కుంతలేశునికూఁతురు వనవిహారమునకు వచ్చుట ... 298
దుష్టబుద్ధి చంద్రహాసుని కాళికాగృహమునకుఁ బంపుట ... 303
కుంతలుండు చంపకమాలినిఁ బెండ్లి చేయుట ... 307
చంద్రహాసుండు దుష్టబుద్ధిని బ్రతికించుట ... 308
కృష్ణుండు తా నొక్కరుండు కరిపురంబు ప్రవేశించుట ... 320
ధర్మజుం డశ్వమేధంబు కావించుట ... 325



# జైమినిభారతము

## అశ్వమేధపర్వము, పీఠిక

### ఇష్టదేవతాస్తుతి



లావణ్యపయోనిధిత్రివళివీ
చీమధ్యరోమావళి
వ్యాళానల్పసుఖైకతల్పుఁడు జగ
ద్వ్యాపారలీలావతా
రాలంకారవిహారి శౌరి సదయుం
డై సాళ్వగుండక్షమా
పాలాగ్రేసరనారసింహుని నద
భ్ర శ్రీయుతుం జేయుతన్. 1

చ. జడముడి జాహ్నవీతటనిశాకరపోతముఁ జూచి యెవ్వ రీ
కొడిమెలు గట్టి పెండ్లికొడుకుం గడియారము మోవఁజేసిరం
చడుగ వివాహవేదిపయి నంబిక నెచ్చెలిఁ జూచి నవ్వ నా
మృడుఁడు నృసింహశౌరికి సమిజ్జయముల్ దయసేయుఁ
గావుతన్. 2

మ. పలుకుందొయ్యలితోడికూటములు పెంపం దమ్మికూటంబు
లో, నలుమోముల్ సమకాలసౌఖ్యములఁ జెందన్ రామి
నొయ్యారపుం, బొలయల్కన్ ముఖమండలిన్ మలఁచు
నంభోజాసనుం డిచ్చు భూతలనాథాగ్రణి నారసింహునకు
నిత్యం బైనదీర్ఘాయువున్. 3

మ. తొలుమ్రొక్కుల్ గొనువేల్పుఁ గొల్తు శశభృత్కోటీరుఁ
గోటీరట, త్కలభూషాంకితగాత్రు గాత్రమరసంఘస్తోత్ర
వేళా నిరర్గళ ధారాళ కట ప్రదానతటినీ రంగ ద్విరే
ఫాళికా, కలికాలోలవిచారుఁ జారుహరిభుక్ప్రాలంబు
లంబోదరున్. 4

సీ. ప్రణవపీఠమున మంత్రపరంపరలు గొల్వ
నుండు నేదేవి పేరోలగంబు
భావజ్ఞులకుఁ బరాపశ్యంతి మధ్యమా
వైఖరు లేదేవి వర్ణసరణి
జపహార కీర పుస్తక విపంచిసమంచి
తంబు లేదేవి హస్తాంబుజములు
కుందేందుమందారకందళీబృందంబు
చంద మేదేవియానందమూర్తి

తే. కాంచె నేదేవి కాంచనగర్భచతుర
పూర్వదంతకవాటవిస్ఫుటమనోజ్ఞ
చంద్రకాంతశిరోగృహస్థలవిహార
మమ్మహాదేవి వాగ్దేవి నభినుతింతు. 5

మ. కవులం బంకజగర్భసన్నిభుల వక్కాణింతు వల్మీకసంభవు
నిన్ వ్యాసునిఁ గాళిదాసు బిలహున్ బాణున్ మయూ

రుఁ శుకుఁ, భవభూతిఁ శివభద్రు మల్హణుని ఘంటా
మాఘునిం జోరు భా,రవి మా నన్నయభట్టుఁ దిక్కకవి
నేఱాప్రెగ్గడఁ సోమునిన్. 6

క. అని యిష్టదేవతాప్రా
ర్థనమ్ము నాదిసుకవివినుతమునుం గావిం
చి నిలిచి పెల్లగునుల్లం
బునందు నే నొకపురాణముం జెప్పంగన్. 7

క. ఉద్యోగించి సుకవిజన
హృద్యంబును నాద్యము మఱి యితిహాసానే
కద్యోతితపద్యాళ్యై
శద్యం బైనదియుఁగా విచారించి తగన్. 8

క. స్తుత్యముఁ గలికల్మషరా
హిత్యము నాఖ్యాయికావిహితబీజచతు
స్సీత్యము శ్రీహరికథలను
నిత్యంబును నైన జైమినిజభారతమున్. 9

శా. జంబూద్వీపములోన నెంతయుఁ బ్రశస్తం బైనదీని న్నట
ద్దంభూకుండలజూటకోటరకుటీధృత్స్వర్ధునీవీచికా
లంబిస్విన్ననవేందుకందళసుధాలంకారవాగ్వైఖరిఁ
జంబూకావ్యము చేసెదఁ బుధజనశ్లాఘానిరాఘాటతన్. 10

క. సాళువ నరసింగమహీ
పాలుని నత్యంతఘనకృపాలుని నసుహృ
త్పాలితనగరిపశ్య
త్ఫాలుని నాచేయుకృతికిఁ బతిఁ గావింతున్. 11

వ. అని ప్రబంధంబుఁ జెప్ప నుద్యోగించుసమయంబున. 12

ఉ. భారతవంశమండనుఁడు పాండవ గాండివముక్త బాణసం
భార తత ప్రభావ నుతిపారగుఁ డంచిత గో మహీ తులా
భార తదంగ దాన పరిపాక సమగ్ర యశోవిలాస శో
భా రతశాలి గుండనరపాలనృసింహుఁడు గహ్వరిస్థలిన్. 13

సీ. తనభుజాపరిఘుచేత ధరావరారోహ
భరియించి బర్బరబాహుఁ డయ్యెఁ
దనప్రతాపంబుచేత దిగంతరంబుల
దీపించి యంబరాదిత్యుఁ డయ్యెఁ
దనదానగరిమచేత సురాగముల పెంపు
దండించి ధైర్యవరగండఁ డయ్యెఁ
దనమహత్త్వంబుచేతఁ బురాణపురుషుని
మఱపించి చౌహత్తమల్లుఁ డయ్యె
తే. రాజమాత్రుండె ధరణీవరాహబిరుద
వర్ణఫలకాయమానదుర్వారగర్వి
తాహితోర్వీశవిపులదోరంతరుండు
సాళ్వగుండయనరసింగజనవిభుండు. 14

వ. ఆరాజపరమేశ్వరుం డొక్కనాఁడు కురు కుకుర కరూశ శక మగధ మరాట లాట భోట గాంధారాది సింధుపరివేష్టిత వసుంధరారమణ కిరీట మణిగణ కిరణజాల బాలాతపస్మేర రంజిత తరుణచరణారవిందుండును, లీలావతీ కర కిసలయాలోల చమరవాల చామర సమీరచలితాంత కుంతలుండును, నాయికామధుర గానతాననమాబిరుద ప్రపంచసంచితానందకందలిత మందస్మితవికస్వరగండమండలుండును, సభాభవనాభినవ రత్నస్తంభదర్పణప్రతిబింబిత

మనోహరాకారుండును నై యర్ధాసన సమాసన్న రాజన్య
శిరఃప్రసవవాసనాముద్రితం బైన భద్రాసనంబునం బేరో
లగం బుండి పురాణేతిహాసకథాప్రసంగంబుల వినోదిం
చుచు. 15

ఉ. ఆదట సప్తసంతతులయందును నొక్కొకకాలమందు వి
చ్ఛేదము గల్గు నాఁటికిఁ జెప్ప విపర్యయ మేయుగంబునన్
లేదు కవిత్వసంతతికి నిక్కము తత్కవితావిలాసముల్
జాదులు నిష్టదైవము ప్రసాదము నౌ హరికీర్తనంబునన్. 16

క. నామది నిరతము భారత
రామాయణకథలఁ బ్రేమ రంజిలు నందున్
జైమినిభారత మనఁగా
భూమి నపూర్వము పురాణముల గణియింపన్. 17

తే. ఆపురాణంబు గనఁ దెనుఁ గయ్యె నేనిఁ
జెప్ప నేర్చినకవియుఁ బ్రసిద్ధుఁ డేనిఁ
దెనుఁగు నుడికారమున మించు గనియె నేనిఁ
గుందనము కమ్మవలచినచంద మగును. 18

వ. అని సభాసదుల మొగంబులు చూడ నవధరించిన నారాజ
సత్తముచిత్తం బెఱింగి వా రిట్లని విన్నవించిరి. 19

కవివంశప్రశంస

క. ఏరీతి నెఱిఁగనో పిన
వీరన దేవరతలంపు విఖ్యాతముగాఁ
బేరును బెట్టిదియును దన
పేరుగ రచియింపఁ బూనెఁ బేశలఫణితిన్. 20

క. తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువనభాసురకృతిని
ర్మాతలు పిల్లలమఱ్ఱివి
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలఁ గలరే సుకవుల్. 21

సీ. అమృతాంశుమండలం బాలవాలముగాఁగ
మొలిచె నొక్కటి జగన్మోహనముగఁ
జిగిరించె విలయసింధుగతకై తవడింభ
శయనీయవరపలాశములతోడఁ
బితృదేవతలకు నంచితసత్త్రశాల యై
చెట్టు గట్టెను గయాక్షేత్రసీమ
నిలువ నీడయ్యె నిందీవరప్రియకళా
కోటీరునకు భోగికుండలునకు

తే. మఱ్ఱిమాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు
పేరువలెఁ గాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరువాక్యసరణి
సరసులకు నెన్నఁ గర్ణరసాయనంబు. 22

క. అని విన్నపంబు చేసిన
ననుఁ గనుఁగొని యలరి నాధనంబు ఋణముగాఁ
దినక యుపార్జించె యశో
ధన మిటు గావలదె యాశ్రితత్వం బనుచున్. 23

క. దరహాసరసముఁ దాంబూ
లరసముఁ గప్పురపుఁబలుకులం గుంకుమపూ
పెరసినగతిఁ దోఁపఁగ సా
దరమున ని ట్లనియె భారతజ్ఞులతోడన్. 24

ఉ. అల్లన విచ్చుచెంగలువలందు రజం బనుకప్పురంబు పైఁ
జల్లఁగఁ జల్లనై వలచుసౌరభముల్ వెదచల్లు భావముల్
పల్లవహ స్తచన్నుఁగవపయ్యెద జీబుగఁ దోఁచుభాతిగాఁ
బిల్లలమఱ్ఱి వీరన యభిజ్ఞుఁడు చెప్పఁగ నేర్పుఁ గబ్బముల్. 25

వ. అని సమీపంబునం గొలిచియున్న నన్నుఁ గృపాతరంగితా పాంగంబున విలోకించి మామక మనోరథం బెఱింగినట్లు చెప్ప నుద్యోగించితివి హృద్యానవద్యగద్య పద్యానుబంధంబుగాఁ బ్రబంధం బంధ్రభాషను జైమినిభారతమునం దశ్వమేధపర్వంబు నిర్విఘ్నంబుగా రచియింపు మని యాన తిచ్చినఁ బ్రసాదం బని యంగీకరించి యిమ్మహాప్రబంధంబునకు మంగళాచారంబుగాఁ దదీయవంశావళీవర్ణనం బభివర్ణించెద. 26

కృతిపతివంశవర్ణనము

సీ. శార్ఙ్గబాణాసనజ్యావల్లరీజాత
బంధురకిణగణోద్భాసితంబు
లీలోపధానవేళాలాలితశ్రీక
బరిపుష్పవాసనాభాసురంబు
నభసంగమాన్వయనాథవాహనరాజ
కందరాస్ఫాలనకర్కశంబు
పాంచజన్యోద్భూతపాండుచ్ఛవిచ్ఛటా
చంద్రికాకారసముహాః పూలితంబు
తే. దానవారాతిదక్షిణేతరకరములు
రాజితం బందు వెలయించె రాజకులము

కైరవాప్తుండు దనకుఁ బక్షంబుగాఁగఁ
గువలయానందకరలక్ష్మిఁ గొమరు మిగిలి. 27

చ. ఉడుపతి వంశకర్త మహిమోన్నతి కెయ్యది మేర నాఁడు పా
ల్కడలి జనించినప్పుడు దళంబుగ నంటిన మేనిజిడ్డు వోఁ
గడుగుకొనంగ నబ్బెనని కా శివు నౌదలయేటఁ బాదముల్
దడఁబడ నోలలాడుచు హళాహళిగా పడి నీఁదులాడెడిన్.

శా. ఆవంశంబున నుద్భవించె నమిత క్ష్మాధీశ కోటీరకో
టీ విన్యస్త వినూత్నరత్న రుచివాటీ విస్ఫుర త్పాదరా
జీవద్వంద్వుఁడు గుండశౌరి జయలక్ష్మీకంధరా బంధుర
గ్రైవేయాంతర పద్మరాగసఖ దోఃఖడ్గప్రతాపార్కుఁ డై.

మ. జననం బందిరి గుండభూవిభునకున్ సంథాకబంథారి గౌ
తనయుల్ శ్రీనిధి వీరయాబళుఁడు నుద్యత్కీర్తి మాద
య్యయున్, ఘనతేజోనిధి గుండబమ్మఁడును సంగ్రామస్థలీ
పార్థ స్సజ్జనమందారులు సాళ్వమంగనృపుఁడున్ సావిత్రి
మంగాంకుఁడున్. 30

క. వీరలలో నుతి కెక్కెను
వీరాగ్రేసరుఁడు లోకవిశ్రుతవిభవ
స్వారాజు సాళ్వమంగ
క్ష్మారమణుఁడు సుగుణరత్నకలశాంబుధి యై.

సీ. దురములో దక్షిణసురతాను నెదిరించి
కొనివచ్చి సంపరాయనికి వచ్చె
సామ్రాజ్యమున నిల్పి సంపరాయస్థాప
నాచార్యబిరుదవిఖ్యాతిఁ గాంచె

శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్వదివేలు
మాడ లద్దేవునుమ్మడికి నొసఁగె
మధురాసురత్రాణు మడియించి పరపక్షి
సాళువబిరుదంబు జగతి నెరపె

తే. గబ్బితనమునఁ దేజిమొగంబు గట్టి
తఱిమి నగరంపుగవఁకులు విఱుగఁ ద్రోలి
తాను వ్రేసినగోరు సుద్దవిడిఁ దెచ్చె
సాహసంబున నుప్పొంగు సాళ్వమంగు. 32

ఆ. అట్టిసాళ్వమంగయకు సింగవిభు గుండ
శౌరి గౌతరాజ సావడిక్షి
తీశ హన్మమానవేశ్వరు ల్నా మల్లి
నాథుఁ డనఁగ సుతులు నమదహితులు. 33

తే. చక్రవర్తులతోడుత సవతు వచ్చు
వీర లార్వురలోపల వినుతకీర్తి
మదవతీజనపశ్యాయమదనమూర్తి
గౌతరాజవసుంధరాకాంతునకును. 34

సీ. సర్వసర్వంసహాచక్రరక్షణమునఁ
జక్రాంకునాల్గుహస్తములు వోలె
స్థిరతరప్రజ్ఞావిశేషంబున హిరణ్య
గర్భునినాల్గువక్త్రములు వోలె
దుర్దాంతనిష్ఠురదోఃప్రతాపంబునఁ
గాలాగ్నినాల్గుశృంగములు వోలె
మహితధర్మమున మన్మథవైరి వాహగో
రమణుని నాల్గుపాదములు వోలె

తే. సంభవించిరి సుతులు సౌజన్యయుతులు
హరిపదధ్యానరతులు లోకైకనుతులు
గుండపరివృఢ సాళువకువలయేశ
బొప్పజననాథ సాళువతిప్పవిభులు. 35

ఉ. వీరలలోన నగ్రజుఁడు విక్రమకేసరి గుండధారణీ
ధారుఁ డుదారుఁ డాతనిప్రతాపము దిక్కులఁ బిక్కటిల్లు దు
ర్వార విరోధివీర నగరంబులకుం హరుకంటిమంట లై
వైరినృపాలసైన్యవనవాటికి దావకృశానుపంట లై. 36

క. గుండనృపాలునితమ్ముఁడు
దండితరిపురాజి సాళ్వధరణీపుఁడు మహీ
మండలి కాధారం బగు
కుండలి కాధారమయ్యె గురుభుజశక్తిన్. 37

క. అప్పార్థివునను జన్ముఁడు
బొప్పాధీశ్వరుఁడు సమరభూభాగములం
బప్పన్న మేదినీశుల
బొప్పానామము లడంచె భూవిదితముగాన్. 38

శా. ఆబొప్పాధిపుసోదరుండు నుతజన్యశ్రీసుధాసౌధహే
లాబాహాపరిరక్షణాంబునిధివేలామేఖలాచక్రుఁ డై
ప్రాబల్యంబున సాళ్వతిప్పధరణీపాలుండు పాలించెఁ దా
శాబద్ధప్రీతి వహించి నిత్యవినుతక్ష్మానాథయూథంబులన్. 39

సీ. అమితవైభవముచే నసమానవైభవ
కులిశాయుధుల నద్రిగుహల కనిచె
దోఃప్రతాపంబుచేఁ దులితప్రతాపదా
వానిలాప్తుల నరణ్యములఁ ద్రోచె

వినుతధైర్యంబుచే విఖ్యాతధైర్యమం
ధానాద్రులను సముద్రముల ముంచె
ఘనకీర్తిచే సముత్కటకీర్తిచంద్రులఁ
గడకొండయవలిచీఁకట్టఁ గలిపె
తే. నౌర మీసరగండకటారిసాళ్వ
పంచఘంటానినాదాదిభయదబిరుద
కాహళారానసంపాతకంపితారి
దీప్తబలసీరి సాళువతిప్పశౌరి. 40

వ. ఇట్లు చతుస్సముద్రంబులుఁ హరిచతుర్భుజంబులుం జతు
ర్విధపురుషార్థంబులుం జతురుపాయంబులుం జతుర్దిగీశులుం
బోలె వర్తించువీరలయందు. 41

ఉ. గుండమహీవిభుండు తనకుం గులభామిని మల్లమాంబ గాఁ
గుండలికుండలుండు వలిగుబ్బలిపట్టియు వైనతేయవా
హుండును నాదిలక్ష్మియుఁ బయోరుహగర్భుఁడు వాణి
యుఁ సముద్రుండును జహ్నుకన్యయును దుల్యముగా
మతి కెక్కె. నిమ్మహిన్. 42

ఉ. ఆమహితానుభావునకు నాసుచరిత్రకు నుద్భవించి రు
ద్దామయశోధనుల్ విజయధాములు విక్రమభీము లాహవ
స్థేములు సార్వభౌములు ప్రసిద్ధులు తిమ్మనరేంద్రచంద్రుఁ
డుఁ, శ్రీమదహోబలేశ్వరనృసింహునియంశమునఁ నృసిం
హుఁడున్. 43

సీ. హతరిపుక్షత్రియుం డయ్యు సామ్రాజ్యంబు
గరిమఁ జేయనినాఁటికడమ యొకటి

యోగీంద్రవంద్యుఁ డయ్యును నుగ్రసేనుని
నోలగించిననాఁటియొచ్చె మొకటి
భువనైకవీరుఁ డయ్యు విభాకరతనూజు
తాఁపుఁ గోరిననాఁటితక్కు వొకటి
యాదిలక్ష్మీనాథుఁ డయ్యును బలిదైత్యు
నడుగఁబోయిననాఁటిహైన్య మొకటి
తే. తలఁచి మూర్ధాభిషిక్తుఁడై ధరణిపతులు
గొల్వ నసహాయశూరత వెలసి దాన
శక్తి నవతార మెత్తినశౌరి గాక
క్షితిపమాత్రుండె నాళ్వనృసింహవిభుఁడు. 44
సీ. తిగుళభూములు తెంకులుగఁ జరించినదొడ్డ
చెవులపోతుల నెల్లఁ జెండివైచి
ఘన మైనకండక్రొవ్వునఁ బొలుతెంచిన
యొడ్డీనిపెనులావు లూడఁదన్ని
పఱతెంచి చక్కఁగఁ బాలదుర్గము మెట్టి
సుడివడ్డచామలఁ జుట్టుముట్టి
పెనుగొండకడ వ్రాలి ఫిక్కిళ్లు మొదలైన
ప్రతిపక్షులను హతాహతము చేసి
తే. సత్కవులత్రుప్పు డుల్చు వసంతవేళ
రాయమీసరగండధరావరాహ
విజయవిఖ్యాతగుండభూవిభునృసింహ
సార్వభౌమునిబిరు దైన సాళువంబు. 45
మ. ప్రతివారంబును నారసింహధరణీపాలుండు భూమీసుర
ప్రతతిం గామితవస్తుసంపదల సంభావించుచోఁ దత్కరో

ద్గతదానాంబుసరిత్తటీతృణసుఖోదంచన్మృగీలోచన
ద్యుతు లిందీవరదామసంపదలఁ జేయుగా దిక్పతిస్త్రీలకున్. 46

## షష్ఠ్యంతములు

క. ఈదృగ్విధగుణమణికల
శోదధికిని మథితగర్వతోర్వీధవసే
నోదధికి భువనవినుతా
పాదదయావధికి సాధుజనసేవధికిన్. 47

క. ధరణీవరాహునకు బ
ర్బరబాహునకహితరాజరాహునకు దిగం
తరముఖరిత జయభేరీ
సరభస భాంకారనాద సన్నాహునకున్. 48

క. ఆకాశకేశకంధర
కాకోలసదృక్షనిశితకౌక్షేయజయా
నీకనిరాతంకున కరి
భీకరచౌహత్తమల్లబిరుదాంకునకున్. 49

క. మీసరగండనికిఁ గటా
రీ సాళువమునకుఁ గిన్నరీజనవిద్యా
వాసపరిపఠితదిగ్జయ
శాసనగీతప్రబంధసంబంధునకున్. 50

క. పాండురతరకీర్తిరమా
గండూషితనిర్జరాపగా పాథునకుగా
గుండయనరసింగమహీ
మండలనాథునకు విక్రమసనాథునకున్. 51

కథాప్రారంభము

వ. అభ్యుదయం బాకల్పంబుగా నాకల్పింపం బూనిన జైమిని భారతంబునకుం గథావతారిక యెట్టి దనిన నట్లు జనమే జయమహీశక్రుండు చక్రియాగంబు నిర్వక్రతం గావించిన యనంతరంబ సుఖాసీనుండై జైమినిం గనుంగొని మహాత్మా సకలకలికలుషలతికాలవిత్రం బైనకురుక్షేత్రంబునం దజాత శత్రుం డగుధర్మపుత్త్రుండు ధార్తరాష్ట్రబలంబు నష్టాదశ వాసరంబుల ధూళిధూసరంబు గావించి శాశ్వతైశ్వర్య ధుర్యుం డై విశ్వజగన్నుతంబుగా నశ్వమేధం బెవిధంబున నాచరించె నెఱింగింపు మనుటయు నమ్మునివల్లభుండు జన వల్లభున కిట్లనియె. 52

తే. ధారుణీనాథ వినుము మీతాత యైన
ధర్మసూనునియశ్వమేధక్రమంబు
తనపితామహుఁ డైనశంతనుతనూజుఁ
డమరపురి కేఁగ శోకాకులార్తుఁ డగుచు. 53

ధర్మజునికడకు వ్యాసులు వచ్చుట

క. ఉన్నంత నానృపాలుని
సన్నిధి కేతెంచె వ్యాససంయమి తతవి
ద్వన్నుతబహుపుణ్యకథా
సన్నపురాణేతిహాసశాలి *యదృచ్ఛన్. 54

* యథేచ్ఛన్.

క. వచ్చినవఱాని నెదుర్కొని
తెచ్చి యుచితపీఠి నునిచి దీర్ఘతరంబై
హెచ్చినశోకము మదిలో
నచ్చనలాడంగ ననియె నమ్మునితోడన్. 55

ఉ. సత్యవతీతనూభవ నృశంసత భీష్మునిఁ గుంభజన్ము నా
దిత్యకుమారు నూరక వధించితి రాజ్యరమావిభూతి కా
ద్ధత్యముతోడుతన్ సమరధర్మము వీసవపుచ్చి వంచనా
కృత్యజ మైనయీనిబిడకిల్బిష మేమిటఁ జక్కనయ్యెడున్.

చ. తలుచుగ భానునందనుఁనిధానమునందు నభీష్టవస్తువుల్, గు
ఱుతులుమీఱఁ గొం చరుగుకోవిదకోటులసమ్మదాశ్రువుల్
వఱదలు వాఱఁ బ్రస్తుతరవంబులు మిన్నులు రాయుచుం
డు న, క్కుఱంగట శోకజాశ్రువులుఁ గో యనునేడ్పులు
నుప్పతిల్లెడున్. 57

ఆ. గురుఁడు కుంభజుండు సురనదీసూనుండుఁ
జూడలేని రాజ్యసుఖము నాకుఁ
గన్నుదోయి లేనికాయంబు తోయంబు
గాని మిగుల సౌఖ్యకరము గాదు. 58

ఉ. పిన్నటనాఁటనుండి ననుఁ బెద్దఁగఁ జూచినవంశవృద్ధులన్
మిన్నక చంపి చేకొనినమేదిని నా కిదియేల సత్త్వసం
పన్నిధి వాయునందనునిఁ బట్టము గట్టెద నేఁటితోన నే
నన్నియు మాని కానలకు నేఁగెద నిష్ఠఁ దపంబుఁ *జేసెదన్.

*సేయఁగన్.

క. ఏతపముల నేజపముల
నేతీర్థవిలోకనముల నేక్రతువుల నీ
జ్ఞాతివధం బొనరించిన
పాతకము హరించు ననఁ దపస్వి యతనితోన్. 60

వ్యాసుఁడు ధర్మజున కశ్వమేధము సేయ ననుజ్ఞ యిచ్చుట

సీ. తలఁకకు ధర్మనందన నీకు గోత్రవ
ధం బొనర్చినదురితంబు వాయు
నశ్వమేధంబుఁ జేయ నుపక్రమింపుము
తొల్లి రాముఁడు జగం బెల్ల నెఱుఁగఁ
బౌలస్త్యుఁ జంపినపాతకంబు హరించె
హయమేధయాగత్రయం బొనర్చి
శౌరిశాసనమున సంగ్రామజయలబ్ధ
మైనరాజ్యంబు నీ కగునె విడువ
తే. సకలయాదవులును గైవసంబు నీకుఁ
గాన నీకానితలఁపులు గట్టిపెట్టి
తురగమేధంబుఁ జేసి కౌతుకముతోడఁ
గురుకులంబున సత్కీర్తి గుదురుకొల్పు. 61

క. అన విని వేదవ్యాసునిఁ
గనుఁగొని దైన్యంబు దోఁపఁగాఁ ధర్మజుఁ డి
ట్లనియెఁ జనునయ్య కడుని
ర్ధనునకు నాకిమ్మహాధ్వరం బొనరింపన్. 62

క. మొలకలు రాజకుమారులు
తలిదండ్రులు లేనివారు దయ కర్హులు భూ

తలమునఁ గలప్రజ లందఱు
నొలిచిననొలి వాడెదరు సుయోధనుబాధన్. 63

ఉ. కాఁక నెదిర్చి సంగరముఖంబున హెచ్చినరాజవంశముల్
గూఁకటివేళ్లతోఁ బెఱికి గోత్రవధంబును జేసినట్టియా
వ్రేఁకపుఁగీడు గాకఁ ప్రజ వేఁచఁ దలంచిన గోరుచుట్టుపై
రోఁకటిపోటు చందముగ రోసి జనుల్ ననుఁ జూచి తిట్టరే.

క. కావునఁ దురంగమేధము
గావింప ధనంబు గూర్చుగతి గానఁగ లే
నీవేళ నన్ను నవ్వుచు
నీ వేల తలంకె దన మునీశ్వరుఁ డనియెన్. 65

ఉ. వాలినవేడుకల్ బహుసువర్ణముఖంబున మున్మరుత్తభూ
పాలునిచే మహీసురు లపారసుదక్షిణ లంది తెప్పలం
దేలి యథేచ్ఛఁ గొం చరుగ నిల్చినవిత్తము వెక్కసంబుగా
మూలుగుచున్న దిప్పుడు నముద్రితమై తుహినాద్రి చేరువన్.

క. ఆధనము నీకు నచ్చిన
సాధనముగ నధ్వరంబు సాఁగించి బుధా
రాధనము చేయు నిరతా
యోధనచణు లైనతమ్ము లూఱటగాఁగన్. 67

సీ. అన విని ధర్మనందనుఁడు పారాశర్యు
తోడ నిట్లను మరుత్తుండు బహుసు
వర్ణయాగము చేసి వసుధామరశ్రేణి
కెల్ల దక్షిణలుగా నిచ్చె మొదల
విప్రార్జితం బైనవిత్తంబు గొనివచ్చి
క్రతువు చేయుటకంటెఁ గలదె గీడు

తమసొమ్ము తమ కిచ్చి ధర్మరాజని మహీ
సురులు దానము సేయఁ జూచి నగరె.

తే. యాగడంబున బ్రహ్మస్వ మపహరించి
తెచ్చి పుణ్యంబు సేయంగఁ దివురు టెల్లఁ
గుడిచి కూర్చుండి శిలఁ దెప్పకొయ్యఁ జేసి
జలధిలో నీఁదులాడంగఁ దలఁచినట్లు. 68

క. మొదలఁ గుల మెల్లఁ ద్రుంచుట
యదయత గురులయెడఁ గల్లలాడుట యదిగా
కిదియును జేయఁ దలంచినఁ
గొద లే దీవేళ ద్రొంతికొల సిద్ధించున్. 69

వ. నావుడు. 70

క. ఆమాటలు విని మానిని
గ్రామణి ధర్మజున కనియెఁ గశ్యపునిది గా
దా మేదిని యె ల్లేలిరి
భూమిపతులు కాని త్రోవఁ బోయిరె వారల్. 71

చ. వినుము నృపాల భూసురులు వెక్కస మైనఁ బరిత్యజించిపో
యినకనకంబుఁ జేకొన మహీపతికిం జనుఁ గాని వారికిం
జనవొకనాఁడు లే దొకనిజం బెఱేఁగించెద నెవ్వఁ డేలు మే
దిని ధన మెల్ల నాతని యధీనమ మాటలు వేయు నేటికిన్.

తే. అదియుఁ గాక మరుత్తుండు యజ్ఞవేళ
నుచితదక్షిణ లర్పించి యున్నధనముఁ
గొల్ల విడిచిన బ్రాహ్మణు లెల్లఁ దనిసి
విడిచి రర్థంబు దీనికై వెఱవ వలదు. 73

—● అశ్వమేధవిధానము వ్యాసుఁడు ధర్మజునకుం జెల్పుట ●—

వ. కావున నీమనంబున ఘనం బైనవంత యావంతయుం బెట్టు
కొనక నెట్టుకొని యమ్మహాధ్వరంబు సాగింప నుద్యో
గింపుము. తద్విధానంబు సావధానంబుగా నెఱింగించెద
నాకర్ణింపు మఖిలవేదశాస్త్రపురాణేతిహాసకథాసుధానుభవు
లును నంచితాన్వయసంభవులును నచ్యుతపదారవిందసంద
ర్శనానందకందళితహృదయారవిందులును నతిమనోహర
ప్రభావిడంబితరవీందులును నగునగ్రజన్ము లిరువదివేలు
ఋత్విజులు గావలయు నం దొక్కొక్కనికి హాటకసమేతం
బొక్కొక్క ఘోటకంబును నొక్కొక్క మదద్విరదంబును
నొక్కొక్కయరదంబును రత్నప్రస్థసహితంబు గోసహస్రం
బును భారపరిమితంబు హేమంబును బ్రేమంబున నేమం
బునం దురంగంబు నర్చించి విసర్జించు మొదలిదివసంబున సమ
ర్పింపవలయు నిది దక్షిణాప్రకారంబు. 74

క. పాటీరహీరవర్ణము
హాటకపుచ్ఛమును నల్ల నగుచెవులు నిరా
ఘాటజవంబును నధ్వర
ఘోటకలక్షణము లివి యగోచర మైనన్. 75

ఉ. కాయము చిత్రవర్ణములు గల్గి మనోజవ మైనయశ్వమే
ధీయహయంబునాగమవిధిన్ విడువం దగుఁ జైత్రపూర్ణిమన్
రాయుచు సైన్యముల్ గొలిచి రా సుతు లైనను దమ్ము
లైన న,త్యాయతశక్తిఁ గావ నొకహాయన ముర్విఁ బరిభ్ర
మింపఁగన్. 76

క. శూరులు గల్గినఁ బట్టుఁడు
ధీరత నని హయము నిటలదేశంబున బం
గారపుఁబట్టముపైఁ బతి
వీరాంకము వ్రాసి కట్టి విడువఁగవలయున్. 77

సీ. విణ్మాత్రములు సప్తి విడిచినతావుల
నెల్ల హోమంబు సేయించి యచట
గోసహస్రంబు ధాత్రీసుపర్వుల కాగ
మోక్తదక్షిణలతో నొసఁగవలయు
దీక్షితుండు హయంబు తిరిగివచ్చెడుదాఁక
నియతభోగంబు లన్నియును మాని
భార్యతోడుత నసిపత్త్రవ్రతముఁ బూని
బ్రహ్మచర్యంబు సల్పంగవలయు
తే. నమరపతి నూఱుతురగమేధములు చేసెఁ
గాని యీనిష్ఠఁ జరియింపఁ గానఁడయ్యె
వ్రతయుతంబుగఁ జేయు మీక్రతువు నీవు
పాండునందన సకలపాపములు నడఁగు. 78

క. అంగజుని గెలిచె నొక్కఁడ
గాంగేయుఁడు తమకు నలవి గా దని మహీభృ
త్పుంగవు లీవ్రత మోపక
చెంగిరి నీ కలవి యైనఁ జేయుము నియతిన్. 79

చ. అన విని ధర్మసూనుఁ డనఘా బవరంబుల డస్సినారు నా
యనుజులు కర్ణసూనుఁడు మహాబలుఁ డీవృషకేతుఁ డర్భకుం
డనుపఁగఁ జాల నాజికి మదగ్రహతుండు ఘటోత్కచుండు త
త్తనయుని మేఘవర్ణుని నధర్మము పంపుట చాలఁ బోరికిన్. 80

భీముఁ డశ్వముం దెచ్చెద నని ప్రతిజ్ఞ సేయుట

క. ఎవ్వనిప్రాపున గెలిచెఁ
గవ్వాఁడి నెవ్వాఁడి విరోధిగణముల ననిలో
నవ్వనజాక్షుఁడు గృష్ణుఁడు
దవ్వుల నున్నాఁడు క్రతువు తరమే చేయన్. 81

క. అని భీముని దెసఁ జూచిన
వినయంబున నతఁడు వల్కె విష్ణుఁడు నికటం
బున లేఁ డననేటికి మన
మునఁ దలఁచిన దురిత మడఁగి పుణ్యము దొరకున్. 82

వ. అదియునుంగాక నీ కొక్కరహస్యం బవశ్యం బెఱింగించెద వాసుదేవునిశాసనంబునం జేసి మనకు బంధునాశంబున నైన దోసంబు వీసంబును లేదు జన్నంబు సేయకున్నను నవ్వె న్నుండు నిన్ను ధన్యునిం జేయు నయిన లోకంబునం గల రాజలోకంబులోన సుత్తమశ్లోకుండ వగుటకుం దగ నియ్యాగంబు సుప్రయోగంబుగా సాఁగింప నుద్యోగిం పుము యోగ్యం బగునశ్వంబు విశ్వంబునం గల్గినం జాలు దుర్వారభుజాగర్వం బఖర్వంబుగా నుర్వీపతు లెవ్వ రెదిర్చి నం బేర్చి నేన నిర్వహించి తెచ్చెద నెచ్చటం గల దదుగ నవధరింపు మనుటయు సాత్యవతేయుఁడు కౌంతేయునిం గనుంగొని. 83

సీ. పావనివాక్యంబు పావనంబును శుభ
ప్రదమును శ్రేయస్కరమును వరము
నశ్వ మున్నది యౌవనాశ్వవిశ్వంభరా
ధిపుఁ డేలుభద్రావతీపురమునఁ

బిసిడి యర్థముఁ గూడఁబెట్టిన ట్లావంకఁ
బోతుటేఁగకు నైనఁ బొలయరాదు
సందడించుచు దశాక్షౌహిణీసైన్యంబు
లనిశంబుఁ గొలకొల మనుచునుండు
తే. మనకు నది దక్కె నేని నమ్మఖము సాఁగు
ననిన విని భీముఁ డిట్లను నన్నతోడ
నతనిబల మేల దేవత లడ్డమైనఁ
బట్టి తెచ్చెద హయము నీపాద మాన. 84
తే. వాసుదేవునికృప గలవారి కెందు
నరయ దుర్ఘట మైనకార్యమును గలదె
కాన భద్రావతికి నేఁగి క్రతుహయంబు
నొంటిఁ గొనివత్తు నట్లు తేకుంటి నేని. 85
సీ. వేదఘోషణలేని వీట నున్నయతండుఁ
దలిదండ్రులకు రెండు దలఁచునతఁడు
నూరు వాడనిమాత నీరు గ్రోలునతండు
భూసురావళితోడ బొంకునతఁడు
నిటలాక్షుగుడిలేనికోటిక నున్నయతండు
నిల్లరిధన మీఁక యేఁచునతఁడుఁ
దగిలి విశ్వాసపాతకముఁ జేసినతండు
శివచింతఁ జెవిచింతఁ జేర్పనతఁడుఁ
తే. బోవుగతికి నవశ్యంబు పోదు ననుచు
శపథములు పల్కి కదల నిశ్చయము చేసి
యన్నసన్నిధి మఱుమాట లాడకున్న
ధర్మసుతుఁ డాదరమున సోదరునిఁ జూచి. 86

మ. బలియుం డుగ్రుఁడు యౌవనాశ్వధరణీపాలుండు దత్సై
న్యల్యాజుల ముక్కాఁకల నారితేఱిన మహాశూరుల్ చలం
బెత్తి మొక్కలముల్ పల్కితి ఘోటకంబు గొనిరాఁగా
నైన నీవెంట రావలదా యొక్కరుఁ డన్నఁ గర్ణసుతుఁ
డావాక్యంబు లాలించుచున్. 87

క. అనిలతనూజునివెంటన్
ననుఁ బంపుము వేడ్క ధర్మనందన యనినన్
విని భీముఁడు వృషకేతునిఁ
గనుఁగొని దయ చెంగలింపఁగా నిట్లనియెన్. 88

ఉ. ఏచినయాగ్రహంబు వహియించి భవజ్జనకున్ గఠోరనా
రాచపరంపరల్ గొని దురంబునఁ గూల్చిననాఁటనుండియున్
ద్రోచినశోకవేదనలతోడఁ గుమారక నీముఖాబ్జమున్
జూచినయప్పు డెల్ల మది చుఱ్ఱనుఁ దీఱనిలజ్జపెంపునన్. 89

తే. అనిన వృషకేతుఁ డిట్లను ననిలజునకు
సమరమున నైన మీచేతిశస్త్రనిహతిఁ
జాల నుపకార మయ్యె మజ్జనకునకును
గలుషములఁ బాసి సద్గతిఁ గనియెఁ గాన. 90

క. అంతరము దప్పి లక్ష్మీ
కాంతునిఁ గృష్ణునిఁ భజింపక దయారహిత
స్వాంతు సుయోధనుఁ గొలిచెన్
జింతామణి విడిచి గవ్వఁ జేకొనుభంగిన్. 91

ఆ. ద్రుపదుపీటిలోన దొమ్మికయ్యము రేఁచెఁ
బసులఁ బట్టె విరటుపట్టణమున

మఱియు నెన్ని లేవు మార్తాండతనయుండు
దొడరి మనకుఁ జేయుదుండగములు. 92

చ. ఖలుఁ గురురాజుఁ గొల్చుటయ కాక సభాస్థలి నుత్తమాంగనన్, వల దన శక్తిగల్గియును వస్త్రము లొల్వఁగఁ జూచె నమ్మహా, కలుషము లోర్చి సంగరముఖంబునఁ బార్థుఁడు తండ్రిబిడ్డలన్, గలపిన మేల కాక కొఱగామియుఁ గీడును నెద్ది పేర్కొనన్. 93

క. అధిప విను ధనంజయుచే
నిధనంబై ముక్తిఁ జెకొనియెఁ గావున న
వ్విధుకులజుఁ డుత్తమగుణుం
డధమగుణుఁడ కర్ణుఁ డిది యథార్థం బైనన్. 94

చ. శమనతనూజమాద్రిజులు సాత్త్వికులుగా జని యౌవనాశ్వదుర్గము వడిఁ జొచ్చి యధ్వరతురంగముఁ బావని కిచ్చి తండ్రి పాపముల నడంచి సద్గతికిఁ బంపినక్రీడిబుణంబు నేన తత్సమరతలంబునన్ వినుతశౌర్యము నుత్తిగఁ బెట్టి తీర్చెదన్.

తే. అనిన వృషకేతుఁ జూచి ధర్మావరజుఁడు
నెమ్మి రెట్టింప నాలింగన మ్మొనర్చి
తనదుపయనం బెఱింగి ఘటోత్కచసుతుండు
మేఘవర్ణుండు గడు సంభ్రమింపఁ జూచి. 96

క. తండ్రీ ఘటోత్కచుఁడు మీ
తండ్రి గలుగఁగాదె తల్లి ద్రౌపదితోడం
తండ్రులహరిదీశ్వరులెన
మంద్రుఁ బొగడఁ దెచ్చె గంధమాదనమునకున్. 97

శా. వాత్సల్యంబున నీవు నట్లు భుజగర్వస్ఫూర్తిఁ బెంపారుబీ
భత్సుం బాయక ధర్మజుం గొలువు తాత్పర్యంబునన్ శౌ
ర్యసంపత్సారున్ వృషకేతుఁ గూడుకొని యాభద్రావతీ
సైనిక, ప్రోత్సాహం బెడలించి యధ్వరహయంబున్ దెచ్చు
పర్యంతమున్. 98

చ. అన విని మేఘవర్ణుఁ డనిలాత్మజుతో నను నీకుఁ బుట్టి మ
జ్జనకుఁడు ముజ్జగంబునఁ బ్రశస్తి వహించె నహల్య రామ
చంద్రుని చరణాబ్జరేణువునఁ దొంటిశిలాకృతి వీడుకొన్నలా
గునసురసింధుతోయములఁగూడినయోడిక వాఁగుకైవడిన్.

ఉ. కావున నీకు సేవకుఁడఁ గాఁ దగుదున్ నినుఁ గొల్చి వచ్చి భ
ద్రావతిలోన నుండెడుతురంగముఁ దెచ్చెదఁ గూయివచ్చినన్
నీ వటు దండగో లగుచు నిచ్చినఁ జాలు నగస్త్యమూర్తియై
యీవృషకేతనుం డరిమహీశబలాంబుధి నోరఁ బట్టెడున్.

తే. అహితసేనలు రా నతఁ డడ్డగించి
యాహవము చేయుచుండ హయంబు నేన
గొణియవలెఁ బెట్టుకొని వత్తు నఱకడమునఁ
దడవు సేయక ధర్మనందనునికడకు. 101

వ. అనిన విని పరమానందకందళితహృదయారవిందుం డై
సమీరనందనుండు ఘటోత్కచనందనుం బరిణమించి కరుణ
మించినచూపులం జూచి పౌత్రపౌత్ర ధర్మభూషణంబును
నమిత్రవిభీషణంబును నగునీభాషణంబు మదీయశౌర్య
భూషణంబునకుఁ హేతుభూతం బయ్యె భూతనాథుండు
వచ్చినను మనముప్పురతోడం జివ్వకుం దొడర వశంబు
గాదని యుద్ధసన్నద్ధులైన సోదరపుత్రపౌత్రులం గనుంగొని

ధర్మపుత్రుండు హర్షాశ్రుమిళితనేత్రుండును బులకకలికాభి
రామగాత్రుండును నై యగ్నిత్రయంబు గలుగ నాకు
లోకత్రయంబున నెయ్యది యసాధ్యం బని యుత్సహించి
యుండె నంత భానుమంతుం డపరదిక్కాంతాకబరికాంత
రంబునకుఁ జెంగలువబంతిచెలువు సంతరించె నప్పుడు. 102

తే. ధర్మనందనుచిత్తఖేదంబు మాన్పి
తురగమేధంబు గావించువెరవు దెలిపి
పోవఁదలఁచిన నమ్మౌనిపుంగవునకు
ననుజులును దాను విహితపూజనము లొసఁగి. 103

శా. చేదోయిన్ ముకుళించి వీడుకొనె నక్షీణప్రమోదంబునన్
వేదవ్యాసుఁ బ్రసాదభాసురవచోవిన్యాసు నంహస్సము
త్సాదాభ్యాసు సుధీవిలాసు నుతవిద్యావాసుఁ బ్రజ్ఞాకళా
పాదజ్ఞానసముల్లసచ్చిదమృతాస్వాదోదితోల్లాసునిన్. 104

సీ. మునినాథుచే ధర్మతనయుండు వీడ్కొని
యపరసంధ్యాక్రియ లాచరించి
యనుజులు గొల్వ సింహాసనంబున నుండి
క్రమ్మఱఁ జింతాభరంబు దాల్చి
యంతరాయము లేక హయము వచ్చుట యెట్లు
సత్క్రియయాగంబు సాఁగు టెట్లు
దానదక్షిణలకు ధనము గల్గుట యెట్లు
మునిమాట కే నియ్యకొనుట యెట్లు

తే. చాలదుష్కర మైనయీ జన్నమునకుఁ
దోడుదొరన యైనచుట్టంబు దొరకు టెట్లు

దేవకీసూతి త్రిభువనాధిపుఁడు తాన
యొఱిఁగి సాధింపకున్న నీడేలు టెట్లు. 105

తే. హా సరోజాక్ష గోత్రదుఃఖార్ణవమున
మునిఁగియున్నాఁడఁ జేయార్చుకొనఁగ లేక
నీకృపాదృష్టి వేరోడ గాకయున్న
వెడలఁబడు టెట్లు మఖము గావించు టెట్లు. 106

క. కౌరవసభలో లజ్జా
వారిధి దిగ నుద్ధరింపవా ద్రౌపది న
న్నారీతి నుద్ధరింపుము
నీరజదళనేత్ర కలుషనీరధివలనన్. 107

ధర్మరాజుకడకుఁ గృష్ణుండు వచ్చుట

వ. అని పెక్కుఁ దెఱంగుల నక్కమలోదరుం బేర్కొని దీనాతి
దీనంబు లగువాక్యంబులం బ్రస్తుతింప సమస్తభువనవ్యా
పియు విశ్వరూపియు నగుగోపికారమణుండు దక్షిణంబు
వచ్చి వాకిట నిలిచి ప్రతీహారిం గనుంగొని మదీయాగమ
నంబు ధర్మపుత్రున కెఱింగింపు మెంతవారి కేని మహీ
కాంతునియవసరంబు దెలియక చనవు మెఱసి యంతఃపు
పురంబునకుం జనుట యనుచితం బనిన వాఁడును గృత
వందనుం డయి గోవిందున కిట్లనియె. 108

సీ. దేవర యేవేళ నీవు వేంచేసిన
సమయంబ యని ధర్మసంభవుండు
నాతోడ మొదల నానతి యిచ్చె నవసరా
నవసరంబులు మీకు నడుగ వలదు

పరధనాపహారులును బరదోషనిరతులుఁ
బరవధూరతులును బడయ లేరు
నీదగుకరుణ గణింపఁగా నిట్టిదు
ర్గుణములు ధర్మపుత్రునకు లేవు
తే. తగ విలోకించి తద్వాంఛితంబు దీర్పఁ
దాను దమ్ములు నీపదధ్యానపరత
నున్నవా రని పఱతెంచి సన్నుతోక్తిఁ
గృష్ణుఁ డేతెంచె నగరివాకిటికి ననిన. 109
ఉ. దిగ్గన లేచి యవ్వసుమతీపతి భీముఁడు సవ్యసాచియున్
డగ్గఱి కొల్వ నాననమునన్ దరహాసమనోజ్ఞచంద్రికల్
నిగ్గులువాఱ మత్తగజలీల రయంబున నేఁగుదెంచెఁ దా
నగ్గరుడాంకుఁ జేరఁ బులకాంకురముల్ దనువెల్ల నిండఁగన్.
ఉ. వచ్చినధర్మజుం గదిసి వారిజనాభుఁడు మ్రొక్క మ్రొక్కనన్
గ్రుచ్చి కవుంగలించుకొనెఁ గూర్మియు భక్తియుఁ బొత్తు సేయఁగా, ముచ్చట వాయఁ గొంతవడి మూర్ధము మూర్కొని లోచనంబులం, బిచ్చిలి రాలుబాష్పజలబిందులు మౌళి నలంకరింపఁగన్. 111
క. గోవిందునిపాదములకుఁ
బావనియును నర్జునుండుఁ బ్రణమిల్లిరి రా
జీవయుగళంబుపైఁ గ్రొ
త్తావులు గొన వ్రాలుతుమ్మెదల చందమునన్. 112
వ. ఇత్తెఱంగునం బాండునందనులు వసుదేవనందను సంభావించి యంతఃపురంబునకుం దోడ్కొనిపోయి యర్ఘ్య పాద్యాదివిధులం బూజించి యర్హాసనంబుల నాసీనులయి

యున్నయెడం బాంచాలరాజనందన వినయంబున న మ్ముకుం
దునకు వందనం బొనర్చి మందస్మితవదనారవింద యగుచు
నరవిందనాభురాకకు విస్మయం బందుచున్న యన్నరవరా
గ్రణిం గనుంగొని యి ట్లనియె. 113

తే. అర్ధరాత్రంబు వచ్చె నీహారి యటంచు
మనమునం దేల వెఱఁగంద మనమ కాదు
దాసజనుఁ డెందుఁ నేయుపద్రవముఁ జెందు
నందులకు వచ్చి రక్షించు నచ్యుతుండు. 114

ఉ. ఈవు మనంబునన్ మఱచితే సభలోఁ దనచీర యొల్చుకోఁ
గా విడిపింప నందఱును గల్గియు నిర్దయులై కనుంగొనన్
హా వసుదేవపుత్ర యన నక్షయవస్త్రము లిచ్చి నన్ను ల
జ్జావనరాశిలో మునిఁగి చావకయుండఁగ నుద్ధరించుటల్.

తే. మనము గాండీవి నంపుద మని తలంపఁ
దలఁపులోనన వచ్చెను దక్షణంబ
భక్తజనులకు ముంగొంగుపసిఁడి గాఁడె
దేవతారత్న మీవాసుదేవుఁ డనఘ. 116

వ. అని సన్నుతింప ద్రుపదజాతయెడ జాతాదరుండై సరసిజో
దరుండు మన్నించి యజాతశత్రుదిక్కు మొగం బైన
నతండు వినయవిస్రంభగంభీరంబుగా ని ట్లనియె. 117

చ. తలఁచితి దుఃఖనిర్గతికిఁ దామరసోదర నిన్ను నీవునుం
దలఁపునకంటె మున్నె ప్రమదంబున వచ్చితి నామనోరథం
బులు ఫలియించె వ్యాసమునిపుంగవునానతి నశ్వమేధముఁ
దలఁచితిఁ జేయ నిర్భయతఁ దత్ఫలకర్తవు నీవ కావునన్.

తే. అనిన ధర్మతనూజుతో నధిప నీవు
పూనుపను లెల్ల ఫలసిద్ధిఁ బొందు ధైర్య
ధనుల కరయంగ లే వసాధ్యంబు లనుచు
నచ్యుతుఁడు భీముదెసఁ జూచి యల్ల నగుచు. 119

క. మందమతియు బహ్వాశియుఁ
దుందిలుఁడును రాక్షసీరతుఁడు నిష్ఠురవా
క్సందర్భుఁడు నగుమారుత
నందనుసచివతఁ బ్రయోజనములు ఫలించున్. 120

కృష్ణుఁడు భీమునిగుణంబులు ధర్మజునకుం దెల్పుట

ఉ. అంగవిహీను నిల్లటపుటల్లునిఁ బ్రల్లదు నీచభామినీ, సంగతు
వామనుఁ బధిరు సాధ్వసమానసు మూముఁ గాముకుఁ, వెం
గలి నంగనాజితుని నిర్దయుఁ గ్రోధిఁ బ్రమత్తు మంత్రిఁ జే
యం గొఱగామి కెల్లఁ గుదురంచు గణింతురు నీతికోవిదుల్.

ఉ. గంధవహాత్మజుండు పెనుగబ్బి తలంపఁడు కార్యముల్ జరా
సంధు హిడింబునిం బకనిశాచరు జంపినయట్లు గాదు గ
ర్వాంధులు సత్యసంధులు మహాబలసాంద్రులు నిర్జితేంద్రి
యుల్, బంధురదానశీలురు నృపాలురు వారి నెఱుంగఁ
డెన్నఁడున్. 122

తే. నాఁడు గాండీవి పూనె సైంధవు వధింపఁ
బ్రతిన యుద్ధతి నేవిచారమును లేక
నేఁడు భీముఁడు కడిమిఁ బూనిన ప్రతిజ్ఞ
యంతకన్నను మిగుల సాహసతరంబు. 123

వ. ఇమ్మహాప్రతిజ్ఞ యీడేఱు నట్లు నిరాఘాటంబున యజ్ఞ
ఘోటంబు దిగంతరంబుల నిరంతరంబును జరింప నితాంత

శౌర్యవంతు లగుమహీకాంతులు దేవగంధర్వాదులు నంత రాయంబు నొందింప నెడరు వేచియుండుదురు మున్ను రాఘవేశ్వరుం డశ్వరక్షకు వృత్తచరవీరు మారుతిం బనుప నతండు శక్తిమతి యనుపట్టణంబున సురథుం డనుమహా రథునిచేతఁ దురంగంబు పట్టువడి తానునుం గట్టువడియె నట్టియెడ రామభద్రుం డాయుపద్రవంబు తాన చని చక్కఁ బెట్టుకొనవలసెఁ గావునఁ బావనికి సహాయం బీయర్జునుం బనుచుట కర్జం బని తర్జనిం జూపిన కంసమర్దనునకు బక మర్దనుం డిట్లనియె. 124

## కృష్ణభీమసేనుల సరసాలాపము

తే. అనఘ నీ వానతిచ్చినట్ల మిగులఁ
దుందిలుండను బహ్వాశి దుష్టరాక్ష
సీరతుండను నగుదుఁ జర్చించి చూడ
దేవరకు నట్టిగుణములు లేవు గాన. 125

సీ. మొదల నత్యంతకాముకుఁడ వౌటకు గొల్ల
యిల్లాండ్రగుబ్బపాలిండ్లు సాక్షి
యతినీచరతిశీలి వగుటకుఁ బాఱీన
కమఠసూకరవిగ్రహములు సాక్షి
బహ్వాశి వగుటకు బ్రహ్మాండకోట్లును
బూరింప లేని నీబొజ్జ సాక్షి
స్త్రీలోలుఁ డగుటకుఁ ద్రైలోక్యము నెఱుంగ
ధరకుఁ దెచ్చినవేల్పుతరువు సాక్షి

తే. జడసముత్సాహి వగుటకు జలధి సాక్షి
వామనుఁడ వగుటకు బలీశ్వరుఁడు సాక్షి

మందమతి వోట నది మఱపోం దెఁగాక
సరవిఁ జేర్కొనఁ దరమె నీసటలు కృష్ణ. 126

తే. చదురు లేటికి మును జరాసంధముఖ్య
భూవరుల సంహరించుట నీ వెఱుఁగవె
నీకరుణతోడుగా వైరినృపుల గెల్తు
హయముఁ గొనివత్తు సాఁగింతు నధ్వరంబు. 127

చ. ఇది యొకదొడ్డగాఁ దలఁప నేటికి నాహృదయంబులోన నీ
పదయుగళంబు నిల్పి కులపర్వతముల్ పెకలించి వైతునో
గదగొని ధారణిం దుమురుగా వడి దంతునో దిగ్గజంబులన్
రదనము లూడఁ దన్నుదునొ రాలుతునో గ్రహతారకం
బులన్. 128

తే. బహువిచారపిపాసార్తపాండుపుత్ర
చాతకముల కకాలవర్షంబ వైతి
విమతజనులకు నంగారవృష్టి వైతి
నీవు వేంచేసి నీరదనీలవర్ణ. 129

తే. పంకనిర్మగ్న మగుగోవుఁ బరికరించి
సుకరముగ నుద్ధరించుగోపకునిమాడ్కి
ముదము దైవార నుద్ధరింపుదువుగాక
పంకనిర్మగ్ను నన్ను గోపాలతిలక. 130

వ. అని యనిలనందనుండు పలుకుపలుకులకుం బ్రమోదివైౖ తదీ
య తేజోవర్ధనుం డగుచు గోవర్ధనుండు భీమసేను నాలింగ
నం బొనర్చి భవద్వాక్యంబుల నాచిత్తంబు కౌతుకాయత్తం
బయ్యె ధన్యుండవు మాన్యుండవు రాజన్యునకు మనుష్యభ
రంబు వలవదు జన్యంబున జాహ్నవీసుత ద్రోణ కర్ణులను

దత్సంబంధబాంధవులను నిధనం బొనర్చి దుష్కృతంబు
మత్కరంబునం బెట్టి విశ్వనుతంబుగా నశ్వమేధంబు సాంగం
తుగా కనిన బలానుజునకు ధర్మానుజుండు దండంబు వెట్టి
యి ట్లనియె. 131

చ. అరసి భవత్కరాంబురుహముం దొక టిడ్డను గోటికొండలై
పెరుఁగుటఁ జేసి దుష్కృతముఁ బెట్టఁగఁ జూడదు నీకరం
బునఁ, నరపతి యశ్వమేధసవనం బొనరించిన నాఫలంబు నీ
కరకమలంబునందు నిడఁ గానికగా నది గాంచు నున్న తిన్.

తే. హయముఁ గొని వచ్చునంతకు యమతనూజుఁ
గాచికొనియుండ నీసవ్యసాచి ననుపు
పోయి వచ్చెద. నీపదాంబురుహచింత
నాకుఁ దగుసంబళంబుగా నలిననాభ. 133

క. అని మాటలాడుసమయం
బున భోజనవేళ యయ్యెఁ బ్రొద్దెం తేనిం
జనియె నని ద్రుపదనందన
చను దెంచినఁ బాండుపుత్ర సారసనేత్రుల్. 134

వ. ప్రసంగం బుజ్జగించి మజ్జనంబు లాడి యిష్టాన్నపానంబులం
బరితుష్టి నొంది యర్వాప్రకారంబుల నారాత్రి సుఖసుప్తిం
బొంది రంతం గొంత ప్రొద్దునకు నిశావిరామం బగుటయు.

క. కలువలమురు వెడలఁగఁ జు
క్కలు దివి నంతంత నొక్కొకటి దోఁపఁగ వె
న్నెల పడమటిదిక్కునకుఁ
జలపల నై యొడ్డగిలఁగఁ బలపల వేగన్. 136

ఉ. తూరుపు తెల్లవాఱుటయుఁ దోడనె మంగళపాఠకస్తుతుల్
మీఱఁ దదీయరావముల మేల్కొని కాల్యసమంచితక్రియల్
దీఱిచిపాండుపుత్రవసుదేవసుతుల్ ప్రమదంబుమోములన్
దేఱఁగ వేడ్కతో నరుగుదెంచి సభాస్థలి నిల్చి రంతటన్.

## భీమాదులు భద్రావతీపురంబున కరుగుట

సీ. ఆహవసన్నదు లై భీమ కర్ణనం
దనమేఘవర్ణులు ధర్మతనయు
పాదంబులకు మ్రొక్కి పంకజాక్షునకు దం
డము వెట్టి యంతఃపురమున కరిగి
కుంతికి నెరఁగి వీడ్కొని వచ్చి విప్వచ్చు
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి కుస్తరించి
యనఘ నేఁ దురగంబుఁ గొనివచ్చునందాఁక
నంగరక్షకుఁడ వై యధిపుఁ గాచి
తే. యుండు మని మాద్రిపుత్రుల నుపచరించి
ద్రౌపదికిఁ జెప్పి మఱియును దానవారి
యడుగులకు వ్రాలి యద్దేవు ననుమతమున
నరిగె ననుమోదమున యౌవనాశ్వపురికి. 138

క. అనుటయు విని జనమేజయ
జనపతి సంతసము నొంది జైమినితో న
య్యనిలసుత యౌవనాశ్వుల
కును దారస మైనరణముకొలఁ దడుగుటయున్. 139

శా. మల్లాంబావరపుత్ర గర్వితరిపుక్ష్మాపాలసంపత్తివి
ద్యుల్లావణ్యకళాశరత్సమయలీలోల్లాసి బాహాసిమ

త్తల్లీన త్తనరంగదంగదసుహృద్ధాత్రీశకోటీరమా
దవ్యల్లీలాకకుబంతవారణ సువర్ణాహార్యధైర్యోదయా. 140

క. ధరణీవరాహవార్జిత
ధరణీవరణాపరావతార మురారీ
ధరణీవరాహ రక్షిత
ధరణీవరబృంద మహితదాన ముకుందా. 141

మాలిని.—

జనితమహితసంధా చారుసాహిత్యగంధా
వినయనయవిలాసా విద్వదంతర్నివాసా
ఘనతరమదగర్వగ్రంథిభారానమద్దు
ర్జనపహృదయభల్లా రాయచౌహత్తమల్లా. 142

గద్యము. ఇది భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్ర గాదయామాత్యపుత్ర వినయవిద్యాసముద్ర పినవీరభద్రప్రణీతంబైన జైమినిభారతంబునం దశ్వమేధపర్వంబునం బ్రథమాశ్వాసము.

శ్రీ

# జైమినిభారతము

## అశ్వమేధపర్వము, ద్వితీయాశ్వాసము.



శ్రీ రమ్యణచరణకలితవి
చారణ పరభయదఖడ్గశార్దూలమహా
ధారానఖముఖదారిత
వీరారికుభంగ గుండవిభునరసింగా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున
కిట్లనియె నట్లు ధర్మజ వాసుదేవులచేత ననుజ్ఞాతుండై హస్తి
పురంబు నిర్గమించి నిరర్గళప్రయాణంబులం గతిపయవాస
రంబులకు. 2

భీమాదులు భద్రావతీనగరంబుఁ జేరుట

ఉ. పావని కాంచెఁ గట్టెదుర భర్మశిరోగృహతుంగశృంగసం
భావితపద్మరాగజగభస్తిసమాజవిరాజమానలీ
లావిపరీతసాంధ్యనిశలం దిశలందు నలంకరించు భ
ద్రావతి యౌవనాశ్వసురరాజవిరాజదిరామరావతిన్. 3

సీ. స్ఫాటికమణిశిలా ప్రత్యగ్రరచనాతి
బంధురప్రాకారభాసురంబు

పాతాళజలరుఖరీపర్యాప్తకల్లోల
సుకుమారపరిఖోపశోభితంబు
కనకసౌధాంచలకలితముక్తాఫల
రాజిలీలాగ్రతారాగణంబు
శక్రనీలశిలావిశాలగోపురరోచి
రసమయజనితమిథ్యాతపంబు
తే. భవనకాసారకహ్లారపద్మకుముద
పుండరీకనీలోత్పలషండసురభి
విపులమధుకరకలనాదవిజితపుష్ప
చాపనినదంబు భద్రావతీపురంబు. 4

ఉ. పంబినవేదఘోషణాల భాషణముల్ వినరాక హోమధూ
మంబులు గ్రమ్మి కార్గొన ఖమార్గము కానఁగనీక యూపసం
ఘంబులసందడిన్ నడువఁ గాద్దెరువైనను లేక సాధుర, మ్యం
బును శత్రుభీషణము నై పుర మొప్పుచునుండు నెప్పుడున్

శా. నానాపక్వఫలాతినమ్రతరుసంతానంబులన్ విస్ఫుర
న్నానాపుష్పలతాప్రతానముల నానాపక్షిరావంబులన్
నానావర్ణమృగప్రచారముల నానాకేళికుంజంబులన్
నానాభంగి నుతింప నొప్పుఁ బురి నానాభోగసంపన్నతన్. 6

ఉ. ఆనగరంబువై భవము లగ్గజసూతికిఁ జూపుచున్ మరు
త్సూనుఁడు గాంచె నొక్కయెడఁ దోయజహల్లకకైరవోత్ప
లానూనమరందగంధినటదూర్మిఘటాపరిఘట్టనార్ద్రమూ
లానఘకూలదేశసముదంచితపూగము వాస్తటాగమున్. 7

తే. కాంచి యీబావి యగుఁ దురంగములు నీరు
ద్రావ నది గాకయున్న నుద్యత్ఖురప్ర

కాండముద్రలచేత సంకలిత మగుచు
మృదురజోరాజి మెదుగ నేరదు పథంబు. 8.

క. తురగములు నీరు గొనునవ
సరమును నేతెంచె మనము చాటువడుద మి
గ్గిరిరాజంబున నని యరి
గిరి ముఫ్వురు నరిగి కుంజగృహాసంస్థితు లై. 9

తే. ఉండి కర్ణసుతుండు వాయుజునితోడ
నృపతి కీతని కక్షౌహిణీదశకము
కలిగినను నందు నొకకొంతగాని పెకలి
యంతయును రాదు చనుదెంచు హయముబడిని. 10

సీ. త్రిపథగావాహినీతీరంబుఁ జేరిన
జనులపాతకసముచ్చయముఁ బోలె
సంవర్తశిఖిశిఖాజ్వాలకీలంబును
డాసినకాలకూటంబుఁ బోలె
వసుదేవసుతపదద్వయచింతనంబున
మలినమానసునిజన్మంబుఁ బోలె
సాధితగయుఁ డైనసత్పుత్రుఁ గాంచిన
పితృవర్గవిషమదుర్గతియుఁ బోలె

తే. నడఁగిపోవును నీచేత యౌవనాశ్వ
భూమిపాలాశ్వరక్షకభూరిసైన్య
సముదయం బెల్ల నుగ్గునూచంబు లగుచు
నీగదాఘాతమున నొక్కనిమిషమునను. 11

మ. అని సల్లాపము లాడుచున్నయెడ నుద్యద్వాద్యఘోషం
బులుఁ, ఘనఘీంకారరవంబులుఁ బృథుగళగ్రైవేయఘంటా

కరో,రనినాదంబులు గండదానజలధారాలోలరోలంబమో
హానఝుంకారములునైలంగనివహంబై వచ్చెశుండాలముల్.

వ. ఇత్తెఱంగున మత్తగజంబులు వచ్చి సరోవరంబుఁ జొచ్చి మచ్చికలు హెచ్చుమీఱం గరంబుల జలంబులు పూరించి కరులు కరేణువులమీఁదను గరేణువులు కరులమీఁదనుం జల్లుచు నుల్లసిల్లుచు దంతకోరకంబులం గోరిక లీరికలెత్త మెత్తమెత్తనఁ గండూయనంబులు సేయుచు శుండాదండంబులం బుండరీకంబులు వెఱికి నిండిన కుతూహలంబున గండుమిగిలి ప్రేట్లాడుచు నన్యోన్యవదనసౌరభంబు లాస్వాదించి మోదంబున బృంహితంబులు సేయుచుఁ బిక్కటిల్లిన మక్కువ నక్కుతోడ నక్కును, జెక్కుతోడఁ జెక్కును, జెవితోడం జెవియును, బరితోడం బరియును సరిబెరయ నొరయుచుఁ బుష్కరాగ్రంబుల జలంబులు పూరించి చిమ్మనఁగ్రోవులంబోలె నొండొంటిపయిం జిమ్ముచు ననేక ప్రకారంబులఁ గ్రీడించి మావంతుల బలవంతంబునం జలవిహారం బుజ్జగించి పురంబునకుం మగుడు నంత. 13

సీ. నేమినిర్గతధారుణీరేణుకల్పిత
తిమిరబృందస్యందనములతోడఁ
గల్పాంతరుద్రఢక్కారావధిక్కారి
సముదగ్రవాద్యఘోషములతోడ
వ్యాలోలమృత్యుజిహ్వాపల్లవాభీల
సందీప్తబిరుదధ్వజములతోడ
గ్రీష్మఘర్మత్విషద్భీష్మదీప్తిచ్ఛటా
కలితాస్త్రసుభటసంఘములతోడ

తే. వచ్చుసైన్యంబు చటులగర్వంబుఁ జూచి
యౌవనాశ్వుండు గాఁబోలు ననుచుఁ గర్ణ
సుతుఁడు దిగ్గన లేచి చూచుచును నీరు
ద్రావ నేతెంచుహరులసందడిగఁ దెలిసి. 14

చ. పరువడి భూసురాస్యములభంగిఁ బదక్రమముల్ దలిర్పఁ ది
త్తిరినకులోష్ట్రకేకులగతిం గతు లొప్పఁగఁ జేరి వాహకుల్
పరిపరిలాగులం గుదియఁబట్టుచు రా వలనత్రయంబులుఁ
దురగము లేగుదెంచె నవె త్రొక్కినచోటులు త్రొక్క
కుద్ధతిన్. 15

చ. వివిధము లైనయశ్వములు వేలతరంబులు నీరు ద్రావుచున్న
వియును బోవుచున్నవియు నైనవి యారయ నిందులోపలఁ
బవనహయంబు వచ్చుట కనంబడ దింటన కట్టి గడ్డియుఁ
గవణము నీరు చూపఁ బతి కట్టఁడ చేయఁగఁబోలుఁ బావనీ.

తే. అనిన వృషకేతుఁ గనుఁగొని యనిలసుతుఁడు
పలికినారము తురగసంబంధ మైన
ప్రతిన లెన్నేని ధర్మసంభవునియెదుర
మనము దోయిడిచేతుల మగుడు టెట్లు. 17

సీ. పుత్రహీనుం డైనపురుషునకుఁ బరలో
కసుఖముపొందు గల్గనివిధమున
నంగనాజితుఁ డైనయట్టిపాలసునకు
బంధుసంఘంబు చొప్పడనికరణి
మంత్రినిష్ప్రహుఁ డైనమనుజనాథునకును
స్థిరరాజ్యగరిమ సిద్ధింపనట్లు

శ్రీవిష్ణుపదభక్తి చిత్తంబులో లేని
వానికి శుభములు లేనిపగిది

తే. శంకరునిఁ బూజ సేయనిపంకమతికి
గురుతరైశ్వర్య మొదవనిసరణి మనము
హయముఁ గొనిపోక విఫలప్రయత్నమునను
గరిపురికి నేగు టపకీర్తికారణంబ. 18

క. అని మాటలాడుసమయం
బున రథకరితురగభటసమూహము బహువా
ద్యనినాదభీషణంబై
చనుదెంచెఁ దదీయవిపులసైన్యము నడుమన్. 19

భీమాదులు యజ్ఞాశ్వంబును జూచుట

క. తురగంబు వచ్చెఁ బరిపరి
మురువునఁ జరణములు నేల మోవకయుండన్
ధర బహువల్లభ యగుటను
ఖురపుటములు మోపకుండఁ గొసరెడుభంగిన్. 20

మ. వినుతానేకవిభూషణాభినవమై శ్వేతాతపత్రద్యుతుల్
తనపై వెన్నెల చల్లఁ జామరశిరోదంచన్మరున్మంజరీ
జనితానందమున న్మనం బలర నుత్సాహంబునన్ సార్వభౌ
మునిచందంబున నేగుదెంచె విహితాంభోజాకరక్రీడకున్.

క. ఈకరణి వచ్చుతురగముఁ
బైకొని పట్టంగఁ దమకపడుపుత్రుని నా
లోకించి వలదు వేగము
నీకని వారించి మనుమనిం గనుఁగొన్నన్. 22

### మేఘవర్ణుఁడు సైన్యంబుల మార్కొనుట

సీ. భీమసేనునకుఁ బ్రణామంబు గావించి
మేఘవర్ణుఁడు విక్రమించి పలికె
సేనలనడిమి తేజీఁ దెత్తు మందలోఁ
జెవిపట్టి క్రేపు నీడ్చినవిధమున
దళము లేలెక్క నీసెలవు గల్గినఁ జాలు
యౌవనాశ్వునిఁ దనూజాన్వితముగ
బలిమిమై మూటకట్టులు గట్టి తెచ్చెద
ప్రుచ్చులఁబోలె నీముందటికిని
తే. నేల మన కింత తురగంబ చాలు ననినఁ
దడవు సేయక నిమిషమాత్రంబులోనఁ
దార్చి కట్టెద నీయున్న తరువుతోడఁ
గీచకాంతక నను విలోకింపు మనుచు. 23

వ. సంగరోత్సాహంబున సంగంబు వొదల నక్కధరశృంగంబుననుండి లంఘనజంఘాలం బగుసింగంపుఁగొదమకరణి ధరణికిం జనుదెంచి మించినమాయాప్రభావంబునం గాలకంధర కంధరామూల కాకోలవిష మషీసగంధం బగునంధకారంబు గల్పించు కల్పాంతకాలమేఘంబుల నుత్పాదించి తన్ముఖంబున దిఙ్ముఖంబులం దళతళలు గడలుకొన విద్యుల్లతామతల్లికల నల్లుకొనం జేసియు నెల్లెడలఁ బెల్లుకొని యుల్లంబులు జల్లనం బిడుగులు వడం జేసియు నుత్పాతంబులు గావించుచు దేవదానవాదులకు భయంకరంబుగా గగనవీథీవిటంకంబున నిలిచి మేఘనాదుండునుం బోలె

మేఘనాదంబున సింహనాదంబు చేసి యద్దనుజసింహుండు విక్రమింప నవ్విక్రమంబు శక్రుం డొక్కచారునివలన విని సక్రోధుండై యాక్రవ్యాదుం డెవ్వం డరసి రమ్మని యొక్క దూతం బుత్తెంచిన నతండు సత్వరంబుగ వచ్చి యంబరంబున శాంబరీడంబరంబు నెరపుహిడింబాపౌత్రుపాలికిం జను దెంచి. 24

ఇంద్రుండు మేఘవర్ణునికడకు దూతను బంపుట

క. నీ వెవ్వ రేల చేసెద
వీవిపరీతములు నిర్జరేశ్వరుఁడు త్రిలో
కీవిభుఁడు తెలిసి రమ్మనఁ
గా వచ్చితి నిజముఁ జెప్పఁగాఁ దగు ననినన్. 25

చ. అమరవిభుండు నన్నడుగ నంపెఁ గృతార్థుఁడ నైతి భీమసే
నుమనుమఁడన్ ఘటోత్కచతనూజుఁడఁ బేరున మేఘవర్ణుఁ
డన్, శమనజుఁ డశ్వమేధసవనం బొనరించుచు యౌవనా
శ్వదుర్గమున మఖాశ్వ మున్న దనఁగా విని తెమ్మని పంపు
వెట్టినన్. 26

తే. నీతికై చేయుమాయావిభూతిగాని
యొండు గా దన విని దూత యుత్సహించి
యరిగి యవ్విధ మెఱిఁగింప నమరవిభుఁడు
సంతసమునొందె నిచట రాక్షసవరుండు. 27

సీ. ఒకచోట జీమూతనికరంబుఁ బొడమించు
నొకచోటఁ గురియించు నుపలవృష్టి
వెదచల్లు నొకచోట విస్ఫులింగంబులఁ
బడఁజేయు నొకచోటఁ బిడుగుగముల

నతులవాతూలసంహతి ముంచు నొకచోటఁ
దొరఁగించు నొకచోట ధూమపటలి
సవరించు నొకచోటఁ జటులాంధకారంబు
నొకచోటఁ బెళపెళ నుఱుమఁజేయుఁ

తే. బెక్కు లీరీతి మఱియుఁ గల్పించి మించి
యహితసేనల నెల్లఁ జీకాకుపఱచి
పట్టి యశ్వంబు మూఁపునఁ బెట్టికొనుచు
గగనగమనంబు గైకొని కదలె వడిని. 28

చ. అతఁడు సమీరవేగమున నశ్వముఁ గొం చుడువీథి నేగ న
ద్భుతపడి పోయెఁ బోయె హయముం గొని దానవుఁ డంచు
సైనికుల్, వితథఫలప్రయత్ను లయి విస్మృతిఁ గన్గొన వేలు
పుల్ కృపా,హితమతి మేఘవర్ణునిపయిం గురియించిరి పుష్ప
వర్షమున్. 29

తే. ప్రసవవర్షంబుఁ గురియించి ప్రస్తుతించి
త్రిదశు లేగంగ హయముతోఁ జదల నున్న
యతనిఁ గన్గొని భీమకర్ణాత్మభవులు
సింహనాదంబు చేసిరి చెంగలించి. 30

వ. ఇవ్విధంబున భీమసేనపౌత్రుండు మాయాబలంబున హ
యంబు నపహరించుకొని పోవుట భటులవలన విని యావ
నాశ్వమహీకళత్రుండు పుత్రబంధుజనమిత్రసహితుండై నిర్ని
రోధం బగు క్రోధంబున నిష్ప్రతీపం బగుప్రతాపంబున
వెడలి వియత్పథంబునం జనురథికవీరుల నావేళ నాలుగువేల
ననుప ననుపమాన సంరంభంబున విజృంభించి వార లంబరం
బున కుద్గమించి మించినపరాక్రమంబునం జక్రశరశూల

ముద్గర ముసలాది సాధనంబు లంకించుచు నవ్వీరునిఁ జుట్టు ముట్టిన నాజెట్టిబిరుదునుం దట్టువారక యట్టహాసంబు చేసి చెట్టిదం బైనరాచట్టుఁ బెటికి చుట్టుకొనిన మూఁకలఁ గిట్టి వడిం జాఁపకట్టు వడంగొట్టి యమరపతిపట్టణంబున కనిచి పట్టి తెచ్చిన హయంబును ననిలుపట్టికట్టెదురఁ జెట్టునం గట్టి దండంబు వెట్టి నిలిచిన నట్టియెడ. 31

మేఘవర్ణుఁడు రాజసైన్యముతోఁ బోరుట

చ. వెనుకొని యౌవనాశ్వపృథివీపతిసేనలు చుట్టు ముట్టినన్
గనుఁగొని మేఘవర్ణుఁ డధికం బగురోషమునం దదీయసై
న్యనివహముల్ వడిన్ దఱిమినన్ సుర లచ్చెరు వంది రప్పుడ
ద్దనుజుఁడు మందరాచలవిధంబున నబ్బలవార్ధిఁ జొచ్చినన్.

సీ. కలఁగుండు వడి హల్లకల్లోల మై చాలఁ
 గలఁగె వాహినులు భంగములతోడఁ
గటకశోభితవిశంకటకూటములతోడఁ
 బెకలె సపక్షభూభృచ్చయంబు
చండభాస్కరసముజ్జ్వలితహేతులతోడ
 బాడబోద్భూతవిభ్రమము లడఁగె.
నాలోలకీలాలహతులతోడఁ బెనంగి
 కడలేనివివిధశంఖములు తేలెఁ

తే. బవనసుతపౌత్రదుర్దాంతబాహుదండ
మందరాచలమంథానమథ్యమాన
యౌవనాశ్వమహీపాలకాగ్రగణ్య
వర్ణితాభీలవిపులసైన్యార్ణవమున. 33

క. ఈకరణి దానవుం డతి
భీకరముగ రణము సేయఁ బిఱుతివియక వై
భాకరసేనలు శస్త్ర
నీకంబుల ముంచి రాతనిశరీరంబున్. 34

తే. అపుడు వృషకేతుఁ డమ్మహాహవముఁ జూచి
మేఘవర్ణుండు హరి విక్రమించి తెచ్చు
నవసరంబున నయ్యాజి నలసినాఁడు
తలము గా దొక్కరునకు నీదళము గెలువ. 35

క. అని పలికి కార్ముకము గొని
యనిలతనూజునకు మ్రొక్కి యనుమతిఁ గొని తాఁ
జనియె రణం బొనరింపఁగఁ
గనుఁగవ నునుసోఁగ కెంపు గడలుకొనంగన్. 36

శా. జ్యాటంకారకఠోరరావము దిశాజంఘాల మై మ్రోయఁ దీ
వ్రాటోపంబున యౌవనాశ్వనృపుసైన్యంబు ల్విలోకించి త
ద్ధాటీనిష్ఠురఖేలనంబునకు సంత్రాసంబు నొంద న్నిరా, ఘా
టోత్సాహత మేఘవర్ణుఁడు మదిం గౌతూహలం బందఁగన్.

తే. ఇవ్విధంబున వృషకేతుఁ డేగుదెంచి
యలసినాఁడవు వత్స నీ వరుగు మనుచు
భీమపౌత్రుని ననిపి యుద్దామసింహ
వృత్తిఁ బరసైన్యమత్తేభవితతి కుఱికి. 38

వృషకేతుఁడు సేనలం దునుముట

ఉ. బాణనఖప్రకాండముల భద్రగజంబుల సంహరించి కం
ఖాణముల న్వధించి రథకాండముల న్నుఱుమాడి సద్భట

శ్రేణుల మర్మవర్మములఁ జెండి విశృంఖలవృత్తి నాహవ
క్షోణిఁ జరించి జన్యజయశోభితనిష్ఠురసింహనాదుఁ డై. 39

ఉ. హాటక శైలధన్వి త్రిపురాసురవీరుల సంహరించున
ప్పాటునఁ గార్ముకాంబుధరబంధురమార్గణవృష్టి ముంచినన్
ఘోటరథేభవీరభటకోటులు రూపఱి పోవ వీటికిన్
జే టెటిఁగింపఁ గంఠగతజీవుఁ డొకం డరిగెన్ రయంబునన్.

సీ. అరిగి భద్రావతీశ్వరుఁ జేరి ప్రణమిల్లి
సేన లన్నియు సమసిన తెఱంగు
వీతిఁ గోల్పోయినవిధమును విన్నవిం
చిన రోషవిహ్వలచిత్తుఁ డగుచు
నెట్టెట్టురా దళం బెంత వచ్చె హయంబు
పరుల కేగతిఁ బట్టువడియె ననిన
దేవర మువ్వు రేతెంచిరి వారిలో
నడుకొత్తి కొంతసైన్యము వధించి

తే. సవనహరిఁ గొంచునెగసె నద్దివికి నొక్కఁ
డుఱికి బలమెల్ల సమయించె నొక్కఁ డతని
దండ నున్నాఁడు పెనునిట్టతోటివంటి
గుదియ మూఁపున సవరించుకొని యొకండు. 41

క. అని విన్నపంబు చేసిన
మనమున రోషాద్భుతములు మల్లడిగొన న
య్యనఘులు కారణజన్ములు
జనులకు లే వరయ నిట్టిసామర్థ్యంబుల్. 42

చ. ముగురును నాకుఁ జూడఁగఁ ద్రిమూర్తులు తప్పదు లేక
వాహముఁన్, బొగరున నొక్కఁ డెత్తుక నభోగతి నేగుట

యెట్లు లెక్కఁగొనఁ, మిగిలినసేన నొక్కఁడ దహించి వధిం
చుట యెట్లు వారిలో, మొగఁ డగువాని కింత మసి మోవక
త్రుంగుట యెట్లు సైన్యముల్. 43

తే. అశ్వమేధంబునకు విఘ్న మాచరించి
తిరిగి రశ్వంబుఁ దిగిచినఁ దిగువ నిమ్ము
వానితోడన సంగరాధ్వర మొనర్చి
దేవతల నెల్లఁ దృప్తిఁ బొందింతు ననుచు. 44

వ. ఆహవోత్సాహదోహలమ్మున నమ్మహీవిభుండు శతాంగ
మాతంగతురంగసుభటపుంగవసంగతుం డై పురంబు నిర్గ
మించి సమరభూమిసమీపంబునకు వచ్చి యాసమీపంబున
యుగాంతకాలకాలుండునుంబోలెఁ బ్రచండగదాదండమం
డితభుజోద్దండుం డై భండనంబున కెదురుచూచుచున్న
వృకోదరు విలోకించి యలోకసామాన్యంబు లగునతని తేజో
విశేషంబులకు నద్భుతంబు నొందుచు జన్యంబున సైన్యంబు
నెల్ల సమయించి సన్యస్తభయుండై నిజధనుఃకోటివిన్యస్త
హస్తుం డై యున్నవృషకేతుం గనుంగొని శిరఃకంపంబు
చేసి తనమనంబున, 45

ఉ. కంపితదిగ్విభాగమున గాసిలి వచ్చిన నన్నెకింత వీ
క్షింపఁడు సైన్యముఁ గొనఁడు సేయఁడు సింహకిశోరవృత్తి గ
ర్జింపుచు నున్నవాఁడు మది మృత్యుభయం బిసుమంత లేక
యీ, తెంపరికర్మపాశములు ద్రెంపఁగ నిల్చినయోగికై వడిన్.

తే. అని బలంబులఁ గర్ణనందనునిమీఁదఁ
బంపువెట్టిన వానిసంభ్రమము చూచి

రోషతామ్రాక్షుఁ డగుచు మారుతసుతుండు
ఘనగదాదండమంకించి కదలుటయును. 47

యౌవనాశ్వుండు వృషకేతునితోఁ బోరుట

సీ. భీమసేనునిసముద్దామతఁ గన్గొని
యెదురుగా వృషకేతుఁ డేగుదెంచి
యీరేడుభువనంబు లెత్తి వచ్చినఁ గాక
యల్పసైన్యంబు లక్ష్యంబె నీకు
నీపుత్త్రు నన్ను మన్నించి చూచుచునుండు
నే నీక్షణంబున నీవు మెచ్చఁ
బరబలారణ్యంబు భస్మంబు చేసెద
నస్మత్కఠోరబాణాగ్నిశిఖల
తే. నఖిలజనులకు దేహంబు లస్థిరములు
ప్రాయములు చంచలంబులు పౌరుషమునఁ
గాని త్రైలోక్యవర్తిని యైనకీర్తి
గలుగనేరదు తండ్రి యెక్కాలమునను. 48

మ. కరియానం బటుపాశహస్తఁ బృథుశంఖగ్రీవఁ జక్రస్తనిన్
బరసేనారమణి న్వరించితి నురోభాగంబునన్ నిల్చెన్ నిర్భరకే
ళిన్ విషమాస్త్రచిహ్నములు సేరన్ వావి గా దింక మాను
రణోత్సాహము నీవు జన్యరతిఁ గాంతున్నే యశస్సంతతిన్.

తే. నన్ను వరియించినది కారణంబుగాఁగ
దేవరకుఁ గోడ లైనసేనావధూటి
సిగ్గు పెంపున మొగమువాంచినది చిత్ర
వైజయంతీనవాంశుకవ్యాజమునను. 50

ఉ. నావుడు వాయునందనుఁడు నందన పొమ్ము చమూవధూటినీ
కైవస మైన లెస్స యటుగాక నినుం దల మీఱెనేని దా
దావుల నిల్చి మద్భుజగదాపటువిభ్రమతాడనంబులన్, జేవ
యడంతు నెందు గురుశిక్షఁ గదా మతి గాంతు రంగనల్.

తే. వత్స నీవు పదాతివి వారు రథికు
లెట్లు పంపుదు నిను మది గట్టి చేసి
యనిన నీకృప నాకు వజ్రాంగిజోడు
చింత వలవదు పనుపు మాజికిని ననుచు. 52

ఉ. భీముఁ బ్రదక్షిణించి మెయిఁ బెంపుచుఁ గెంపగుకన్నుదో
యితోఁ, గాముకవృత్తి నేగి నవకం బగుచందనకుంకుమా
బ్జధూ,ళీమృగనాభికర్దమవిలిప్తఁ జమూసతి సాయకాంబకన్
సామజకుంభకర్కశకుచ న్వరియింపఁగ నుత్సహించుచున్.

క. వీతభయుండై యావృష
కేతుఁడు గుతుకమునఁ బెండ్లికిం జనుగతిఁ బ్ర
స్ఫీతగతి వచ్చి మును తన
చేత హతం బైనసమరసీమాభూమిన్. 54

సీ. ప్రథమపయోరాశిపగిది నొక్కొకచోట
క్షారకీలాలసంకలిత మగుచుఁ
గైలాసశైలంబుకరణి నొక్కొకచోటఁ
గరిరాజవదనవిస్ఫురిత మగుచుఁ
బార్థప్రతిజ్ఞాబిభంగి నొక్కొకచోట
దళితసైంధవముఖోద్దామ మగుచు
శౌరిదక్షిణబాహుసరణి నొక్కొకచోటఁ
బృథులరథాంగాతిభీమ మగుచు

తే. నిష్ఠురాత్మీయకింకరనికరనిర్భ
దేళిమారాతిసైన్యప్రతీకశకల
వితతవిషమితసంగరోర్వీతలంబుఁ
జూచి యల్లన నగుచు నచ్చోట నిలిచి. 55

మ. తనపై వచ్చు విరోధిసైన్యముల నుద్యద్బాణజాలంబులన్
దనువుల్ సించియు నశ్వసంతతులగాత్రంబుల్ విభేదించి
యున్, ఘనదంతావళకుంభకూటములముక్తాశ్రేణులన్ రా
ల్చియున్, దిననాథాత్మజసూతి రౌద్రరస మున్నిద్రస్థితిన్
జూపుచున్. 56

సీ. సైన్యంబు నీగతి సమయించుచును వచ్చు
నతనిఁ గన్గొని యావనాశ్వవిభుఁడు
దంతావళము నెక్కి తపనపౌత్రునిఁ జూచి
యాదివిష్ణువుఁబోలె నాత్మలోనఁ
దెలియకున్నాఁడ నీకులగోత్రనామంబు
లని సేయరా దన్వయం బెఱుంగ
కెవ్వానితనయుండ వెద్ది నీనామంబు
నీరాక కిపు డేది కారణంబు
తే. నాకు నెఱిఁగింపు మనిన భూనాథుతోడఁ
గశ్యపుఁడు వంశకర్త పంకజహితుండు
తాత త్రైలోక్యవినుతప్రదాత కర్ణుఁ
డనఘ మాతండ్రి వృషకేతుఁ డండ్రు నన్ను. 57

తే. ధర్మనందనునశ్వమేధంబుకొఱకు
వచ్చి కనుఁగొనునాతండు వాయుసూనుఁ

డతనిపౌత్రుండు తురగము నపహరించె
నేను నిల్చితి నిల్చినసేనలకును. 58

తే. అనుచు వృషకేతుఁ డాడిన యౌవనాశ్వ
ధరణిపాలుండు మదిఁ బ్రమోదంబునొంది
యనఘ యొక్కింత శ్రమమార్చుకొనుము మిగుల
నలసినాఁడవు తడవు కయ్యంబుచేసి. 59

క. నీవు పదాతివి నే దం
తావళరాజంబు నెక్కినాఁడఁ దగవుగా
దోవత్స యరద మెక్కుము
నావుడుఁ జిఱునవ్వుమోమునం దళుకొత్తన్. 60

చ. తరువులు ఱాలు గొడ్లును బ్రదాతల వెవ్వనివీట నట్టియా
సురపతి నర్థిఁ జేసినయశోనిధికూర్మిసుతుండ నీవు న
న్నరదముఁ బుచ్చుకొమ్మనెద వందిన వందిన కాదె మీఁదసం
గరము ఘటిల్లునే చెలిమిగాఁ బడుఁగా కిటు మాటలాడినన్.

క. అనిన వృషకేతుఁ గనుఁగొని
యనురాగముఁ బొంది యౌవనాశ్వమహీశుం
డనియె మును చూపుమా నీ
ఘనకార్ముకముఖశిలీముఖంబుల ననినన్. 62

చ. తురగముసుద్ది చెప్పిన నెదుర్కొనుకోపముతోడ నాత్మమం
దిరములు నిర్గమించుచుఁ బ్రతిజ్ఞలు వల్కఁగఁ గాదు వారిని
స్ఫురతరశౌర్యముల్ మొదలఁ జూడుము నాశరవృష్టి ముం
చినఁ, మరల జనింప దీబలము మంత్రజలంబులు మీఁదఁ
జల్లినన్. 63

సీ. అదియునుం గాక నీకనుగుణం బైనయీ
బంధువర్గముఁ బుత్రపౌత్రచయము
సమదవారణహయస్యందనారూఢులై
చనుదెంచి యుభయపార్శ్వముల నిలిచి
బిరుదకాహళములు పెనుపడం బైప్రాయ
ఘనశస్త్రరోచు లాకసముఁ బ్రాఁక
విజయకేతనములు వివిధంబు లై క్రాలఁ
గాలు ద్రవ్వుచును సంగరముఁ జేయఁ
తె. మెండుకొని యున్నవారందుమీఁద నీకు
వార్ధకం బొత్తినది లావువయసు నాకు
నన్ను నేకాకి యని కన్గొనంగ వలదు
శౌరికృపఁ గాదె నాకు నక్షయబలంబు. 64

క. వల దింకఁ బెక్కుమాటలు
తొలిపోటై నిలిచినాఁడ దుర మొనరింపన్
దలపడు మనుటయు నాతం
డలిగి మదావళము డిగి రథారూఢుం డై. 65

క. బెడిద మగు కార్ముకం బె
క్కిడి నిష్ఠురసాయకంబు లీరైదు వడిన్
దొడి యేయ నక్కుమారుఁడు
నడుమన యొకమార్గణమున నవి త్రుంచి వడిన్. 66

తే. అర్ధచంద్రాశుగంబేయ నధిపుగొడుగుఁ
జామరయుగంబుఁ దునుఁబయ్యె సగుణధర్మ
రహితు లైనట్టికుటిలవర్తనులఁ గూడ
సజ్జనుని ప్రీతిగుణములు సమసినట్లు. 67

ఉ. అంతటఁ బోక మూఁడునిశితాస్త్రము లుద్ధతి నేయఁ జాప
మొక్కంతగఁ ద్రుంచి యశ్వనివహంబుల నొంచి నృపాలు
దేహముఁ, గ్రంతలు చేసి చొచ్చె విశిఖంబులు గహ్వరిఁ
గూటసాక్షు లత్యంతకఠోరఘోరనిరయంబులు దూఱఁగఁ
బోవుకై వడిన్. 68

చ. నరపతి యొండువిల్గొని గుణధ్వని చేసి కుమారుమీఁద ని
ర్భరగతి నేసె సర్వదిశరంబు లురంబునఁ గాఁడ నెత్తు రా
బిరుసగుగంటులం దొరఁగి పింజనగ్రోవులరీతిఁ బాఱఁగా
నరుణమరీచి మాలిక్రియ నర్కజుపట్టి వెలింగె నాజిలోన్.

సీ. అవ్విధంబున యౌవనాశ్వభీకరశాత
శరభిన్నవక్షుఁడై తరణిఁ బౌత్రుఁ
డడరి బెబ్బులిఁ గోల నడచినగతి రేఁగి
చండమార్గణచతుష్టయముచేత
రథరథ్యములను సారథిశిరోధియుఁ ద్రుంచి
జననాథు నమ్ముల మునుఁగఁ జేసి
తపనమండలము శస్త్రపరంపరలఁ గప్పి
కదన మంతయును జీఁకట్లు గొలుపఁ

తే. బొలిసి రాజన్యసేనలు కళవళింప
వెఱఁగుపడఁ బావకాస్త్ర మవ్వేళఁ దొడిగి
నృపతి తత్కాండనివహంబు నీఱుచేసి
వారుణం బేసి యార్చి యవ్వహ్ని నార్చె. 70

### వృషకేతుఁడు మూర్ఛిల్లుట

ఉ. భానుజసూనుఁడుం గనలి పావకవారుణదారుణాస్త్రసం
తానము లేయ నద్ధరణినాయకుఁ డాగ్రహవృత్తి నుద్ధతుం

డైనగబాణ మేసిన రయంబున నమ్మహనీయసాధనం
బేనికగున్నలం గడవ నెక్కుడుగుండుల నుర్వఁజొచ్చినన్.

మ. కులిశాస్త్రంబున నమ్మహాశిలల నుగ్గుల్ చేసి హాలాహలా
నలసంకాశము లైనబాణముల నోనాటింప నల్క న్మహీ
తలనాథుండు కఠోరభల్లమున వత్సం బేయఁ జండాంశుస
త్తులితం బైనశరంబు నాటి వృషకేతుం డాజిలో మూర్ఛిలెన్.

చ. మిహిరతనూజుపట్టి రణమేదిని వ్రాలిన భీమసేనుఁ డా
గ్రహమునఁజూచికన్ను లెదురన్ వృషకేతునిపాటుగాంచి యీ
యహితులనెల్ల డించి సవనాశ్వముతోఁ బురి కేగుదెంచి య
మ్మహిపతిఁ గాంచి యీతనిక్రమం బపు డేమని విన్నవించెదన్.

క. అలమున యావనాశ్వను
పాలుని వరపుత్రమిత్రబంధుయుతముగాఁ
గాలునిపురి కనుపక యీ
బాలునికోల దీఱ దనుచుఁ బట్టెనకినుకన్. 74

వ. భీమసేనుండు రెండవదండధరుండునుంబోలె నుద్దండభుజా
దండభీషణగదాదండుండై కనలి భండనంబున కెదుర
వేదండకాండంబులు తండతండంబులై పయింబడం బడలు
వడం గనుపుకొట్టినయప్పట్టునఁ బడినయట్టలతిట్టలం జుట్టు
కొని వెడలు శోణితప్రవాహంబులు దురవగాహంబులై
పాఱం బాఱ వశంబు గాక తెరలి పారలంబడు వాహ
నంబులును దత్తటంబున నెత్తుటం దడిసి జొత్తుపాపలవిధం
బున నొత్తొత్తుల నలసి యమ్ములతిత్తు లైనరాహుత్తులును
సముల్లోలకల్లోలమాలికాభీలకీలాలవేల్లితంబులం దలక్రిం

దుగాఁ బడి శకలితాంగంబు లైనశతాంగంబులును జెంగట
కృతాంతపురపథికు లైనరథికులును గూలంబుల యోలం
బులం గాలు గాలం బెనంగఁ దేలియాడుకాలుబలంబునుంగా
నాలంబు త్రిజగదాభీలం బయ్యె నప్పుడు. 75

ఉ. భీముని జానుదేశముల భీషణవాయువు లుప్పతిల్లి సం
గ్రామతలంబున న్విసరఁగా జతురంగసమస్తసైనిక
స్తోమము లభ్రమండలముతో నొరయం జనె బొందితోన సు
త్రాముని వీటి కేగెడువిధంబున దివ్యులు చోద్యమందఁగన్.

ఉ. ఆహవభూమి సోఁకఁ బడె నంతట దంతిరథాశ్వసైనిక
వ్యూహము గీలుగీలునకునూడి వడిన్ రుధిరంబు గ్రక్కుచున్
శ్రీహరికీర్తనంబుఁ జెవిఁ జేర్పక దుర్మతిఁ జన్న వైష్ణవ
ద్రోహులు ముక్తకేశములతో నిరయంబునఁ గూలుకై వడిన్.

సీ. దంతంబు లిడిసి మూర్ధంబులు వ్రక్కలై
కూలినభద్రశుండాలములును
గళములు మలఁగి డొక్కలు మీఁది కెత్తుక
చాఁపకట్టుగఁ బడ్డసైంధవములు
విటతాటనములుగా విఱిగి చక్రములతోఁ
దలక్రిందు లైనరథవ్రజములుఁ
దొడగులు సడలి కుత్తుక లెండి మిక్కిలి
వెడరూపులై పడ్డవీరభటులుఁ

తే. గలనఁ బ్రోవులు గొనుచుండ గజతురంగ
సుభటవిగ్రహసంజాతశోణితములు
వఱదలై పాఱె భీముదుర్వారజాను
తటసముద్భూతవాతూలతాడనమున. 78

—◆ సువేగభీమసేనుల ద్వంద్వయుద్ధము ◆—

ఉ. అప్పుడు యౌవనాశ్వసుతుఁ డైనసువేగుఁడు కీచకాంతకుర్
దప్పక చూచి తానును గదాఘనదండము కేలఁ గ్రాలఁగాఁ
ద్రిప్పుచుఁ దేరు డిగ్గి పఱతెంచి వడిం దనపేరు వాడి వ్రాఁత
ప్పక వ్రేసె నొక్క మొగిఁ దార్కొని భీముశిరంబునక్షమున్.

క. పెట్టు బయలుగాఁ గరువలి
పట్టి బెడంకుచు సువేగుబరులునురంబుర్
జుట్టుకొని విసర నాజగ
జెట్టి మిగుల నడిఁకి బొంకు చేసితి ననుచున్. 80

చ. తొలఁగిన నుప్పరం బెగసి దూఁటి శిరం బడి త్రిప్పి వ్రేయ న
వ్వల నటు దాఁటి చిత్రగతి వాయుజుఁ డిట్లపసవ్యసవ్యమం
డలవికటప్రచండకరణస్ఫుటవిభ్రమఖేలనంబులర్
దలపడి చేసి రిద్దఱు గదారణముర్ బటుదారుణంబుగన్. 81

క. కోలాట మాడుపాత్రల
పోలిక నరు దైనకీలుబొమ్మలగతి నా
భీలతఁ బెనఁగిరి గదలను
వేలుపులు నుతింపఁ బెక్కువిన్నాణములన్. 82

తే. కొదలు దెలియంగవలె ననుకోర్కిఁ జేర్చి
యెదలఁ బొదలినపదిలంపుటీ సమర్చి
మొదలుకొని మేనులు చెమర్చి మద మెలర్చి
గదలరొద లార్చి గగనంబు గదలనార్చి. 83

శా. ఈహం బూఁచి పెనంగఁ జొచ్చి రపు డయ్యేకాంగవీరుల్
జయోత్సాహంబుల్ వదనంబులం బొదల మాద్యచ్చండ

గర్వోద్ధత, వ్యాహారధ్వను లభ్రవిభ్రమములన్ వారింప
నొక్కుమ్మడిన్, బాహాబాహిఁ గచాకచిం దొడరి ప్రాబల్యం
బు తుల్యంబుగన్. 84

సీ. కనలి భీముఁడు సువేగుని లాగమునఁ జొచ్చి
పడవైచి చరణంబు లొడిసి పట్టి
విసరి పల్మఱుఁ ద్రిప్పివ్రేయ నమ్మేటియు
ధరఁ బడి బంతిచందమున నెగసి
పెనఁగి వాయుతనూభవుని నవ్విధమ్మునఁ
బడవేయ నవ్వడముడియుఁ గినిసి
కరటిఘోటకశతాంగముఁలచే నొప్పింపఁ
దప్పించి కదియ నిద్దఱును మఱియుఁ
తే. బార్ష్ణిపాదోరుపర్వకూర్పరకఠోర
ముష్టినిహతులఁ బగిలి మోములను దొరఁగు
రక్తములఁ దొప్పదోఁగి మూర్ఛలను వ్రాలి
యుండి రావేళ వృషకేతనుండు దెలిసి. 85

యౌవనాశ్వుని వృషకేతనుం డుద్ధరించుట

చ. వదలినద్రిండు తొంటిగతి వాటముగా బిగియించి మో
మునన్, జెదరినఘుర్మవారిఁ గొనచేలమునన్ దొలఁగించి
వీఁపునన్, బొదు లమరించి మించి బలుముష్టి శరాసనమున్
ధరించి కట్టెదుర విరోధిఁ గాంచి యెద నించినకోపము సంద
డింపఁగన్. 86

చ. ఎఱకలతోడిదుష్టభుజగేంద్రముల న్నిరసించునైదు క్రొ
మ్మెఱుఁగుశరంబుల న్విభునిమీఁదఁ గుమారకుఁ డేసె నేసిన

న్నెఱఁకుల నుచ్చిపాఱె ధరణీపతి తద్రథకూబరంబుపై
నొఱఁగి శరీరముం మఱచియుండెను బ్రాణములేనికైవడిన్.

క. అరదంబుమీఁద వ్రాలిన
ధరణీశ్వరుఁ జేరి కర్ణతనయుఁడు చిత్తం
బెరియంగ గంట్లవెంటం
దొరఁగెడురక్తంబుఁ గేలఁ దుడుచుచుఁ గరుణన్. 88

సీ. ముదుకనిమస్తకంబునకు దాపున నూఱు
కాండముల్ దలగడగా నమర్చి
తనువునఁ దూఱఁగాడినగంట్లు పరికించి
యధిపతియుత్తరీయమునఁ బొదిగి
మెఱుఁగుదట్టియుఁ గొంత కుఱుచగా నెఱివట్టి
సురఁటిలాగున గాలి సోఁక విసరి
యొయ్యనఁ బెడకేల నూర్పులు పరికించి
పలుమాఱు చెందంబు పట్టిచూచి

తే. నాన్యథా దైవబుద్ధిఁ బ్రత్యహము నేను
హరిపదారాధనైకతత్పరుఁడ నేని
శూరతముఁ డైనయిమ్మహాసుకృతరాశి
బాణజాతవ్యథలఁ బాసి బ్రదుకుఁగాత. 89

మ. అనుచుం శౌరిపదాబ్జముల్ దలఁచి దేహం బంటినం దీవ్రశ
స్త్రనిరూఢవ్రణఖేదముం దొలఁగ నంతం జెప్ప లల్లార్చిలో
చనముల్ మెల్లన విచ్చి కర్ణసుతునాస్యంబుం విలోకించి ని
ల్చిన నవ్వీరుఁడుఁ దొంటితావునకు వచ్చె న్వచ్చి విల్లందినన్.

ఉ. అవ్వనజాక్షపౌత్త్రునిఁ బ్రియంబున డగ్గఱి కౌఁగిలించి లే
నవ్వున యౌవనాశ్వనరనాయకుఁ డిట్లను నన్ను వేలుపుల్

ముప్పురు మెచ్చఁ బోరిచినసముజ్జ్వలమూర్తిని నిన్నెఱింగి
యుఁ, జిహ్వకు మార్కొనం దలఁపు చేసినవెఱ్ఱితనంబు చాలదే.

క. ప్రాణసముఁ డైనసఖునకుఁ
బ్రాణము లీఁగనుట చెలిమిఫల మటుగా దీ
ప్రాణంబులు నీ విచ్చిన
ప్రాణము లిదె నీవె పంచి పనిగొను తఱితోన్. 92

క. దినపజుఁడు భవజ్జనకుం
డనవరతాభీష్టదాత యైనను నాలం
బునఁ దెగినప్రాణములు త
త్తనువున కీనేరఁ డివ్విధంబున నతఁడున్. 93

మ. జయలక్ష్మీధవుఁ డైననీకుఁ దగ మత్సామ్రాజ్యభోగంబు ల
న్నియు నర్పించితి నీకృపాతిశయత న్నీరేజపత్త్రాయతా,
యదూత్తంసు మునీంద్రమానసరిరంసుం గంసవిధ్వంసున, వ్య
యు నద్వైతు భజించి యవ్విభునిసేవం గాంతు నిష్టార్థముల్.

యౌవనాశ్వుండు భీమాదులతోఁ బురంబున కరుగుట

సీ. అని ప్రియోక్తుల యౌవనాశ్వభూపాలుండు
వృషకేతునునివీర్యవితరణములు
వినుతించి తగ నిద్దఱును మరుత్సూనుసు
వేగులు న్నచటికి వేడ్కతోడఁ
జను దెంచి భీమసేనునిఁ గాంచి కర్ణనం
దనుఁడు ఘోరాస్త్రసంతతులఁ దన్నుఁ
జంపి రక్షించిన చందంబుఁ గొనియాడి
వినుఁ డిది మీకు నిచ్చినశిరంబు

తే. క్రతుహయము వెంట నరిగి దిక్చక్ర మద్రుపఁ
దిరిగి కొనివత్తుఁ దెమ్మని తిథికి మునుప
ధర్మజునిసమ్ముఖము సేయ దశసహస్ర
ధవళదంతుల నిత్తుఁ జేదర్శనంబు. 95

క. ఆసమయంబునఁ గృష్ణు ద
యాసింధువుఁ గానిపింప నద్దేవు నుతుల్
చేసి హితబంధుయుతముగ
నాసర్వస్వము సమర్పణం బొనరింతున్. 96

వ. విశేషించియుం బ్రాణదాతలతోడియుద్ధం బసంబద్ధంబు సిద్ధంబుగా మీకు మాన్యుండ ననిపలుకు రాజన్యసౌజన్యవాక్యంబులం బరితుష్టమానసుండై నపవమానసూనునభ్యర్ణంబునకు మేఘవర్ణుండునుం గ్రతుహయంబు రయంబునం గొనివచ్చె ననంతరంబ యనంతరత్న రాజీవిరాజమానకల్యాణపల్యాణపరిస్తరణపరిస్తోమాభిరామంబులును గండపాలికాచూలికాంతరసముల్లసితహల్లకోద్దామదామంబులును గాంచనఘంటికాసమంచిత కాంచీలతాప్రాంచల చంచలచ్చమరవాలచాలనారంభ గంభీరయానంబులును నైరావణసార్వభౌమకులీనంబులును నిరంతరానర్గళనిర్గతసింధుసిక్యసాగర మేఘుచిక్కణశీకర ప్రముఖాష్టమదగంధలహరీవిహార దలినికరకోలాహలాక్రాంతదశదిగంతంబులును నరాళకరాళదంతంబులును నిర్యాణపర్యంతకల్పితానల్పసిందూర తిలకానుబంధబంధురములు నగుధవళసింధురంబుల నాధోరణు లసాధారణప్రయత్నంబులం గొనివచ్చిన మెచ్చి యవ్వసుంధరారమణుండు గంధవహతనూభవుండునుం దాను నొక్కవేదండంబును.

రెండవకుండాలంబు మార్తాండపౌత్రనిజపుత్రులుంగా
నెక్కి లెక్కింపరానిసేన లుక్కున నొక్కుమ్మడిం గ్రిక్కిఱిసి
నలుదిక్కులం గొలిచి రా నిరాఘాట చాటుప్రబంధంబుల
వంది బృందంబు లభినందింప నందంద ముందటం గ్రందుకొని
చెలంగు శంఖభేరీమృదంగఢక్కాహుడుక్కానకఝల్లరీము
రజకాహళారావంబులు భైరవంబులై మొరయ సముత్తం
భితకుంభచ్ఛాతకుంభరంభాస్తంభ సంభృతానర్ఘ మాణిక్య
మకరతోరణపరిష్కారం బైనభద్రావతీపురద్వారంబు గార
వంబునం జొచ్చి యచ్చటం బచ్చలగచ్చుమేడల మేలు
మచ్చులం బచ్చవిలుతు నెచ్చరించుమచ్చెకంట్లు నిడువాలుం
జూపులచాపలం దగిలినట్టు నిట్టట్టు గదలనేరక చిట్టకంబు
నం బొరలునాగరకలోకంబును గాశ్మీరగంధసార నీహార
వారిధారావిలిప్తంబులయిన యంగళ్లు ముంగిళ్లు నత్తమిల్లిన
ముత్తియంపురంగవల్లికలమీఁదం బసిండిజాలవల్లికల నమ
ర్చిన మంగళద్రవ్యంబులును నంతరిక్షంబునకు వింతసింగా
రంబు సంతరించు వైజయంతీవితానంబులును భాసురం
బులుగ భూసురాశీర్వాదనాదమేదురంబుగా నాదరం
బునం బురంధ్రీజనంబు లల్లుకొని చల్లునాచారలాజాక్షత
ప్రసూనంబు లనూనవైభవంబులం దేజరిల్లురాజమార్గం
బునం జని వాసరాధిపరథావరోధినిజాగారం బగుహజారంబు
డగ్గఱి మదావళంబు డిగ్గి దండనాయక పురోహితామాత్య
సామంతభృత్యవర్గంబు నైసర్గికదయావలోకంబునం జూచి
యథోచితప్రకారంబుల వీడుకొలిపి యౌవనాశ్వవిశ్వం

భరాధీశ్వరుండు పురస్కృతపాండవుండై యంతగిపురసమీ
పంబులోపలికొలువుకూటంబున హాటకమణిగణోన్నిద్ర
భద్రాసనంబుల వారునుం దానును సుఖాసీనుండై యుండె
నాసమయంబున. 97

చ. ఘనివడి నాథుపంపునఁ బ్రభావతి భామిను లర్థిఁ గొల్వఁ గుం
దనపుమెఱుంగుఁబళ్లెరమునన్ ఘనసారజదీపికావళుల్, గ్గొని
మును భీముఁగాంచి యనిలోఁ దనమంగళసూత్రమూడఁగా
ననువున నిల్పె నేసదయుఁ డాతనికిన్ జయమంగళం బనెన్.

తే. కర్ణజునికీర్తి లోకవిఖ్యాత మగుచుఁ
బ్రబలుఁ గా కని దీవించి పరమసాధ్వి
వారి కత్యంతభక్తి నివాళు లొసఁగి
రమణులును దాను నంతగిపురమున కరిగె. 99

క. అంతటఁ గనుపట్టెను భా
స్వంతుఁడు చరమాద్రిమీఁద వారుణదిక్సీ
మంతిని జలకేళికిఁ జెఱు
బంతిపసుపుముద్ద సన్నపై నిడుభంగిన్. 100

క. మసమసక నయ్యె దిక్కులు
పసి క్రేపుఁ దలంచి తిరుగఁబడె గూండ్ల కేకుం
తసమాజముకలకలము లె
గసె వెడవెడ కన్నుమొగిచెఁ గమలవనంబుల్. 101

క. ఆవేళ యావనాశ్వ
క్ష్మావరుఁడు సువర్ణకుంభసలిలంబుల న
ప్పావనిముఖ్యులతో సం
ధ్యావిధు లొనరించి బాంధవావలితోడన్. 102

సీ. పవనసంభవునికోపప్రసాదంబులు
పదివేలభంగులఁ బ్రస్తుతించి
వృషకేతుఁ డాహవోర్వి నిజంబుగాఁ దన్నుఁ
జంపి రక్షించినపెంపుఁ బొగడి
వీతి నెత్తుక వినువీథి కేగినమేఘ
వర్ణునిబాహుగర్వము నుతించి
ధర్మజాచ్యుతుల సందర్శింపఁ గల్గిన
తనపుణ్యపరిపాకమునకు మెచ్చి
తే. కదల నియమించి తనవెంట గజపురమున
కౌదనికచిత్రకారకలాదరజక
తంతువాయకులాలవర్ధకులు మొదలు
గాఁ గలుగుమేటిపనుల నాగరికవరుల. 103

శా. కుంతీద్రౌపదులుం బ్రభావతి కనుంగో నేగెదుర్ మీరు శు
ద్ధాంతస్త్రీనికురుంబులై కదలి రండంచుఁ బ్రియోక్తిన్మహీ
కాంతుం డాప్తులనంపి పాండవులజోర్కఁ సాత్వికాన్నంబు
లత్యంతాభీష్టత నారగించి సుఖనిద్రం జెంది యావేకువన్.

క. పురజనుల నెల్ల ముందటఁ
దెరలుచుకొని హస్తినావతీనగరిగి నా
దరమునఁ గొనిపొమ్మని భూ
వరుఁడు సుదేవునకుఁ జెప్ప వాఁడును వేడ్కన్. 105

తే. సకలజనులకుఁ బయనంబు చాటఁబంచి
బలముఁ జదలంబు గదలింపఁ బంచిపెట్టి
తాను గమనింప సమకట్టి తద్విధంబుఁ
దల్లి కెఱిఁగింప నిజనిశాంతమున కరిగి. 106

మ. జననీ భూపతి ధర్మనందనునియజ్ఞం బర్మిలిం జూడఁ గో
రి ననుం గట్టడ చేసెఁ బట్టణమువారిం గొంచుఁ బొమ్మంచు నీ
వును వేగం బయనంబు గమ్మన సుదేవుం జూచి కోపించి యీ
ధనధాన్యాదులు వీఁటిబుచ్చి ననుఁ బుత్రా వెళ్ళి రమ్మందురే.

తే. కుడిచి కూర్చుండి రాజ్యంబు విడిచిపోవ
విభునకును నీకు నెటువంటివెఱ్ఱి పుట్టెఁ
బురజనులు మీరు నెట్లైనఁ బొండు నేను
వేయుఁ జెప్పిన నిలయంబు వెడల ననిన. 108

సీ. అంబతో నగుచు నిట్లనియె సుదేవుండు
భాగీరథీపుణ్యపరిసరమున
ధర్మజుఁ డశ్వమేధముఁ జేయఁగాఁ గోరి
రప్పించె మౌనివర్గంబు నెల్ల
రుక్మిణీముఖవరారోహాలతో వాసు
దేవుఁ డచ్చటికి నేతెంచినాఁడు
వారల దర్శించువారిదుష్కృతములు
పంచబంగాళమై పాఱు ననినఁ

తే. తండ్రి తరమునఁ బెనిమిటితరమునందు
వీసమంతయుఁ బుణ్యంబుఁ జేసి యెఱుఁగ
వార్ధకంబున నిం కేల వట్టితోడుసు
కృష్ణు దర్శింప కున్న నా కేమి చిక్కు. 109

క. ఏరీతి ధర్మసుతునకు
శౌరికి నధ్వరముఁ జేయ సంతస మగు నా
కారీతిన తప్పదు సం
సారము సేయునెడ నిది నిజంబు కుమారా. 110

చ. అని జనయిత్రి పల్కెఁ డుదురాగతభాషలు యౌవనాశ్వభూ
వనులకుఁ జెప్పి కొంతవడి వారికి హాస్యముఁ బుట్టఁజేసి యా
వెనపరివక్కరాలు మొఱ పెట్టుచు నీడిగిలంగ నందలం
బున వడిఁగట్టివైచుకొనిపొం డని చెప్పి సుదేవుఁ డంతటన్.

క. కరితురగస్యందనభట
వరసైన్యము లుబ్బి రెండువంకలఁ గొలువం
గరినగరికిఁ దెరలించెన్
బురజనములఁ బ్రాణిమాత్రమును లే కుండన్. 112

ఉ. పల్లకులన్ మహోష్ట్రముల భద్రగజంబుల నందలంబులన్
గొల్లెనబండులన్ నడకగుఱ్ఱపుమోటుల వేసడంబులం, బెల్లుగ
నెక్కి పౌరజనబృందము పోఁ బురి నైదునాళ్లు భూవల్లభుఁ
డుండి తాఁ గదలె వాయుజముఖ్యులతోడ వేడుకన్. 113

తే. అనుచుఁ జైమిని చెప్పిన నాత్మలోన
నలరి జనమేజయక్షమాతలవిభుండు
యతికులోత్తంస మీఁదివృత్తాంత మెల్లఁ
దెలివిపడ నాకు నానతీవలయు ననిన. 114

—— ముక్తపదగ్రస్తము ——

మ. ప్రమదాస్వాంతనిశాంత శాంత నవశౌర్యప్రౌఢిమాభోగభో
గమరుద్రాజసమాన మానకలనాకౌరవ్య రవ్యగ్రజ
న్మమనోజ్ఞస్మృతిమార్గ మార్గణకుటుంబస్థైర్యసంకల్ప క
ల్పమహీజప్రతిమానదానసుషమాభాస్వత్కరాంభోరుహా.

క. త్రైలోక్యనుతకరారీ
సాళువబిరుదాంక మథితజలధిభవమహా
హాలాహలకోలాహల
కీలాభీలాసిజైత్ర కీర్తికళత్రా. 116

పృథ్వీ.—
బుధావనపురూరవా భుజగజిద్భుజాభైరవా
విధావితమదాహితద్విపచమూపకంఠీరవా
సుధాకరనిధానరాట్సురమహీజదానప్రథా
విధాయిగుణగౌరవా బిరుదపంచఘంటారవా. 117

గద్యము.—ఇది భారతీతీర్థశ్రీచరణకరుణాపాత్ర గాదయామాత్యపుత్ర వినయవిద్యాసముద్ర పినవీరభద్రప్రణీతంబైన జైమినిభారతంబునం దశ్వమేధపర్వంబున ద్వితీయాశ్వాసము.

శ్రీ

# జైమినిభారతము



## అశ్వమేధపర్వము, తృతీయాశ్వాసము

క. శ్రీకరవిశాలకరుణా
లోకనసంతుష్టితార్థిలోక హిమానీ
రాకేందురుచిరకీర్తి
స్వీకృతదిగ్జాల నారసింహనృపాలా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున
కి ట్లనియె. 2

క. సామజనగరం బిరువది
యామడ గల దనఁగ యౌవనాశ్వనృపాల
గ్రామణితోడుత ని ట్లని
సామీరణి పలికె సంతసము రెట్టింపన్. 3

భీముఁడు దన్నకుఁ దమవిజయంబు సెఱిఁగించుట

ఉ. మించి కళత్రబాంధవసమేతముగా నిటు మీర లర్థి నే
తెంచువిధం బతిత్వరగతిం జని ధర్మజుతోడ ము న్నెఱిం
గించెద మిమ్ముఁ గొల్చి వృషకేతుఁడు రాఁగలఁ డంచుఁ బల్కి ని
ర్వంచితలీల హస్తినగరంబునకుం జని మ్రొక్కె నన్నకున్.

క. తమ్ములతో నపు డాస్థా
నమ్మునఁ గొలు వుండి ధర్మనందనుఁడు ప్రమో
దమ్మునఁ దమ్ముఁడ రమ్మని
క్రమ్మనఁ గదియంగ భీముఁ గౌఁగిటఁ జేర్చెన్. 5

సీ. తనకు మ్రొక్కిన శక్రతనయమాద్రేయుల
నెమ్మితో నాలింగనమ్ము చేసి
వాయునందన సేమమే యన్న నన్నకుఁ
గరములు మొగిచి నీకరుణ గలుగ
నఖిలంబు సేమంబ యధ్వరాశ్వముఁ గొంచు
వచ్చె భద్రావతీశ్వరుఁడు తాన
యతనిదేవియుఁ బ్రభావతి కామినీసహ
స్రంబు సేవింపఁ బాంచాలిఁ జూడఁ

తే. గా నరుగుదెంచె వృషకేతుఁ డానరేంద్రుఁ
బోర మెచ్చించె నన ధర్మపుత్త్రుఁ డీజ
యంబు కృష్ణకుఁ జెప్పు పొమ్మనిన భీముఁ
డంతిపురమున కేగ నయ్యాజ్ఞ నేని. 6

ఉ. అచ్చెరువంది గొబ్బున నిజాసనముం దిగి సమ్ముఖంబుగా
వచ్చి సువర్ణపీఠమున వాయుతనూభవు నుంచి నెమ్మదిన్
వచ్చిరె కర్ణనందనుఁడు నామనుమండును నంచు మేనిముల్
వ్రచ్చి వెడందగాయములుపాణితలంబున నంటిచూచుచున్.

క. కుశలం బడిగిన సర్వము
కుశలము భద్రావతీశుకులసతి రాకా
శశివదనలు గొల్వ నిరం
కుశవృత్తిని నిన్నుఁ జూచుకోరిక వచ్చెన్. 8

శా. కాంతా నీవు నలంకరింపు సభలోఁ గానంగరాఁ డిందిరా
కాంతుం డేగెనె ద్వారకాజనుల వేడ్కం జూడ నన్నన్ విభుం
డంతస్సౌధములోన వాఁడె యన నట్లైనన్ భవన్మందిరం
బెంతే వన్నెకునెక్కెఁబో హరి దయ న్వీక్షింపఁగాఁ గల్గుటన్.

తే. చెల్ల దొక్కింతయును దామసింప నిచట
సుఖులు నీవును లోచనోత్సవముగాఁగ
నాయితము గండనుచుఁ బల్కి వాయుసుతుఁడు
చనియెఁ గృష్ణయు శృంగారశాల కరిగి. 10

క. పన్నీట జలక మాడెను
నున్ననివీణాముఁ గట్టెను విరు ల్దుఱిమెన్
సన్నముగ నలఁదెఁ గస్తురి
చన్నుల ముత్యాలబన్నసరములు దాల్చెన్. 11

యౌవనాశ్వుండు సైన్యంబుతో హస్తిపురంబునకు వచ్చుట

ఉ. అంతట యౌవనాశ్వవసుధాధిపుసేనలు హస్తినావతీ
ప్రాంతవిశాలచంపకవనాంతరసీమలు డాయ వచ్చినన్
దంతిరథాశ్వసైనికవితానము గొల్వఁగ వచ్చి రాత్మలన్
సంతసమందుచున్ మదగజంబులనెక్కి యుధిష్ఠిరాచ్యుతుల్.

ఉ. ఆనకశంఖదుందుభిమహారవముల్ దశదిక్కులన్ బ్రతి, ధ్వా
నము లీనఁగాఁ గదియవచ్చువిభుం గని యధ్వరాశ్వమున్
గానిక పెట్టి కూర్మి దొలఁకన్ బ్రణమిల్లినఁ బాండవాగ్రజుం
డేనుఁగు డిగ్గి యవ్విభుని నెత్తి కవుంగిటఁ జేర్చి యిట్లనున్.

క. నరనాథ వినుము భీముఁడు
నరుఁడును మాద్రిజులు గూడ నా కనుజులు న

ల్వ్వరు కృతమున నేఁటికి నే
గురుసోదరు లైరి నీవు గూడినకతనన్. 14

క. సందర్శింపుము వాఁడె ము
కుందుని లోకైకరక్షకుఁ బ్రభావతి మ
న్మందిరమున కంపుము కుం
తిం దామరసాక్షి ద్రౌపది న్వీక్షింపన్. 15

క. నావుడు నంతఁగపురికిఁ బ్ర
భావతిఁ గడలించి ధరణీపతి తనశిర మ
గ్గోవిందునిపాదంబుల
మోవఁగఁ బ్రణమిల్లి వినయమున ని ట్లనియెన్. 16

సీ. దేవ ధన్యుండ నైతిని భవత్పాదాబ్జ
ములు మోవఁగా మ్రొక్కఁగలిగెఁ గాన
నాపట్టణము పావనం బయ్యె భీమాది
శూరత్రయము మట్టి చూచెఁ గానఁ
గీర్తనీయము వృషకేతు శౌర్యం బాజిఁ
జెల్లిన నన్ను రక్షించెఁ గాన
సఫల మీతురగంబుజన్మంబు ధర్మజుం
డొనరించు క్రతువున కొదవెఁ గాన

తే. నిన్నిటికి శేఖరంబుగా నింద్రతనయుఁ
జూడవలె నాకు నతఁడు నీజోడు గాఁడె
యనఁగ నర్జునుఁ డరుదెంచి యౌవనాశ్వ
నరవరేణ్యునిఁ బరిరంభణం బొనర్చె. 17

చ. అనయము నీవు ధర్మజునియట్టికృతార్థుఁడ వర్థి నిన్నుఁ గ
న్గొనినజనంబు లెల్ల ననఘుల్ మును చేసినపుణ్య మెట్టిదో

నినుఁ గనుఁగొంటి నంచు ధరణీపతి ప్రస్తుతిచేసెఁ దత్క్షణాం
గనయునుగుంతికిన్ద్రుపదకన్యకుఁ జాఁగిలమ్రొక్కె నచ్యుతన్.

క. ఆగుణనిధినందనుఁడు సు
వేగుఁడు ధర్మాదులకును వినతుండై మా
కీగోవిందునిఁ గరుణా
సాగరుఁ గనఁ గల్గెఁ గర్ణసంభవుకతనన్. 19

క. శౌరి వెలియైనధనము శ
రీరము సామ్రాజ్యమును బరేతసమంబుల్
పేరు గొనఁదగదు గాన ము
రారిపదాబ్జములు విడువ ననవరతంబున్. 20

చ. తురగమువెంట నంపుము కుతూహలినై చని మోహరించు భూ, వరులఁ దృణీకరించి కొనివచ్చెద నధ్వరవేళ కన్న శ్రీ హరి వృషకేతు రాసుతుఁ బ్రియంబునఁ గౌఁగిటఁ జేర్చ హస్తినాపురి కరుదెంచి రందఱుఁ బ్రభూతపురందర వైభవంబునన్. 21

తే. అందు నొకమాస ముండి ముకుందుఁ డనియె
ధర్మజునితోడ నింక ముందఱనువచ్చుఁ
బదునొకండవనెల చైత్రపౌర్ణమాసి
నాఁడు ముఖ్యంబు నీకు జన్నం బొనర్ప. 22

ఉ. కావున నుగ్రసేనభుజఖడ్గసురక్షితమై తనర్చుద్వా
రావతి కేగెదఁ మఖతురంగము నీవును యావనాశ్వుఁడుర్గ
గావుఁ డతిప్రయత్నమునఁ గైకొను మధ్వరదీక్ష వేళకున్
నీ వెఱఁగింప వత్తు ధరణీవర యేనును బంధుకోటితోన్. 23

క. అని పలికిన గోవిందుని
మన సెఱిఁగి విభుండు సబహుమానముగా నం
పినఁ జనియె నయ్యశోదా
తనయుఁడు వరభోగవతికి ద్వారావతికిన్. 24

సీ. వనజాక్షుఁ డరిగినవెనుక వేదవ్యాసుఁ
డరుగుదెంచిన యుధిష్ఠిరుఁడు మ్రొక్కి
యాది మరుత్తుఁడు యజ్ఞంబుఁ జేసిన
వైభవం బానతీవలయు ననిన
విను మానవేశ్వరుం డనిమిషగురుని నా
చార్యుఁగాఁ గోరిన శక్రుఁ డతని
వారింప నారదువలన నెఱింగి సం
వర్తుని నధ్వరకర్తఁ జేయఁ
తే. దనమహత్త్వంబుచేత నత్తపసి తేఁడు
శతమఖాదుల వాకట్టి క్రతు వొనర్చి
భూమిభర్తకు వరమిచ్చి పోవ నానృ
పతియుఁ బూతాత్ముఁడై దివ్యపదముఁ గనియె. 25

క. అంచు మరుత్తునికథ విని
పించిన మునితోడ జననభీరువులకు నే
యంచున నిహపరములు సి
ద్ధించు ననుచు నడుగ నయ్యుధిష్ఠిరుతోడన్. 26

వ్యాసులు ధర్మజునకు ధర్మంబులఁ జెప్పుట

సీ. ధర్మశాస్త్రములయర్థరహస్యము లెఱింగి
జరపుబ్రాహ్మణుఁడు మోక్షంబుఁ గాంచు

న్యాయమార్గము నొకింతయును దప్పక ధాత్రిఁ
బాలించుజనపతి పడయు ముక్తి
క్రయవిక్రయములఁ బొందఁ(క)క సర్వసముఁ డైన
వైశ్యుండు పొందుఁ గైవల్యపదము
నారాయణస్మరణయు విప్రపూజయుఁ
గావించుశూద్రుండు గనుఁ బరంబు
తే. నాల్గువర్ణంబులును నిట్లు నడచి పొందు
ముమ్మరంబుగ నైహికాముష్మికములు
స్త్రీలవర్తన లేర్పరించెదను పావ
ధానమతితోడ విను మింక ధర్మతనయ. 27

వ్యాసులు ధర్మజునకు జారస్త్రీలక్షణంబులు చెప్పుట

చ. ఒఱపరిఁ గన్నఁ గూడఁజను నూరక సన్నలు వాఱ నాడుఁ
దత్తఱపడు బోటిఁ బిల్చెడువిధంబున నొత్తిలి పల్కు
నవ్వుఁబల్కుఱుఁ బొరుగిండ్ల కేగు నొకపట్టున నిల్వదు చంటి
మీఁద ముంజెఱఁ గెడలించు వైశికపుసిగ్గు నటించుచు
జార ధారుణిన్. 28

ఆ. పరులఁ గన్నఁ జంకపాపని ముద్దాడు
గోడ నిక్కి చూచుఁ గొప్పు దీర్చు
మాఱుమలయు నత్తమామలతో లేని
కిటుకు వెట్టి బంధకీవధూటి. 29

తే. మాలకరి దాసి సైరంధ్రి మాఱుఁదల్లి
మగఁడువిడిచినసతి దూతి మంత్రసాని
జోగురా లాఁకు లమ్మెడిజోటి విధవఁ
గలసి వర్తించునది జారగా నెఱుంగు. 30

క. వీరలలోపల మిక్కిలి
జారకు దూతియును దాది సాహసపారా
వారముతీరముఁ జేరుపఁ
జేరోడలు పాయరాని పెనఁకువకతనన్. 31

క. ఎచ్చోటఁ విలాసినులకు
మచ్చికఁ జన విచ్చినం బ్రమాదము పతికిన్
వచ్చునవశ్యము కాంతలు
చచ్చినపుడు విశ్వసింపఁ జన దెవ్వరికిన్. 32

క. అత్తయు మామయు మగఁడును
గత్తులబోను లయి బిఱుసు గావలె నెపుడున్
మత్తచకోరాక్షులకును
జిత్తము పరపురుషభోగశీలం బగుటన్. 33

సీ. ఉపవాసములఁ దద్దయును గృశింపక మేను
దిండిచేఁ బోషించు చుండె నేని
మస్తకాంబరముల మాలిన్యభావంబు
నందక వన్నె బెట్టయ్యె నేని
దానధర్మముల నర్థంబు వెచ్చింపక
కట్టఁడియై గూడఁ బెట్టె నేని
తనపుట్టినింట వంచనతోడ నిల్వక
పొరుగిండ్లపా లయి తిరిగె నేని

తే. సంతతంబును శ్రీహరిస్మరణ లేక
కఱకుఁదనమున దుర్భాష లఱచె నేని
విధవ పెనిమిటితోఁ గూడ వివిధనరక
కూపబాధలఁ బడుఁ గడు గుఱుతు లేక. 34

క. నాలుకయును దాలువులును
నీలరుచిం గలిగెనేని నెఱిచరణంబుల్
నేల సరిమోవ వేనియు
వాలాయము నది వహించు వైధవ్యంబున్. 35

క. కంతుసుఖకేళిఁ దేలు వి
తంతువుతో నెవ్వఁడే నతఁడు దనపుణ్యం
బంతయుఁ గోల్పడి కూలు ని
రంతరమును రౌరవాదులగు నరకములన్. 36

తే. బాల్యమునఁ దల్లిదండ్రులు ప్రాయమున ధ
వుండు వార్ధకమున నందనుండుఁ జెప్పి
నట్లు చేయంగఁ దగుఁగాని యరసి చూడఁ
దెఱవలకు నెందుఁ దమయిచ్ఛఁ దిరుగఁజనదు. 37

వ. ఇది నీ వడిగినయర్థంబునకు నుత్తరంబు నీవు నాస్తికదూర్త కారపిశునాసూయకుల డాయనీక నిజోపలాలనంబునఁ బ్రజాపాలనంబు సేయుము ప్రజాజానురాగంబున ధనంబును ధనంబున ధర్మంబును ధర్మంబునఁ గీర్తియుం జేకురుఁ గావున భూవల్లభునకుఁ బ్రజాపాలనం బవశ్యకర్తవ్యంబు మర్త్యు లెయ్యెడం గీర్తనీయంబు గానివర్తనంబునఁ బ్రవర్తిల్లక నారాయణధ్యానపరాయణులై యుండవలయుఁ బుండరీకాక్షభక్తివిరహితుం డగుబ్రాహ్మణుండును జండాలుండు చండాలుండును విష్ణుభక్తుం డయ్యేనేని సకలలోక పూజ్యుం డగును గావున నీవు వాసుదేవచరణస్మరణాయత్తచిత్తుండ వగు మనిన నత్తపోధనసత్తముం గనుంగొని యుధిష్ఠిరుం డిట్లనియె. 38

వాసులు ధర్మజునకు స్థిరలక్ష్మీయోగం బగువిధంబుఁ దెల్పుట

క. ఏరీతి సంభవించు ము
రారిపదాంభోజపూజనాభ్యాసము ల
క్ష్మీరమణి మర్త్యకోటియ
గారంబుల నెట్లు నిల్చుఁ గదలక యనినన్. 39

సీ. కలిమి దాఁపక పైతృకంబుఁ జేసినవాఁడు
పుణ్యతీర్థము లాడఁబోవువాఁడు
వితరణశీలుండు వినయంబు గలవాఁడు
పరకాంతలకు నాస పడనివాఁడు
శూరత మెఱసి ప్రస్తుతికి నోర్వనివాఁడు
సత్య శౌచంబులు సల్పువాఁడు
బాంధవపితృమాతృభక్తిఁ జెందినవాఁడు
కిల్బిషంబులకు శంకించువాఁడు
తే. సప్తసంతానవిఖ్యాతి జరగువాఁడు
నిఖిలభూతదయాసక్తి నెగడువాఁడు
మేలు మఱవనివాఁడు లక్ష్మికిఁ బ్రియుండు
వానియొద్దనె హరియును వదలకుండు. 40

ఉ. జూదరి దుష్టు దుర్వ్యసనుఁ జోరుని సజ్జనదూషకుణ్ మృషా
వాదిఁ గృపావిహీను గృహవిప్రవిఘాతకు లోభి సంతత
స్వోదరపూరకుణ్ బిశును నుద్ధతినిం బెడఁబాయు లక్ష్మి వే
దాదిసమస్తవిద్యలు పరాన్నపరాయణుఁ బాయుకై వడిన్.

శా. సోళాదొప్పియు నెత్తముణ్ మొదలుగా జూదంబు నీ వా
డునా, వేళం గాదని బాంధవుల్ శకునిదుర్వృత్తం బెఱిం

గింప వే, హాళిం బుట్టినకాఁక నొడ్డితివి రాజ్యం బెల్ల నక్కొడునర్, జాలం గంటిమి నేము కౌరవులనాశంబుల్ యశోహానియున్. 42

క. అదిగానఁ గాదు జూదము
మదిఁ దలపోయంగ నెట్టిమానవులకు నీ
విది దెలిసి నడవు ధర్మా
స్పదబుద్ధిన్ విష్ణుభక్తిపరతంత్రుఁడవై. 43

క. వ్యతిపాతయోగమున వై
ధృతి సంక్రాంతులను బర్వదినములఁ దీర్థ
వ్రతచర్యలఁ బైతృకముల
నతివలఁ గామించువాఁ డనర్హుఁడు సిరికిన్. 44

ధర్మరాజు భీముని ద్వారకకుం బంపుట

ఉ. ఇన్నియు నీకుఁ దేటపడ నే నెఱిఁగించితి నింక ముందటన్ జన్నము సేయఁగావలయు శౌరి వెసం బిలిపింపు నీకు నభ్యున్నతిహేతు వయ్యదుకులోత్తముఁ డన్న మహీవిభుండు నిర్భిన్నవిరోధిసైన్యుఁ డగుభీమునిఁ జేరఁగఁ బిల్చి యిట్లనున్. 45

ఉ. ద్వారక కేగి యధ్వరవిధాన మొనర్పఁగఁ జైత్రమాసమున్ జేరఁగ వచ్చుటం దెలియఁ జెప్పి సమస్తకుటుంబినీసుహృత్పౌరపురోహితార్యగురుబాంధవమంత్రిపురస్సరంబుగా వారిజనాభునిన్ సుజనవత్సలుఁ దోడ్కొని రమ్ము పొమ్మనన్.

తే. అన్నపాదంబులకు మ్రొక్కి యనిలసుతుఁడు
ద్వారవతి కేగి దివ్యరత్నప్రభావి

రాజితం బైనహరిమందిరంబుఁ జొచ్చి
నడిమి మొగసాలజగతిముందఱికి వచ్చి 47

వ. దౌవారికుం గనుంగొని తనరాక నెఱింగింపు మనవుడు నిరత్న దేదీప్యమాన రత్నదీపికా నిరత్నప్రభాపూరదూరీకృతాంధకారంబును గాలాగురుగంధసారకర్పూరధూపనిరవధికవాసనాగభీరంబును ధగద్ధగితశాతకుంభరసవిసరకుసుంభరాగసముత్తంభిత విచిత్ర చీనిచీనాంబరతిరస్కరిణీ వితానచ్ఛాయాపరిష్కారంబును నానావర్ణసముదీర్ణప్రభాపటలజటిలనూత్న రత్నకంబళపరిస్తరణవిస్తారంబును బారావతకపోతశుకశారికాచకోరమయూరప్రముఖనిఖిల విషదోషపరిహరణక్రియానిపుణచాతుర్యధుర్యగ్రీవాహారంబును బ్రసక్తముక్తాఫలస్వచ్ఛగుచ్ఛాంతరవిలంబిదరవికాసి వాసంతికాపూగ పున్నాగ చంపక హల్లకమల్లికోద్దామశృంగారంబును నగుభోజనాగారంబునుం గురంగమదకర్దమానులిప్తమణిమయవితర్దికాప్రదేశంబునం గేశవుండు సుఖాసీనుండై. 48

తే. కనకపీఠిఁ జతుష్షష్టికాకచోల
విరచితం బైనపసిఁడిపళ్లెరమునందు
దేవకీదేవి వడ్డింపఁ దృప్తిమీఱఁ
బంకజోదరుఁ డారగింపంగఁ దొడఁగి. 49

సీ. మెత్తనై మిలమిల మెదలురాజాన్నంబు
నొలపుఁబప్పులును సద్యోఘృతంబు
నప్పడంబులు వడియములుఁ దాలింపులుఁ
బలుచనినులివెచ్చపడిదములును

బులుసుఁగూరలును బజ్జులుఁ దియ్యచేరులుఁ
బంచదారలు నానవాలు జున్నుఁ
బులగంబు బహువిధంబులపిండివంటలుఁ
బాయసంబులు వడపప్పుఁ దేనె

తే. పానకంబులు సిగరులు ఫలరసాయ
నములుఁ బచ్చళ్లుఁ గలవంటకములుఁ బెరుఁగు
నూరుఁగాయలు మొదలుగా నుచితవృత్తి
నారగింపఁ జతుర్విధాహారములను. 50

తే. మఱియు భూచరజలచరాంబరచరముల
పేరుకలమాంసములు నంజి ప్రియముతోడ
రుక్మిణీసత్యభామ లిరువురుఁ గదిసి
తాళవృంతంబు లిడుచుఁ ద్రస్తరులు సేయ. 51

ఉ. భీమునిరాకఁ జెప్పిన నుపేంద్రుఁడు రమ్మని పంప వచ్చి య
త్తామరసోదరుం గదిసి దండము వెట్టఁ గరంబుఁ బట్టి వ్యా
యామభరంబున న్మిగుల నాఁకలి గొంటివి సేద దేఱఁగా
నేమములన్నియుం దెలియఁజెప్పెదు గాని భుజింపు నావుడున్.

సీ. తల్లిచన్నులపాలు ద్రావి యంతటఁ బోక
పూతనఁ బొరిగొంటి పురిటిలోన
జనని యుగ్గునఁ దృప్తి సనక నిన్నటిదాఁక
వెరఁజితి వ్రేపల్లెవెన్న లెల్ల
నంబపొత్తునఁ దనియక వెక్కసం బైన
యుదరాగ్ని నార్చి తింద్రోత్సవమున
జనయిత్రి యొసఁగుభక్షణము చాలక తింటి
వాకుచేలునిచేతియడుకు లొడిసి

తే. కడుపులోపల సకలలోకములు వరుసఁ
గూరుకొన్నప్పుడును నఱిగొఱంతగాని
తుష్టుఁడవు గావు నీదుపొత్తున భుజింపఁ
దీఱునే నాకు ఘనమైన దీపనంబు. 53

మ. అని సల్లాపము లాడ శౌరి వివిధాహారంబులన్ వాయునం
దను సంతృప్తునిఁ జేసి యొక్కెడఁ బ్రమోదం బారఁ గూ
ర్చుండి వచ్చినకార్యం బఖిలంబు నాపఁడు విశేషింపంగ
మాల్యానులే, పనతాంబూలవిభూషణావళుల సంభావించి
యత్యున్నతిన్. 54

## ✺ శ్రీకృష్ణుండు భీమునివెంట హస్తిపురంబున కేగుట ✺

మ. కృతవర్మన్ బిలిపించి కేశవుఁడు పల్కెం బౌరులన్ హస్తినా
వతికిన్ వే కదలింపు తత్తదుచితవ్యాపారలీలాసమం
చితవృత్తిన్ యమసూతియధ్వరము వీక్షింపన్ బురీరక్షణ
స్థితికిన్ గట్టడ చేసి మజ్జనకునిన్ సీరి న్నియోగించెదన్. 55

మ. అనినన్ భోజమహీవిభుండు లయకల్పాంతోగ్రధారాధర
స్తనితాభీలపటుప్రయాణముఖనిస్సాణంబు ప్రేయించినన్
జనితోత్సాహభరంబునం గదలె యజ్ఞప్రేక్షణాలంబసౌ
ఖ్యనిరాయాసపథంబునం బురజనం బాబాలవృద్ధంబుగన్.

క. పురజనము లెల్ల ముందటఁ
దెరలినపిమ్మటను వాసుదేవుఁడు గమన
స్ఫురణము దండ్రికిఁ జెప్పఁగ
నరుదెంచిన సుతునితోడ నతఁ డిట్లనియెన్. 57

సీ. హరికథావిముఖుని నన్యాయవర్తనుఁ
బురుషార్థరహితుఁ దపోవిహీను
మిత్రవంచకుని స్వామిద్రోహిఁ బతితుని
యుద్ధభీరువు నన్యయోనిరతుని
జామాతృవిత్తభక్షకు ధర్మబాహ్యుని
యతి విదూషకుని దుర్వ్యసనశీలు
బహుభాషి విశ్వాసపాతకు ఋతుకాల
కర్మపరిత్యాగిఁ గష్టు లోభి
తే. ఖలు వికత్థను బహువాదకరుఁ గృతఘ్ను
నాత్మభృత్యప్రతారణు నాతతాయిఁ
దగదు కొనిపోవఁగా నెంతధనికు లైన
నధ్వరాలోకనానర్హు లగుటఁ జేసి. 58

క. నినుఁ బాసి నిలువ నేర్తునె
వనజోదర యనుచు నపుడు వాత్సల్యభరం
బున వసుదేవుఁడు రాఁ దలఁ
చిన నోడఁబడఁ జెప్పి యతనిచే ననుమతుఁ డై. 59

వ. అప్పుడు. 60

చ. శకునమనోజయంబుగఁ బ్రశస్తముహూర్తమునందు వే
డ్కఁ బల్లకులు గదల్చి పెట్టెల కెలంకుల సాత్యకిఁ బోవఁ
బంచి యంధక యదువృష్ణి భోజులు సుతప్రకరంబును గొల్చి
రా మురాంతకుఁడు మహేంద్రవైభవమునన్ గదలెం
దురగాధిరూఢుఁ డై. 61

సీ. గండమండలదానగంధలుబ్ధమదాళి
ఝంకృతులకుఁ గాక జడియుకరులుఁ

గరటిఘీంకృతులకుఁ గాక రాహుత్తులు
జలదరింపఁగ దాఁటుసైంధవములు
హయహేషలకుఁ గాక యదరి వృద్ధులఁ గూల
వైచి పాఱెడుబలీవర్దములును
దుష్టశాక్వరధావితులకుఁ గాక ధరిత్రిఁ
బడి వైవములదూఱుభారవహులుఁ
తే. గలయఁబడి మూఁపుమూఁపునఁ దలఁగఁద్రోయ
రానిసందడి నడచుపౌరవ్రజంబు
నరయుచును వచ్చువృద్ధవేశ్యాజనంబుఁ
జూపి నవ్వుచు హరి వాయుసుతున కనియె. 62

ఉ. వీరిఁ బరిగ్రహింపు మిదివేళ సమానలు నీకు భీషణా
కారకఠోరమన్మథవికారగుణంబుల నన్న నవ్వియ
న్మారుతి పల్కె నిట్టికొఱమాలినజంతలఁ జక్కఁబెట్ట నీ
భారము వన్నె కెక్కు దురవస్థలు నీకరలాలనంబునన్. 63

శ్రీకృష్ణుండు సైన్యంబుతో సరోవరతీరంబున విడిసియుంట

మ. అని చాణూరబకాంతకుల్ సముచితవ్యాహారులై ముందటన్
గని రుత్ఫుల్లసరోజహల్లకపరాగస్ఫారవీచీఘటా
కనదుత్కూజితరాజహంసబకచక్రక్రౌంచసంచారమున్
జనితాంతస్పరితాపవారణసుధాసారమ్ముఁ గాసారమున్. 64

క. ఆరమణీయసరోవర
తీరామలకీపటీరతిలకాగురుక
ర్పూరతరుచ్ఛాయలఁ బ్రజ
నీరజనాభుండు విడియ నియమించుటయున్. 65

సీ. విప్రవరక్షత్రవిట్ఛూద్రగాయక
నటవిదూషకవందినాగరికులుఁ
గుడ్యకృత్కారుశాకునికరంగాజీవ
జటకారసౌచికశాంబవికులు
నిర్ణేజకగ్రామణీకులాలకువింద
దాశకళాదవైతంసికులును
జర్మకర్మఠచికిత్సకపుష్పలావిక
తక్షకపాషాణదారకులును
తే. గంధసారగోరోచనాగరుసితాభ్ర
పట్టపటరత్నభూషణాపణికవరులుఁ
బట్టు చాలక వీథు లేర్పడఁగ విడిసి
రంబుజాకర ముభయపార్శ్వంబులందు. 66

చ. కమలదళాక్షుఁడంత నిజకామిని రుక్మిణితోడ నిట్లనుఁ గమ
లినిఁ జూచితే ప్రియుఁడు గన్గొనరామి మరాళసామజభ్రమ
రకులంబు పైఁబడఁ గరంబు సుఖించెడుఁ గామ మెప్పుడుఁ
రమణునికంటె నెన్మిదిగుణంబులు గాదె లతాంగి కారయన్.

క. అన విని రుక్మిణి విభుతో
ననుఁ దనయునివాహనంబు హంసము దనవా
హన మేనుఁగు దేఁటులయెడఁ
దనుజాభావ మగుఁ గానఁ దగ దిటు పల్కన్. 68

క. తామొదలం బద్మిని యటఁ
గామించునె యన్యపురుషుఁ గలలో నైనన్
దామరసనేత్ర యంత
ర్యామివి నీ వెఱుఁగనట్టియర్థము గలదే. 69

వ. అని పరిహాసపల్లవితంబు లగు సల్లాపంబులం బల్లవోష్ఠి
తోడం గలసి యాజగద్వల్లభుం డుల్లసిల్లుచున్నంత. 70

## శ్రీకృష్ణునిసన్నిధికి గోపకులు వచ్చుట

ఉ. తెల్లని పట్టెనామములు దీఁగెల నట్టములుం బదంబులన్
బిల్లలచెప్పులున్ జెవులఁ బింఛములున్ మొలనున్నక్రొత్త
కంబళ్లును వన్నెగాఁ బెరుఁగుఁబాలును నేతులు వీఁక వంకకా
వళ్ల ధరించి శౌరిఁ గనవచ్చిరి కొందఱు గొల్ల లర్థితోన్. 71

వ. ఇట్లు వచ్చి. 72

క. తెచ్చినగవ్యముఁ గానుక
యిచ్చి ప్రణామములు చేసి యిన్నాళ్లకు మా
ముచ్చటలు దీఱె నని హరి
గ్రుచ్చి కవుంగిటను జేర్చుకొని మోదమునన్. 73

సీ. కోరగించెదుకొండగోఁగుఁబువ్వులచాయ
దీవన్నె గోర్పడం బెట్లు గలిగె
మెఱుఁగుఁజుక్కలచాయ మించు నీతెల్లని
గురువిందపే రెందుఁ గూర్చుకొంటి
నిగుఱు గప్పనిచంద్రనిష్పూకై పడి యున్న
దీకొడ్డిపూస నీ కెవ్వఁ డిచ్చెఁ
బొలసినగబ్బుకంపులు సోడుముట్టెడు
నీనల్ల తిరునామ మెచట దొరకె
తే. జడలు మెడమీఁద వ్రేలెడుజల్లితోఁక
నేడ సవరించుకొంటివి బోడకోడె
యనుచు నాడెదుమూఢవాక్యముల కలరి
శ్రీధరుఁడు వారిఁ గృప నాదరించె నపుడు. 74

చ. హరి కొకలేమ యిచ్చెను సమర్పణగా నవనీతకుంభ మొ
క్కెరుఁగును వంటకంబు నొకబింబఫలాధర తెచ్చె నొక్క తా
మరసదళాయతాక్షి వనమాలిక ముందఱఁ బెట్టె నొక్క సుం
దరి గొనివచ్చె నెంతయు ముదంబున సాంద్రపయఃప్రపూర
మున్. 75

సీ. తెఱవ యొక్కతె జుంటితేనె కానుక చేసి
తలఁపించె నధరామృతంబుచవులు
తరుణి యొక్కతె పూవుదండ సూడిదఁబెట్టి
హేలాపరీరంభ మెచ్చరించెఁ
బడఁతి యొక్కతె బిల్వఫల ముపాయన మిచ్చి
పచరించె ఘనకుచస్పర్శనంబు
సువిద యొక్కతె పింఛ ముపదగా నర్పించి
రూపించెఁ గుంతలాక్షేపణంబు

తే. నెమ్మి నీరీతిఁ జేదర్శనమ్ము లొసఁగి
ప్రియుల సన్నిధి నర్మగర్భితముగాఁగఁ
బ్రౌఢగోపాంగనలు దమప్రాఁతవలపు
వెల్లివిరిఁ జేసి రిందిరావల్లభునకు. 76

శా. ఈలీలం బొడచూప సాదరముగా నీక్షించి కృష్ణుండు గో
పాలవ్రాతము వీడుకొల్పి యచటన్ బ్రత్యగ్రసౌగంధిక
వ్యాలోలానిలముల్ పథశ్రమము వాయం జేయ నా
వేకువన్, గాళిందీనదిఁ జేరి యందు విడియంగాఁ బంచె
సైన్యంబులన్. 77

క. విడియించి యశోదాదుల
కడకుం జని మీరు కుంతిఁ గని పరిచర్యల్

నడపుఁడు వినుఁ డాయమ క
వ్వడికిని జనయిత్రి భగిని వసుదేవునకున్. 78

వ. కావున నద్దేవి మీకుం బెద్దఱికంబు చేయందగిన దని యాన
తిచ్చి ప్రద్యుమ్నాదికుమారులం గనుంగొని మీరు ద్వా
రకానగరంబునంబోలెఁ *దేరకాఱతనంబున నుండక పాండ
వాగ్రజునధ్వరంబు సముద్ధరింపవలయు నని మఱియును. 79

ఉ. ఆవనజాక్షుఁ డిట్లనియె నందఱు నెప్పుడు నప్రమత్తులై
సేవలు చేయఁగా వలయు సింహబృహస్పతి గూడుకొన్నగో
దావరిఁ జూచి తీర్థము లుదారతఁ దక్కినయట్లు మీరు గాం
డీవిపరాక్రమంబు గని నిల్వఁగ నేర్చినపాటిభక్తితోన్. 80

సీ. కోదండ్రగమి గూర్చుకొని దేవకీదేవి
భక్తిఁ గుంతి భజింపఁ బొలువెట్టి
సఖులతోఁగూడ సుమాకన్య పాంచాలి
ననయంబు సేవింప నానతిచ్చి
ప్రద్యుమ్ననకుఁ గుమారసమేతముగ ధర్మ
పుత్రునికడ నిల్వ బుద్ధిఁ జెప్పి
వాయుసూనునిఁ గృతవర్మాదియోధులఁ
జదలంబువెంటనే కదలఁ బనిచి

తే. వారువము నెక్కి మితపరివారుఁ డగుచు
సూరిజనవందిమాగధస్తుతులు తనదు
దివ్యలీలలు వరుసతోఁ దెలుప నగుచు
వాసుదేవుండు హస్తినావతికి వచ్చి. 81

---

* తేరకాఱతనంబునన్ = జోక్యము కల్గించుకొనని సోమరితనముతో.

## శ్రీకృష్ణుండు హస్తిపురంబు ప్రవేశించుట

క. ధృతరాష్ట్రవిదురకృపసం
గతుఁడగుధర్మజునిఁ గదిసి కంసారి నమ
స్కృతిఁ జేయ నాధరిత్రీ
పతి యతనిం గౌఁగిలించి పరమప్రీతిన్. 82

తే. తనకు మ్రొక్కిన శక్రనందనునిఁ గవల
నాదరించుచుఁ దక్కినయక్షజనుల
నుచితసంభాషణంబుల నుపచరించి
స్వర్ణమయపీఠమున నున్న శౌరిఁ జూచి. 83

ఉ. నీవు సమస్తబంధుజననీజనకానుజపుత్రపౌత్రభా
ర్యావిసరంబుతోఁ గదలి రా కిటు వత్తువె యన్న నవ్వి య
ద్దేవుఁడు రానివారు వసుదేవుఁడు సీరియుఁ దక్క యజ్ఞదీ
క్షావిభవంబుఁ జూడ నధికస్ఫురణం జనుదెంచి రందఱున్.

క. ముందఱ వచ్చితిఁ దావక
సందర్శన మర్థిఁ గోరి సకలంబును గా
లిందిని విడియించితి వా
రిందులకుం గదలి వత్తు రెల్లిటి కనినన్. 85

క. ముద మొంది విభుఁడు పార్థునిఁ
గదియం బిలిపించి రేపకడ విభవముతో
నెదురుకొనవలయు సేనలఁ
గదలింపుము యజ్ఞఘోటకసమేతముగాన్. 86

వ. అని పలికి ధర్మనందనుండు మఱునాఁడు వనజోదరనిజసోదర
యౌవనాశ్వసహితంబుగా నధ్వరాశ్వంబు నలంకరించి కుంతీ

ద్రౌపదీప్రభావతులం గదలించుకొని రాఁ గంచుకీజనంబు నియోగించిన వారు నారాణివాసంబులం జిత్రపటనిచోళి కాందోళికల నునిచి వారి కుభయపార్శ్వంబులు ఘోటి కారూఢచేటికాసహస్రంబు లజస్రంబునుం గాంచనదండ మండితంబు లగుధవళచామరంబులు వీవం గట్టడచేసి దేవకీ యశోదాదులకుం దగినకట్టణంబులు పెట్టియల నలవరించి కట్టాయితం బై పట్టణంబు వెడలుసమయంబునం బాండవా గ్రజుండును రెండవ సురేంద్రుండునుం బోలె నఖండ వైభవంబునం గదలి కాళిందీతటంబు సేరం జనియె నంతకు మున్న భీమసేనకృతవర్మాదులును సకలసన్నాహంబులు మెఱసి యెదురుకొనునప్పు డన్యోన్యభూరిభేరీభాంకారం బులు నితరేతరసౌవిదల్లహుంకారంబులును బరస్పరకరటి ఘీంకారంబులును ననేకచామరగ్రాహిణీకరకంకణ క్రేంకా రంబులును సాహంకారంబులై చెలంగె నప్పుడు. 87

సీ. ప్రణమిల్లెఁ బాండవాగ్రజుఁడు దేవకిపాద
సరసిజంబులకు సోదరులుఁ దాను
మ్రొక్కె నన్నకు వడముడి భద్రకరి డిగ్గి
సకలయాదవకుమారకులుఁ దాను
దేవకీదేవి కుంతికి వేడ్కతోడ దం
డముఁ బెట్టెఁ గదిసి కోడండ్రుఁ దాను
నతిఁ జేసె నపుడు నందకపాణితల్లి కి
వచ్చి ద్రౌపది ప్రభావతియుఁ దాను
తే. మఱియుఁ దమలోనితారతమ్యము లెఱింగి
వందనాలింగనక్షేమవాక్యవివిధ

పారితోషికవిధుల సంభావ్యమాను
లగుచు వర్తించుచుండి రయ్యవసరమున. 88

అనుసాల్వుండు మఖాశ్వంబు నపహరించుట

మ. అనుసాళ్వుం డనువాఁడు సోదరుని నన్యాయంబునన్ బట్టి
చం,పినశౌరిన్ బరిమార్తు నే ననుచు బల్మిం దాఁక నుద్యు
క్తుఁడై, తనసైన్యంబుల నెల్ల నొక్కయెడ గృధ్రవ్యూహ
మున్ బన్నఁ బం,చి నిరాఘాటపథావరోధమతి నిల్చెన్
వ్యగ్రుఁడై యత్తఱిన్. 89

ఉ. దేవకి మున్నుగాఁ గలసతీనివహంబుల కెల్లఁ జూప న,ద్దేవుని
యాజ్ఞ వాహకులు దెచ్చునెడన్ నడుకొత్తి యొంటిమైఁ
జావున కోహటింప కనుసాళ్వుఁడు సాళ్వము దూఱినట్లు యో
ధావలిఁ గిట్టి పట్టె సవనాశ్వము విశ్వభయంకరంబుగన్. 90

క. ఉట్టిపడి యిట్టిధంబునఁ
బట్టినతురగంబు నాత్మ బలమధ్యమునన్
గట్టి చమూనాయకుఁడై
నట్టిసు తారకునితోడ నతఁ డిట్లనియెన్. 91

ఉ. ఈహరిఁ బట్టి తెచ్చుట యహీనభుజాబలగర్వరేఖమై, నా
హరితోడ సంగరవిహార మొనర్చుటకే తదర్థని,ర్వాహక
బుద్ధి వెన్దగిలి వచ్చు నతండును మీరు విక్రమో,త్సాహ
మెలర్ప నొక్కమొగిఁ దాఁకుఁడు వీఁక నెదిర్చి యందఱున్.

తే. శౌరికంటె బలుఁడు చర్చింపఁగా లేఁడు
పట్టుఁ డతని నెఱిఁగి పట్ట కున్న

వాఁడు నాకు హితుఁడు గాఁడు సూనుఁడు గాఁడు
బాంధవుండు గాఁడు భటుఁడు గాఁడు. 93

క. అవ్యాహతుఁ డచ్ఛేద్యుం
డవ్యయుఁ డాద్యంతరహితుఁ డచ్ఛిద్రుఁడు లో
కవ్యాపకుఁ డక్షరుఁ డశ
రవ్యుఁడు వినుఁ డతని గెల్వ రా దెవ్వరికిన్. 94

క. శుకదాల్భ్యవిభీషణశౌ
నకరుక్మాంగదవసిష్ఠనారదబలివా
యుకుమారకులకువలె నతఁ
డొకరికి లోఁబడఁడు తెలిసియుండుఁడు మదిలోన్. 95

క. అని యిట్లు బహువిధంబులఁ
దనయోధుల హెచ్చరించి తానుఁ బ్రతాపం
బున వచ్చి నిలిచె మొనతల
ననుసాళ్వుఁడు శౌరితోడనాహవకాంక్షన్. 96

వ. అంత నిక్కడ నధ్వరహయాపహరణకోలాహలం బాలకించి
సంభ్రమంబుగ. 97

ఉ. పాళిముచుట్టు గాచుటకుఁ బార్థునిఁ బౌజులునేయఁ బంచి త
న్మూలబలంబుతో నగరిముందట ధర్మజు నుంచి కృష్ణుఁ డా
భీలపరాక్రమస్ఫురణ భీముఁడు తానును దాడిమై జగ
జ్జాలము సంచలింప ననుసాళ్వునివెంబడి నేగి ముందటన్. 98

క. ప్రద్యుమ్నుని వృషకేతు స
మిద్యోధుల ననికిఁ బొండు మీ రనినఁ ద్రయీ
వేద్యుఁ డగుకృష్ణుముందటఁ
బ్రద్యోతనపౌత్రుఁ డపుడు ప్రతినలు వలికెన్. 99

చ. సమరముఖంబునన్ సవనసైంధవమున్ గొనివత్తు బాహుగ
ర్వమున విరోధి గెల్చి కొని రాక తొలంగితి నేని బ్రాహ్మణీ
గమనము సేయఁ గోరినజఘన్యజుఁడున్ ఋతువేళలం గుల
ప్రమదఁ బరిత్యజించెడుదురాత్ముఁడుఁ బోయెడుత్రోవఁ బో
వుదున్. 100

వ. అని యిట్లు సంధాధురంధరుం డైనవృషకేతుండు సహా
యుండుగా నాహవోద్యోగంబునం బ్రద్యుమ్నుండు గృధ్ర
వ్యూహంబు సాహసంబునం జొచ్చి కుండలీశసముద్దండ
దోర్దండకుండలీకృతకోదండచండకాండప్రకాండంబులసమద
శుండాలంబులం జెండియు నిరాఘాటజవఘోటకంబులం
గీటడంగించియు నందంద ముందటం గ్రందుకొను మణి
మయస్యందనంబులం జిందఱవందఱఁ జేసియు సముద్భట
వీరభటపరంపరల వెంపరలాడియు సైన్యంబు దైన్యంబు
నొందించి యవష్టంభసంరంభంబున విజృంభించినం గనుం
గొని యనుసాళ్వుండు గినుక రెట్టింప నతని కిట్లనియె. 101

చ. తరుణులఁ బాంథులన్ వెడఁగుఁదాపసులన్ ప్రసవాశుగం
బులన్,బొరిగొనునట్లు గాదు ననుఁ బోర జయించుట యన్న
నవ్వి నా,శరములు పువ్వుతోట సహజంబులు వారికి నిన్ను
నొంచునో, గరళముకంటె నుక్కు లని గ్రక్కున నైదు
శరంబు లేసినన్. 102

క. అనుసాళ్వుఁడు దచ్ఛరములు
దునియలుగా నేసి యొండుతూపున నుర మే
సినఁ జుట్టుకపడె నతఁ డ
వ్వనజాక్షునియెదుర మెఱము వైచిన భంగిన్. 103

చ. తనయునిపాటుఁ జూచి యట దానవమర్దనుఁ డల్క మో
మునఁ, దనుక విరోధిఁ జూపుచును దారుక యద్దెసఁ దేరు
వోవ న్నిమ్మని లయకాలరుద్రపటహోర్భటి నొత్తె సుదాత్త
మూర్తియై, యనిమిషసిద్ధసాధ్యనివహావనధన్యముఁ బాంచ
జన్యమున్. 104

క. వెంటన రిపుసేనల నద
రంటఁ దఱిమి పవనజుఁడు గదాహతి నొకఁడుఁ
గెంటువడ కుండఁ బీనుఁగుఁ
బెంటలు గావించె దివిజబృందము పొగడన్. 105

క. అది చూచి భీమసేనునిఁ
గదియఁగ నేతెంచి పలికెఁ గర్ణసుతుఁడు నే
మొదల నభిలాష చేసిన
కదనఫలం బిట్లు నీకుఁ గైకొనఁ దగునే. 106

చ. కినుక మదేభముల్ విడిచి కేసరి యొండుమృగంబుఁ జీరికిం
గొనునె భవత్ప్రతాపమునకుం బ్రతియే యితఁ డంచుఁ
జూపఁగాఁ, గని యనుసాళ్వుఁ డుగ్రవిశిఖం బరిఁ బోయుచు
నార్చి భీముని, న్ననుమఱి నాట నేసిన రణస్థలి వ్రాలె నతండు
స్రుక్కుచున్. 107

క. కలన బకవైరి వ్రాలినఁ
గలుషించి మురారి నీదుగర్వ ముడిపెదఁ
నిలునిలు మని యదలించినఁ
దొలఁగక యనుసాళ్వుఁ డతనితో నిట్లనియెన్. 108

చ. మిడుక మదగ్రజన్ముఁ గుశమీఁదికిఁ గట్టుకపోయి బావిలోఁ
గెడపితి వట్టి ని న్నిపుడు గీ టణఁగింపక పోవ నిత్తునే

కొడుకు మఱందియుం బడినకోల్తలఁ జూచి రసాతలంబులో
నడఁగినమానిమానసగృహంబులు చొచ్చినఁ బంతమిచ్చినన్.

క. విను నేఁ గడుఁ బ్రాయమువాఁ
డను నీవు పురాణపురుషుఁడవు తెలియఁగ నీ
కును నాకు నెంతయంతర
మని వికటభ్రుకుటిభీషణాననుఁ డగుచున్. 110

ఉ. నాలుఁగుతూపులన్ బరులు నాటఁగ నేసిన మ్రొగ్గి యుగ్య
ముల్, దూలుచుఁ దేరిఁ బోరికిని దూరముగాఁ గొనిపోవ
నంతలోఁ, బాలుగఁ బగ్గముల్ గుదియఁ బట్టి పిఱిందికి నోస
రించి యుద్వేలభరంబునన్ మగుడఁ ద్రిప్పెను దారుకుఁ
డెట్టకేలకున్. 111

అనుసాల్వుఁడు కృష్ణుని మూర్ఛ నొందించుట

ఉ. వచ్చి మురాంతకుం డతనివక్షమునన్ బదుమూఁడుకాండ
ముల్, గ్రుచ్చిన నొచ్చి వాఁ డపుడ కోల్కొని భీషణ
కార్ముకంబునం, జిచ్చులు రాల్చుబాణ మెదఁ జిక్కఁగ నేసిన
నాటి మూలమున్, ముచ్చముడింగి వ్రాల వెడమూర్ఛ
తనున్ బొదువన్ రథంబుపైన్. 112

సీ. హరిపాటుఁ జూచి సైన్యము పటాపంచలై
తండ్రిబిడ్డన కన్నతమ్ముఁ డనక
విడిచి పాఱఁగఁ గాంచి వృషకేతుఁ డదలించి
పోరికిఁ దిరుగ సమ్ముఖము చేసి
యనుసాల్వ నిలునిలు మని బాణసప్తకం
బతనిపై నిగిడింప నదరి వాఁడు

పదిశరమ్ములఁ గర్ణపట్టివక్షము నొంప
నలిగి యాతఁడు తేరిహరులఁ ద్రుంచి
తే. విరథుఁ జేసినఁ గనలి యవ్వీరవరుఁడు
రథముమీఁదికి నుఱికి కర్ణజునిఁ దన్నఁ
బడ కతఁడు వానిముందల నొడిసి తిగిచి
పుడమిఁ బడఁద్రోచి బలిమి నుక్కడఁగఁబట్టి. 113
ఉ. అర్జున వింటినారి బిగియం దగిలించి విరోధిమోము క
న్గొర్జ వహించుకన్నుల నిరీక్షణ మొప్పఁగఁ దెచ్చి వేటకాఁ
డిర్జియుఁబోలె నవ్వుచు నుపేంద్రునిముంపటఁ బెట్టి వీఁడుగో
గుర్జుపుదొంగ చిక్కె నమకొన్న ప్రతిజ్ఞ ఫలించె నావుడున్.
క. ధన్యుండ వీవు త్రిజగ
న్మాన్యుండవు నీవు కర్ణనందన నేఁ డీ
జన్యమున నీవు దక్కఁగ
నన్యుల కిటు పట్టి తేర నలవియె వీనిన్. 115
క. అని కృష్ణుఁడు వృషకేతనుఁ
గొనియాడఁగఁ గంఠలగ్నగుణబంధనసం
జనిత మగుమూర్ఛ వీడ్కొని
యనుసాళ్వుఁడు శౌరిఁ జూచి యను వినమితుఁడై. 116
క. స్వామీ నీ పదములకుఁ బ్ర
ణామము సేయంగ దొరకె నాకుఁ బ్రియముతో
నీమహిమ నఘటనాఘట
సామర్థ్యము దొరకెఁ గర్ణసంభవున కిటన్. 117
వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రశంసించునతనిం
గృపాతరంగితంబు లగు నపాంగంబులం గనుంగొని కాఁగి

లించి యతనికరంబు నిజకరతలంబున నవలంబించి కొనిపోయి ధర్మనందనుం గానిపించి దండప్రణామంబు చేయించినం బాండవాగ్రజుం డాదరించి నాకు నీవు వృకోదరాదుల యట్ల గాదిలిసోదరుండవు గావునం గ్రతురక్షణంబున సావధానుండవై యుండు మని యానతిచ్చి యధ్వరాశ్వంబు నవక్రవిక్రమంబునం గొనివచ్చిన ప్రద్యుమ్నవృషకేతులం బ్రీతులం జేసి తెరలి కరిపురంబునకుం జని ముఁన్నాయితంబు చేయించిన బిడారంబుల సకలయాదవుల విడియించి కృష్ణానుసాళ్వయౌవనాశ్వమహీపతుల బహుమానపూర్వకంబుగా సముచిత నివాసంబులకుం బోవంబనిచి తాను నభ్యంతరమందిరంబున కరిగి యజ్ఞదీక్షాసమయంబుఁ బ్రతీక్షించుచుండె నంత. 118

క. కరిపురములోన నందఱు
నిరువదిదివసములదాఁక నిష్టకథావా
క్యరసస్థితులఁ జరింపఁగఁ
బరువడి నటఁ జైత్రశుద్ధపౌర్ణమి వచ్చెన్. 119

—● అర్జునుఁడు యజ్ఞాశ్వము వెంట నరుగుట ●—

సీ. ఆపుణ్యదివసంబునందు ధర్మసుతుండు
ద్రుపదపుత్త్రియుఁ దాను నుపవసించి
జపహోమదానసంస్కారపూర్వకముగా
నధ్వరవ్రతదీక్ష నలవరించి
తురగరత్నంబుఁ గౌతూహలంబున గంధ
పుష్పాక్షతాదులఁ బూజ చేసి

నిజబిరుదాక్షరాన్విత హేమపట్టిక
ఫాలభాగంబునఁ బదిలపఱిచి
తే. చిత్రపటరత్నఖచితమంజీరకనక
కింకిణీచామరముల నలంకరించి
మ్రొక్కి వలగొన బహువాద్యములు చెలంగఁ
గదలె నశ్వంబు మధ్యాహ్నకాలమునను. 120
క. ఆతురగము వెంబడిఁ బురు
హూతకుమారకునిఁ బనుచు టుచితం బని సం
ప్రీతిఁ బిలిపింప నతఁ డవ
ధౌతాంబరరుచిరమాల్యతనుఁడై వచ్చెన్. 121
శా. ఉర్వీజానియు సవ్యసాచిగమనోద్యోగంబు వీక్షించి య
జ్ఞార్వం బీతఁడు గావ నర్హుఁ డని యాజ్ఞాపించి తత్కంధరన్
దూర్వాచంపకదామకం బిడ నతండున్ భక్తితో మ్రొక్క నా
శీర్వాదం బొనరించి గెల్వుమని చేర్చెం దమ్మునిన్ గౌఁగిటన్.
మ. అతఁడున్ శౌరిపదాబ్జముల్ గదియ సాష్టాంగంబుగా
మ్రొక్క నూర్జితసౌహృదము గానరా బిగియ నాశ్లేషించి
ప్రద్యుమ్నకృష్ణతనూజాతులు తోడుగా నరుగు మన్నన్
దల్లికిన్ దేవకీసతికిన్ వందన మాచరించి కదలెన్ జంచ
ద్రథారూఢుఁ డై. 123
క. తనవెంట యౌవనాశ్వుఁడు
ననుసాళ్వుఁడు మొదలుగా మహారథికవరుల్
ఘనసేనాపరివృతులై
చనుదేర నిరంకుశప్రచారముతోడన్. 124
మ. కదలెన్ దత్తురగోత్తమంబు నగరగ్రామావనీభృన్నదీ
నదవేశంతసరిత్తటాకతటనానాభూమి సీమాదురా, సదకాం

తారకఘోరమార్గము లనఁ బ్రాపంభంబునం దాఁటి యాస్వమ్యది
శామండలమండనం బయినయామాహిష్మతిఁ జేరఁగన్.

క. అన విని జైమినిఁ గనుఁగొని
జనమేజయనృపతి యజ్ఞసప్తి యథేచ్ఛన్
జనినయనంతరకథ నా
కనఘా తెల్లియంగవలయు నని యడుగుటయున్. 126

శా. చండాంశుప్రథమానవిక్రమకళాసంపన్న హేలాసమి
ద్గాండీవాయుధనిర్జరోధకమహాదానాంబుధారాధునీ
డిండీరాయితకీర్తివిభ్రమ ధరిత్రీమండలాఖండలా
గుండక్ష్మావరపుత్ర శాత్రవజయా కుంఠార్ధకంఠీరవా. 127

క. దంభకిటిజరఠకచ్ఛప
కుంభీనసరాజకుంభిగోత్రమహీభృ
త్సంభావితపటుబాహా
స్తంభసమారూఢవిశ్వధరణీభాగా. 128

ఉత్సాహ.—
మానినీమనోజ వర్ధమానమానుషక్రియా
నూనలబ్ధజయరమావినోద నిత్యవైభవా
దీనసర్వశాస్త్రవిత్సుధీనిధాన పంచఘం
టానినాదబిరుద రిపుకటారిపతిసాళువా. 129

గద్యము. ఇది భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్ర గాదయామా
త్య పుత్ర వినయవిద్యాసముద్ర పినవీరభద్రప్రణీతం బైన
జైమినిభారతంబునం దశ్వమేధపర్వంబునం దృతీయా
శ్వాసము.

---

91

శ్రీ

# జైమినిభారతము

## అశ్వమేధపర్వము, చతుర్థాశ్వాసము



మందిరనయన సుధా
ధామాన్వయతిలక ధైర్యధరణీధర ది
క్సీమాధికజయధాటీ
సామజహయసుభటరంహ సాళ్వనృసింహా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున
కిట్లనియె నవ్విధంబునఁ దురంగంబు మాహిష్మతీపురపరిసరో
ద్యానవాటికానేకప్రసూన విస్ఫురర గంధబంధురమందాని
లాందోళన ప్రసరదూర్మిమాలికానవరతపథికజన హృదయశ
ర్మదం బయిన నర్మదాతటంబు చేరం జని. 2

ఉ. అధ్వపరిశ్రమాపనయనార్థము తీరవనాంతరాళముఁ
సాధ్వస మేది చొచ్చి వెడ సాగఁ బ్రవీరుఁడు నాఁగ మేటి నీ
లధ్వజుకూర్మిపుత్త్రుఁడు కళత్త్రము చూడఁగఁ జూచె వచ్చు న
య్యధ్వరఘోటకంబును మహామహిమార్ణవకేళిఁ దేలుచున్.

ఉ. చూచి సుధాకరాభ్రకరిశుభ్రశరీరముఁ బీతపుచ్ఛముఁ
మేచకకర్ణముం దరుణమిత్రసమోదరముఁ బ్రవాళగో
రోచనకుంకుమారుణశిరోధియు నీతురగోత్తమంబు రా
మా చెలు వన్న నమ్మదనమంజరి నాథునితోడ నిట్లనున్. 4

క. ఈహాయరత్నము గన మన
సాహిణమున నున్న నీదుసామ్రాజ్యశ్రీ
కూహించి తెలియఁ బ్రథమో
దాహరణము కాదె యన ముదంబున నతఁడున్. 5

క. చని పట్టి ఫాలపట్టికఁ
గనుపట్టెడుకనకపత్త్రికావిలిఖితనూ
తనబిరుదాక్షరములు పే
ర్కొని లోలోపలనె చదువుకొనె వివరముగన్. 6

ఉ. దుర్జయరాజమండలవిధుంతుదమూర్తి యుధిష్ఠిరక్రతూ
త్సర్జిత మైనయీహయవతంసము త్రిమ్మర నంగరక్షగా
నర్జునుఁ డేగుదెంచె నిటలాక్షుని గెల్చినజోదు విక్రమో
పార్జితలీలఁ బట్టుఁడు రయంబున శూరులు ధాత్రిఁ గల్గినన్.

క. అని వ్రాసినపద్ధతిఁ గని
వనితా యీహయము వెంట వచ్చునతని నే
నని గెల్చి దీనిఁ దెచ్చెదఁ
జను మిచ్చుట నుండ వలదు సకియలు నీవున్. 8

క. నావుడు నాగంధర్వము
పై వాంఛలు గట్టిపెట్టి భయరసపూరా
ప్లావిత యై కలఁగిననిజ
భావమున సఖీసహస్రపరివృత యగుచున్. 9

నీలధ్వజమహారాజు యుద్ధము

సీ. అంగవల్లులకుఁ బర్యాయంబు లైనక్రొ
వ్వాలపుఁదీఁగలు వంచి వంచి మాని

హస్తపల్లవముల కభిధాంతరము లైన
కిసలయంబులు గిల్లిగిల్లి మాని
కుచగుళుచ్ఛములకు విచికిత్సలైన పూ
గుత్తు లబ్బునఁ గోసి కోసి మాని
యధరామృతములకు నామ్రేడితము లైన
తేనె లింపున నానియాని మాని

తే. మదనమంజరి మానినీమణులుఁ దాను
వనవిహారంబు చాలించి చనియెఁ బురము
త్రోవఁ బట్టి పదంబులు తొట్రుపడఁగ
నధిపుఁ బెడఁబాసి చతురంతయానమునను. 10

క. తరళాయతాక్షి నీగతిఁ
దెరలిచి తురగంబు నొక్కదెసఁ గట్టి భయం
కరకరటిస్యందనభట
హరిపరివృతుఁ డగుచు ఘనరథారూఢుం డై. 11

తే. ఘటితగోధాంగుళీత్రాణకవచదివ్య
బాణతూణీరుఁ డగుచు విభాసమాన
సజ్యకోదండకోటినిషణ్ణమకుట
భాగుఁడై యుండె నమ్మహీపాలసుతుఁడు. 12

శా. అంతన్ బార్థుఁడు యజ్ఞఘోటకనయవ్యాపారకృత్యంబు ల
త్యంతప్రీతి నొనర్చి గాండివధనుర్జ్యారావముల్ సర్వది
గ్దంతిశ్రోత్రపుటీకఠోరముగ రాఁగా సేన మున్నాడి దుర్దాం
తుం డై వృషకేతుఁ డాహయనిరోధంబున్ విలోకించుచున్.

క. విడువిడు తురగముఁ బట్టక
విడువక మార్కొన్న నుద్దవిడిఁ బ్రాణంబుల్

విడిపించి కాని పాఱఁగ
విడువఁడు కర్ణసుతుఁ డనఁ బ్రవీరుఁడు నగుచున్. 14

క. అనికిఁ దలమీఱి వచ్చిన
నిను నిపుడ వధించి విజయునిం దుర్జయసా
ధనుఁ బిదపం దెగటార్చెద
ననుచుఁ వృషకేతుఁ గదిసి యాగ్రహ మెసఁగన్. 15

చ. శరములు నాల్గిటన్ హరుల సారథి నొక్క శిలీముఖంబునన్
గెరలిచి వక్ష మ్మైడిటఁ బగిల్చిన నాతఁడు నేదుతూపులన్
నొరిది హయంబులన్ గెడపి సూతుని నుబ్బడఁగించి నాల్గు
తోమరముల నుగ్రుఁడై నిటలమధ్యము నొంచిన వాఁడు
నల్కతోన్. 16

మ. ఘనశస్త్రాహతిఁ గర్ణసంభవుని స్రుక్కంజేసి వేఱొండుతూ
పున భూపాలతనూభవుండు వికటభ్రూదుర్నిరీక్ష్యాస్యుఁడై
యనుసాళ్వం దెరలించినం గినిసి వాఁ డత్యుగ్రబాణోత్క
రంబున నవ్వీరవరాగ్రగణ్యుఁ బొదివెన్ బుంఖానుపుంఖం
బుగన్. 17

క. ఆహవముఁ దక్కి విశిఖ
వ్యూహమునఁ బ్రవీరుఁ డొదిఁగి యున్న మిగుల సం
దేహించి కలఁగి సేనలు
హాహాకారం బొనర్చె నలమిన భీతిన్. 18

క. ఆలం బీగతిఁ జెల్లఁగ
నాలో నక్షౌహిణీత్రయసమన్వితుఁ డై
నీలధ్వజుఁ డేతెంచెను
గిలిసహాయముగ నచటికిన్ దీవ్రగతిన్. 19

ఉ. వచ్చి కుమారు తేరి కతివారణ నడ్డము సొచ్చి నిల్చి భా
స్వచ్ఛటులాస్త్రవృష్టి ననుసాళ్వుని ముంచి పదేసిబాణముల్
హెచ్చిన వీరయోధులపయిన్ నిగిడించిన సేన లెల్లనుం
బచ్చముపాడుగా విఱిగి పాఱ ధనంజయుఁ డడ్డగించుచున్.

ఉ. భూవరుమీఁద నైదుశరముల్ నిగిడింపఁ దదంబకంబులన్
ద్రోవనె త్రుంచి యార్చుటయుఁ దోడన యవ్విభునిన్ సమ
స్తయో, థావళిఁ జండ కాండనివహంబుల ముంచిన నల్లుఁ
డైనయ,స్పావకుఁ డస్త్రమై నిలువఁ బార్థునిపైఁ దోడి యేసె
నేసినన్. 21

అర్జునుని సైన్యంబు నగ్నిదేవుఁడు కాల్చుట

తే. ఇంద్రసూనుండుఁ బ్రతిబాణమేయుటయును
వారణముచేత నది యనివార్యమగుచుఁ
జిటచిటార్భటి నావర్తశిఖలతోడ
సేన లన్నియు భస్మంబు సేయఁ దొడఁగె. 22

సీ. పగిలి భద్రేభకుంభములమౌక్తికములు
పెటిలి నల్దిక్కులఁ బ్రేలిపడఁగ
గమకంబు చెడి హాటకస్యందనంబులు
గ్రొమ్మించుఁబూదలై కూడఁ గరఁగ
వీరాగ్రగణ్యకోటీరరత్నంబులు
పుట మెక్కి వన్నెచూపుచును మెఱయఁ
జర్మతూణీరశీర్షకపతాకాదులు
సమసి భస్మావశేషములు గాఁగ

తే. ధనము పెఱికలు పడవైచి తల్లడమునఁ
గమరి యుష్ట్రవ్రజంబులు బ్రమసి పాఱ
సుడిసి పావకుఁ డిబ్భంగిఁ జుట్టుముట్టి
ప్రళయకాలానలస్ఫూర్తిఁ బరిఢవించె. 23

క. ఈలీలఁ బరబలంబుల
ధూళీపటలంబు చేసి తురగముఁ గొని యా
నీలధ్వజుఁ డేగెను బురి
కాలము చాలించి లోక మభినుతి చేయన్. 24

ఉ. అప్పుడు క్రీడి వహ్నికిఁ బ్రియంబునఁ జేతులు మోడ్చి దేవ యీ, చొప్పున సేవకుం జుఱకుఁ జూపుదురే యిఁక నేఁడు క్రొత్తగాఁ, జెప్పెడిదేమి నీవు కృపచేసిన వీరథచాపతూణముల్, తప్పక శాంతిఁ గైకొను ముదంబున నీ శరణంబు వేఁడెదన్.

తే. ధర్మజునికార్య మఖిలబృందారకులకు
నాననము నీవు నీకుఁ బ్రియంబుగాఁగఁ
జేయఁబూనినక్రతువుఁ బతీకరించి
కరుణ దఖుకొత్త రక్షింతుకాక యనుచు. 26

క. ఏరీతిఁ బ్రస్తుతించిన
మేర గడచి మిగుల వేడిమిం జూపఁగ జం
భారిసుతుఁ డతనిమీఁదను
బోరన నారాయణాస్త్రముఁ దొడుగుటయున్. 27

శా. చండాంశుగ్రహతారకంబు లెడలెఁ జాఱెఁ ఘనశ్రేణి ది
క్కుండాలంబులు మ్రొగ్గె భూతగణ మాక్రోశించె భీతిఁ

ద్రయీ, పాండిత్యం బుడిగెఁ విధాత తెమలెం బాతెఁ
సురౌఘంబు బ్రహ్మాండక్రోడకటాహ మ్ముర్లిపడె ప్రాయం
జొచ్చె నంభోనిధుల్. 28

క. ఆసాయకంబు గని సం
త్రాసము నొందుచును బిఱుసు దక్కి దహనుఁ డ
వ్వాసవనందను పాలికి
భూసురుఁడై వచ్చి వినయమున ని ట్లనియెన్. 29

మ. క్రతువుల్ నూఱును వేయిదానములు లక్షల్ తీర్థసంసేవ
నల్, వ్రతముల్ కోటులు సేయ నేమిటికి శ్రీవత్సాంకవ
క్షుఁ రమాపతిఁ గీర్తించినఁ జాలు నాతఁడు భవత్ప్రాణంబ
యై యుండఁగా, నితరవ్యాప్తిఁ బ్రయాస మొందఁ బనిలే
దెబ్భంగి నూహించినన్. 30

తే. హరి విసర్జించి దేవతాంతరముఁ జేర
దుగ్ధపాథోనిధానంబు దొరఁగి మేఁకఁ
బిదుకఁ జూచుట యినరశ్మి పెంపు విడిచి
యవల ఖద్యోతదీప్తికి నాసపడుట. 31

క. కావున నవ్వనజాక్షుని
సేవింపుదు నీకు నిష్టసిద్ధిగ హయముఁ
రావించు టెంతపని యా
భూవరుఁ గొనివచ్చి నీకుఁ బొం దొనరింతున్. 32

చ. అనుచుఁ బ్రసన్న వాక్యముల నాతని నెంతయుఁ బ్రీతుఁ జేసి కూ
డినతనపూర్వమైత్రిఁ బ్రకటించుచు రూపతి కానరాకభం
డనమునఁ బడ్డసేన మగుడం బ్రదికించి హుతాశనుండు వే
చనె నపు డైంద్ర జాలికునిచందముఁ జూపి నృపాలుపాలికిన్.

## నీలధ్వజునకు నగ్నిదేవుఁ డల్లుఁ డైనవిధము

క. నావుడు జనమేజయధర
ణీవరుఁ డిట్లనియె జైమినిం గనుఁగొని య
ప్పావకుఁడు నీలకేతున
కేవిధమున నల్లుఁ డయ్యె నెఱిఁగింపు మనన్. 34

క. నీలధ్వజునగ్రమహిషి
జ్వాల యనువధూటిఁ గాంచె స్వాహాకన్యం
త్రైలోక్యనుతవిశేషక
ళాలలితసమస్తభాగ్యలక్షణధన్యన్. 35

వ. అంతం దజ్జనకుండు. 36

ఉ. ఆతనుఁ జీమణిం బరిణయం బొనరింపఁ దలంచి విశ్వధా
త్రీతలనాథసూనులఁ బరిస్ఫుటరూపకళావిలాసవి
ఖ్యాతుల వ్రాసి తెచ్చిన సమంచితచిత్రపటంబుఁ జూపి పు
త్రీ తగ నిందు నొక్కని వరింపు మనన్ దరళాక్షి సిగ్గునన్.

క. మనుజులు గర్వగ్రంథులు
పెనులోభులు మోహమతులు పేర్కొన నాకున్
మన సొడఁబడ దస్మానిఁగా
ననిమిషులం దొకని వెదకు మనుటయు నతఁడున్. 38

క. మంచిపని వాసవుని ర
ప్పించెద వరియింపు మనిన బింబాధర యొ
క్కించుక మదిలోన విచా
రించి పలికె దివిజపతి వరిష్ఠుం డైనన్. 39

క. కులగోత్రభేది జారుం
డలఘుతపోవిఘ్నకారి యదియునుగాక

జ్జలజాక్షునిఁ దమ్మునిఁగాఁ
దలఁచుకృతఘ్నుండు వానిఁ దడవకు మెపుడున్. 40

క. పావకుఁడు పూజ్యుఁ "డగ్నిము
ఖా వై దేవా" యనుచు నిగమములు చాటుం
గావున సంతతమును మ
ద్భావము నిశ్చలిత నతనిపై వర్తించున్. 41

తే. పతిపరోక్షంబునందుఁ దద్భార్య తనశ
రీర మాహుతిగా విసర్జించెనేని
వారిదురితంబు లడఁచి కైవల్య మొసఁగు
వహ్నిఁ బోలంగ నొండుదైవంబు గలదె. 42

క. సురగరుడోరగవిద్యా
ధరముఖ్యులమీఁద మనసు దగులదు వైశ్వా
నరుఁడ వరుఁ డన్న విని య
త్తరుణీమణిఁ జూచి చెలులు దరహాసమునన్. 43

చ. ఉడుగక రాఁజుచుండు మొగ మూరక నిప్పులు రాల్చు
నొక్కచోఁ, మడుఁగఁడు తిండిపోతు పెనుమంటల ప్రోఁగవి
చారశీలుఁ డే, వడువునఁ జూచినన్ మలినవర్తనుఁ డౌటఁ
దలంప కెట్లుగాఁ, గడఁగితి మూఁడుగాళ్లముదుకన్ వరి
యింప లతాంగి నావుడున్. 44

సీ. చెలులమాటలు చెవిఁ జేర్పక తండ్రిచే
ననుమతిఁ గొని తపోవనము దఱిసి
నియతయై విప్రసన్నిధి సమంత్రకముగా
నచట వైశ్వానరు నావహించి

ఘనసారకుంకుమాగరులవంగపటీర
శర్కరాఘృతపాయసమధుబిల్వ
తాంబూలపుండ్రేక్షుదండరంభాఫలా
ర్చనవిధానమునఁ బ్రసన్నుఁ జేయఁ
తే. బావకుఁడు మెచ్చి విప్రరూపమున నృపతి
పాలి కేతెంచి పూజలు వడసి తనకు
స్వాహ యనియెడుకన్య నుద్వాహమునకు
నిమ్ము నీ వన్న నమ్మేదినీశ్వరుండు. 45
చ. అనలునెకాని యొండొకని నాలలితాంగి వరింప దిత్తు నా
తనయలయందు నొక్కతె ముదంబునఁ జేకొను మన్న హ
వ్యవాహనుఁడను నేన యంచుఁ దనయాకృతిఁ జూపిన
నుబ్బి చిత్రభానునకు నృపాలుఁ డవ్వరతనూభవఁ బెండిలి
చేసె వేడుకన్. 46
క. జననాథ నాఁడు మొదలుగ
ననయముఁ బురరక్షణంబు నాహవజయముం
గొన నస్త్రమునై నృపతికి
ననలుం డిల్లటపుటల్లుఁడై వర్తిలున్. 47
వ. ఇది జాతవేదసుండు భూతలాధీశునకు జామాత యైనవిధం బట్లు చని వీతిహోత్రుండు ధాత్రీధవుం గాంచినం గనుంగొని ప్రసంగంబు దిగిచి నీచేత జన్యంబున విమతసైన్యం బశేషంబు నిరవశేషంబుగా భస్మంబు సేయంబడెనే యని యడిగిన సస్మితుం డగుచు నతండు నారాయణపరాయణుం డమ్మహోవ్యూహంబు దురవగాహంబు దాహంబు సేయ నెట్లు వచ్చు నదియునుం గాక పూర్వంబున గీర్వాణవల్ల

భునిదోస్స్తంభసంభావితకఠోరదంభోళివిజృంభణంబు సంస్తం
భింపం జేసి ఖాండవం బఖండదర్పంబున నాకు నర్పించె నీ
దృగ్విధోపక్రియానుబంధంబు భవత్సంబంధంబున విస్మృతం
బయ్యె నిరర్థకవిరోధంబు సమర్థింపక నీవు హయంబు
రయంబునం గొనిపోయి యప్పార్థునిం గని కృతార్థుండవు
గ మ్మనిన నంగీకరించి రాజపుంగవుండు తనకులాంగనం
గనుంగొని. 48

క. పావకుఁడు హితవు చెప్పెం
గావున నీసవనఘోటకము నంపుద మ
ద్దేవేంద్రసుతునికడ కన
నావనజదళాయతాక్షి యధిపునితోడన్. 49

ఉ. పట్టినకార్య మీశ్వరుఁడు పట్టి పెనంగినఁ జేర నీక చే
పట్టుట రాజధర్మ మని పల్కెడునీతిఁ దొలంగి కీర్తికిం
బట్టగుసాహసంబు నిజబాహుబలంబును వీటిఁబుచ్చి యీ
పట్టినవాహముం దిరుగఁ బంపిన నవ్వరె తోడిభూపతుల్.

క. ధర యెల్ల నేలు గెలిచిన
సురరాజ్యం బేలుఁ దెగిన శూరున కెపుడుం
దుర మొనరించుట మంచిది
పరులకుఁ బ్రియ మాచరించి బ్రదుకుటకంటెన్. 51

క. అనిన విని వాని మదిఁ దోఁ
ప నిరంకుశవిజయ భేరిభాంకృతు లెసఁగం
మొన లేర్పరించి తోడనె
జననాథుఁడు గదలె సమరసంరంభమునన్. 52

## నీలధ్వజార్జునులద్వంద్వయుద్ధము

మ. ఇరువాఁగుం దలపడ్డ నాసమయమం దింద్రాదు లగ్గింప భీ
కరమయ్యెన్ సమరంబు పార్థుఁ డపు డల్కన్ శింజినీ రావని
ష్ఠురగాండీవధనుష్మ తావలయ నిష్ఠ్యూతశాస్త్రజాలంబు దు
ర్ధరలీలం దొరఁగించినన్ సమసెఁ దత్సైన్యంబు శూన్యంబుగన్.
చ. తనయులు నిష్టబాంధవులుఁ దమ్ములు నన్నలుఁ గాలు గాలు
నం, బెనఁచుక పడ్డ నవ్విభుఁడు బీరము డింపక పోరిపోరి య
ర్జునునిశితాస్త్రజాలముల స్రుక్కఁగ సూతుఁడు రాజు మేనఁ
గ్రమ్మిన పెనుమూర్ఛఁ జూచి తటి మెల్ల వడితోడ రథంబు
వీటికిన్. 54
ఉ. అంతట భానుమంతుఁ డపరాబ్ధికి నొయ్యన జాఱె దిక్కులన్
సంతమసంబు మీఱె జలజంబులు డయ్యెఁగఁ బాఱె జక్కవ
ల్వంతలఁ దాఱెఁ గైరవదళంబుల నొక్కలు దీఱె రోహిణీ
కాంతునిరాకఁ జూచి కుతుకంబునఁ గేరెఁ జకోరదంపతుల్.

క. అప్పుడు గదిరినమూర్ఛం
దెప్పిఱి యవ్వసుమతీపతి హితజనములన్
రప్పించి సైన్య మొందిన
యొప్పమిఁ బరికించి నిజతలోదరి కనియెన్. 56

క. కలనన్ మనవా రెల్లను
బొలిసిరి నీదుర్ణయమునఁ బోయినయవి పె
ద్దలె నాకును 'స్త్రీబుద్ధిః
ప్రళయాంతక' యనెడిపలు కబద్ధం బగునే. 57

చ. అని తలకొన్న నెవ్వగయు నాగ్రహమున్ దమకంబు నాత్మ
లోఁ, బెనఁగొనఁ దదవ్యథూటిఁ బటభేదనమున్ వెడలంగఁ

ద్రోచి య,జ్జనపతి హేమరత్న హయసామజముఖ్యము
లైనకానుకల్, గొని చనుదెంచి యన్నరునకుఁ సవనాశ్వము
నిచ్చి మ్రొక్కినన్. 58

ఉ. ప్రేమఁ గవుంగిలించుకొని పెక్కువిధంబుల నాదరించి సు
త్రామతనూభవుండు నియతం బొకయేఁడు దురంగరక్షగా
నామనుజేంద్రునిన్ బయనమై చనుదె మ్మనునంత దక్షిణా
శాముఖవీథి నేగె మఖసైంధవ ముద్భటవేగసంపదన్. 59

చ. మగఁడు పరాభవింప నట మానిని భూరివిషాదవేదనన్
బొగులుచుఁ గాశికాపురికిఁ బోయి సమున్నతబాహువైభవుం
డగుతదధీశు నుల్ముకుని నాత్మసహోదరుఁ గాంచి యెంతయున్
దగిలిన వంత నాతనిపదంబులపైఁబడియేడ్చె నేడ్చినన్. 60

క. అతఁడు సహోదరిఁ గరుణా
యతమతి నూరార్చి యొంట నరుదెంచుట య
ద్భుత మీచందంబునకున్
గత మెయ్యది యనుచుఁ దెలియఁగా నడుగుటయున్. 61

క. సవనాశ్వముఁ బట్టుట మొద
లవనీపతి తన్ను వెడల నడుచుట తుదగా
వివరించి చెప్పె నంతయుఁ
గువలయదళనేత్ర పూసగ్రుచ్చినభంగిన్. 62

వ. చెప్పి మఱియునుం దద్విరోధంబు నిర్నిరోధంబు సేయం
దలంచి యి ట్లనియె. 63

చ. పఱచి దవాగ్నిఁ బడ్డశలభంబులకైవడిఁ బార్థుఁ దాఁకి రూ
పఱి సుతులున్ సహోదరులు నాలమునం దెగటాఱఁ జూచి నీ

మఱంది భయంబునఁ గలఁగి మార్తునకుఁ శరణంబుచొచ్చె నే
తెఱఁగున నైన నా నెగులు తీర్పఁగ నెవ్వరు నీవు దక్కఁగన్.

క. ఈయాపదలకు మూలం
బౌయింద్రతనూజుఁ డతని నాహవభూమిం
జేయారఁ జంపి నామదిఁ
బాయనివగ పాపు మన నృపాలుఁ డబలతోన్. 65

చ. విను మిఁక నేఁట తేపటన వీతిబడిఁ జనుదెంచు నర్జునుం
డని నెదిరించి పట్టెద మఖాశ్వముఁ దోడనె లంకె పెట్టెదన్
మనమున నూఱడిల్లు మన మానిని వాఁడు హయంబు పోవు
త్రోవనె చనుఁగాక యీకడకు వచ్చుట యెట్లనినన్
లతాంగితోన్. 66

క. రా కతఁడు గడచి పోయిన
నే కార్యముఁ దప్పిపోవ దింతటిలోనన్
శోకింపవల దవశ్యము
నీకొఱఁ తంతయును దీర్తు నింకొకవేళన్. 67

క. నావుడు ముట్టినజగడం
బీవేళనె తీర్ప వేని యేండ్లం బూండ్లన్
నీ వేమి తీర్చె దనుటయు
నా వెలఁదుకఁ జూచి పలికె నాగ్రహ మెసఁగన్. 68

క. అతిమించి చొచ్చిని ల్లటు
చెఱిచితి విఁకఁ బుట్టినిల్లు చెఱిచెద ననియే
పఱతెంచితి రెండిండ్లకుఁ
జెఱుపనచేట వయి తేమి చేసెడి దనుచున్. 69

క. విడనాడఁ జూచి మును పిడు
గడిచినతనిఁ గోఱిఁ జూఁడిన ట్లగుటయు న
క్కడ నుండ కేగె మదిలో
మిడుకుచు భాగీరథీసమీపంబునకున్. 70

అర్జునుని గంగ శపించుట

తే. ఇంతి యటఁ జని పేరోడ నెక్కి దరికిఁ
జనఁగఁ దనవామచరణ మజ్జలము సోఁక
నంటితి నమశ్శివాయ పాపాత్మురాలి
నంచు నాద్వీపవతిని దూషించుటయును. 71

క. అచ్ఛోటితీర్థవాసులు
వచ్చి తగునె నీకుఁ బుణ్యవాహిని నిటు వా
క్రుచ్చితి వని వడి నందఱు
గ్రచ్చుగదలినట్లు గువ్వకరిగొని తిట్టన్. 72

సీ. అద్దివ్యతటిని ప్రత్యక్షమై ముందఱ
నిలిచి యి ట్లనియె నోనిర్మలాంగి
నాయందు నెట్టియన్యాయంబు పొడగంటి
వెటిఁగింపు మనిన న త్తెఱవ నీవు
సుతుల నేడ్వురను మ్రింగితివి తోడ్తో నిల్వఁ
గడపట నొకఁ డుప్పుఁగల్లువోలె
నట్టిసత్యవ్రతు నర్జునుండు వధించె
ననిలో శిఖండి ప్రాపునఁ గడంగి
తే. యతని కొలయును నెడపలే వైతి గానఁ
బుత్రహీనవు ని న్నంటఁ బోల దనిన

నలిగి పార్థునిశిర మాఱునెలల కుర్విఁ
ద్రెళ్ల శపియించి దేవి యదృశ్య యయ్యె. 73

క. జ్వాలయు నాదివిజనదీ
కూలంబునఁ జితి యమర్చుకొని చిత్రముగాఁ
గాలి ధనంజయుఁ జంపఁగ
నాలో మృత్యుస్వరూప మగుశర మయ్యెన్. 74

చ. అట మఖసైంధవంబును జవాతిశయంబున వింధ్యభూమిభృ
త్కటకసమీపనీపతిలకక్రముకార్జునదాడిమీశమీ
కుటజకురంటకామలకగుగ్గులుసాలరసాలపాటలీ
వటలవలీలవంగవనవాటిక లుద్ధతిఁ జొచ్చి పోవుచున్. 75

తే. ఎదుర ఘన మైనయొకశిలఁ గదియఁ బోయి
బరులకండూతివాయ బిట్టొరసికొనఁగ
నంటుకొనె నధ్వరాశ్వ మగ్గుంటితోడ
జిగురుగడఁ దాఁకి విహగంబు తగిలినట్లు. 76

చ. అది గని సైనికుల్ కడుభయంబునఁ జేరి మహోపలంబు
తో, నదికినరీతి నున్నసవనాశ్వము ధేయని కక్కసంబులన్
సదసదగాఁగ వ్రేసియును జాటులఁబెట్టియు నేమి చేసియున్
గదలుప లేక యవ్విధము కవ్వడి కేర్పడ విన్నవించినన్. 77

అర్జునుండు సౌబరియాశ్రమంబునకుం బోవుట

క. అరుదంది హయము పడియెడు
దురవస్థకు నేమివెరవు దోఁప కచటిసౌ
బరి యనుమునివరుఁ జేరఁగ
నరుదేరఁ దదాశ్రమాంతికారామమునన్. 78

సీ. భేరుండములు ప్రక్కఁ బెట్టి చన్నులపూరి
పాటించి శరభడింభముల కిచ్చు
శరభముల్ శయనించి హరికిశోరములను
బొదుఁగులపా లిచ్చి నిదుర పుచ్చు
నీనినసింగంబు లేనిక లేఁజూళ్లు
గుడువ మై నాకుచుఁ గుస్తరించు
లేడిపిల్లలకు బాలెంతచివ్వంగులు
పంకంబు లిచ్చుచుఁ బంచితిల్లుఁ
తే. బక్షములు గప్పి పసిపాపపాములకును
మేపు లొసఁగి రక్షించు నెమిళ్లు పిల్లు
లెలుకబోదలఁ బ్రోచుఁ జన్నిచ్చి యచటి
జంతునివహంబు జాతివైషమ్య ముడిగి. 79

వ. అవ్వనంబున కనతిదూరంబున సర్వసైన్యంబుల నిలువ నియమించి ప్రద్యుమ్నవృషకేతనానుసాల్వయౌవనాశ్వనీలధ్వజ సమేతంబుగాఁ జని చని ముందట. 80

ఉ. అక్షయపుణ్యశీలు నిగమార్థరహస్యకథాప్రవీణు రు
ద్రాక్షవిభూతివల్కలమృగాజినశోభితగాత్రు శ్రీమద
ష్టాక్షరమంత్రలబ్ధమహిమాధికు సౌబరిఁ గాంచి యాసహ
స్రాక్షతనూభవుండువినయంబునఁ జాఁగిలిమ్రొక్కి యిట్లనున్.

చ. శమనతనూభవుండు మునిసత్తమ గోత్రవధం బొనర్చి చి
త్తమున నపారమైన పరితాపమునొందఁ బరాశరాత్మజుం, డు
మనుజనాథుఖేదముఁ గనుంగొని యూఱడఁబల్కి యశ్వమే
ధమున కుపక్రమింపు మనెఁ దద్దురితాతిశయోపశాంతికిన్.

సీ. మునిసార్వభౌముపంపున ధర్మతనయుండు
భక్తిఁ జైత్రవిశుద్ధపౌర్ణమాసి
దీక్ష గైకొని ధరిత్రీదేవతలకు ను
క్తప్రకారంబున దాన మొసఁగి
వీతి నర్చన చేసి విడుచుచో నేనును
బయనమై హరికి భూపతికి మ్రొక్కి
చన యౌవనాశ్వానుసాల్వనీలధ్వజ
ప్రద్యుమ్నకర్ణసంభవులతోడఁ
తే. గదలి దేశంబు లన్నియుఁ గడచి వచ్చి
వచ్చి యీవింధ్యవనవాటిఁ జొచ్చి యోజ
నాయతం బగుశిలతోడ నంటుకొనియె
సప్తతంతుతురంగ మోసంయమీంద్ర. 83

క. కావున నీమహనీయ
గ్రావంబున నంటువడ్డ క్రతుసైంధవ మిం
కేవిధమున విడువడి చను
నావిధ మెఱిఁగింపవే దయానిధి యనినన్. 84

సౌబరిమహాముని యర్జునున కుద్దాలకమునిచరిత్రంబు చెప్పుట

క. విను ముద్దాలకుఁ డనియెడు
మునివర్యుఁడు బ్రహ్మచర్యమును జరిపి వరిం
చెను జండిక యనుపేరఁ
జనుకన్నియ నతిపరుషవచన దుశ్శీలన్. 85

తే. బాల్యముననుండి యౌవనప్రాయ మైన
యపుడుఁ దనభార్యయందు నయం బొకింత

గానఁ దయ్యెను వేము వెగ్గలము పెరుఁగఁ
గలదె మాధుర్యగుణము తిక్తంబ కాక. 86

సీ. సంధ్య వార్వఁగ నిమ్ము జలపాత్ర మనఁ బోవఁ
గొట్టిన నతికించుకొనఁగ వలసెఁ
దడిదోవ తిమ్మన్న నడిమికి వడిఁ జింపఁ
గట్టుకోఁబడె బ్రహ్మకమ్మి వైచి
యక్షమాలికఁ జూపు మనఁ ద్రెంచి వైచినఁ
బనిచెడి మఱి గ్రుచ్చికొనఁగవలసె
సమిధ లిమ్మన్న వ్రేలిమిగుండ మార్చిన
నూఁదుకోఁబడె మండ నొకవిధమున

తే. ననుదినము నిట్లు ప్రాతికూల్యము భజింపఁ
జండికతమున ముని బ్రహ్మచర్యనియమ
మునకు గృహమేధివర్తనమునకుఁ దొలఁగి
రెంటికిని జెడ్డ రేవని రీతి యయ్యె. 87

క. అంతట ముని కౌండిన్యుం
డంతేవాసులు భజింప నరుదెంచె మదిన్
జింతిలునుద్దాలకుని ని
శాంతమునకుఁ దీర్థయాత్ర చనియెడుత్రోవన్. 88

క. చనుదెంచి యర్ఘ్యపాద్యము
లొనరించి నమస్కరించునుద్దాలకునిం
గని సేమ మడుగ నెగులునఁ
దనసతిగతిఁ జెప్ప విని యతని కిట్లనియెన్. 89

తే. అయినపని కింక నేమి సేయంగ వచ్చు
నగ్నిసాక్షిగ నుద్వాహ మైనవెనుక

విడువవచ్చునె సతు లెంత వెఱ్ఱు లైన
దీని కొకయుక్తిఁ జెప్పెదఁ దెలియ వినుము. 90

క. చేయఁగవలసినకార్యము
చేయకు మను మదియుఁ గడఁగి చేయు నిజముగాఁ
జేయనికార్య మవశ్యము
చేయు మనుము చాలు నదియుఁ జేయక మానున్. 91

ఉ. కాన మదీయవాక్యములు గైకొని నెమ్మది నూఁడిల్లు మం
చానతి యిచ్చి యమ్మునిగృహంబున మజ్జనభోజనాదులం
దానతితృప్తిఁ బొంది మఱునాఁడి దె వచ్చెద నెల్లి గౌతమీ
స్నానము చేసి యంచు మునినాథుఁడు శిష్యులుఁ దాను
నేగినన్. 92

తే. చండి వినుచుండ నుద్దాలకుండు పలికె
నహహ నాయింటఁ బైతృకంబనుచుఁ గాదె
యెల్లి వచ్చెద నని పోయె నీతపస్వి
పైతృకం బేల తన్నుఁ జెప్పంగ నేల. 93

క. తిథి యని చేసిన నథవా
విధవానందనుల ఖలుల వృషలీపతులఁ
బధిరుల నవైష్ణవుల న
న్యధనాపహారులను గాని యర్హులఁ జెప్పన్. 94

క. ఉలవలు చామలు కోద్రవ
ములు కందులు రాజమాషములు నిష్పావం
బులు చణకంబులు దవ్విం
దలు జొన్నలుఁ గాని గూర్పఁ దగుధాన్యంబుల్. 95

ఆ. ఉల్లి పుచ్చకాయ ముల్లంగి సొరకాయ
పిండికూర నేతిబీరకాయ
చిత్రిమేడికాయ చెంచలి వంకాయ
గాని మంచికూరగాయఁ దేను. 96

వ. మఱియు నొక్కటి విను మెల్లి తెల్లవాఱినంగాని ధాత్రీ సుపర్వుల నీరాత్రి నియమింప నియమించిన నపరాహ్ణంబునం గాని కుతపకాలంబునం బెట్ట నట్టింట దట్టంబుగాఁ జిట్టుము కయు గోర్పడంపుబట్టలు నెఱపుదుంగాని గృహం బలంక రింప బ్రాహ్మణులకు వస్త్రదక్షిణ లొసంగ శ్రాద్ధం బశ్రాద్ధంబు గావింతు ననిన మండిపడి చండి సకలవిద్యావిచక్షణు లైన భూసురాధ్యక్షుల నిశాసమయంబునంద క్షణియించి రంగ వల్లికాదులచేత నిలుముంగిలి శృంగారించి తానునుం గత స్నానయై మాషముద్గయవశాలి గోధూమాదిమనోహర ధాన్యంబులు యోగ్యంబు లైన శాకంబులు పాకంబు లేర్పడంజేసి ప్రేక్ష్యంబు లైనభక్ష్యంబులు ప్రాజ్యంబు లైన భోజ్యంబులు సహ్యంబు లైనలేహ్యంబులు సంస్తవనీయంబు లైనపానీయంబులు నూతనభాండంబులు నిండ నలంకరించి దక్షిణావస్త్రయుక్తంబుగా శ్రాద్ధంబు యుక్తకాలంబునంద నిర్వర్తించినం గని యుద్దాలకుండు పెద్దయుం బ్రొద్దు సంతోషించి యిష్టులుం దానునుం దుష్టిగా భుజియించు సమయంబున. 97

క. కమలవనీబాంధవబిం
బము బింబఫలాశిపాలిపాటలరుచిఁ బ

శ్చిమధరణీధరసౌధా
గ్రముపైఁ గనుపట్టెఁ గనకకలశముభంగిన్. 98

క. ఆలోనఁ జండితోను
ద్దాలకుఁ డిట్లనియె సమ్మదంబున విపరీ
తాలాపసరణి మనమున
శీలింపక తుష్టిగా భుజించినకతనన్. 99

క. ఈపార్వణంబు గొని గం
గాపావనజలములోనఁ గలుపు మటన్నన్
గోపించి చండి యింటిస
మీపంబున నున్న పెంటమీఁద నైచెన్. 100

మ. అపుడుద్దాలకుఁ డాగ్రహించి నిజభార్యం జూచి నిర్భాగ్యు
రా,ల పవిత్రం బగుపార్వణంబు నవలీలం బెంటపై వైచి కుం
టుపడన్ జేసితి శ్రాద్ధకర్మ మని కన్గోనల్ చిగుర్పంగ వే,శపి
యించెన్ ఘనవింధ్యశైలవనిఁ బాషాణత్వమున్ బొందఁగన్.

చ. అని శపియించినం గడుభయంబునఁ గంపము నొందుచండిఁగ
న్గొని ముని శాంతచిత్తుఁ డయి కొన్నిదినంబుల కిందు ధర్మనం
దనుమఖవాజి నిన్నొరసి తార్క్ష్యనిరన్ విడిపించ వచ్చు న
ర్జునకరపంకజోదరము సోఁకి కృతార్థవు గమ్ము పొమ్మనెన్.

సీ. ఇది శిలావృత్తాంత మింద్రనందన నీవు
తటుకునఁ జని కరతలమునందు
నంటుము విడువడు వశ్వమేధహయంబు
సతియును శాపమోక్షంబు గాంచు
ననిన నమ్మునికి సాష్టాంగంబుగా మ్రొక్కి
యమరేంద్రనందనుఁ డట్ల చేయ

శిలతోడ నంటు వాసె హయంబు రఘురాము
నంఘ్రిరేణువున నహల్య వోలెఁ

తే. జండియును వేగ శాపమోక్షంబు గాంచె
నంత నుద్దాలకుండు సన్న్యాసియయ్యెఁ
గాని గార్హస్థ్యధర్మంబుఁ బూనఁ డయ్యెఁ
దరుణి చేసినవెనుకరోఁతలఁ దలంచి. 103

మ. హయరత్నంబును వింధ్యశైలవనరథ్యాసీమముల్ దాఁటి దు
ర్జయసైన్యంబు లశేషశేషభుజగేంద్రస్ఫారభోగావళీ,భయ
దాహంకృతిఁ జూపుచుఁ గదలఁ,శుంభల్లీల హంసధ్వజా,హ్వా
యభూపాలకుచంపకాపురము డాయం బోయె వేగంబునన్.

క. ఆహయము వెంటఁ గూడి మ
హాహవసన్నాహవిక్రమాటోపకళా
సాహసిక యోధవీరుల
తో హరిహయసుతుఁడు వచ్చె దోర్గర్వమునన్. 105

క. అధ్వరఘోటకమును నా
నాధ్వజినీయుక్తుఁ డగుధనంజయుఁ గని దూ
తాధ్వగులు చెప్ప విని హం
సధ్వజుఁ డిట్లనియె వృద్ధసచివులతోడన్. 106

హంసధ్వజమహారాజు యుద్ధము

చ. ఇట మఖవాజివెంట నమరేంద్రతనూజుఁడు వచ్చుచున్నవాఁ
డఁట చతురంగసైన్యయుతుఁడై చని యేనును నత్తురంగముఁ
దటుకునఁ బట్టెదన్ ఘనరణం బొనరించెద నంతభక్తసం,కట
మెడలింప వచ్చుహరిఁ గాంచి కృతార్థుఁడనై సుఖించెదన్.

క. అని సంగరసన్నాహం
బున ధర్మని విజయపటహమును వ్రేయింపన్
విని నిల్వక వెల్వడెఁ గ్ర
కున్క సైన్యము లెల్లఁ గోలఁ గొట్టినభంగిన్. 108

సీ. జననాథ హంసధ్వజునకు సప్తతిసంఖ్యా
సైనికు లత్యంతశౌర్యనిధులు
ప్రతిసైనికునకు డెబ్బదియొక్క వేయిగ
జంబు లన్నియు మణిస్యందనములు
జవసత్వములఁ గల్గుసైంధవంబులు లక్ష
వివరింప నందఱు వీరభటులు
ధన బల సురథ సుధన్వ సుబల ధర్మ
బాహు లవ్వసుమతీపాలసుతులు

తే. వీరు వా రన కందఱు విష్ణుభక్తి
నిరతు లందఱు నేకపత్నీవ్రతస్థు
లందఱును సత్యభాషణు లందఱును వ
దాన్యు లందఱు నాహవోత్సాహరతులు. 109

తే. ఇట్టిసేనలతో నమ్మహీశ్వరుండు
వెడలుచును శంఖలిఖితు లనెడు పురోహి
తుల నియోగించి రానివారలను వైవుఁ
డరసి కాఁగినచమురుఁ గొప్పెరలలోన! 110

ఉ. అంచు రథంబు నెక్కి వసుధాధిపుఁ డేగఁ బురీవిలాసిను
ల్గాంచనసౌధజాలకములన్ గుతుకంబునఁ జూడఁ దత్కటా
క్షాంచలరోచు లత్తనువు నంటిన నొప్పెఁ గిరీటిఁదాఁక నూ
హించినమాత్ర నెట్లు దివిజేశ్వరుఁ డయ్యె నరేశ్వరుం డనన్

చ. అనికి సుధన్వుఁడేగ నపు డాయితమైజనయిత్రిఁ గాంచి వం
దనమొనరించినన్ సుతునిఁ దల్లియుఁ గౌఁగిటఁజేర్చికీర్తిఁగై
కొనుమనిపంచినన్ గువలఁ గూరిమిసోదరిఁ దల్లి యట్ల వీడ్కొ
ని వెస నాత్మగేహమునకున్ జనుదెంచి ముదంబుతోడుతన్.

—◎ సుధన్వుండు యుద్ధంబునకు రాక తడయుట ◎—

క. తనదేవి యగుప్రభావతిఁ
గనుఁగొని గమనగతిఁ జెప్పఁగాఁ దొయ్యలి నా
థునకు ఘనసారసీరా
జన మర్పణచేసి కేలిసౌధము పొంతన్. 113

క. తనకోర్కి విన్నవించిన
విను మిప్పుడు వేళ గాదు విజయుని నాలం
బున గెలిచి వేగ వచ్చెద
ననుపుము నీ వన్న మఱియు నధిపునితోడన్. 114

చ. తలఁపఁగ నేఁటిదాఁక ఋతుధర్మము దాఁటవు గాన నీకు నేఁ
దెలియఁగ విన్నవించితి మదీయమనోరథకల్పవల్లిక, న్ఫలిత
ముచేసి పొమ్ము కపనంబున కన్న దివాప్రసంగముల్, గలవె
మహోగ్రశాసనుఁడు గాఁడె నృపాలకుఁ డాగ్రహించినన్.

చ. నియమితదుందుభిధ్వని వినీవినమిం బురిలోనిసైనికుల్
హయరథవారణేంద్రసుభటావలితోడఁ గిరీటిఁ దాఁక ని
ర్భయగతి నేగి రింకఁ బిదపం జన నే మను భూవిభుండు ని
ర్దయమతు లెన్న శంఖలిఖితప్రవరుల్ దెలియంగఁ జెప్పితిన్.

తే. రమణి తావకఋతువాసరములు పెక్కు
గలవుగాని విరోధి నెక్కటి జయించి

నిలువ మఱిలేదు దివసంబు నేఁడు దక్క
సమర మొనరించి వచ్చి నీచనవుఁ దీర్తు. 117

చ. అనవుడు నేఁటితోడఁ బదియాఱుదినంబులు నిండె ముంద
టన్ దినములు లేవు పైతృకతిథిన్ ఋతుదానము సేయఁ
జెల్లు యామినికడజామునన్ విను సమీకము చేసెద నంచు
నిట్లు పోవ నుచిత మానె నీ వెఱుఁగవా నిగమార్థరహస్య
ధర్మముల్. 118

చ. కలనికి రాక తక్కెనని కాఁగిననూనియతొట్టిలోపలన్ దోలఁ
గక పట్టి శంఖలిఖితుల్ పడఁద్రోయుదు రంచు నాత్మలో నలి
కెదు భ్రూణహత్యకుఁ గృతాంతునిదూతలు చేయుబాధ లీ
కొలఁదులె మీఁద నంచు గిఱికొన్న మనోజవికారవేదనన్.

ఉ. ఇందునిభాస్య నాథుఁ జన నీయక మంగళభూషణద్యుతుల్
గ్రందుకొనంగ డగ్గఱి యురంబున బింకపుగుబ్బచన్ను లం
టం దమకంబుఁ గాఁకయు ఘనంబుగ మక్కువఁ జేర్చెఁ
గౌఁగిటన్, గంధపుమ్రాఁకు తావి గొనఁగాఁ బెనఁగొన్న
భుజంగికైవడిన్. 120

క. జననాథసుతుఁడు కామిని
చనవులు చెల్లించి కాని చనరా దనుచున్
దనిపె రతికేళి నపుడ
త్యనురాగముతోడ నంత హంసధ్వజుఁడున్. 121

వ. భండనంబునకు సుధన్వుండు రాకుండు టెఱింగి మండిపడి
మహీవిభుండు దండధరకింకరభయంకరవిశంకటపటుభుజా
హంకారులైన లెంకనాయంకులవంకం గనుంగొని మీర
లాజ్ఞాభంగంబు గావించునక్కించు నొక్కించు కంతయు

విచారించక పట్టుకొనిపోయి మత్పురోహితుల ముందఱం
బెట్టి రండు పొం డనిన మహాప్రసాదం బని పంపువడి
చంపకాపురంబున కరుదెంచువారు ముందట సఫలితసతీ
మనోరథుండును నారూఢమణిరథుండును నాహవోత్సాహ
సంపాదకవచుండును నాబద్ధగోధాంగుళీత్రాణతూణీరకవ
చుండును నధిజ్యధన్వుండును నై వచ్చు సుధన్వుం గాంచి
కోపించి. 122

చ. తగునె సుధన్వ నీకు వసుధాతలనాథునియాజ్ఞ మీఱి యి
ప్పగిది రయంబు దక్కి పిదపన్ జనుదేర విభుండు నీపయిన్
మిగులఁగ నాగ్రహించి బలిమి న్నినుఁ బట్టుకపోయి ధర్మశా
స్త్రగురువు లైనశంఖలిఖితద్విజవర్యులచేతి కిమ్మనెన్. 123

చ. అనవుడుఁ దండ్రియందుఁ బతియందు సుతుండును బంటు
నర్థవంచనమును ప్రాణవంచనము సంగతి గా దొనరింప
నక్కత్రై,నను నెలవైనఁ దండ్రియును నాథుఁడుఁ దా నటు
గాన నాకు న,జ్జనకునియాజ్ఞ సేయుటయె జన్మఫలం బని
తేరు డిగ్గినన్. 124

క. పట్టి మరాళధ్వజస
మ్రాట్టుపరిజనములు రాకుమారుని నంటం
గట్టుకొని శంఖలిఖితుల
కట్టెదుఱం దెచ్చి రాజ్ఞఁ గడవఁగ రామిన్. 125

సీ. తెచ్చి యాతఁడు ధరిత్రీనాయకుఁడు సవ్య
సాచిపై దండెత్తి చనెడుచోట
రాజువెంటనె కొల్చి రాక కృష్ణునిపాద
కమలంబులను భక్తిఁ గాన లేక

యంగన బుతుదాన మడుగ నింటనె నిల్పి
కామాంధుఁడై యాజ్ఞఁ గడచెఁ గాన
నృపసూనుఁ డని చూడ కపుడు మీముంపటఁ
జేసినశపథంబు చిత్తగించి
తే. యీకుమారు సుధన్వుఁ బోనీక బలిమిఁ
దప్తతైలకటాహమధ్యంబునందుఁ
గట్టి వేయింపుఁ డనినఁ గింకరులతోడ
లిఖితుఁ డిట్లనుశంఖుఁ డాలించి వినఁగ. 126

క. తనపలుకు సత్యముగ నే
మనుజుఁడు భూమండలిఁ సమర్థింపఁడు ప
ర్వినభయలోభంబున న
జ్జనపతి పడు రౌరవముల శతవత్సరముల్. 127

మ. తనరాజ్యంబును విశ్వధాత్రియును తాత్పర్యంబునం గాధిపు
త్రున కర్పించి కళత్రముఁ వరకుమారుఁ గాశిలో విక్రయిం
చి నిరూఢం బగుసత్య మర్వ్వరఁ బ్రతిష్ఠించెఁ సురల్ మెచ్చఁ
గా, జననాథాగ్రణి సార్వభౌముఁడు హరిశ్చంద్రుండు వి
ఖ్యాతిగన్. 128

సుధన్వుఁడు తప్తతైలకటాహమునఁ బడి బ్రదుకుట

క. వనమునకు రామచంద్రుని
ననిచి దశరథక్షితీశుఁ డఖిలము నెఱుఁగఁ
మును కైకతోడ నాడిన
తనసత్యము నిలిపి కాదె తనువుఁ దొఱంగెన్. 129

ఉ. సత్యవిహీనుఁ డై చను రసాతలనాథునితోడఁ జేయుసాం
గత్యము కోటి వచ్చినను గాదు సుధీజనకోటి కాశ్రయా

వ్యత్యయభూతి నెవ్వఁ డభివాంఛితుఁడౌ భువి నట్టిసత్యరా
హిత్యుఁ డొనర్చుదుష్కృతుల కెల్లఁ బురోహితుఁ డెల్ల
యాఁ దుదిన్. 130

క. ఇతఁ డొకఁ డనఁనేల మహీ
పతియాజ్ఞ యలంఘనీయపథ మగుట సుహృ
త్పితృమాతృబాంధవానుజ
తతి మొదలుగ వధ్యు లన నతం డెల నగుచున్. 131

చ. అలఘు భయంకరాహవముఖార్జితరత్నవిభూషణావలుల్
చెలఁగుచు నూడ్చిమాల్యతులసీప్రసవాంబుజబీజమాలికా
కలితవిశాలవక్షుఁ డయి కంజదళాక్షునిఁ బీతవాసు హృ
జ్జలజనివాసుఁగా నుపనిషద్వచనంబులఁ బ్రస్తుతించుచున్.132

చ. తడయక మండుతైలపరితప్తకటాహము కేలుదామరం, దొడి
కిలిపట్టి రాహువు విధుం గబళించినరీతిఁ జూపఁ గ్రొమ్మడుఁ
గున కేగుభద్రకరిమాడ్కి సుధన్వుఁడు చొచ్చె బిట్టుగా
నుడికెడినూనెతొట్టి బలియుర్ హరిదాసులు సత్యసంపదన్.

క. కీలిశిఖాముఖదారుణ
తైలకటాహంబు కంఠదఘ్న మయిన భూ
పాలసుతువదన మొప్పెఁ గ
గాళిందీనదములోనికమలముభంగిన్. 134

క. ఆహేమకృతకటాహ
స్నేహము దనుజారిదాసునికిఁ జారుశర
న్నీహారకిరణచంద్రిక
యై హర్ష మొనర్చుచుండె నాసమయమునన్. 135

తే. శంఖలిఖితద్విజన్ము లాశ్చర్య మంది
యిక్కుమారకుఁ డిట్టుండు టెల్లనింద్ర
జాలవిద్యావిధంబు గాఁబోలుఁ దైల
మరసి పరిశోధనము చేయ నర్హ మనుచు. 136

సీ. రయమున నారికేళఫల మొక్కటి వేయఁ
బెటిలి పెంచికలు నొప్పించెఁ బ్రజల
వీక్షించి యప్పు డాద్విజులు తప్ప దితండు
హరిభక్తిరతుఁడు ప్రహ్లాదునట్ల
విష్ణుభక్తుఁ బరాభవించినదురితోప
శాంతికిఁ దప్తకాంచనకటాహ
గర్జితస్నేహావగాహంబు ముఖ్య మీ
దేహంబులకును సందేహ మేల

తే. యని ప్రవేశంబు చేసి రుద్యత్కఠోర
దహనకీలాకలాపనృత్యత్కరాళ
తైలదారుణపాత్ర మత్తగవు చూచి
దేవతలు మెచ్చి రమ్మహీదేవతలను. 137

క. ముప్పూర మీఁద మరందపుఁ
దుప్పరఁ జల్లుచుఁ బరాగతోయధరంబుల్
ఉప్పొంగఁ జొచ్చెఁ దఱుచుఁగఁ
బుప్పులజడివాన వేలుపులు గురియింపన్. 138

సీ. చాలు సుధన్వ నీసత్యవ్రతము చూచి
పరిణమించిరి హరిత్పాలవరులు
హరిభక్తిరతుఁడ వౌటరయక నిన్ను న
ప్పగిది నొప్పించినపాపకర్ము

లకుఁ బ్రాచితంబు గల్గఁగనేర దదియు నీ
దేహసంసర్గంబు తీఱఁ జేసె
ననుచుఁ దైలకటాహ మవగాహనము చేసి
వెడలుచందమున వెల్వడిన ముగురు
తే. సముచితస్నానకృతపరిష్కారు లగుచు
హంసకేతనుపాలికి నరుగుదేర
శంఖలిఖితద్విజులు సత్యసంధుఁ డైన
తనయుకథఁ జెప్పఁ దండ్రి మోదమునఁ బొంది. 139

ఉ. ధూపితతైలపాత్రమునఁ ద్రోయఁగఁ బంచిన నిన్ను నార్తర
తూపరుఁ డైనశౌరి దయఁ గాచె ధరిత్రి మదీయశాసనం
బేపున నిర్వహించితి వహింపుము వేడుకతోడ నింక సే
నాపతిపట్ట మంచు నరనాథుఁడు నందనుఁ గౌఁగిలించినన్.

చ. తగిలినభక్తిఁ దండ్రికి ముదంబునఁ జాఁగిలి మ్రొక్కి హస్తముల్
మొగిచి నిజాంగభూషణసముజ్జ్వలరత్నమరీచిమాలికా
ద్విగుణితరోచులం దనరుతేరు ముదంబున నెక్కెఁ దత్ప్రబో
ధగురువు లైనశంఖలిఖితద్విజవర్యులు సన్నుతింపఁగన్. 141

వ. అనిన విని జనమేజయుండు తరువాతివృత్తాంతం బానతిత్తు
గాక యని యడిగిన. 142

మ. శివరాత్రిప్రమదావలోకనతరస్విక్షోణిభృత్కన్యకా
ధవసేవాసుగ వాలుకాగణనభక్తవ్రాతయాత్రాసము
ద్భవభారాపగమప్రమోదభరదృప్యద్రాజతాహార్యవై
భవలీలాపరపాకశాసన వచగపర్యాయపద్మాసనా. 143

క. వివిధప్రతిదినదానో
ద్భవసాగరఘనతరంగఘట్టసముదయ
న్నవనీహారకణాయిత
లవణేక్షుసురాజ్యదధికలశజలజలధీ. 144

మానిని.—
మీసరగండసమీహితవైరిసమీకజయాతిసమిద్ధయశో
వాసితవాసవవహ్నియమాసురవార్ధిపసన్నరవాహభవా
వాసవిలాసనివారితమన్మథ వారిజభూనిభవాగ్విభవో
ల్లాసవికాసకళామృగలాంఛనలాలితభాస్వదిళామహిళా.

గద్యము. ఇది భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్ర గాదయామాత్యపుత్ర వినయవిద్యాసముద్ర పినవీరభద్రప్రణీతంబైనజైమినిభారతంబునం దశ్వమేధపర్వంబునం జతుర్థాశ్వాసము.



131

శ్రీ

# జైమిని భారతము



## ఆశ్వమేధపర్వము, పంచమాశ్వాసము

వేంకటాద్రినాథద
యావర్ధితరాజ్య సన్నుతార్థిజనమహీ
దేవాగ వైరినృపరా
జీవనికరచంద్ర నారసింహనరేంద్రా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున
కిట్లనియె నవ్విధంబున సుధన్వుండు తండ్రిచేత సేనాధి
పత్యంబు గైకొని. 2

సీ. రథచక్రనేమినిర్గతభూరజోరాజి
వార్ధు లొక్కమ్మడి వారఁబట్ట
బిరుదకాహాళశంఖభేరిరావములు ది
గ్దంతులచెవులు చీఁదఱలు గొలుప
వలమానకేతనోజ్జ్వలవితానశ్రేణు
లాకాశతటినిలోఁ దరసి చూడ
శస్త్రవిక్షేపణోచ్చండస్ఫులింగంబు
లుష్ణాంశురోచుల కుష్మ చూప

తే. సమధికోద్దామసంగ్రామజయపటిష్ఠ
చటుల ఘాటీనిరాఘాటచాతురంగ
వాహినులతోడ నపుడు వెల్వడె నధిజ్య
ధన్వుఁడగుచు సుధన్వుఁ డుత్సాహమునను. 3

క. ఆహంసధ్వజుఁడును గా
తూహలమున సప్తతంతుతురగముఁ బద్మ
వ్యూహంబునడుమ నిడి రణ
దోహలి యై యరుగుదెంచె దోర్గర్వమునన్. 4

వ. ఇత్తెఱంగునం గదలివచ్చునప్పు డెదుర నతిభయంకరారణ్యం బునుం బోలె నుద్దండపుండరీకవిలసద్గజాసహ్యసింహనాదగర్వ దుర్వారభీషణంబును నంతరిక్షంబునుంబోలె నక్షత్రమాలికా శ్లేష రాజహంసశంసనాదభ్రకేతువిభ్రమంబును నంబుజాకరం బునుంబోలె ననేకపక్షిప్రకరవిహారదధికతర వారిపూరితాబ్జ పరాగపటలవారితాశావకాశంబును నంభోధియుం బోలె ననంతవాహినీవిలక్షితసపక్షభూభృత్ప్రేక్షణీయంబును నై వృషకేతనాధిష్ఠితంబయ్యును బ్రద్యుమ్న వైభవాభిరా మంబై సర్వతోముఖసంభ్రమంబయ్యును ధనంజయప్రతాప దర్పితంబై యనల్పకుఠారధరవిహారంబయ్యును ననుసాల్వ భుజావిజృంభణంబై ప్రచండభీషణాశుగంబయ్యును మేఘ వర్ణసముదీర్ఘ వర్ణితం బై వచ్చువివ్వచ్చుసైన్యంబు నాలోకించి యాహవంబునకు మోహరించుసమయంబున. 5

వృషకేతుఁడు సుధన్వునితో యుద్ధముఁ జేయుట

మ. బలముల్ గన్గొని సవ్యసాచి పలుకుం బ్రద్యుమ్నుతో మ
ద్భుజాబల మీతఁడింపుము నీవు నీనృపులు శుంభల్లీలఁ
బ్రత్యర్థులన్ దలరింతుర్ రణభూమి నన్నవారి సేనం గూర్చి
నన్నంపె శత్రులు నాపై లని పల్కఁ జూచి వృషకేతుం
డిట్లనుం గ్రీడితోన్. 6

చ. పుడిసెఁడునీటిచే నడఁగిపోయెడు ధూళికిఁ గాలమేఘముల్
దొడరునె తెప్పవేయఁ జెడుదోమలమీఁద సుపర్ణుఁ డెత్తిపోఁ
గడఁగునె యీసుధన్వరథికప్రభుఁ డెన్నఁగ మీకు నీడుగాఁ
డుడుగుఁడు సంభ్రమం బితని నోర్చెదఁ దెచ్చెద నధ్వరా
శ్వమున్. 7

మ. అని సుత్రామతనూజు వీడ్కొని శతాంగారూఢుఁడై ధూర్త
వర్త్మనిరూఢక్రమచక్రవిభ్రమసముద్యద్విస్ఫులింగచ్ఛటల్
వినువీథిన్ వెదచల్లుచున్ గదియునవ్వీరున్ సుధన్వుండు క
న్గొని కాఁడీతఁడు శక్రసూతి పడగన్ గోరాజువర్తించుటన్.

సీ. అని కర్ణసుతునితో ననఘ నీవంశాభి
జాత్యంబు లెఱిఁగింపు సరవి ననినఁ
గశ్యపమునిగోత్రకర్త నీ వనిలోనఁ
దివిరి యెవ్వాని భేదింపఁ గోరెఁ
దామహాత్ముఁడు మత్పితామహుఁ డాతని
తనయులం దధికప్రదాత శౌర్య
ధనుఁడు కర్ణుండు మాతండ్రి నానామంబు
వృషకేతనుం డన విని యతండు

తే. తగు మధుస్యందనుండు మద్వంశమునకు
గురుఁడు హంసధ్వజక్షమావరుఁడు నాకు
జనకుఁడు సుధన్వుఁ డనుపేరఁ దనరువాఁడ
దొరయు నీకును నాకు సంగర మొనర్ప. 9

మ. అనినన్ గ్రోధకషాయితాక్షుఁ డయి మిథ్యాజల్ప నీవాఁడు
ముల్గొన విచ్చో నని మండలీకృతరణత్కోదండనిర్ముక్త
శస్త్రనికాయంబుల సేనలం గెడపి యంతం బోవ కైదింట
న్నాతనిబాణాసనకేతుసూతరథరథ్యవ్రాతముం ద్రుంచినన్.

మ. అరదం బొండొక టెక్కి విల్లు గొని పంచాస్త్రంబులం గెంటి
భాస్కరపౌత్రుం దెరలించి చాపములుకన్ ఖండించి సైన్యం
బులన్ బురికొల్పన్ వడిఁ జుట్టుముట్టి యతనిం బోనీకయత్యు
ద్ధతిన్, బరిఘాసిక్షురికాకుఠారముసలప్రాసంబులం గప్పినన్.

తే. చిక్కు వడియును మదిఁ జేవ చెడ కతండు
కైటభారాతి హృదయసంకలితుఁ జేసి
యొక్కరథికునిచేతివి ల్లూడిసి తిగిచి
దురము సేయ సుధన్వుఁ డచ్చెరువు నొంది. 12

మ. ఘనశస్త్రం బరిఁబోసి యార్చిబలువీకన్ పక్షమున్ దూఱిపా
ఱ నతం డేసినఁ గర్ణసూతి పెనుమూర్ఛన్ వ్రాలఁ గేడించి చ
య్యన సూతుండు మరల్చెఁ దేరనికిఁ బాయన్ ధీరుఁడై
య త్తఱిన్, గని ప్రద్యుమ్నుఁడు పోరికిం గదిసె దోర్గర్వం
బఖర్వంబుగన్. 13

ప్రద్యుమ్నాదులు సుధన్వునితో యుద్ధంబు చేయుట

సీ. అదలించి నిలు నిలు మని సుధన్వుని నైదు
నారసంబుల నొంచి తేరిహారుల

శరచతుష్కమున వింశతిఖండములు చేసి
నొగ లష్టశకలంబులుగ శిలీము
ఖత్రయం బడరించి కార్ముకం బొకకోల
నటనికిఁ ద్రుంచి యార్చుటయు నతని
కరకౌశలమునకుఁ బరిణమించి పదాఱు
తూపు లొక్కమ్మడిఁ దొడిగి చాప

తే. సారథిధ్వజకూబరాశ్వములఁ గెడిపి
కనలి మఱియును వాఁడు నిర్ఘాతభయద
సాయకత్రితయమునఁ గేశవునిపట్టి
తనువు నొప్పించి సింహనాదంబు చేసి. 14

క. గగనమునకుఁ బక్షులగతి
నెగయుచుఁ బెనఁచుకొని పడి యహిప్రభులగతిన్
జగతిన్ బొరలుచుఁ బాయుచుఁ
దగళ్లచందమున మలసి తాఁకుచుఁ గినుకన్. 15

క. సరి పోరి పోరి మూర్ఛా
పరవశులై రపుడు బాహుబలుఁడు సుధన్వుం
డు రయంబునఁ దెప్పిఱియొం
డురథం బపు డెక్కి వాహినుల సమయింపన్. 16

ఉ. వంచన లేక తాఁకి కృతవర్మ నవాంబకముల్ నిగిడ్చినన్
ద్రుంచె నతండు మూఁడుబలుతూపుల వెండియు నైదుబా
ణముల్, నించె విరోధిపై నవి గణింపక తొమ్మిదికోలలేసి నొ
ప్పించినవాఁడు తేరుదిగి భీతిఁ బలాయితుఁ డయ్యెనయ్యెడన్.

మ. అనుసాల్వుం డెదిరించిపల్కెనిజబాహాటోపముల్ జూపితా
ననిలో రెండుబలంబులుం బొగడ నీయస్త్రంబు సైరింతు వే

గని మెచ్చం దగు నంచు బాడబసదృక్షం బైనభల్లంబు మర్మనిఘాతంబుగ నేయఁ దూల కతఁ డుగ్రస్ఫూర్తిమై నిల్చినన్.

ఉ. వాఁడిమితోడ వెండియు నవారణనెంతయు నాగ్రహించి ముష్మాఁడుశరంబులేయ వడిమూర్ఛిలి తోడనె తేఱి శూరతన్ వాఁ డనుసాల్వుఁ దీవ్రశరవర్షనిమగ్నునిఁ జేసి సేనలన్, బోఁడిమిమాపి యంతకుఁడుబోలె విజృంభణవృత్తిఁ జూపుచున్.

వ. మఱియు నక్కిరీటి సైన్యంబు లెక్కగొనక యుక్కుమిగిలి యక్కజంబుగాఁ జక్కువడం బెక్కునారసంబు లీకసంబునం బఱపినం దారసం బగుచుఁ గోఱప్రాణంబులతోడ సాధోరణంబులుగాఁ దోరణంబులై పడినమత్తవారణంబులును జక్రకూబరయుగపతాకానీకవిశ్లథంబు లగుచు సరథ్యరథికసారథికంబుగా జయశ్రీకథాకథనపథంబు లగుచు వితథంబులై కూలినరథంబులును నీరంధ్రంబుగాఁ దొరఁగునెత్తురుటేఱులఁ దడిసి కెడసిన బిరుదరాహుత్తులకబంధంబులసంబంధంబులు విడువక పెడమరలు బంధురతరస్కంధంబులతోడ శిథిలీకృతసంధిబంధంబులై వసుంధరం బొరలుసైంధవంబులును వెగ్గలం బగునగ్గలిక మొగ్గరంబులు నుగ్గునూచంబుగా నఱికి ప్రగ్గి నిసర్గవిక్రమక్రమానర్గళవీరమార్గంబు గైకొనుపదాతివర్గంబునుం గలిగి విఱిగిపడినకుఱుగడలును విటతాటంబు లైనఖేటంబులును దుండెంబు లైనకండెంబులును దుత్తుము ళ్లయినయత్తళంబులును నలువు లైనమైమఱువులును నందంబు చెడినచిందంబులును నాభీలంబు లగుసమరభూభాగమధ్యంబున నిట్టవొడిచి తెట్టువలు గట్టు

నట్టులతోడం గట్టువిసి పఱచురుధిరప్రవాహంబులు ధాతు
మయధరిత్రీవివరంబున సగరకుమారులపై బహుముఖంబు
లం బ్రవహించు భాగీరథిఁ విడంబించె నాసమయంబున. 20

శా. శైనేయుం జెదిరించిన న్నిశితశస్త్రంబుల్ సుధన్వుండు తో
డ్తో నాటింప నశీతిబాణముల వాఁడుర్వీ క్రుద్ధుండై తద్రథా
జానేయధ్వజసూతులం దునిమెఁ బెల్చన్ వానితే రాతఁడ
స్త్రానీకంబులఁ గూలిచె న్విరథులై రట్లిద్దఱుం బోరిలోన్.

తే. వేఱయరదంబు లెక్కి యవ్వీరవర్యు
లసము డింపక పోరి నాగాస్త్రనిహతిఁ
దొరఁగుశోణితములఁ దొప్పదోఁగి యచటఁ
బుష్పితాశోకములరీతిఁ బొలుపుమిగిలి. 22

ఉ. సాత్యకిపై సుధన్వుఁడు ప్రచండభుజాబలవైభవోన్నతిన్
మృత్యుకరాళదంష్ట్రఁ బురుడించుభయంకరశక్తి వైవ నౌ
ద్ధత్యము దక్కి వ్రాలె వసుధాస్థలి నంతఁ గిరీటి శత్రులో
కాత్యయగర్వరేఖ మెఱయం దగ నాతనిఁజూచి యిట్లనున్.

## అర్జునుఁడు సుధన్వునితోఁ బోరుట

మ. గురుభీష్మార్కతనూభవాదులమహాకోదండవిద్యాధురం
ధరపాండిత్య మెఱింగినాఁడ భవదుద్యత్సంగరక్రీడకున్
సరిగా దన్న నృపాలసూనుఁ డను నస్మద్బాణసంధావిశే
షరహస్యంబులు నీవ చూచెదిఁక వాచాలత్వ మిం తేటిన్.

తే. కృష్ణసారథ్యమున మున్ను గెలుపు లొనవెఁ
గాక యిట్లొంటి వచ్చినఁ గలదె జయము
అతఁడు తోడైనఁ బట్టినహయము విడువ
నశ్వమేధంబు మాతండ్రి కర్హమగుట. 25

మ. అనినన్ బార్థుఁడు నూఱుబాణములు బిట్టల్కన్నిగుడ్పన్ రయం
బున వాఁ డన్నియుఁ ద్రుంచి వైచి పదితూపుల్మేనఁ
గీలించి నవ్విన నవ్వీరుఁడు మార్గణావళుల దోర్విక్రాంతిఁ
జూపన్ రణంబు నభోభాగము నాతఁ డస్త్రవితతిన్ ముంచె
న్విచిత్రంబుగన్. 26

శా. ఆయోధాగ్రణిపై నరుండు కినుకన్ హాలాహలార్చిశ్ఛటా
దాయాదోత్కటకీలలం దిశలు నిర్దగ్ధంబు గావించునా
గ్నేయాస్త్రం బడరింప వాఁడు విలుత న్నిర్ఘాతకల్పాంబుద
చ్ఛాయావిభ్రమగర్భితం బయినపర్జన్యాస్త్ర మేసె న్వడిన్

క. మెఱపులు దఱచుగఁ బెళపెళ
నుఱుముచు వడగండ్లతోఁ బయోధారలు పె
న్వఱదలుగా నెల్లెడఁ జి
చ్చఱపిడుగులతోడ వాన జడిగొని కురియన్. 28

క. జల్లెడలును బక్కెరలును
బల్లంబులు జోళ్లు నాతపత్రాదులు న
వ్వెల్లిఁ బడి కలిసి మిఱ్ఱును
బల్లము నొక్కటిగఁ బొరలి పాఱఁగఁ దొడఁగెన్. 29

క. వాయవ్యాస్త్రంబున నపు
డాయింద్రతనూభవుఁడు తదాశుగ మహిమన్
మాయింప నతఁడు భీషణ
సాయకమున నరునితేరిసారథిఁ దునిమెన్. 30

ఉ. వెండియు వాఁడు తీవ్రశరవేదనఁ జూపుచుఁ దూఱనాడ నా
ఖండలసూతి యప్డు పెనఁగంబడురథ్యములన్ మరల్పఁగా

నొండువిధంబు గానక పయోరుహనేత్రుసమస్తవేదవేద్యుం
డగుకృష్ణునిం దలఁపఁ దోడనె సన్నిధి యయ్యె నయ్యెడన్.

సీ. అక్లేగుదెంచిన హరికిఁ బ్రణామంబు
గావింపఁ బార్థుని గారవించి
మలగొన్న తేరివాజులఁ బగ్గములచే బి
గించి సారథ్య మంగీకరింపఁ
గని సుధన్వుండు ఫల్గున నీకు నిబ్భంగి
నబ్జనాభుండు సహాయుఁ డయ్యె
నంపపోకడ చేయునాహవం బేటికిఁ
బ్రతిన పట్టుము నిల్చి బంటవైన

తే. ననిన విశిఖత్రయంబున నవనిఁ గూల్తు
నీశిరం బట్లు చేయకుండిన మదీయ
పూర్వజులు పుణ్యహీను లై భూరినిరయ
కూపబాధలఁ బొరలి వేఁగుదురు గాక. 32

చ. అన విని యాతఁ డిట్లను రయంబున నీ వడరించుబాణముల్
తునుముదుఁద్రుంపకున్న ఘనదుర్గతి పాటిలుఁ బుణ్యసంపదల్
దనుజసమాహృతంబు లగుఁ దప్పినవాఁడను విశ్వనాథున
ర్చనల కరుంధతీరమణుఁ జంపినవాఁడఁ ద్రివాచికంబుగన్.

మ. అనుచున్ గాంచనపుంఖబాణశతకం బబ్జాక్షువక్షంబునన్
జొనుపన్ దద్విశిఖచ్ఛదప్రభవదుచ్ఛ్వానోగ్రవాతూలవ
ర్తనసంరంభమునన్ బిఱిందికి రథోత్తంసంబు విభ్రాంతమై
చనియె న్గిష్కుచతుశ్శతంబు విదళచ్ఛాత్త్రారఘోరంబుగన్.

క. అమ్మాధవార్జునులఁ బెను
దుమ్ము పొదుగ రథము దిరుగఁ దొడఁగెఁ దడవుగా

బొమ్మరము తిరుగునురవడిఁ
గుమ్మరిసారె గుడి దిరుగుకొనెడు విధమునన్. 35

వ. ఇత్తెఱంగునం బరిభ్రమించురథంబు రయంబునం గుదియం
బట్టి కృష్ణుండు క్రీడి నాలోకించి. 36

ఉ. తీవ్రశరప్రకాండములఁ దేరు విఘాతముగా నొనర్చె వీఁ
డవ్రణశౌర్యశాలి యగు టారయ కాడితి వాడినం బ్రతి
జ్ఞావ్రతహాని కాని కొనసాఁగుట దుస్తర మీతఁ డేకపత్నీ
వ్రతుఁ డౌటఁ జేసె నది నీకును నాకు నశక్య మెమ్మెయిన్.

క. అన విని నీకృప గలుగం
గ నిదెంతటి కార్య మనుచుఁ గవ్వడి శరమే
ర్చిన నపుడ యునిచె గోవ
ర్ధన మెత్తినఫలము శౌరి తత్కాండమునన్. 38

శా. ఆకాలానలఘోరసాయకము సాహంకారుఁడై పార్థుఁ డ
స్తోకప్రౌఢిమ నేసినం గినిసి తద్దుర్వారసంధాకథా, వైకల్యం
బుగఁ ద్రుంచి యాతనిపయిన్ వాఁ డుగ్రుఁడై మార్గణా,నీ
కంబుల్ పరఁగించె వెండియు సమున్నిద్రప్రతాపోన్నతిన్.

తే. అమ్మహాసాధనము భగ్న మైనఁ గ్రీడి
యొండు బాణంబు దొడుగ నుద్యుక్తుఁడైన
నంబుజాయతనేత్రుఁ డీ నవధరించెఁ
దచ్ఛరమునకు విశ్వభూదానఫలము. 40

క. గాండీవజ్యారావము
లొండొండ చెలంగ నమ్మహోగ్రవిశిఖ మ
ప్పాండవమధ్యముఁ డేసిన
ఖండించె నతండు దివిజగణము నుతింపన్. 41

—— అర్జునుఁడు సుధన్వుని దృతీయశరంబుచే ఖండించుట ——

వ. ఇవ్విధంబున శరద్వితయంబు వితథంబై పోయినం బురుహూతనందనుండు డెందంబునం గ్రందుకొను నచ్చలంబు పెచ్చు పెరుఁగ విలయమార్తాండమండలంబు వేఁడిమిం గ్రేణిసేయు మూఁడవబాణంబు తూణంబునం దిగుచునప్పుడప్పుండరీకలోచనుం డాత్మీయతేజోవిశేషంబును రామావతారసంచితం బగు సముంచితపుణ్యఫలంబును దత్ఫలంబునం బ్రతిష్ఠించె నంతకమున్న రంభాద్యప్సరోగణంబును వాసవప్రముఖనిఖిలగీర్వాణలోకంబును వీరసంహారణరణవిలోకనకౌతుకంబున విమానంబు లనూనగగనంబునందు నుముకొని వచ్చి యితరేతరవిజయసందేహనిగుంభనంబగు ప్రతిజ్ఞాసమరవిజృంభణంబున హర్షాద్భుతభయానకంబులు మనంబులం బొదల నంతరిక్షంబునం గనుంగొను చుండి రాసమయంబున.

మ. నరుఁ డాయుగ్రశిలీముఖంబు పటుసంధానక్రియాచాతురీ
గరిమన్ దార్కొని మింట మంట లడరంగా నేసినం జూచి
వాఁడరదోర్గ్రీవం దెగ నేసె నేయ వృథగాకయ్యుగ్రఖండంబు
భీకరలీలం బఱతెంచి బిట్టురవడిన్ ఖండించెఁ దద్గ్రీవమున్.

క. శిర మటు దెగి హరినామ
స్మరణము చేయుచును దనసమక్షమునఁ బడన్
బరికించి చూచె దానవ
హరుఁ డత్తేజంబుఁ గలసె నవ్విభునందున్. 44

తే. కంసమర్దనుఁ డమ్మ స్తకంబు వైచె
హంసకేతనుమ్రోల వాఁ డది గనుంగొ
ని దళమగుపుత్రశోకంబు నివ్వటిలఁగఁ
బొగిలి యందంద బహువిధంబులను వగచి. 45

క. మరలఁగఁ దన్మూర్ధము శ్రీ
వరునిపదాబ్జములు గదియ వైచిన నతఁ డం
బరమునకై నిగిడించినఁ
దిరుగక యది యంతలో నదృశ్యం బయ్యెన్. 46

క. అంత సుధన్వునిపాటున
కెంతయు వెఱఁగంది సురథుఁ డెడపడనిసుత
భ్రాంతిఁ బలవించుజనకుని
సంతాపం బుడుపఁ జేరఁ జని యిట్లనియెన్. 47

క. శూరుల కాహవమరణం
బారయ శోభనము వగచు టనుచితము రణ
ప్రారంభవేళఁ దగునే
ధీరతఁ గైకొనక యింతదీనతఁ బొరయన్. 48

చ. అనుపుము నన్ను నిప్పు డభియాతిబలంబులఁ జుట్టుముట్టి
మా, ర్కొనినబలంబులన్ గనుపుగొట్టెద మాధవుప్రాపునన్
సుధ,న్వునిఁ బొరిగొన్న వాసవతనూభవుఁ దాఁకెద నా కె
దిర్చి ని,ల్చిన ననుజన్మసూదు మరలించెద దిక్కులఁ గీర్తి
నించెదన్. 49

క. అని పలికి పెక్కుభంగుల
జనకుని నూరార్చి బహుళశస్త్రమరీచుల్

గనుపట్టి వెలుఁగ సురథుఁడు
చనియె రథారూఢుఁ డగుచు సమరోన్ముఖుఁ డై. 50

**సురథుం డర్జునునితో యుద్ధముఁ జేయుట**

క. పుంఖానుపుంఖనృహారి
ప్రేంఖద్వికటాట్టహాసభీషణ రేఖా
రింఖణచటులారభటి
న్నంఖముఁ బూరించి సింహనాదము చేయన్. 51

చ. సురథునిరాక చూచి మధుసూదనుఁ డిట్లనుఁ బార్థుతోడ ని
ష్ఠురలయకాలభైరవునిచొప్పునఁ గ్రాలుచు నున్నవాఁడు ని
ర్భరగతి వీని మార్కొనఁగ బ్రహ్మకునైన వశంబు గాదు నేఁ
డురవడికిం దొలంగి విజయోన్నతి గాంచుట మేలు పిమ్మటన్.

క. అనఘుఁడు సత్త్వమె రూపై
జనియించినవాఁడు వీఁ డసాధ్యుం డీవే
ళను బ్రద్యుమ్నాదుల నిట
నునిచి మనము కెళవు దొలఁగి యుండుద మనుచున్. 53

క. పరబలముమీఁద సేనలఁ
బురికొల్పెడువాఁడపోలెఁ బొద వెట్టుచు న
మ్మురవైరి దలుముకొని చనె
నరద మపుడు యోజనత్రయం బెడ గలుగన్. 54

వ. అప్పుడు. 55

క. వడి నేగుదెంచి సురథుఁడు
పిడుగులగమికంటె మిగుల బిలు సగుశరముల్

జడి గొలిపి తద్బలంబుల
మడియింపఁగఁ జొచ్చె మారిమసఁగినభంగిన్. 56

ఉ. కూలినభద్రనాగములుఁ గుప్పతిలంబడుతేరులుల్ ధరన్
వ్రాలెడుఘోటకంబులు నవారణ మ్రగ్గెడువీరయోధులున్
రాలినశస్త్రఖండములుఁ గ్రమ్మెడురక్తనదంబులున్ సముద్వేల
ముగా రణంబు గణుతింప భయంకర మయ్యెఁ జూడ్కికిన్.

క. ఒదుఁగువడ యోజనత్రయ
ము దలం బగువిమతసైన్యముల నీరీతిన్
మద మడఁచి కృష్ణపార్థుల
నెదురం బొడగాంచి సురథుఁ డిట్లని పలికెన్. 58

తే. కృష్ణ నీపుణ్య మంతయుఁ గ్రీడి కొసఁగి
పిదప నిట్లు సుధన్వుఁ జంపింపఁ దగునె
పడుచుపని చేసితివి రేఁగుఁబండ్లకొఱకు
ముత్తియంబులు వెలపోయుములుచ కలఁడె 59

క. గోవింద నిన్ను ధర్మద
యావిందుం డనుచు లోకు లాడఁగ విందున్
నీ విందు సుధన్వునినెడ
సావిందుని మించి తెందు సాగెద వనుచున్. 60

ఉ. కాండపరంపరల్ నముచిఘస్మరసూతిపయిన్ నిగుడ్చ నా
తం డెడఁ ద్రుంచి వాని నిశితప్రదరంబులఁ గప్పుచున్ ధను
ర్దండరథాశ్వసూతబిరుదధ్వజముల్ పొడి చేసె నంత వాఁ
డొండురథంబుఁ గైకొని సముద్యతసజ్యకఠోరచాపుఁ డై.

ఉ. అక్కమలాక్షపార్థుల రథాశ్వయుతంబుగ బాణరాశిలోఁ
జిక్కుపడంగఁ జేసె నవి చిత్రముగాఁ దునుమాడి క్రీడితో

నుక్కన వానితేరు దివి కుప్పర మెత్తుకపోవ నేసినన్
రెక్కలతోడి మేరుశిఖరిం దలఁపించె నిలింపకోటికిన్. 62

క. నరుని శరాసనవిద్యా
కరకౌశల మరుదు చెప్పఁగా నిమిషములో
సురథునిగాఁ గొనిపోయెను
సురథునిఁ దద్బాణరాజి సురథుని మోవన్. 63

మ. సురవర్త్మంబున నిల్చి వాఁడు భువనక్షోభంబుగా నొక్కభీ
కరబాణం బడరింపఁ బార్థునకు నుత్కంపంబు వాటిల్ల ది
ర్ధిరయంచుం బిడిసానచందమున ధాత్రీభాగముఁ గ్రొచ్చె
న, య్యరదం బారభసంబు మానుపఁగ లేఁ డయ్యెన్ మురా
రాతియున్. 64

క. కరువలిసుతుఁ డయ్యెడ బి
ట్టురవడిఁ గేతనము డిగ్గ నుఱికి బిగియ బం
ధురవాలంబునఁ బెనఁచియు
నరదము పెకలింపనోప కవశుం డయ్యెన్. 65

ఉ. క్రమ్మఱఁ గంకపత్రవిశిఖమ్ములు బి ట్టడరింపఁ దత్ప్రతా
పమ్ము సహింపలేక మురభంజనుఁ డర్జునువంకఁ జూచి నీ
కిమ్మెయి నూరకుండఁ జనునే యనినం దెలివొంది బాణజా
లమ్ముల వానితేరు శకలమ్ములుగాఁ దొరఁగించె మేదినిన్. 66

క. సురథుం డీచందమున
న్విరథుం డై మాధవాంజనేయులచేతన్
దెరలింపరానిపార్థుని
యరదముఁ బెకలించి పట్టి యపు డి ట్లనియెన్. 67

చ. చదువుదు నే ధరం గెడపి సాగరముల్ గడపంగ వైతు నే
చెదరఁగ హస్తినాపురికిఁ జిష్ణుదు నే యని ఘాత చేసినన్
బ్రదరము లైదిటన్ సురథుఁ బాండుతనూజుఁడు నొంప
వాఁడు చే, వదలి విసంజ్ఞుఁడై ధరణి వ్రాలి రయంబునఁ దేఱి
యంతటన్. 68

క. సారథి వెసఁ గొనివచ్చిన
తే రతఁ డవలీల నెక్కి తీవ్రశరంబుల్
ధారాళంబుగఁ బఱపుచుఁ
బౌరందరితోడఁ బోటుపంతము గొసరన్. 69

క. నినుఁ దలద్రుంపుదును భవ
జ్జనకుఁడు చూడంగ నిదియ శపథం బన నీ
తనువు ధరఁ ద్రెళ్ళ నేయుదు
ననుమానము లేదు సత్య మాడితి ననుచున్. 70

చ. అతఁడు కిరీటి శస్త్రనివహంబుల నొంచినఁ ద్రుంచి వానిపై
శితశరజాలముల్ నిగుడఁ జేసిన నాసురథుండు రోషరం
జితవదనాబ్జుఁడై నరుని శింజినిఁ ద్రెవ్వఁగ నేయ నాహవో
ర్జితమతి నొండునారి సవరించి రథం బిలఁ గూల నేసినన్. 71

ఉ. ఒక్కశతాంగ మాతఁడు సముద్ధతిఁ గైకొని మోహరించినం
జెక్కలువాపెఁ బార్థుఁ డదిచీరికిఁ గైకొన కొండుతేరు వాఁ
డెక్కినఁ గ్రమ్మఱం దునిమె నింద్రతనూభవుఁ డివ్విధంబునన్
దక్కక నూటయెన్మిదిరథంబులు రూపఱఁ జేసెఁ జేసినన్. 72

తే. విరథుఁ డయ్యును సురథుండు విపులచాప
హస్తుఁడై తూణమున బాణ మందుకొనఁగ

నలుక రెట్టింప నర్ధచంద్రాశుగమునఁ
గ్రీడి దునుమాడె నతనిదక్షిణభుజంబు. 73

సీ. అట్లు ఖండితబాహుఁ డయ్యును శౌర్యంబు
వదలక డాకేల గద యమర్చి
తెగువ జాళంబులు ద్రిప్పుచుఁ బఱతెంచి
గాండీవితేరి యుగ్యములఁ జంపి
వేదండముల రెండువేల నుక్కడఁగించి
కడఁక నన్నియ శతాంగములఁ జదిపి
వీరయోధులఁ బదివేవుర మడియించి
యన్నియుహరుల రూపడఁగఁ జేసి

తే. సమరమధ్యంబునను సాహసంబు మెఱసి
సింహనాదంబు చేసి నిల్చినఁ గిరీటి
జిహ్మగముఁ గ్రేణిసేయునజిహ్మగంబు
దొడిగి గదతోడిభుజమును దునుఁగ నేసె. 74

సురథుం డర్జునునిచేఁ జచ్చుట

క. ఈ రీతి నతఁడు శస్త్రవి
దారితభుజుఁ డయ్యు నుద్ధతము లాడుచు రాఁ
గా రెండుపాదములు నొక
నారసమునఁ ద్రుంచి దారుణాం బగునలుకన్. 75

మ. నగభిన్నందనుఁ డుగ్రమార్గణము వింటన్ గూర్చి యేయన్
బ్రభాస్థగితాజాండకటాహమై చని వడిన్ దత్కంఠ మున్
ద్రుంచినన్, దెగి యమ్మూర్ధము దారుయంత్రశిలభాతిన్ బార్థు
మస్తంబు బిట్టగలం దాఁకిన రిమ్మ వట్టి వివశుండై వ్రాలె
నమ్మేటియున్. 76

తే. అవనిపై నట్లు మూర్ఛితుం డైననరునిఁ
దేర్చి దనుజాంతకుఁడు ప్రమోదించుచుండ
నపుడు సురథునిశిరము తదంఘ్రియుగళిఁ
గవిసి నెత్తమ్మిమీఁదిషట్పదముఁబోలె. 77

వ. ఇత్తెఱంగున నిజపదంబుల నత్తమిల్లినసురథునియుత్తమాంగంబు మెత్తమెత్తన శౌరికరపల్లవంబుల నెత్తి ధనంజయుం గనుఁగొని యితం డుదాత్తచరిత్రుం డత్యయంబు నొంది యును సత్యవ్రతంబు నిత్యంబుగా విహరించినయుత్తమ శ్లోకుండు కావున నిఖిలలోకవందనీయుం డనిన సంక్రందన నందనుండు పరమానందంబున నందుకొని తచ్ఛిరంబునకు వందనం బాచరించె నంత నమ్మురాంతకుం డప్పార్థివనందనుం గృతార్థుం జేయ నూహించి వైనతేయుం దలంచిన. 78

శ్రీకృష్ణుఁడు గరుత్మంతుని రప్పించుట

మ. అరుదెంచెన్ వినతాతనూజుఁడుసముద్యత్ప్రావృడారంభని
ర్ఝరజీమూతఘటాంతరాళవిచలద్రాఘిష్ఠవిద్యుల్లతా
పరిపంథిప్రథమానదీధితినటత్పక్షానిలాఘాతజ
ర్జరితోడ్డీనకులక్షమాధరదృషజ్ఝంపాకళాసంపదన్. 79

ఉ. ఈగతివచ్చిమ్రొక్కినను పేంద్రుఁడు కాశ్యపి నాదరించుచున్
వేగమ యీశిరంబుగొని వేయుప్రయాగమునన్ద్రివేణికా
యోగవశంబునన్ సురథుఁ డుత్తమలోకముఁగాంచునన్న న
న్నాగవిరోధి యిట్లనియె నందకపాణికి భక్తిపెంపునన్. 80

తే. ఆత్మ నినుఁ జెందఁ గైవల్య మనఁగ నెద్ది
ధన్యుఁ డితనికి నేల తీర్థములగోడవ

రైన నీయాజ్ఞ దాఁటరా దనుచు మ్రొక్కి
శిరము గొంచును దివి కేగె గరుడుఁ డపుడు. 81

క. ఆవేళ నంబికాయుతుఁ
డై వృషభేశ్వరుని నెక్కి యంబరవీథిన్
బోవుచు గరుడుని నీల
గ్రీవుఁడు వీక్షించి భృంగిరిటి కిట్లనియెన్. 82

క. సురధునితల గరుడుఁడు గొని
యరిగెడుఁ దె మ్మనిన నాతఁ డచటికిఁ జని త
ద్గరుదనిలాహతి సుడివడి
సురగాలిం బడిన చొప్పచొరుగును బోలెన్. 83

క. ఈచందమునఁ బరాజితుఁ
డై చేవ దొలంగి వచ్చు నాప్రమథవరున్
జూచి వెడ నగుచు గుబ్బలి
రాచూలి ట్లనియె భోగిరాట్కటకునితోన్. 84

ఉ. భృంగి తలంపఁగాఁ బరమభృత్యుఁడు నర్మసఖుల్ పిశాచముల్
కంగటికాలు నమ్మఁదగుకైదువు రక్షలు శల్యఖండముల్
జంగిలిగిబ్బ వారువము సర్వము నీగతి నెన్ని చూచినన్
మంగళ మేమి బ్రాఁతి పురమర్దన నీకెపుడున్ జయోన్నతుల్.

మ. అనినన్ బార్వతిఁజూచి నవ్వుచు శివుం డామూర్ధమున్ గొం
చు రమ్మనిశైలాదకి నానతిచ్చిన నతం డట్లేగి పక్షీంద్రునిన్
గని రోషస్ఫురణంబు దీటుకొన హుంకారంబు గావింపఁ ద
ద్ఘనవాతాహతిఁదూలెనాతఁడు త్రిలోకవ్యాప్తి సంధిల్లఁగన్.

చ. ప్రమథవరుండు వెన్కొన సుపర్ణుఁడు నిల్వఁగ నూఁత లేక ది
గ్భ్రమణము చేసిచేసి నిజభాగ్యవశంబునఁ దోఁచినం బ్రయా

గమున శిరంబు వైవ నది గైకొని యాతఁడు తెచ్చి యిచ్చి
నఁ, శమనవిరోధి యందుకొని శైలతనూభవతోడ నిట్లనున్.

క. శూరులు ధర్మచరిత్రులు
దారులు విజితేంద్రియులు కృతజ్ఞులు జగదా
ధారు లని వారిశిరములు
హారంబులుగా ధరింతు ననవరతంబున్. 88

వ. అని యానతిచ్చి యప్పరమేశ్వరుండు సురథునిశిరంబు రుండ
మాలికామధ్యంబున నాయకరత్నంబుగా నవధరించి నిజే
చ్ఛం జనియె వైనతేయుండునుం దద్వృత్తాంతం బంతయు
మురాంతకున కెఱింగించి చనియె నంత. 89

మ. సుతు లవ్యాహతశక్తిఁ జేర్చి సమరక్షోణీస్థలిన్ వ్రాల నప్రతి
మాటోపవిజృంభమాణుఁ డయి భూభాగంబు కంపింప ను
ద్ధత సైన్యంబు లసంఖ్యముల్ గొలువ మాద్యల్లీలహంసధ్వజ
క్షితిపాలుం డరుదెంచెఁ బోరికి భుజోత్సేకంబు సంధిల్లఁగన్.

## హంసధ్వజునితో నర్జునుఁడు స్నేహము సేయుట

చ. గురుతరశక్తి నాలమునకుం దమకించెడువానిఁ జూచి సు
స్థిరకరుణాతరంగితమతిం గమలాక్షుఁడు తేరు డిగ్గి రా
నరపతియున్ రథావతరణం బొనరించెదు రేగుదెంచినన్
హరి తగ నూఱడం బలికి యాతనిఁ గౌఁగిటఁ జేర్చి యిట్లనున్.

తే. జననమరణాదిదుఃఖముల్ సకలజీవ
లోకమున కెందు నొఱయఁ గల్గుట యెఱింగి
కాలగతి నైన పుత్రశోకంబు నూఁది
వసుమతీనాథ తగ దింత వంత యనిన. 92

క. ఆవిభుఁ డిట్లను దుఃఖం
చేవలనను గలుగనేర దిహపరసౌఖ్య
శ్రీవిభవంబుల కెల్లను
దావకసందర్శనము నిదానం బగుటన్. 93

సీ. అనిన గోవిందుఁ డిట్లను మహీధవునితో
నధిప నీతోడిసఖ్యంబు మాకు
దొరకె నీవాప్తబంధుఁడవు పాండుతనూ
పాలనందనులు నాప్రాణ మగుటఁ
దెలిసి యీయజ్ఞసప్తిపిఱుంద నఖిలసే
నాసమన్వితుఁడవై నరునిఁ గూడి
చని ధర్మసూతి కుత్సవముగా నిటమీఁది
పని నిర్వహింప నీభార మనుచు
తే. హంసకేతనుఁ బ్రియమార నాదరించి
యతనిచేఁ బూజ్యమానుఁడై యర్హభంగిఁ
దత్పురంబునఁ బంచరాత్రములు నిలిచి
వనజనాభుండు హస్తినావతికి నరిగె. 94

ఉ. అంత మరాళకేతుఁడు ప్రయత్నమునన్ గదలింప భూరివి
క్రాంతగతిన్ గుబేరుదెసగాఁ దురగం బటు పోవుచున్ బథ
శ్రాంతి వహించి దప్పి గదురన్ వెడ సాగెడుచో సుమావనా
భ్యంతరసీమ నొక్కజలజాకరముం గని డాయఁ బోవుచున్.

యజ్ఞాశ్వము గోడిగయై వ్యాఘ్రరూపముఁ దాల్చుట

క. సలలితమణిసోపాన
స్థలములుగా డిగ్గి కంఠదఘ్నముగ జలం

బులు గ్రోలి తనిసి వెలువడి
కొలనిసమీపమున నిలిచి గోడిగ యయ్యెన్. 96

క. క్రీడి వెఱఁగంది కనుఁగొనఁ
గేడించుచు నొండుదొరవికిం జని యచటన్
జూడ భయంకర మగుచును
గోడిగ తద్రూప ముడిగి క్రొల్పులి యయ్యెన్. 97

క. అన విని జనమేజయుఁ డి
ట్లను జైమినితోడ నంబుజాకరయోగం
బున హయము తురగి యెట్ల
య్యెను శార్దూలంబు పిదప నేగతి నయ్యెన్. 98

వ. అనిన నమ్మునీంద్రుండు నరేంద్రున కిట్లనియె. 99

మ. ధరణీనాయక శంభునిం గుఱిచి యద్దాక్షాయణీకన్య తత్స
రసీమధ్యమునం దపంబు ఘననిష్ఠం జేయ నక్తంచరేశ్వరుఁ
డొక్కండు మదాంధుఁడై చెనకినన్ శర్వాణి తద్దైత్యుఁ జె
చ్చెరఁ గ్రోధాగ్ని శిఖాకలాపముల భస్మీభూతునిం జేయుచున్.

క. ఈజలజాకర మిది మొద
లేజంతువు చొచ్చి వెడలు నెడపక పుంస్త్వం
బోజచెడి యాఁడురూపం
బై జగతిఁ జరించు నంచు నంబ శపించెన్. 101

క. దేవివచనం బమోఘము
గావునఁ దురగమున కట్టిగతి వాటిల్లెన్
భూవర విను మది బెబ్బులి
యై విహరించినవిధంబు నవధానమునన్. 102

సీ. పొగడొందుకృతయుగంబున నకృతవ్రణుం
డగుమౌని తీర్థయాత్రాభిరతిని
సకలపుణ్యాశ్రమస్థలములఁ గలనదీ
నదముల నవగాహనం బొనర్చి
వచ్చుచోఁ దత్సరోవరముఁ గన్గొని భక్తి
నఘమర్షణస్నాన మాచరింపఁ
గా నందు నొకమహాగ్రాహ మాతనిపాద
కమలంబు బలువుగాఁ గఱచి తిగువఁ

తే. గళవళించుచు మకరంబుగా నెఱింగి
పెనఁగి విడిపించుకొని పోవుచును మునీంద్రుఁ
డిదిమొదలుగాఁగ నేజంతువిందుఁ జొచ్చు
నది మహావ్యాఘ్రిమగుఁగాక యని శపించె. 103

క. నరనాథ యివ్విధంబునఁ
దురగము పులి యైన విధము దోఁచక నరుఁ డం
బురుహాక్షుఁ దలఁప నవ్విభు
కరుణన్ వ్యాఘ్రంబు ఘోటకం బయి నిలిచెన్. 104

స్త్రీమండలవృత్తాంతము

ఉ. ఆయెడ వాద్యభాంకృతు లహంకృతి మీఱ సమస్తవాహినీ
నాయకకోటితోడుత ధనంజయుఁ డుత్సవమంద నశ్వమే
ధీయహయంబుమారుతగతిన్ బహుదేశము లంతరించుచున్
మాయనివేడుకన్ యువతిమండలమున్ గదిసెన్ సమున్నతిన్.

ఉ. అందలిముఖ్యనాయిక మృగాక్షి ప్రమీల యనంగ నొక్క
రా,కేందునిభాస్య యత్తరుణి కెన్నఁగ నొక్కొకలక్షవారణ

స్యందనఘోటకంబు లది సాహసవృత్తిఁ బ్రతాప మెల్లెడన్
గ్రందుకొనం జరించు వృషకన్యక లిమ్ముల నంగరక్షగాన్.
మ. సరసాలాపవిలాసవిభ్రమకళాసౌభాగ్యరేఖామనో
హరకేళీపరిరంభణక్రియల నాహ్లాదంబు పుట్టించి నిర్భరపుం
బ్రేమ వశీకరింపుదురు తద్భామాజనుల్ పాంథులన్, సురత
ప్రౌఢివిహారవైభవములన్ జొక్కించి చిక్కించుచున్. 107
క. ఈసరణిఁ గామతంత్రా
భ్యాసపరిశ్రాంతి మిగులఁ బరవశ మైనన్
నాశిలి ధాతుక్షయ మై
మాసములోపలన వాఁడు మరణము నొందున్. 108
తే. తోడగతి చేయుదురు వానితో రమించు
కాంత లందఱు నందోర్థ్వ గర్భ మైన
నిలుచు నమ్మానవతికి జన్మించెనేని
కొడుకు గానేరఁడెపు డాఁడుఁపడుచ కాని. 109
క. ఇవి యాదేశచరిత్రము
లవనీశ్వర యధ్వరాశ్వ మవ్విధమున నా
యువతిజనపురసమీపో
పవనాంతరములకు మేఁతఁబడిఁ జరియింపన్. 110
సీ. నెలవంక బొమలకుఁ దలఁకి మ్రొక్కుచునున్న
పగిది నానమితచాపములు మెఱయఁ
గలికిచూపులకు భీతిలి డాఁగి నిలిచిన
కైవడిఁ బొదుల మార్గణము లమరఁ
గుచమండలములఁ గన్గొని భయం బందెడు
రీతిఁ జక్రములు పరిభ్రమింప

నలువొందురోమావళులకుఁ గాక వడంకు
కరణిఁ బట్టెంబులు కంప మొంద
తే. వీరశృంగారములు మేళవించినట్టి
చెలువమున నిందుముఖులు తేజీల నెక్కి
వచ్చి రాహవ మొనరింప వారిలోనఁ
బడఁతి యొక్కతె మున్నాడి పోలుతెంచి. 111

ప్రమీల యర్జునుతో యుద్ధముఁ జేయుట

ఉ. ఆమఖవాజిఁ బట్టి యసహాయమునం గొనివచ్చి తా నిజ
స్వామినిపంపునం దురగశాలకు నప్పన చేసె నంత నుత్రామర
సేక్షణల్ హయవతంసముఁ బట్టిన నాగ్రహించి సుత్రామ
తనూభవుండు సమరంబున కుద్యతుఁ డయ్యె నయ్యెడన్.

క. భూరితురంగమరథమద
వారణములతోడ సతు లవారణఁ గొలువం
బోరికిఁ బ్రమీల గదిసి గ
భీరగుణారావ మడర భీకరభంగిన్. 113

చ. శతమఖసూతిపై వివిధసాయకముల్ నిగిడించి యొక్కవ
జ్రతులితబాణఘట్టన సురస్థలి నొంచినఁ గ్రీడి మార్గణ, త్రిత
యము వానిమీఁద నడరించినఁ దోడనె త్రుంచె నంతలో
నితరవధూటులుం దెరల నేసిరి తక్కినవీరయోధులన్. 114

క. ఈరీతి నుభయబలములుఁ
దారసమునఁ బోరునెడఁ బ్రతాపము మెఱయం
గా రమణీమణి మధురవ
చోరచన తలిర్ప నింద్రజున కిట్లనియెన్. 115

చ. కనుఁగొని నన్ను నాహవముఖంబున మార్కొనినిల్వ నీక కా
దనిమిషసిద్ధసాధ్యులకు నైన నసాధ్యము కార్యకాంక్ష నె
మ్మనమునఁ గల్గెనే దురభిమానము మాని ప్రియం బెలర్ప న
న్నెనసిన వేడ్కతోడ వరియింపు హయంబుఁ బరిత్యజించెదన్.

తే. సోమపానంబు నీయగ్రజుం డొనర్చి
యిష్టఫలభోగములఁ బొందనిమ్ము నీవు
నిట మదీయాధరామృతం బెలమిఁ గ్రోలి
యువతిమండలమున కెల్ల నొడయఁ డగుము. 117

చ. అనిన ధనంజయుండు దరహాసమనోజ్ఞముఖారవిందుఁ డై
వనిత నిను న్వరించిన నవశ్యముఁ జచ్చు. నరుండు చచ్చి య
మ్మనుజుఁ డధోగతిన్ యువతిమండల మేగతి నేలు ధర్మనం
దనునకు నెవ్వ రీహయవతంసముఁ జేర్చెదువారు పిమ్మటన్.

క. నావుడుఁ బ్రమీల యిట్లను
దేవేంద్రజుతో మదీయదేశంబునకున్
రావలసె దైవికంబునఁ
బోవచ్చునె నీకుఁ బ్రాణములతో నింకన్. 119

చ. రణమున నాదుభీకరశరంబుల నైన లసత్కటాక్షవీ
క్షణముల నైన నిన్నిపుడు చంపుట తప్పదు రిత్త చావఁగా
రణ మది యేల నన్ను రతిరాజసుఖంబులఁ దేల్చి తీర్చినన్
గణనకు నెక్కఁ బావకముఖంబున నీబడి నేగుదెంచెదన్.

మ. అనినన్ గైకొన కింద్రనందనుఁడు మాద్యల్లీల నాఱమ్ము లే
సిన నక్కాంతయుఁ నేడుకాండముల మైఁ జిక్కించి తోడ్తో
న శస్త్రనికాయంబుల ముంప నాతఁ డలుకన్ సమ్మోహనా

స్త్రంబు వింట నమర్చఁ సతి త్రుంచె మౌర్వియును నన్నా
రాచముఁ జయ్యనన్. 121

తే. నరుఁడు గాండీవమున నొండునారి గూర్చి
యతివఁ దెగటార్తు ననుచుఁ గట్టల్కఁ దోఁడఁ
దీవ్రతరబాణ మొకటి సంధించి యేయఁ
గదలఁ గన్గొని పల్కె నాకాశవాణి. 122

క. పదివేలేఁడులు పోరినఁ
దుదినెప్పుడు గెల్వ నీకు దుర్లభ మిపుడీ
సుదతి వరియించి హయమును
గదలింపుము ముదముతోడఁ గరిపురి కనినన్. 123

ఉ. అంబరవాణిపల్కు విని యర్జునుఁ డవ్విధ మాచరించె వా
హంబును వృక్షదేశమునకై చనె నం దుదయించుప్రాణివ
ర్గంబు ప్రభాతవేళ నెఱప్రాయముఁ దాల్చుఁ బగల్ దినావసా
నంబునఁ జచ్చుఁ దద్విహరణస్థితు లవ్విపినోపరిస్థలుల్. 124

వృక్షదేశవృత్తాంతము

వ. మఱియు నవ్వృక్షదేశంబునఁ జరించు తిర్యఙ్మనుష్యవర్గంబు నైసర్గికవిశేషంబునుం గనుంగొనుచుఁ గదలి బహువిధ స్వకర్మానురూపజాతు లయినయేకపాద ద్విపాద త్రిపాదానేకవికటపాదులును శశ వృకాచ్ఛభల్ల వలీముఖోష్ట్ర ఖర కురంగ తురంగమ స్తబ్ధరోమ గో మహిష వ్యాఘ్ర మార్జారముఖులును నేకశృంగ ద్విశృంగ త్రిశృంగ చతుశ్శృంగ వక్రశృంగ దీర్ఘశృంగులును నులూకాక్ష కోకిలాక్ష కుళీరాక్ష కేకరాక్ష పింగళాక్ష

విషమాక్షులును నాదిగాఁ గల వికృతవేషులు చరించు నానావిధజనపదంబు లతిక్రమించి పోవుచుఁ దురంగం బగ్రభాగంబున ననేకపిశాచనిశాచర శాకినీడాకినీభూత బేతాళగణశరణ్యంబును బ్రచండగండభేరుండ చమరవేదండ గండక రురు వరాహశరభశార్దూలాది మృగసమ్మర్దనిర్దయ విహారానుగుణ్యంబును నగు నొక్కదారుణారణ్యంబుఁ బ్రవేశించె. 125

క. ఘనదుష్కృతాలవాలము
ననయము నశుభముల కెల్ల నాకరమును నై
జనలోకభయంకర మగు
దనుజపురం బొకటి మెఱయుఁ దద్విపినమునన్. 126

మ. భయదాకారులు మూఁడుకోట్లుదనుజుల్ పార్శ్వంబులం
గొల్వ నిర్దయచిత్తుండు పటుస్ఫులింగవికిరద్దంష్ట్రాకరాళాన
నుం, డయుతాశాంతమదేభసత్త్వుఁ డనివార్యస్ఫూర్తిమై
భీషణా, హ్వాయదైత్యుండు బకాసురాత్మజుఁడు రాజై
యుండు నవ్వీటికిన్. 127

క. నగరోపకంఠ కానన
జగతీధరబిలనివాసి సాహసకర్మా
నుగవిశసనవిద్యాపా
రగుఁ డొకఁడు చరించు బ్రహ్మరాక్షసుఁ డచటన్. 128

సీ. అఱుత యజ్ఞోపవీతాంత్రగుచ్ఛంబులు
వఱలు నెత్తురుపట్టెవర్ధనంబు
మనుజకపాలాక్షమాలికావలయంబు
చర్మకాషాయవస్త్రద్వయంబుఁ

గరటివిస్ఫారకర్పరకమండలువును
వ్రేలను గర్ణపవిత్రకమును
గరమునందుఁ బురాణకంకాళయష్టియు
నలర మేదోహోత యనెడు పేరి
తే. వాఁడు దనుజపురోహితవర్యుఁ డచటి
కరుగుదెంచినయజ్ఞవాహంబుఁ జూచి
వచ్చి కొలువున్న దానవేశ్వరునిఁ గదిసి
సన్నుతోక్తుల నిట్లని విన్నవించె. 129
శా. మీతండ్రిం బకదానవేంద్రుని బలోన్మేషంబునం జంపి వి
ఖ్యాతిం జెందినభీముతమ్ముఁ డురుబాహాదుర్జయుం డర్జునుం
డాతం డింగుల కేగుదెంచెఁ బగ సాధ్యంబయ్యెఁ గైకొందు ను
ద్గాతృత్వంబు భజింపు మీవు నరమేధం బాశరప్రీతిగన్.
సీ. జరపిరి నియతి నాషాఢమాసంబున
వరుసతో రుధిరాసవములు గ్రోలి
శ్రావణంబునఁ దపశ్చరణ ముగ్రంబుగా
ఒఱపిరి మాచకష్ఠులను మ్రింగి
చపలత్వ ముడిగి భాద్రపదంబునందు జ
పం బొనర్చిరి పాశుపతుల నమలి
నడపి రాశ్వయుజంబునను వ్రతంబులు బ్రహ్మ
చారుల విఱిచి భక్షణము చేసి
తే. నియమవిధు లన్నియును దీర్చి నిష్ఠతోడఁ
గార్తికమున భుజించిరి కన్యకలను
గలరు నీపీట బ్రహ్మరాక్షసులు మఱియుఁ
గాలవంచకు లరయ నక్తంచరేంద్ర. 131

క. వీరల కందఱకును సుఖ
పారణ గావింపవలయుఁ బార్థునిబలముల్
ధారాదత్తము చేయు ను
దారత విచ్చేయు మన నతం డెల నగుచున్. 132

చ. ఎనయఁగ నీకు నెద్ది ప్రియ మిందులలో ననినం బురోధసుం
డనుపదతృప్తిఁ జెప్పితి సహస్రము దంతితురంగవీరయో
ధనివహమస్తకంబుల మెదళ్లు సమస్తము నిచ్చినం బ్రియం
బనినఁ గరంబు వ్రేసి దనుజాధిపుఁ డాతనిఁజూచి నవ్వుచున్.

క. ఆగమవిధ్యుక్తముగాఁ
జాగింపుము వేది యజ్ఞసంభారంబుల్
వేగ నొడఁగూర్పు మని భూ
భాగము కంపింపఁ గదలెఁ బ్రథనోన్ముఖుఁ డై. 134

క. హుంకారముఖరదానవ
కింకరచటులాట్టహాసకృతసఖ్యనిరా
తంకపటువిజయభేరీ
భాంకారము లెసఁగ నాప్తబలములతోడన్. 135

తే. భీషణుం డేగ నప్పుటభేదనంబు
దానవాంగన లుత్సేధతనులు ద్విత్రి
యోజనపయోధరలు వికటోగ్రముఖులు
కామరూపిణు లద్రిశృంగంబు లెక్క. 136

క. ఏతెంచుపాండుపుత్రుని
కేతనమున నుండి పోరికిఁ మలసెడు న
వ్వాతూలసుతునిఁ గని సం
జాతస్మరణముల రక్కసులు తమలోనన్. 137

భీషణుం డర్జునునితో నని చేయుట

క. వీఁడు మనలంక తోఁకకుఁ
జూఁడినమర్కటము వీనిఁ జూచిన గుండెల్
నేఁడును గలఁగుచు నున్నవి
వీఁ డేటికి వచ్చె వేరువిత్తయి యిటకున్. 138

ఉ. అంచుఁ గలంగఁబాఱుసమయంబున నోడకుఁడంచు నొక్కన
క్తంచరి మింటి కుప్పరముగా వెసదాఁటి పయోదభంగి మే
న్పెంచి కఠోరహుంకృతులఁ బేరెము వాఱుచుఁ జుట్టి ముట్టి
మర్దించెఁ గిరీటిసేన నతిదీర్ఘకుచద్వయతాడనంబులన్. 139

క. తక్కినదానవకాంతలు
మిక్కుటముగ నట్ల బలిమి మెఱయ బలంబుల్
దిక్కు చెడి పాఱఁ గనుఁగొని
యక్కపివీరుండు మిగుల నాగ్రహ మెసఁగన్. 140

చ. ఒడిసి మహోగ్రవాలమున నుక్కడఁగంగ బిగించి ప్రాణముల్
మిడుక సమీపశైలములమీఁదికి నుద్ధతిఁ ద్రిప్పి వైచియుఁ గ
బిడికిటఁ గూర్పరంబులఁ జపేటతలంబునఁ బార్ష్ణిఘాతలం
గెడపియు దైత్యభామినులఁగీటడఁగించుచు నుండ నత్తఱిన్.

మ. రథచక్రార్భటి భూరినిష్ఠురధనుర్జ్యారావముం గూడి దిక్పథ
వాటీకుహాళం బ్రతిధ్వనులు సంపాదింపఁ గేతుప్రభా, గ్రథి
తాహస్కరమండలుం డగుచుఁ గింకన్ భీషణుండుల్లసత్ప్రథ
నారంభవిజృంభమాణుఁడయి యస్పార్థుఁ వెసన్ దాఁకినన్.

క. ఉభయబలంబులు నప్పుడు
రభసంబునఁ గలయఁబడి పరాక్రమమున న

క్షుభితగతిఁ బోరె బాహా
విభవంబులు చూచి సురలు విస్మయ మందన్. 143

మ. నరుపై దానవనాథుఁ డేడుశరముల్ నాటించినం గ్రీడి నిష్ఠు
రభల్లంబుల మూఁట నొంచె నతఁ డాటోపంబునం జేర్చి తో
మరపట్కం బడరించినం దునిమి శుంభల్లీల నైదస్త్రముల్
బరులం గ్రుచ్చి కిరీటియొక్క బలుఁగోలం జాపముం ద్రుంచినన్.

సీ. దైతేయుఁ డొండుకోదండంబు సవరింప
సగుణంబుగాఁ ద్రుంచె సవ్యసాచి
రాత్రించరుండు చక్రముఁ బ్రయోగించిన
నరత్రోవఁ దునుమాడె నర్జునుండు
బకతనూభవుఁడు గృపాణంబు జళిపింప
నడిమికి విఱిచె ధనంజయుండు
క్రవ్యాదభర్త భీకరశక్తి నిగిడింపఁ
బఱిపఱిగాఁ జేసె ఫల్గునుండు
తే. మఱియు దనుజుండు శాంబరీమంత్రమహిమఁ
బర్వతారణ్యజీమూతపటలభయద
మృగసరీసృపవితతి నిర్మింప నరుఁడు
మట్టుపడ నేసె నాయాయిమార్గణముల. 145

భీషణుండు మడియుట

క. అపుడు ధనంజయుకడ కొక
తపోధనుఁడు వచ్చి బహువిధంబులఁ గార్యం
బుపదేశింపఁగ దానవు
కపటమకాఁ దెలిసి వానిఁ గడతేర్పుటయున్. 146

మ. గద కేలంగొని తేరు డిగ్గి యపు డాక్రవ్యాదుఁ డవ్యాహతిం
గదియం బాండుతనూభవుండు కినుకం గల్పాగ్నికీలానిభ
ప్రదరం బేసినఁ గూలె న త్తఱి నిలింపద్రోహిమస్తం బిలన్
భిదురాఘాతనిపాత మేచకమహీభృత్తుంగశృంగం బనన్. 147

క. అసుర వధించి తదీయా
వసథంబునఁ గల సమస్తవస్తువులును సం
తసమునఁ బార్థుఁడు చేకొనె
మసలక తురగంబు నరిగె మణిపురమునకున్. 148

సీ. పద్మరాగోపలప్రాకారభాసురం
బారసాతలపరిఖావృతంబు
ప్రోత్తుంగహేమగోపురపరిష్కారంబు
పటురత్నసౌధవిభ్రాజితంబు
వినుతవర్ణాశ్రమవిశ్రమస్థానంబు
చతురంగవాహినీసంకులంబు
వివిధవస్తువ్రాతవిరచితాపణకంబు
బహుతటాకారామపరిసరంబు

తే. ప్రతిదినోత్సవదేవతాభవనఘటిత
లలితమంగళవాద్యకోలాహలంబు
బభ్రువాహనభుజపరిపాలితంబు
మాన్యైశ్వర్యధుర్యంబు మణిపురంబు. 149

చ. అనుపమ మైనతద్విభవమంతయుఁ జూచి మరాళకేతనుం
గనుఁగొని పార్థుఁ డగ్రకటకం బది యెవ్వని దన్న నవ్విభుం
డను భవదాత్మసంభవుఁ డహర్పతితేజుఁడు బభ్రువాహనుం
డనునరనాథుఁ డేలు సముదగ్రతమై నిజరాజధానిగన్. 150

చ. ప్రకుపితవైరివీరనరపాలసమున్నతకంఠలుంఠన
క్రకచ మితండు నే మొదలుగా నిటఁ గల్గుసమస్తభూమిభృ
న్నికరమునిక్కుమారవరునిన్ భజియించు సహస్రసంఖ్యహా
టకభరితంబులైనశకటంబు లుపాయన మిచ్చి నిచ్చలున్.

క. సుతజనకబాంధవంబున
నతఁ డూరకయున్న లెస్స యటుగాక సము
ద్ధతిఁ దురగముఁ బట్టిన నే
గతి మఱి విడిపింప వశముగా దెవ్వరికిన్. 152

క. అనునెడ సుబుద్ధి యనున
జ్జనపతిసేనాని ఖురళిసంభ్రమ మెసఁగన్
జని కడుగుత్రోవఁ బ్రమదం
బున మేలఁగెడు నమ్మఖాశ్వముం గని పట్టెన్. 153

వ. అయ్యవసరంబున. 154

శా. సామామోదవినోదియై చనియె భాస్వంతుండు శాకుంతమా
రామక్షోణిరుహాగ్రనీడముల నాక్రందించి నాకాశవీ
థీమధ్యంబునఁ దారకాగణము సందీప్తచ్ఛవిం బొల్చె ది
క్సీమాగోళము నంతకంతకును గొంచెం బయ్యె లేఁజీఁకటిన్.

క. సరసిజబాంధవుఁ డీగతి
చరమాంబుధివీచికావశంవదుఁ డైనన్
దురగంబుఁ గొనుచుఁ బురమున
కరుదెంచె సుబుద్ధి వేడ్క నాసమయమునన్. 156

సీ. కురువిందమయకుడ్యకుట్టిమంబులచేతఁ
బగడంపుఁ జేవకంబములచేతఁ

దళితళ మెఱయుదంతకవాటములచేతఁ
గనకసోపానమార్గములచేతఁ
దోరంపుముత్యాల చూరుమొగ్గలచేత
జిగిమించుసాలభంజికలచేత
మృదులాంబరంబులమేలుకట్టులచేత
సరిలేనిధూపవాసనలచేత
తే. మహిమఁ బెంపొందు నాస్థానమంటపంబు
నందు మూర్ధాభిషిక్తులు సందడింప
బభ్రువాహనుఁ డధికసౌభాగ్యగరిమ
గడలుకొన రాత్రి పేరోలగమున నుండి. 157

చ. క్రమమున సప్తిరక్షకులు క్రందుకొనం గరదీపికాసహస్ర
ములు వెలుంగఁ జిత్రపటచామరహేమఖలీనకింకిణీకము
లగునుత్తమాశ్వములఁ గన్గొనుచుండెడుచో సుబుద్ధి భూ
రమణునిఁగాంచి యత్తురగరత్నముఁ గానుక పెట్టి మ్రొక్కినన్.

తే. అవ్విభుఁడు దానిరేఖ కాహ్లాద మంది
కదియఁ దెప్పించి చూచి మొగంబు నిమిరి
ఫాలసంస్థితకలధౌతపత్రలిఖిత
చారుతరశబ్దబంధంబు చదువుకొనియె. 159

ఉ. దుర్జయరాజమండలవిధుంతుదమూర్తి యుధిష్ఠిరక్రతూ
త్సర్జిత మైనయీహయవతంసము త్రిమ్మర నంగరక్షగా
నర్జునుఁ డేగుదెంచె నిటలాక్షునిగెల్చినజోదు విక్రమో
పార్జితలీలఁ బట్టుఁడు రయంబున శూరులు ధాత్రిఁ గల్గినన్.
వ. అని పఠించి. 161

ఉ. భూపకుమారుఁ డిట్లను సుబుద్ధిఁ గనుంగొని సాదరంబుగన్
మా పెదతండ్రి ధర్మజుఁ డమానుషవిక్రముఁ డశ్వమేధదీ
క్షాపరతంత్రుఁ డై విడువఁగా నిట వచ్చిన దీహయంబు నా
నాపురవాటికావిహరణంబుల మజ్జనకుండు తోడుగన్. 162

మ. శివుతో నెక్కటి కయ్యముం దొడరి మెచ్చించెన్ బ్రతాపించి వా,
సవునర్ధాసనమెక్కె వేలుపులు మెచ్చం గాలకేయాదిదా
నవులం గీటడఁగించె నట్టి త్రిగజన్మాన్యుండు చిత్రాంగదా,ధవుఁ
డిచ్చోటికి నేగుదెంచె నఁట మద్భాగ్యంబు సామాన్యమే.

క. కావున మన మెదురుకొనం
గా వలయు సమస్తసైనికవ్రాతముతో
నీ విందుకుఁ దగుయత్నము
గావింపుము వెస బ్రభాతకాలంబునకున్. 164

తే. అనుచు సేనాని వీడ్కొల్పి యర్హభంగి
జనపతుల నెల్ల నిజనివాసముల కనిపి
సవనహయము సాహిణులవశంబుఁ జేసి
యంతిపురమున కరిగె భూకాంతుఁ డపుడు. 165

వ. అంతం బ్రభాతసమయం బగుటయు నక్కుమారవరుండు సముచితప్రకారంబున మేలుకని కాల్యకరణీయంబులు సర్వంబు నిర్వర్తించి వివిధమణిభూషణాంబరమాల్యాను లేపనంబుల నలంకృతుం డై నిఖిలసామంతమంత్రిపురోహితానేకహితజనంబులు పరివేష్టింప నాస్థానమండపంబునకు వచ్చి హయాధిరోహణంబు సేయునెడం గంచుకిజనంబు లంతంత ముందఱం గ్రందుకొనుసందడిం దొలంగ జడియుచు హుంకారంబులు సేయఁ బుణ్యాంగనానివహంబులు

చల్లులాజాక్షతదూర్వాంకుర ప్రసూనంబు లంగీకరించుచు వందివైతాళికమాగధ స్తుతిరవంబులును బ్రచండభేరీమృదంగ శంఖబిరుదకాహళరవంబులును నపరిమితచతురంగవాహినీ నివహకోలాహలంబులును నొక్కింత నిగిడి దశదిగంత రంబులం గడలుకొన బహువిధోపాయనపురస్సరంబుగాఁ బురంబు నిర్గమించి. 166

సీ. తర్కించి హేమభూధరముఁ దేఁడనికాని
సౌవర్ణవితతికి సంఖ్య లేదు
లక్షించి మలయశైలమ్ముఁ దేఁడనికాని
గంధసారమునకు గణన లేదు
దట్టించి గంధమాదనముఁ దేఁడనికాని
ఘనసారపాళికిఁ గడమ లేదు
చర్చించి రోహిణాచలముఁ దేఁడనికాని
వివిధరత్నములకు వెలితి లేదు
తే. నాఁగఁ దనవీటఁ గల్గునానావిశేష
వస్తువులతోడ నధ్వరాశ్వంబుఁ గొనుచు
వచ్చి వాహంబు డిగ్గి విష్వచ్చుఁ గాంచి
బభ్రువాహనుఁ డందంద ప్రణతిఁ జేసి. 167

అర్జునుఁడు బభ్రువాహనుని దిరస్కరించుట

ఉ. అప్పుడ మార్త్తికాంజలిఁ బ్రియంబునఁ జేయుచు దేవ నిన్నకై
తప్పునఁ జేరె నీహయము తండ్రికి నోర్వక పోదు బిడ్డఁ డే
యొప్పమిఁ జేసెనేనియు ననూనకృపామతి నన్నుఁ జూచి యీ
తప్పుసహింపు మంచు వసుధాస్థలిఁ జాఁగిలి మ్రొక్కెఁ గ్రమ్మఱన్.

ఉ. మ్రొక్కిన నాదరింపక నరుండు వియన్నదిశాపవాక్యముల్
దైక్కొన నాగ్రహం బుడుపలేక కుమారుని దన్నె దన్నినన్
గక్కస మొంద కాతఁ డవికారత నిల్చిన రాజు లందఱున్
గ్రక్కున నాప్తవాక్యములుగా నపు డిట్లని రింద్రసూతికిన్.

సీ. తనయునిఁ గృపఁజూడు మనియె సాత్యకి యింత
కలుషింపఁ జనద నెఁ గర్ణసుతుఁడు
హంసకేతనుఁ డిది యవకార్య మని చెప్పె
నీలధ్వజుండు మన్నింపు మనియెఁ
బనిలేనిపని యని పల్కెఁ బ్రద్యుమ్నుండు
కృతవర్మ తగ దపకీర్తి యనియె
ననుసాల్వుఁ డనియె భావ్యంబు గా దని యౌవ
నాశ్వుఁ డీచంద మపాయ మనియె
తే. మఱియుఁ దక్కినరాజు లందఱును వేన
వేలభంగుల నీరీతి విన్నవింప
నాదరింపక మదిఁ గోప మంతకంత
కడరఁ బార్థుఁడు బభ్రువాహనునిఁ జూచి. 170

ఉ. ముంగలఁ బాఱతెంచుహయముం గని పట్టి పిలుందవచ్చునే
నం గని ప్రాణభీతిఁ గదనంబునకుం జొరవైతి వోరి మా
వంగడ మాట బొంకు మును వైశ్యునకుం గనెఁ బోలు
నిన్నుఁ జిత్రాంగద యన్నఁ బొక్కిపడి యానృపసూనుఁడు
పల్కెఁ దండ్రితోన్. 171

మ. నను నేమన్నఁ గొఱంత లేదు సభలోనం బుణ్యచారిత్ర మ
జ్జననిం దప్పఁగ నాడి తీనికృతికిన్ సైరింపఁగా నేర నా, విన

యం బింతకుఁ దెచ్చెఁ జాలుఁ బలుకుల్ వేయేల నేఁడు త్రి
యుం, డనొ వైశ్యుండనొ చూడు పంచు మగిడెన్ సంగ్రా
మసంరంభియై. 172

చ. అపుడు సుబుద్ధిసైన్యముల నన్నిటి నొక్క మొగంబుగా నమ
ర్చి పురికిఁ గానికల్ మగుడఁ ద్రిప్పిజయావహఝల్లరీమృదం
గపటహరావముల్ దిగిభకర్ణపుటీకుటికాంతరంబులం, దుపహ
తిఁ జేయఁదత్క్రతుహయోత్తమ మొక్కెడఁగట్టఁబంపుచున్.

బభ్రువాహనుఁ డర్జునుసైన్యంబు దైన్యంబు నొందించుట

సీ. కల్పితధ్వజఘంటికామాల్యసముదీర్ణ
హేమశతాంగంబు లేడుకోటు
లొకయర్బుదము మదవ్యాఘనిర్ఘాట
సన్నాహములు భద్రసామజములు
చటులఘాటీసముద్భటమనోజవనిర్ణి
రోధవాహంబు లర్బుదయుగంబు
మూఁడర్బుదములు సముద్యద్భుజాటోప
విజయధౌరేయులు వీరభటులు

తే. క్రందుకొనసైన్యనాయకాగ్రణి ఘటించెఁ
గాక చక్రసమాకృతిగాఁ గపీంద్ర
కేతుబలనాశకరధూమకేతు వనఁగ
నాహవభయంకరం బైనమోహరంబు. 174

చ. అనుపమరత్నబంధురము హాటకనిర్మితముర్ మయూరవా
హనపరిశోభితంబు వివిధాయుధగర్జితమున్ విచిత్రకే
తనరుచిరంబు నైనయరదంబు ముదంబున నెక్కి బభ్రువా
హనుఁడు తదగ్రభాగమున నాయితమై నిలిచెం జలంబునన్.

శా. ఆరీతిన్ నరనాథసూతి కృతజన్యారంభుఁడై నిల్వ నా
సీరస్ఫారబలంబు లొండొరు లధిక్షేపంబు లేపారఁగా
వీరావేశభరంబునం బెనఁగ విద్వేషించి ప్రాక్పశ్చిమాం
భోరాసుల్ దలపడ్డచందమున నార్పుల్ మింటితో నంటఁగన్.

మ. చతురంగంబులు నిట్లు మెండుకొని వాచాటోగ్రరేఖాసము
ద్ధతి సంధావిధులన్ బరస్పరజయోత్సాహంబు లుప్పొంగ న
ద్భుతవృత్తిం దెగి పోర నుచ్ఛలితమేదోమాంసమస్తిష్కశో
ణితకీర్ణం బగుచుండె భండన మకుంఠీభూతశస్త్రాహతిన్. 177

క. ఈలీల దుర మొనర్పఁగ
వాలినదర్పమున బభ్రువాహనధరణీ
పాలుండు తేరు గదియం
దోలించి సురేంద్రతనయుతో నిట్లనియెన్. 178

చ. తనయుఁడఁ గాన నీచరణతామరసంబులు భక్తిఁ గొల్చువే
డ్క నరుగుదెంచినం గడవఁగా నటు లాడితి వాడు లెల్లమ
త్సునిశితబాహువిక్రమము చూచుతలంపునఁ గాదె తీర్తు నీ
మనికిత మిప్పు డందుకొనుమా నిజకార్ముకమంచుఁ బల్కినన్.

మ. అనుసాల్వుం డపు డక్కుమారు నెదిరిం చాకర్ణరుక్పుంఖమం
డనుఁడై ఘోరసవాంబకంబులు నిగుడ్పన్ వాని లెక్కింప
క్కాతనిమీఁదం జడి గొల్పె నూఱుశుకపత్రద్యోతశాతా
స్త్రముల్, కినుకన్ వాఁ డవి త్రుంచి తోడన పయిన్ గీ
ల్కొల్పె బాణౌఘముల్. 180

క. ఈచందంబునఁ బటునా
రాచపరంపరలఁ దొరఁగురక్తంబులచేఁ

బూచినమోదుగులకు నెన
రై చేసిరి దురము త్రిజగదాభీలముగన్. 181

ఆ. అపుడు బభ్రువాహనుఁ డనుసాల్వుతేరియు
గ్యముల సూతు సిడముఁ గార్ముకంబుఁ
దునిమి వైచె నాలుగును నైదు నేడు నె
న్మిదియుఁ దోమరముల నదటు మిగిలి. 182

మ. అనుసాల్వుండును నపు నూతనశతాంగారూఢుఁడై నిల్చితో
డన సజ్జీకృతచాపుఁడై చటులకాండశ్రేణులన్ బభ్రువా
హనుఁ దూలించిన నాతఁ డెంతయును రోషావేశతం బేర్చి వై
కనదస్త్రాహతినాతనిన్ విరథునింగాఁజేసి పెల్లార్చినన్.

క. గద కేలం గొని ధర గ్ర
క్కదలఁగ ననుసాల్వుఁ డెదురుగా నడవ నవ
ప్రదరములఁ బభ్రువాహనుఁ
డెడనించిన వ్రాలె నాతఁ డెత్తినమూర్ఛన్. 184

వ. అప్పుడు. 185

శా. ప్రద్యుమ్నుం డనుసాల్వపాటునకు నుగ్రంపశ్యుఁడై హేమ
పుం, ఖద్యోతాశుగపంక్తు లేయ నపు డల్కన్ బభ్రువాహుం
డవి, చ్ఛేదప్రౌఢిమఁ బేర్చి తత్తనువు ముంచెన్ బాణవర్షం
బునన్, సద్యోమగ్నముగా ననంగుఁ డగుటన్ స్వాభావికా
ర్థంబుగన్. 186

మ. గురుదర్పోద్ధతి నిట్లు మర్మములు గీలొక్కనేయఁగా శౌర్యవి
స్ఫురణాహంకరణంబుకుంటువడి యచ్చోనేడుచందంబునన్
శరసంవేధితదేహుఁడై నిలిచె విష్వక్సేనసూనుండు సం
గరకర్మోచితకృత్యముల్ మఱచి కింకర్తవ్యతామూఢతన్.

క. హరిసూను నివ్విధంబునఁ
దిరుగుడువడ నేసి మఱియుఁ దీవ్రశరములన్
నరుని చతురంగసేనల
ను రణంబున బభ్రువాహనుఁడు సమయింపన్. 188

క. కనుఁగొని ప్రద్యుమ్నుఁడు నె
మ్మనమునఁ దెలివొంది విక్రమంబునఁ దను నొం
చినయట్ల బభ్రువాహను
తనువును నస్త్రముల నొంచెఁ దద్దయు నలుకన్. 189

వ. మఱియును. 190

శా. తత్సేనానివహంబు నుద్ధతబలోత్సాహంబునం బూతనా
జిత్సూనుండు కఠోరసాయకములం జెండాడ నాపుంఖవి
ద్ధోత్సేధోగ్రకబంధకంఠబిలనిష్ఠ్యూతాస్రధారామిళ
న్మృత్సాకర్దమదుర్దినం బగుచుఁ గాన్పించెన్ రణంబయ్యెడన్.

సీ. వడి జిఱ్ఱఁ దిరిగి మ్రొగ్గెడుమదానళములుఁ
దోన రూపఱినయాధోరణులును
బల్యాణములఁ గ్రిందఁ బడిన రావుత్తులుఁ
గూలి విజ్జునఁ దన్ను కొనెడుహరులుఁ
బొరపు దప్పినరథంబులసమీపంబునఁ
జక్కుగానరథిరథ్యసారథులును
బొలిసినవీరయోధులుఁ జెంత దుమురైన
చక్రాసిధనురాదిసాధనములుఁ

తే. జింపు లైనమైమఱువులుఁ జిద్రప లైన
సీసకంబులు నలి యైనచిందములును

ద్రుంపు లైన చామరములుఁ దునుక లైన
తొడవులును గల్గి సమర మత్యుగ్ర మయ్యె. 192

క. అప్పుడు చతురంగంబుల
కుప్పలు కులగోత్రగరిమఁ గొంచెపఱుపఁగా
నుప్పొంగి మానసంబులఁ
గప్పరపడి భూతములు జిఘాంసాపేక్షన్. 193

చ. అలమి గజాశ్వమర్త్యకుణపావలి నంకములం దమర్చి తి
త్తొలిచి పృథూరుజానుజఘనోదరపార్శ్వభుజాంతరంబులన్
గలపలలాదులం దనిసి కర్పరముల్ బలితంపుఁగోఱలం, బెళ
పెళనొక్కి లోమెదడు పీల్చి మదంబునఁ జొక్కియాడుచున్.

వ. మఱియును. 195

సీ. నృకళేబరంబు మింటికి వైచి కందుక
క్రీడ వర్తించు డాకిని యొకర్తు
దంతిదంత మ్మలాతముగఁ ద్రిప్పుచు నాడుఁ
జౌపదంబులకుఁ బిశాచ మొకటి
యజినంబు చెఱఁగుగా నభినయించుచు దేశ
పాత్రయై యొకప్రేత పాత్రలాడు
భుజమునఁ గూబరంబు ధరించుకొని సోలు
దరిబేసి యగుచు బేతాళుఁ డొకఁడు

తే. భూతగణములు కరతాళములు ఘటింపఁ
జిత్రగతి నోర్తు చకచకఝుంకృతులకుఁ
గొనుదువాళుల నఖిలదిక్కులు చలింపఁ
దాండవం బాడు నటభైరవుండుఁ బోలి. 196

చ. అది గని బభ్రువాహుఁ డభియాతికి నడ్డముగా వడిఁ రథం
బు దఱిమి నిష్ఠురాంబకసముత్కరముల్ నిగిడింప గూఁటిలో
నొదిఁగినగూబచందమున నుండియు నమ్ములు వో విదిర్చి మి
న్నదరఁగనార్చి చండవిశిఖావలి నాతని నొంచెఁ గ్రమ్మఱన్.

ఉ. నొంచుట బొంకుగా నతఁడు నూల్కొని కృష్ణతనూజుఁ డె
క్కఁగాఁ, ద్రుంచె రథంబు లిర్వది యదుప్రవరుండును బభ్రు
వాహుదో,రంచితవిక్రమంబు గొనియాడుచుఁ దా నరదంబు
లేయుచో, నెంచ నశక్య మయ్యె నతఁ డెక్కఁగఁ ద్రుంచిన
తేరు లేరికిన్. 198

ఉ. ఈసరవిం బరస్పరజయేచ్ఛల వెండియు దివ్యబాణవి
న్యాసపటుప్రహారకరణంబులఁ జక్రగదాపరశ్వథ, ప్రాసకృ
పాణఖేటములఁ బట్టి పెనంగిరి బాహు శౌర్యముల్, త్రాసు
నఁ దూఁపవచ్చు ననఁ దక్కువ యెక్కువ లేక యిద్దఱున్.

క. క్రోధాగ్నిజ్వలితశిఖా
యూధంబులు వెలికి నెగయుచున్న కరణి న
య్యోధవరులతనువుల నని
రోధక్షతజోగ్రనిర్ఝరులు గనుపట్టెన్. 200

క. నిండినమూర్ఛ ధృతకో
దండనమత్కోటిభూషితశిరోధులతో
నుండు నెడ బభ్రువాహుఁడు
గాండివగుణరావబోధకరనుతిఁ దెలిసెన్. 201

తే. అట్లు తెలివొంది బభ్రువాహనుఁడు పాండు
తనయుఁ గదియంగ నరదంబుఁ దఱుముకొనుచు

వచ్చునప్పుడు రాఘవేశ్వరుఁడుఁ గుశుఁడుఁ
గయ్య మొనరింపఁ గదిసిన ట్లగ్యె ననిన. 202

క. విని వినయంబున ని ట్లని
జనమేజయనృపతి పల్కె జైమినిఁ గని నం
దనుఁ డైనకుశునితో నె
ట్లని చేసెను రామచంద్రుఁ డని యడుగుటయున్. 203

మ. కరుణాపూరితనేత్ర దారుణరణక్ష్మానిర్భరక్షాత్ర బం
ధురసాలద్రుమచైత్ర నిర్దళితశత్రుక్షేత్ర రామాదిభూ
వరచారిత్ర నిరంతరోత్సవరణద్వాదిత్ర రామాసము
త్కరసమ్మోహనగాత్ర విశ్వజగదేకచ్ఛత్ర భాగ్యోన్నతా.

క. క్షితినుతమీసరగండా
ప్రతివీరపురోపకంఠ బహువిధఖురలీ
గతచతురతురగరింఖో
ద్ధతధూళీపాళిచుళుకితబ్రహ్మాండా. 205

స్రగ్విణి.—
రాజవంశాగ్రణీ రాజచూడామణీ
యాజిలక్ష్మీకరోదద్విలాసక్రియా
వీజనాకారపృథ్వీవరాహాంకభృ
ద్వైజయంత్యంశుకోద్వర్తితార్కాంశుకా. 206

గద్యము.ఇది భారతీతీర్థశ్రీచరణకరుణాపాత్ర గాదయామాత్య
పుత్ర వినయవిద్యాసముద్ర పినవీరభద్రప్రణీతం బైనజైమిని
భారతంబునం దశ్వమేధపర్వంబునం బంచమాశ్వాసము.

శ్రీ

# జైమినిభారతము

## అశ్వమేధపర్వము, షష్ఠాశ్వాసము





రామాయణభారత
చారుతరకథాసుధాప్రసన్న మనఃపం
కేరుహ యసమానజయ
శ్రీరుచిరనివేశ, నారసింహమహీశా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున
కిట్లనియె. 2

### శ్రీరామచరిత్రము

క. భూనాథ కుశలవోపా
ఖ్యానం బఘపవనలేలిహానము శ్రేయో
ధానం బాశ్రితభక్తిని
ధానం బది వినుము సావధానత మెఱయన్. 3

సీ. తండ్రి పంపునఁ జతుర్దశవత్సరంబులు
రాముఁ డరణ్యమార్గములఁ దపము
గావించి కదనరంగమున రావణకుంభ
కర్ణాదికుటిలరాక్షసులఁ దునిమి

చటులాగ్నిముఖమున జానకిం జేపట్టి
యనుజన్ముఁడు విభీషణార్కతనయ
జాంబవత్ప్రముఖవృక్షచరవీరులుం గొల్చి
రా నయోధ్యానగరంబుఁ జొచ్చి

తే. పౌరు లెదురుకొనంగఁ బుష్పకము డిగ్గి
యావసిష్ఠున కర్థి సాష్టాంగ మెఱఁగి
తల్లులకు మ్రొక్కి తనకు వందన మొనర్చు
భరతశత్రుఘ్నులను భుజాంతరముఁ జేర్చి. 4

క. అంతట రఘునాయకుఁడు సు
మంతుఁడు మొదలైనముఖ్యమంత్రివరులహృ
త్సంతాప ముడుగ నాయా
యంతరములఁ గారవించు నాసమయమునన్. 5

క. పెనిమిటివియోగమునకుఁ
దనయుఁ డడవి కేగుటకు వనరుకౌసల్యా
జనయిత్రి రామభద్రునిఁ
దనయురమునఁ జేర్చి గద్గదస్వర యగుచున్. 6

శా. అన్నా రాఘవ నన్నుఁ గన్గొని వసిష్ఠాదుల్ భవత్సూనుఁ డ
చ్ఛిన్నుం డక్షరుఁ డప్రమేయబలుఁ డచ్ఛేద్యుం డనన్ విశ్వ
సింప న్నాలో నిపుడద్దశాస్యుఁ గలనన్ మర్దించి నీవచ్చుటం
గన్నారం గనుఁగొంటిఁగాన నిజముల్గాఁ గంటిఁ దద్వాక్య
ముల్. 7

తే. అనిన నంబకు మఱియు సాష్టాంగ మెరఁగి
రామచంద్రుండు బంధువర్గంబు ననుజ

వర్గమును గొల్వ నమరేంద్రవైభవమునఁ
బాలనము చేసె సాకేతపట్టణంబు. 8

సీ. పాదపంబులు పుష్పఫలసమృద్ధి వహించె
నఖిలధేనువులుఁ జన్నవిసి పిదికె
జగతీవధూటి రాజన్వతి యై మించె
గత మయ్యె నెచటఁ దస్కరభయంబు
కన రైరి పుత్రశోకము తల్లిదండ్రులు
పొలఁతులవైధవ్యములు దొలంగెఁ
బ్రాణిజాతంబు నిరామయస్థితిఁ బొల్చె
నెల మూఁడువానలు నిలిచి కురిసెఁ

తే. దేనెతలవడఁ బండె ధాత్రీతలంబు
పొదలి ధారణ పోఁకకుఁ బుట్టెఁ డయ్యె
నన్నివంకల దుర్భిక్ష మడఁగిపోయెఁ
బ్రస్తుతింపంగఁ దగు రామరాజ్యమునను. 9

క. తమ్ములు మువ్వురుఁ దను ని
త్యమ్మును భజియింప గుణయుత మ్మగుపరత
త్త్వమ్ముగతి రాఘవుండు న
యమ్మున జగ మేలె జలధు లవధులు గాఁగన్. 10

మ. ప్రతిభం దొమ్మిదివేల్ శరత్తులు నుతింపన్ ధాత్రిఁ బాలించి
ముప్పూతుదం జక్కఁదనంబు చాలమికి 'నాపుత్రస్యలోకో
స్తి' యన్, స్మృతి నూహించి పితౄణముక్తిఁ గనలేమిన్
రామభద్రుండు సంతతమున్ సంతతిఁ గోరి డెందమున సం
తాపంబునం బొందఁగన్. 11

క. జనకతనూభవ కంతఁ
గనుపట్టెఁ బ్రథమగర్భగౌరవ మెలమిఁ
జననీప్రవాసలగ్నం
బున శ్రవణచతుర్థపాదమునఁ జరవేళన్. 12

## శ్రీరాములు దుస్స్వప్నముఁ గనుట

క. నాలుగుమాసము లరుగఁగఁ
దా లక్ష్మణుచేత సీతఁ దడయక గంగా
కూలమున విడువఁ గల గని
యాలో మేల్కాంచి గుండియ తటా లనఁగన్. 13

క. అరుణోదయమున రాముఁడు
తిరముగ సంధ్యాదివిధులు దీర్చినపిదపఁ
గురుఁ డైనవసిష్ఠునితోఁ
జరమనిశావేళఁ గన్న స్వప్నముఁ జెప్పెన్. 14

క. విని యమ్ముని రామునితో
నను సీతాగర్భరక్షణార్థము గావిం
ప నగుం బుంసవనక్రియ
లను జనకునిఁ బిలువఁబంపు లక్ష్మణుచేతన్. 15

సీ. అనుచు నమ్మునివర్యుఁ డానతిచ్చినయట్ల
మిథిలేశుఁ బిలువ సౌమిత్రిఁ బంప
వాస్తుకర్మకులచే వాసుదేవమహర్షి
వినతత్రిగవ్యూతివిస్తృతంబుఁ
గనకసోపానశృంగాటకోజ్జ్వలము గాఁ
బర్జన్యమణిమండపము ఘటింప

సుముహూర్తమున వసిష్ఠుండు రాఘవు సీత
నం దుంచి పుణ్యాహ మైనపిదప

తే. నాజ్యతిలలును జరుహోమ మాచరించి
వెలఁది ధమ్మిల్లమున సూత్రవేష్టనం బ
మర్చి గోధూమయజ్ఞాంగమాలికాయు
గళము గళమున నాగమోక్తముగ నునిచె. 16

శా. భేరీకాహళఝల్లరీమురజగంభీరధ్వనుల్ దిక్కులన్
దోరంబై చెలఁగన్ రఘూద్వహుఁడుసాధుశ్రేణికిం బాయసా
హారంబుల్ కలధౌతపాత్రములఁ బర్యాప్తంబు గావించి నా
నారత్నాశ్వగజాగ్రహారములు దానం బిచ్చె మోదంబునన్.

తే. జనకుఁ డవ్వేళ సుతమహోత్సవముఁ జూచి
యలరి తనచేతఁ బరిపాల్యమగుసమస్త
రాజ్యమును దాశరథికి నర్పణము చేసి
చనియెఁ గౌశికసహితుఁడై వనమునకును. 18

క. కాకుత్స్థుఁ డుర్వి సర్వము
నేకాతపవారణముగ నేలఁగ నొకనాఁ
డాకాంక్ష వొడమి జానకి
యేకాంతం బైనవిభున కిట్లని పలికెన్. 19

ఉ. వల్లభ నామదిం బొడమె వాంఛిత మొక్కటి జాహ్నవీతటిన్
దొల్లిటియట్ల తాపసవధూటులతోడుతఁ గొంతకాల ము
త్ఫుల్లవనీవిహారములఁ బ్రొద్దులు పుచ్చెద నన్న రాఘవుం
డుల్లము జల్లనం గలఁగ నొప్పనికోరిక సీత కోరినన్. 20

తే. వరుసఁ గానలఁ బదునాల్గువత్సరములు
తిరిగియును భూమిసుతకోర్కి తీఱకునికిఁ

దొలుతఁ దనకన్న దుస్స్వప్న దోషలతకు
నెలఁతకోరిక ఫలముగా నిశ్చయించి. 21

క. కానిమ్ము నిన్నపశ్యము
గా నంపెదఁ గాని రేపు కదలు మనుచు న
బ్జానుకులేశుఁడు లోనికి
జానకి వీడ్కొలిపి తన్నిశామధ్యమునన్. 22

—◉ శ్రీరాములు చారులచేఁ బౌరులవృత్తాంతంబు దెలియుట ◉—

క. పౌరులవృత్తాంతంబులు
చారులచేఁ జిత్తగింప సమయం బని దౌ
వారికుఁడు చెప్ప విని రఘు
వీరుఁడు పిలిపింప వచ్చి వినమితులైనన్. 23

క. ఇనకులుఁడు గూఢచారులఁ
గనుఁగొని యీప్రొద్దు మత్సకాశంబునకుం
జను దెంచినార లేమే
వినఁబడియెనె పురములోన వింతలు మీకున్. 24

క. దూతలు సత్యముఁ జెప్పుఁడు
నాతోఁబుట్టుగుల నైన ననైన ధరి
త్రీతనయ నైన వేఱొక
రితిగ నాడరు గదా పురీజను లనినన్. 25

క. శ్రీరామ నీవు సాక్షా
త్తారకమంత్రాధిదేవతవు నిను నర్థిం
బేరుకొనువారు దురితవి
దూరు లనిన నిన్ను నాడుదురె పురజనముల్. 26

కలుషములు నిన్నుఁ దలఁచిన
నిలువున భస్మమయి పోవు నేఁ డెవ్వలనన్
దొలఁగనిపాపము వినఁబడె
నలికెద మది విన్నవింప నశుభం బగుటన్. 27

చ. రజకి యొకర్తు నాథుఁడు తిరస్కృతిఁ జేసినఁ బుట్టినింటి కే
గ జనకుఁ డాత్మజం గని జగజ్జనగాత్రమలీమసాంశుక
వ్రజములు శుద్ధి సేయునిజవంశము మైల వడంగఁ జేసి తిం
టిజగడ మింటిలోనె హవణింపక నీ విటు లొంటి వచ్చుటన్.

చ. అని తనకూఁతుఁ దోడ్కొనుచు నల్లునియింటికి నేగమామఁ జూ
చనలములోన నెయ్యలికినట్టుల మండుచు నిల్లు వెళ్లి నాల్
దినములు నేఁడు నాకడకుఁ దెచ్చితి వే నలరాఘవుండనే
దనుజగృహీత సీతఁ దనదా రని క్రమ్మఱఁ దెచ్చి యేలఁగన్.

సీ. అనుచు నన్నీచాత్ముఁ డాడుదుర్భాషలు
విని కర్ణములు మూసికొనుచు నచట
నిమిషమాత్రం బైన నిలువ కమ్మడివేలు
తలవంచుకొని పోయెఁ దనయఁ గొంచు
మలినాంబరాంబుకశ్మలయవాగూచ్ఛిష్ట
కుక్షింభరులయందు గుణము లరయఁ
గలవె యైనను విన్న కార్యంబు గాన దే
వర కిప్పు డెఱింగింప వచ్చు టనిన

తే. గుండె నీఱుగ నవిసి కాకుత్స్థవర్యుఁ
డెట్టకేలకు ధైర్యంబు మట్టుపఱచి
చారపురుషుల నంపి తచ్చరమరాత్రి
గడపె నొకబ్రహ్మకల్పంబుఁ గడపి నట్లు. 30

శా. ఆలోనన్ భరతాదిసోదరులు సేవాపేక్ష రామక్షమా
పాలుం గొల్వఁగ వచ్చి కర్ణపరితాపవ్యగ్రలోకాపవా
దాలాతగ్రథితాత్మరుక్పిశునలోలాపాటలాపాంగధా
రాళాశ్రుప్రవిలిప్తగండఫలకోరస్కున్ విలోకించుచున్.

ఉ. ఎన్నఁడు లేమి నేఁ డినకులేశ్వరుఁ డేమికతంబొ బాష్పసం
ఛన్న ముఖాబ్జుఁడై ఘనవిషాదముఁ బొందుచు నున్నవాఁ
డు వి,ద్వన్నుతశీలుఁ డెంతదురవస్థకుఁ దావల మయ్యె నం
చుఁ దా, రన్నపదాబ్జముల్ గదిసి యందఱు సాఁగిలి మ్రొక్కి-
లోఁగుచున్. 32

క. నీయంఘ్రిసేవ సకల
శ్రేయోమూలముగ నెఱిఁగి సేవింపంగా
మాయెడ నిపుడేమియు దయ
చేయవు నే మేమి తప్పు చేసితి మనినన్. 33

శ్రీరాములు సోదరులతో జానకి నెడఁబాసెద ననుట

క. వారలతో రఘువరుఁ డనుఁ
జారులవాక్యములు చెప్పి సడిఁ బొందెను సీ
తారమణి లోకమున దు
ష్పూరుషుచే నిందఁ బొందుశ్రుతియుం బోలెన్. 34

తే. అశనిసంకాశ మైనలోకాపవాద
భయము డెందంబు ప్రక్కలింపంగఁ దొడఁగె
సాధ్వి యగుసీత విడిచెద జననభీతి
యోగపురుషుండు మమకార ముడిగి నట్లు. 35

తే. అనిన భయకంపితస్వాంతుఁడగుచు భరతుఁ
డనియె నిట్లనతిఁ జాతురయ్య బుధులు

కపిలఘటియించి యస్పృష్టిగలసె ననుచు
దారుణాటవి విడుచునె దయఁ దొఱంగి. 36

సీ. అదిగాక లంక దశాస్యునిఁ బొరిగొన్న
వెనుక బ్రహ్మాదులు వినుతి సేయఁ
జిచ్చులోఁ జొచ్చి నిల్చినమహీసుతఁ జూచి
యీనాతి తనకోడ లైనకతనఁ
గనఁ గల్గెఁ బుణ్యలోకము లట్లు గాకున్న
సుతశోకమృతులకు సుగతి గలదె
యనుచు వానరసేన వినుచుండ నాఁడే
మనతండ్రి దశరథక్ష్మాతలేశుఁ

తే. డలఘుచారిత్ర యిక్ష్వాకుకులపవిత్ర
జనకపుత్రిక నికటవై జనన నకట
చటులపక్షిమృగాహిరాక్షసవిహార
విషమకాంతారమున నెట్లు విడిచె దనిన. 37

క. ఇనకులునితోడ లక్ష్మణుఁ
డను నపు డాలోకమాత నాడుదురాత్ముం
దునుమక జానకి విడువం
జను నే యన నట్లు పలికె శత్రుఘ్నుండున్. 38

చ. అనుటయు రాఘవుండు భరతాదుల కిట్లను సీత లోకపా
వని యగు నిక్కమైన నపవాదము పుట్టినచోట రాజ్య మై
నను ననుజన్మపుత్రు లయినన్ హితుఁ డైన మదీయదేహమై
నను గణుతింపఁగాఁ దృణకణం బన జానకిఁ జెప్ప నేటికిన్.

క. మనువంశజాతులై మును
చనినహరిశ్చంద్రముఖ్యజగతీశులవ

ర్తనములు కీర్తులచేతన
కొనియాడఁగ వలసెఁ గాదె గుఱుతుగ నిపుడున్. 40

క. కావున యశోవిహీనులు
జీవన్మృతు లగుట కేమి చెప్పఁగ నిందల్
రావచ్చినచోఁ దనువులె
పోవిడుతురు తొంటిభూమిభుజు లట్లగుటన్. 41

క. మంగళచరిత్ర యగుసీ
తాంగన నపవాదభీతుఁ డగునాకుఁ ద్యజిం
పంగ నగు నేఁడు దుష్టభు
జంగము తనప్రాఁతకుప్పసం బూడ్చుగతిన్. 42

తే. అనిన రాముని తెగువఁ గన్గొని భయమున
భరతశత్రుఘ్ను లేగి రప్పటికిఁ దలఁగి
యన్నదుఃఖాంబునిధిమగ్నుఁ డగుటఁ దెలిసి
యుండె నావేళ సౌమిత్రి యొక్కరుండు. 43

క. ఆరాముఁ డపుడు లక్ష్మణుఁ
జేరఁ బిలిచి విడిచిరమ్ము సీతను గంగా
తీరమున విడువవే నసి
ధారన్ నాశిరముఁ దునుము తమ్ముఁడ వేగన్. 44

క. జానకిఁ గానల కనుపం
గా నగుపాతకము నీకుఁ గా దది నా కౌఁ
గాని చనుమన్నఁ దోరము
గా నిట్టూర్పులు నిగిడ్చి గమనోన్ముఖుఁడై. 45

## లక్ష్మణుండు సీతాదేవి నరణ్యమునకుఁ గొనిపోవుట

సీ. అన్నకు మ్రొక్కి రథారూఢుఁడై త్రోవఁ
దఱచుగా దుర్నిమిత్తములు గనుచు
వైదేహిమందిరద్వారదేహళి శిలాం
గము డిగ్గి సీతపాదముల కెరఁగి
తలవంచుకొని భవద్భర్త నీకోరికఁ
జెల్లించెఁ గదలి విచ్చేయు వేగ
ననిన నీరాత్రిఁ దన్నలవోక వేఁడినఁ
జన విచ్చి నిన్నుఁ దోడని పె ననుచు
తే. నలరి రామునిమణిపాదుకలు మునీంద్ర
కన్యలకు నర్హ మగురత్న ఖచితభూష
ణాంబరసుగంధములును మేలైనవివిధ
భక్ష్యములు నేర్చి యరదంబుపై నమర్చి. 46

శా. ఆసీతాంగన యత్తలం గదిసి సాష్టాంగంబుగా మ్రొక్కియ
క్కౌసల్యం గని నాదుకోర్కి నెఱపం గాకుత్స్థుఁ డంపెన్
సుమిత్రాసూనుం బయనంబు చేసి దివిషద్గంగావసన్మౌనికాం
తాసందోహముఁ జూడఁ బోయెదఁ బ్రమోదం బార మీ
రంపినన్. 47

చ. అన విని కోసలాధిపవరాత్మజ జానకిఁ జూచి యెట్టుగాఁ
జనియెదవమ్మ కంటకవిశంకటసంకటఘోరకాననం
బునకు భవన్ముఖాంబురుహముల్ రదనచ్ఛదముల్ మలీమసం
బును గడునీరసంబు నయి పొల్పఱెఁ బోవుటగాదు నావుడున్.

క. వనవాసియుఁ గంటకమ
ర్దనుఁడును నగుదాశరథి నిరంతరమును నె
మ్మనమున నుండఁగ రా నే
ర్చునె యశుభము లెందు మీకరుణ గలనాకున్. 49

తే. అనుపుఁ డిఁక మీమనము సందియంబు దక్కి
యని మహీజాత యత్తల కర్థి మ్రొక్కి
పెనఁచి పయ్యెద నీవితో బిగియఁజెక్కి
హరితఘోటకయుతమైనయరద మెక్కి. 50

క. చనుసమయమున సుమిత్రా
తనయుఁడు సంజాతగద్గదస్వనుఁడై సూ
తునిఁ జూచిపలికె వేగం
బునఁ దోలుము హరుల రథము పోవలె ననినన్. 51

శా. ఆతం డిట్లను నాకు నశ్వహృదయం బామూలచూడంబు వి
జ్ఞాతం బాశుగతిన్ సమగ్రబలజన్యక్షోణులం బో నమ
జ్ఞాతుల్ మా కగుఁ గాని భావిధ్రువవస్థల్ గాన కేతెంచు నీ
సీతాతన్వి భరింపఁ జాల మని వంచెన్ జంచలప్రోథముల్.

తే. ఐన నానేర్పుఁ జూడు మీ వనుచు సూతుఁ
డలమి వలకేలఁ గందంబు లప్పళించి
సమరసముఁ జూపి నెఱయఁ బగ్గములు వదలి
సైంధవంబుల ధేయని చబుకుసేయ. 53

ఉ. స్యందన మప్పు డప్పురనిషద్వలు లీల నతిక్రమించుచో
ముందట నడ్డగించి మృగముల్ గలఁగంబడె జంబుకంబు లా
క్రందన మార్తిఁ జేసె నవి గన్గొనుచుం దనదక్షిణాంబక
స్పందన మాటకున్ బెగడి జానకి లక్ష్మణుఁ జూచి యిట్లనున్.

## జానకి మార్గమున దుశ్శకునములు కనుట

ఉ. బెట్టుగ దుర్నిమిత్తము లుపేతము లయ్యెడు నామనంబు చే
పెట్టి కలంచినట్లు దురపిల్లెడు దైత్యుల నూఁచముట్టుగాఁ
గొట్టినశౌర్యధుర్యునకుఁ గోసలరాజతనూజనెయ్యపుం
బట్టికి రామభద్రునకుఁ బైపయిఁ జేకుఱుఁగాక భద్రముల్.

సీ. దండకావనజనస్థానమం దెవ్వాఁడు
ఖరదూషణాదిరాక్షసులఁ దునిమె
నెలయించుకొని పోవ నెవ్వాఁడు పోనీక
తఱిమి మారీచుమస్తకముఁ ద్రుంచె
నగములు పఱపించి నడవఁగా జలరాశిఁ
గట్టించె నెవ్వాఁడు కపులచేతఁ
గలన రావణకుంభకర్ణాదుల వధించి
కాచె నెవ్వాఁడు లోకత్రయంబు

తే. నవ్విభీషణవైరనిర్యాతనుండు
రామచంద్రుండు శరణార్థిరక్షకుండు
ప్రజలువొగడ నాచంద్రతారకముగా న
యోధ్య సుఖలీలఁ బాలించుచుండుఁగాత. 56

మ. అనుచుం జానకి కొంతదవ్వరిగి యాహ్లాదంబు రెట్టింపఁగాఁ
గనియెన్ సప్తశతప్రవాహముఖజాగ్రత్తీరభూజాతపు
ష్పనవామోదసుగంధిశంబరధరప్రాజ్ఞోరధిన్ లోకపా
వనభాగీరథిఁ జక్రపత్రజమరుద్వాచాలవీచీరథిన్. 57

క. కని మ్రొక్కి వకులతిలకా
శ్రమనమేరుప్రియక మేదురం బైనదరిన్

జనకతనూజ సుమిత్రా
తనయుఁడు మునుగా రథావతరణము చేసెన్. 58

క. కువలయమనోజ్ఞయును స
త్కవిసేవితయును సుధాప్రకాశయు నై రా
ఘవుకీర్తిఁ బోలుజాహ్నవి
నవనిజ గని ధన్య నైతి నని కొనియాడెన్. 59

క. ఇరువురు నపుడు సనావిక
తరి నవలికి దాఁటి యూరుదఘ్నజలాభ్యం
తరమునఁ గ్రుంకిడి రుచిరాం
బరములు ధరియించి విపినమార్గోన్ముఖులై. 60

క. కంఠీరవముఖవివరా
కుంఠకఠోరారవాతిఘూర్ణితనిహతో
త్కంఠేభగహనమహాదుప
కంఠము వై దేహి తఱిసి కళవళపడుచున్. 61

ఉ. సంకటవంశదంశకటుఝుంకృతులుఁ నిబిరీసఝిల్లికా
ఝింకృతులుం బ్రచండమదసింధురఘీంకృతులుఁ మృగద్విష
ద్ఛాంకృతులుఁ జనశ్రుతిపదంబులు వ్రక్కలుసేయ వెల్లితా
తంకనివేశదీనలపితంబుల లక్ష్మణుతోడ నిట్లనున్. 62

సీ. ప్రాచీననీరసారణ్యంబు గాని యో
గ్యతపోవనశ్రేణి గానరాదు
వికటోగ్రఖరకంటకకుడుంగములు గాని
కర్మందిమఠవాటి గానరాదు
నెగయుదావాగ్ని క్రొంబొగ వెల్లు గాని యు
ద్గతహోమధూమంబు గానరాదు

శరభగండకసింహశార్దూలములు గాని
మానిరాట్సంతతి గానరాదు
తే. కఠినపాషాణదుర్ధర్ష కాపథంబు
గాని నడయాడుమార్గంబు గానరాదు
దాశరథిఁ బాసినట్టిదుస్తరపుఁబాప
కర్మ రాలికి నవి యేల గానవచ్చు. 63

లక్ష్మణుఁడు సీతకు రామాజ్ఞ నెఱింగించుట

మ. అని సంతాపము నొందుసీతఁ గని ధైర్యం బేది సౌమిత్రి వా
ల్చిననెమ్మోమున బాష్పముల్ దొరఁగఁ దల్లీ నేఁడు లోకా
పవాదనిమిత్తంబున రాఘవుండు నినుఁ గాంతారంబులోఁ
డించి రమ్మని యత్యంతకృపావిహీనుఁ డగున న్నంపెన్
యథార్థం బనన్. 64

క. ఆతీవ్రభాషణము విని
సీతాతన్వంగి సొమ్మసిలి వ్రాలె ధరి
త్రీతలముమీఁద ఝంఝా
వాతాహతిఁ బడినపుష్పవల్లికఁ బోలెన్. 65

క. అపుడు సుమిత్రాతనయుఁడు
విపులాసుతఁ జూచి మిగుల వెఱచి నిజభుజా
గ్రపటాంచలమున విసరుచు
నుపచారము సేయఁ దెలివి నొందకయున్నన్. 66

క. ఏ నెపుడు రాఘవునిసే
వానిరతుఁడ నైతి నేని వసుధాసుత స
ప్రాణ యయి బ్రతుకుఁ గా కనఁ
గా నలమినమూర్ఛ దేఱి కనుఁగొని భీతిన్. 67

తే. ఎలుఁగు రాలుపడఁగ నిట్లనుఁ బదునాలు
గేండ్లు రాఘవుండు నీవు నన్న
రణ్యభూములందు రక్షించి నేఁడు కా
అడవి నెట్టు లొంటి విడిచె దన్న. 68

సీత తనదురవస్థ లక్ష్మణునితోఁ జెప్పి శోకించుట

చ. మఱఁదులలోన నెన్నఁగలమాన్యుఁడ వావనదండకోర్విఁబ
ల్దెఱఁగులఁ బర్ణశాలలను దియ్యనిపండుల నేర్చి పెట్టుటల్
మఱచినదాననే యకట లక్ష్మణ యీయెడ నప్రసిద్ధికిన్
బిఱుకులు గాని భానుజవిభీషణు లుండఁగ నీకు నర్హమే.

క. పోరానికర్మబంధము
కోరికయై చుట్టు ముట్టుకొనెఁ గా కిపుడుం
గారణము లేక రాఘవుఁ
డారణ్యక్షోణిఁ బాఱనడుచునె నన్నున్. 70

సీ. విపులబాహాశక్తి విఱిచెఁ బురారికో
దండంబు నానిమిత్తంబ కాదె
చలపట్టి దైతేయశాంబరీమృగముమ
స్తముఁ ద్రుంచె నానిమిత్తంబ కాదె
పాథోధి గిరులచే బంధించి కపిసేన
దాఁటించె నానిమిత్తంబ కాదె
కదనరంగమున జగద్ద్రోహిఁ బంక్తికం
ధరుఁ గూల్చె నానిమిత్తంబ కాదె
తే. యట్టిరాముఁడు తాన నన్నడవిలోన
డించి రమ్మని నిన్నుఁ బుత్తెంచె నట్ల

తీర్చితివి నీవు నన్న ప్రతిజ్ఞ నెఱయఁ
బొమ్ము తమ్ముఁడ సాకేతపురమునకును. 71

ఉ. దీక్షితుఁ డైనకౌశికుఁడు దేరఁగ నాఁడు వివాహవేళ నా
లక్షితకాకపక్షసమలంకృతముం గనవరత్నకుండల
ప్రేక్షితముం సుధాకిరణబింబనిభంబు విశాలపుండరీ
కాక్షము నైనరామునిముఖాంబుజ మెన్నఁడుఁ బాయ
దాత్మలోన్. 72

క. ననుఁ బాసి విరహతాపముఁ
గొని తీఁగలఁ గౌఁగిలించుకొనె నఁట నేఁ డ
వ్వనవల్లులలోనన న
న్ను నునిచెనఁట రాముఁ డేమనుదు దైవంబున్. 73

తే. అత్తలకుఁ గేలు మోడ్చితి ననపగాథ
పూర్ణగర్భిణి యని మనంబున గణింప
కడవిఁ ద్రోయించె నను రాముఁ డనుము చనుము
వత్స నిర్విఘ్నమగుఁగాక వర్త్మమనిన. 74

క. కనుమలె పుణ్యాశ్రమములు
నిను రక్షింపుదురు ధారుణియు జాహ్నవియుం
వనదేవతాసమూహము
నని యూఱడఁ బల్కి డెంద మలమటఁ బొందన్. 75

చ. వలగొని భక్తితో నెరఁగి వంచినమోమున బాష్పపూర
ముల్,దలముగ రామునాజ్ఞకుఁ గలంగుచుఁ బోవ మహీజ
లక్ష్మణుం,బలవుచుఁ జూచు చుండెఁ బశుపాలకుఁ డుద్ధతిఁ
గొంచుబోవఁ బెన్దలఁగునఁ జిక్కి హోమగవి తర్ణకముం
బోరిఁ జూచు కైవడిన్. 76

ఉ. తేరు హుటాహుటిం గదలి దృష్టి కగోచరమై యయోధ్య
కున్, జేరె నరణ్యరోదనము చేయుచు నమ్మిథిలేశపుత్రి మూ
ర్ఛాభరసంబునన్ ధరణి వ్రాలె మృగావలితో నుపాంతకా
సారవిహంగముల్ తదుపచారవిధుల్ ప్రకటించుచుండఁగన్.

ఉ. ఆకడకున్ యదృచ్ఛనిగమాగమశాస్త్రకథారహస్యశి
క్షాకృతకృత్యశిష్యపరిషత్పరివేష్టితుఁడై మెలంగువా
ల్మీకి మఖక్రియార్థము సమిత్కుశయూపకలాపఖండన
స్వీకృతి నేగుదెంచి పృథివీసుతఁ గాంచి కృపాసమగ్రతన్.

తే. అబల యేడ్చినయ ట్లయ్యె నడవిలోన
నేకతం బిట్లు శోకింప నేకతంబో
యనిన నమ్మౌనిసాధువాక్యము నిదాఘ
తప్తకేకిని కబ్దశబ్దమును బోలె. 79

ఉ. ఉల్లము చల్లఁ జేసినఁ గృశోదరి తెప్పిరి వీడియున్నధ
మ్మిల్లముఁ జక్కదోఁపుకొని మెల్లన యే మిథిలేశపుత్రికన్
వల్లభుఁడైన రాముఁ డపవాదభయంబున కోహటించి నా
కల్లనిజంబుఁ జిత్తమునఁ గానక కానలఁ ద్రోచె నీగతిన్. 80

వాల్మీకియాశ్రమంబున సీత కుశలవులం గనుట

ఉ. కొంచక యీశరీరమునకుం దెగఁ జూచిన భ్రూణహత్య సి
ద్ధించు నిజంబు గావున మదిం గడుసాహసకర్మముల్ విస
ర్జించితి నాపురాకృతవిశేషమునన్ నినుఁ గంటిఁ గావవే
యంచుమహీజమౌనిచరణాంబురుహంబులమీఁద వ్రాలినన్.

మ. వగలం దూలఁగ నేల సాధ్వి విను మే వాల్మీకి మీతండ్రికిన్
మిగులం బూజ్యుఁడనై చరింతు నెపుడున్ నేఁ డెల్లెడన్

శౌర్యపారగులం బుత్రుల నిద్దఱం గనెదు గర్భశోభముల్
చేయునీ, తెగువల్ సేయఁ దలంతురే యని ధరిత్రీపుత్రి
నూఱార్చుచున్. 82

క. జననీ లెమ్మని వాల్మీ
కి నిజాశ్రమమునకు జానకిం దోడ్కొనిపో
యి నిజోటజాంతరంబున
కనిచి తపస్వినుల నరయుఁ డని నియమింపన్. 83

క. మునిభామ లవ్వధూమణి
ననవరత ప్రసవఫలసమాకీర్ణనివా
తనివేశవివృతకృష్ణా
జినముపయిం గవి శ్రమింపఁ జేసి యడలుతోన్. 84

సీ. కాఁడినవిషకంటకములు మెల్పునఁ బుచ్చి
తను పెచ్చుపాదపద్మములు గాఁచి
కలదులే దనుపాటి గారనూనె యొకింత
పంకించి తలచిక్కుఁ బాపి ముడిచి
తఱచుగాఁ జెక్కుటద్దములనోడిక లైన
కన్నీరు దుడిచి మొగంబుఁ గడిగి
పొరలాడఁ బెంధూళి బ్రుంగినవలు వూడ్చి
పలుచని నూత్నవల్కలముఁ గట్టి
తే. పూఁటపూఁటకు నుపచారములు ఘటింప
మునివతంసంబు వాల్మీకి యనుదినంబుఁ
గథలకారణమునఁ బ్రొద్దు గడప సతికి
నెలలు తొమ్మిది పరిపాటి నిండుటయును. 85

క. మిహిరునిఁ గూడక పుణ్య
గ్రహమ్ము లయి దుచ్చకేంద్రగములై వెలుఁగన్
విహితశుభలగ్నమున న
మ్మహిపుత్త్రిక గనియె వరకుమారద్వయమున్. 86

క. దెసలు ప్రసన్నము లయ్యెను
ముసురుకొనియెఁ బుష్పవృష్టి మురజధ్వని పె
ల్లెసఁగె దివి శుభానిలము లొ
లసె వహ్ని ప్రదక్షిణార్చులం గనుపట్టెన్. 87

క. పుత్రవతి యై తివని భూ
పుత్త్రిక నగ్గించి నేరుపునఁ బ్రసవవిధుల్
చిత్త్రించి మునికి మౌని క
ళత్త్రము లెఱిఁగింప వటువులం బనుచుటయున్. 88

క. అప్పు కుమారులఁ గనె నని
చెప్పిన వాల్మీకి వచ్చి సీతాసుతులం
గప్పరపడి చూచి మనం
బుప్పొంగి పురస్కృతాగ్నిహోత్రుం డగుచున్. 89

క. అర్చిష్మదర్కసన్నిభ
వర్చస్కులఁ గవలఁ గుశలవప్రకరములం
గూర్చి తగ జాతకర్మముఁ
దీర్చి వరుసఁ గుశలవాభిధేయులఁ జేసెన్. 90

శా. నిష్ఠ న్వారికి నబ్దముల్ వరుసఁ బండ్రెం-డేగ వాచంయమ
శ్రేష్ఠుం డర్మిలి జాతకర్మమును మౌంజీబంధముం జేసి వా
సిష్ఠాగ్నియహావిర్గవిం దలఁప వచ్చె న్వచ్చి తద్వాసనే
దిష్ఠక్షోణిఁ జతుర్విధాన్నములు నుత్కృష్టంబుగా నించినన్.

మ. కలమాన్నంబును నొల్పుఁబప్పుఘృతముల్ గజ్జంబులుం బిండి
వంటలుఁ బౌసెంబులు నానవాలు ఫలముల్ నానావిధవ్యంజ
నావలుల్ రాజతపాత్రలన్ మునిసతుల్ వడ్డింప వాల్మీకి బం
తులుసాగింపఁగ నారగించిరి మునీంద్రుల్ షడ్రసోపేతముల్.

క. వేడ్పుగ భుజించి సుఖసం
తర్పణు లగుమానులకు ముదం బలరించెం
గర్పూరఖండతాంబూ
లార్పణములఁ బారితోషికాదులవలనన్. 93

క. ఉదితారుణసితకిరణా
భ్యుదయులఁ గుశలవుల నత్తపోధనుఁ డంతన్
జదివింప నర్థితోడుతఁ
జదివిరి నానాపురాణశాస్త్రాగమముల్. 94

క. ధీశక్తి నస్త్రవిద్యా
కౌశలులై మౌని నేర్పఁగా నేరిచి ర
ద్దాశరథిసుతులు బహువిధ
వ్యాశుగసంధానమోక్షణాకర్షణముల్. 95

తే. మౌనిజల్పిత మైనరామాయణంబు
స్వరలయగ్రామమూర్ఛల సంచుఁ దెలిసి
పాడి రాలాపములఁ ద్రిసప్తకము మెఱసి
కుశుఁడు వీణెయుఁ దాళంబుఁ గొని లవుండు. 96

క. అడవుల మౌనికుమారుల
బడిఁ జని ఫలమూలముల సపర్యలు సేయన్
గొడుకులఁ జూచి మనంబున
నుడు కించుక దీఱె యుండె నుర్వీసుతయున్. 97

### శ్రీరాము లశ్వమేధంబుం జేయ నారంభించుట

మ. అనఘుం డంతట రాఘవుండు జను లాహ్లాదంబునం బ్రస్తుతిం
ప నయోధ్యాపుర మేలుచుండి మది నప్పౌలస్త్యసంహారజా
తనికృష్టం బగు బ్రహ్మహత్య బలవంతంబైనఁ దద్దోషపం, కని
దాఘంబు తురంగమేధమని కాంక్షం జేయ నూహించుచున్.

క. తలపోసి తపతి యను భూ
తలపతి హయమేధసత్త్రతంతువు నిష్ఠ
జలిపి తన బ్రహ్మహత్యా
కలుష మడఁచుకొని ప్రశస్తిఁ గనఁడే యనుచున్. 99

ఆ. అనుజహితపురోహితామాత్యరాజలో
కమ్ము గొలువ నోలగమున నుండి
యావసిష్ఠవామదేవగాలవగాధి
సుతులఁ జూచి పలికె నతులఫణితి. 100

క. హయమేధ మఖిలపాప
క్షయ మని నిగమములు చెప్పఁ గావున నాకుం
బ్రియ మొదవెఁ జేయ నయ్యా
జ్ఞియవిధు లెఱిఁగింపుఁ డన వసిష్ఠుం డనియెన్. 101

సీ. జననాథ బహుదుఃఖసాధ్య మీయశ్వమే
ధంబు తత్క్రతువిధానంబు వినుము
గోక్షీరతనువుఁ గుంకుమశిరోధియుఁ బీత
వాలంబు నసితశ్రవంబు నైన
వీతి నర్చన చేసి విడిచి తద్రక్షకై
యతిశౌర్యధనులఁ దోడనుపవలయు

వేపు రుత్తమకులద్విజులు ఋత్విజులు గా
వలయు వేర్వేఱ వారలకు నొక్క-

తే. గజము నరదంబు భటచతుష్కమును బూజ్య
గోశతంబును నన్నియ ఘోటకములు
వేయిబారువు లర్థంబు విశదమౌక్తి
కములు నల్లుము వలయు దానముగ నొసఁగ. 102

క. మహి నసిపత్రం బీవ్రత
మహిమాంశుకులేంద్ర దీని కరయఁగ భార్యా
సహితుఁడు గావలెఁ బత్నీ
రహితునకు నుపక్రమింప రా దని పలుకన్. 103

తే. జాతరూపంబుచే మహీజాతరూప
మమరఁ గావించి చేయుదు యాగ మనుచు
మునివరేణ్యునిసమ్ముఖంబునకు సవన
హయముఁ దెప్పించె విభుఁడు లాయమున వెదకి. 104

క. వరలక్షణశోభిత మగు
తురగముఁ గని మౌని విస్మితుం డయి మాల్యా
భరణాదులతో వేవురు
ధరామరుల కపుడు విహితదక్షిణ లొసఁగెన్. 105

ఉ. నేమముతోడ హాటకవినిర్మితభూమిసుతాసమేతుఁడై
రాముఁడు దీక్షఁ గైకొని విరాజితచామరరత్నకింకిణీ
దాముఁవిచిత్రమాల్యపరిధానకురంగమదాక్షతాదులన్
దా మఖవాజి నాగమవిధానసమర్చన మాచరించుచున్.

క. మిత్రకులాగ్రణి దివిజ
స్తోత్రపరాక్రముఁడు వీరసూఃకౌసల్యా

పుత్త్రుఁడు రఘుపతి విడిచిన
సత్త్రహయముఁ బట్టుఁ దుర్విసాహసు లున్నన్. 107

క. అంచు లిఖించినమణిమయ
కాంచనపట్టంబు ఘోటకంబునొసలఁ గీ
లించి బహువాద్యరవములు
ముంచుకొనఁ బ్రదక్షిణించి మ్రొక్కినవేళన్. 108

మ. శతమన్యుప్రతిమానవైభవముతో శత్రుఘ్నుఁ డక్షౌహిణీత్రి
తయానీకముతో రఘూద్వహునకర్థిన్ మ్రొక్కినన్ గారవిం
చి తగం గౌఁగిటఁ జేర్చి యీహయము నీచే రక్షణీయంబు ది
క్పతిసందోహముతోడుగా హరిహరబ్రహ్మల్ విరోధించినన్.

క. అని వీడ్కొలిపిన నన్నకుఁ
బునఁగ్ప్రణామంబు చేసి పోయెను వేడ్కన్
ఘనవాద్యనినాదంబులు
వినువీథిం బఱచె దిశల వీడ్వడి మ్రోయన్. 110

మ. క్రతుఘోటంబు సమస్తభూములు నిరాఘాటంబుగం జొచ్చి
మారుతవేగంబునఁ బోవఁ గొందఱు నరేంద్రుల్ డాసి తత్ఫా
ల సంస్థితజాంబూనదపత్త్రికాలిఖితసందేశంబు వీక్షించి యా
నతులై కొల్వఁగ వామలూరుజునరణ్యానిం బ్రవేశించినన్.

క. ఆకాలమున మఖార్థము
నాకుభవుఁడు వరుణపురమునకుఁ జన ధృతస
జ్జీకృతకార్ముకుఁడై లవుఁ
డాకానన మరయ నత్యయము లేకుండన్. 112

ఉ. ఆమహనీయపావనవనాంతిక నాకసరిత్తటీశుక
శ్యామలకోమలాగ్రయవసస్తబకాభిరతిన్ జనన్ వటు

స్తోమము చూపఁగా లవుఁడు చూచి తదీయలలాటపట్టికా
హైమనవీనపత్త్రబిరుదాక్షరపంక్తిఁ బఠించె నర్థితోన్. 113

క. మిత్రకులాగ్రణి దివిజ
స్తోత్రపరాక్రముఁడు వీరసూఃకౌసల్యా
పుత్త్రుఁడు రఘుపతి విడిచిన
సత్త్రహయముఁ బట్టుఁ డుర్వి సాహసు లున్నన్. 114

క. అని చదివి లవుఁడు రాఘవ
మనుజేశునితల్లి వీరమాఁ తఁట సీతా
జనని కుశలవుల నిరువురఁ
గనియు నకట గొడ్డు వోయెఁ గడపట ననుచున్. 115

చ. కవకవ నవ్వి యజ్ఞతురగంబు మెడం దనయుత్తరీయముం
లవుఁడు దవిల్చి మొక్కలమునం గదళీతరువందుఁ గట్టివే
య వటుకుమారు లేటికి నిరర్థకవైరము దీనివెంబడిం
జవగతి వచ్చుసైన్యరభసం బదె చూడుము నీవు నావుడున్.

క. మునిసుతులు మీరు సీతా
తనయుఁడ నే నెఱుఁగ రాజధర్మము తలఁగుం
డనిఁ బగఱ గెలుతు నొండెను
మొనతలఁ గైవల్యసౌఖ్యముఁ గనుదు నొండెన్. 117

లవుం డధ్వరఘోటకంబు బంధించుట

సీ. అనునంతలోన సైన్యములు భీకరభంగి
నరుదెంచి కదళికాతరువుతోడఁ
గట్టినక్రతుఘోటకముఁ జూచి యెవ్వఁడీ
తురగంబుఁ గట్టినదుండగీఁడు

నావుడు జానకీనందనుం డను యజ్ఞ
వాహంబుఁ గట్టినవాఁడ లవుఁడ
వలవదు రిత్త నొవ్వకపొం డనిన నవ్వి
సైంధవబంధమోక్షణము సేయఁ
తే. గనలి కరములు శరములఁ దునుఁగ నేయ
నలమి బలములు ముసలచక్రాసితోమ
రములు పరఁగింప నవియుఁ జూర్ణములు చేసె
గౌతమీస్నాత చెఱుచుపంకములకరణి. 118

మ. పరసేనల్ లవుఁ డక్షయాశుగములన్ భంజింప శత్రుఘ్నుఁ డ
ల్కరథంబుద్ధతిఁ దోలుకొంచుఁ గదియన్ లక్షించినిశ్శంకుఁడై
వరమాహేశ్వరమంత్రసంస్మరణగర్వస్ఫూర్తినేసెన్ వడిన్
శరపంక్తిం బరిపంథిచారుతరవక్షంబున్ గవాక్షంబుగన్.

క. తూలి వెడ దెలిసి విస్మితుఁ
డై లవణాంతకుఁడు లవుని నలుక నలికముం
గీలుకొన నేసె నురవడి
నాలీకనిశాతమార్గణత్రితయమునన్. 120

క. తననొసల నాటి నమ్ములు
వనజంబులరీతి మణులవడువున మెఱయం
గనలి కుశానుజుఁ డుద్ధతిఁ
బినతండ్రిం గదిసి రోషభీషణుఁ డగుచున్. 121

చ. ప్రకటధనుర్గుణారవవిపాటితదిక్కుహరాంతరాళుఁడై, యొక
విశిఖంబునన్ సిడము నొక్కశరంబున సూతు నాల్గుసా, యక
ములఁ జక్రరక్షకుల నన్నియకాండములన్ రథంబు ఘోటక
ములఁద్రుంచి భల్లమొకటన్ హృదయం బగలించియార్చినన్.

మ. సమరోర్విన్ లవణాసురుం దునిమె నేశస్త్రంబు తద్దివ్యబా
ణము వేఁబొందుశిలీముఖాసనమునన్ సంధించి యోవత్స వే
గమసంగ్రామముఁ బాసిపొ మ్మిది యమోఘంబేను నీమీఁదిప
క్షమునన్ జెప్పితినన్న నవ్విశిఖమున్ సైతేయుఁ డీక్షించుచున్.

క. భ్రాత కుశుఁ డున్న నిది ని
ర్ఘాతముగాఁ జేయు నైనఁ దునిమెద నేనున్
మాతల్లి యగుమహీసుత
పాతివ్రత్యంబు ధర సుపాస్యం బైనన్. 124

మ. అని సంధాపరతంత్రుఁడై నిలువ నయ్యస్త్రంబు శత్రుఘ్నుఁడే
సిన నాతం డెడఁ ద్రుంచినన్ జెడక తచ్ఛేషంబు సీతాతనూ
జునికోదండము రెండుగా నఱికి వక్షోభాగముం దూఱఁజెం
దినమూర్ఛన్ ధరవ్రాలె నిశ్చలునిరీతిన్ రక్తసిక్తాంగుఁడై.

క. భేరీశంఖపటహధ
క్కారావము లపుడు దిఙ్ముఖాతీతములై
బోరు కలఁగ హతశేషచ
మూరక్షకసింహనాదములు గర్జిల్లన్. 126

మ. తురగంబు న్విడిపించి శౌర్యనిధిశత్రుఘ్నుండు చెంతం గుశా
వరజుం గాంచి యురోవిదారణగరుద్వ్యస్తాశుగక్లేశదు, స్తర
సంతాపముఁ దీర్చి రాఘవునిసాక్షాత్కార మానందనుం, దర
యం గేవలమూర్తిగాఁ దనుచు నధ్యాహారముం జేయుచున్.

క. ఒడల నసలుకొను నెత్తురు
గడిగి రఘూద్వహునిసమ్ముఖము చేయుదు ని
వ్వడుగు నని తనరథముపై
నిడుకొని చనియె న్మఖాశ్వ మేగెడు దెసకున్. 128

ఉ. అక్కడ భూమిపుత్రి లవుఁ డాఁకొనె గాఁ డని శోకవేదనం
బొక్కఁగఁ బాలుఁ తెంచి మునిపుత్రులు నీసుతుఁ డధ్వరాశ్వ
ముఁగ్, గ్రక్కునఁ బట్టి మార్కొను నరాతిబలంబులఁ ద్రుంచి
వారిచే, జిక్కి ధనుర్ధరుం డొకఁడు చేతిశరాసనయష్టిఁ
ద్రుంచినన్. 129

క. అని మునితనయులు పల్కిన
ఘనమేఘధ్వనికి నళుకుకన్నియరీతిన్
విని గుండియ పగిలి మహీ
తనయ తనయుఁగూర్చి బహువిధంబుల నడలెన్. 130

తే. కాననంబునఁ గుశుఁ డంతఁ గందమూల
ఫలసమిత్కుశపత్రపుష్పములు గోయ
నచటఁ దనవామలోచనం బదర బెదరి
సమరజయచిహ్నములు చూచి సంభ్రమించి. 131

సీ. గ్రమ్మన మగిడి తస్కరులచే ధనముఁ గో
ల్పోయిన ట్లున్న భూపుత్రిఁ గాంచి
యింతశోకముఁ బొంద నేటికి నంబ నే
డెదురుగా లవుఁడు రాఁ డెందుఁ బోయె
నెఱిఁగింపు మని పల్క నెచ్చోటనుండియో
వచ్చునధ్వరసైంధవంబుఁ బట్టి
కదళికాతరువుతోఁ గట్టి మార్కొనువీర
యోధులఁ బెక్కండ్ర నుక్కడంప

తే. ధనువుఁ దెగనేసి యొక్కపాతకుఁడు సుతునిఁ
బట్టుకొనిపోయెనఁట చేటు పాటు దెలియ

రాకఁ బోఁగిలెద నీవు శాత్రవు జయించి
యనుజు మరలించి నాదుఃఖ మార్పు మనిన. 132

క. శోకంబు మాను విమతా
నీకంబులఁ ద్రుంచి తమ్మునిం దెచ్చెదఁ దూ
ణీకార్ముకాసిచర్మ
దాకవచము లిమ్ము సమ్మదంబున ననినన్. 133

మూర్ఛితుఁడైనలవునకు కుశుఁడు తోడ్పడుట

క. కుశలుఁడవై గెలువు నిరం
కుశవృత్తిని రిపుల ననుచుఁ గుంతగదాచ
ర్మశరాసనకవచాదులు
కుశవీరున కొసఁగి వీడుకొలిపిన నతఁడున్. 134

క. తల్లిపదాబ్జములకుఁ బ్రణ
మిల్లి కదలె విలయకాలమేఘ మొదరి గ
ర్జిల్లె నన దిక్కు లద్రువఁగ
మల్లడిచుకొనుచుఁ బటుసమరదోహలియై. 135

మ. తరుశైలంబు లదభ్రయానగతిచేతం జూర్ణముల్ గా దిగం
తరము ల్మాఱువిరి చిమ్మచీఁకటుల నీన న్వచ్చునుద్యద్ధను, ర్ధరు
నీక్షించి పతాకినుల్ హరికిశోరంబు న్విలోకించుసిం, ధుర
యూథంబుల భంగిఁ బాఱఁగని శత్రుఘ్నుండు సేనానితోన్.

కుశునియుద్ధము

ఉ. పైకొని లోకముల్ చెఱుపఁ బొల్పడివచ్చుయుగాంతకాలరు
ద్రాకృతి నిక్కుమీఱఁ డసహాయత గా నదె చూడు మా

హావో,త్సేకము దక్కి శౌర్యములు చెట్లనుగట్టుమమాడ్కినీ
వరా,నీకినులుద్ధతిం బఱచె నేల పదాహతిఁ దూలిధూళిగన్.

క. ఉఱుమక పిడుగులు పడియెడి
వఱళులు వాపోవఁ జొచ్చె వాహిని కెదురై
యొఱలందు నాయుధంబులు
విఱిగిపడం దొడఁగెఁ బుట్టె విపరీతంబుల్, 138

క. అదిగాక కాకఘూకస
ముదయంబులు రథికమస్తముల వ్రాలెడుఁ బో
వఁ దలఁచిన జయపతాకల
తుదల నిమిత్తంబు లేక ధూమము లెగసెన్. 139

క. నీకార్ముకవిద్యకలిమి
నేకీడును నతనిఁ బొరయనీక రణమునం
జీకాకుపఱచు మని య
క్కాకుత్స్థుఁడు పనుపఁ జులుకుగలసేనలతోన్. 140

శా. సేనావాహుఁడు జానకీసుతుని నాజిం దాఁకి నాళీకబా
ణానీకంబుల ముంచినం గుశుఁడు ప్రత్యస్త్రంబులం ద్రుంచిసా
,జానేయధ్వజచక్రరథికధనుస్సవ్యేష్ఠపత్రంబుగా.
సేనానిం బదహస్తమస్తములు విచ్ఛేదించి మోదించినన్.

క. నగుఁ డన్నపాటు గనుఁగొని
దిగిభనిభద్విపము నలుక దీకొలుపుచు బె
ట్టగుశక్తి వైవఁ గుశుఁ డర
నగుచుం దునిమె దాని మూఁడునారాచములన్. 142

సీ. మఱియు నాగ్రహము డింపక విశంకట కార్ము
కంబునఁ జతురంజికములు దొడిగి

దంతావళంబుపాదములునాలుగు నుర్విఁ
దెగ నేయ నది మ్రొగ్గతిలక మున్న
కరి డిగ్గనుఱికి భీకరగదాహస్తుఁడై
కదియ నగ్గదతోడ కరముఁ దునుమ
సవ్యదోర్మండలిఁ జక్రంబు సంధింప
నది సనాథనముగా నట్ల చేయ
తే. రాహు వర్కునిఁ బట్టు నాగ్రహము దోఁప
మలయునగుఁ జూచి కుశుఁడు జిహ్మగముఁ దొడిగి
కర్పరమున కురుండంబుఁ గత్తరింపఁ
బాత్రముగఁ బూనె నది కాలభైరవుండు. 143

చ. నగుపని పోరిలో నడఁగినన్ లయకాలునిమాడ్కి సేనవెన్
దగిలి గజాశ్వసద్భటరథంబులఁ జిత్రవధం బొనర్ప న
ల్కఁ గదిరి లక్ష్మణానుజుఁ డిలాసుతపట్టి నిశాతభీషణా
శుగనిహతిం దెరల్చినఁ గుశుం డతిరోషకషాయితాక్షుఁ డై.

ఉ. అర్వసమన్వితంబుగ శతాంగముఁ జూర్ణము చేసి యానమ
త్పర్వశరాహతిన్ హృదయతాప మొనర్చుచు నాల్గుతూపు
లన్,గర్వ మెలర్పఁ బేరుర మగల్చినఁ గూలె నతండు తేరిపైఁ
బర్వతసానుభూస్ఖలితభద్రమదద్విరదంబుచాడ్పునన్. 145

శత్రుఘ్నుఁడు కుశునిచేఁ బడుట

శా. శత్రుఘ్నుండు వడన్ హతాశఁ బఱచెన్ సైన్యంబు దైన్యం
బునన్, జైత్రోత్సాహము దక్కి తేఱి లవుఁ డన్నన్ జేరి
తత్ప్రేరణన్, సత్రీయాశ్వముఁ బార్శ్వభూజమున నంటం
గట్టి జంఝామరు, న్మైత్రిం బొల్చుహుతాశులీలఁ గుశుఁ
డుత్సాహించె సోదర్యతోన్.. 146

సీ. హతశేషు లపు డయోధ్యాపురంబున కేగి
హయమేధదీక్షితు యజ్ఞవేది
కాసీను మౌనివర్యపరీతు ననుజన్మ
సేవ్యమానుఁ గురంగశృంగహస్తు
సారంగచర్మవాసను దండమేఖలా
ధరు శాతకుంభసీతాసమేతుఁ
దిలసమిదాజ్యవర్తితహోమధూమావి
లారక్తలలితకర్ణాంతనేత్రు
తే. రామభద్రునిఁ గని సప్రణాము లగుచు
దేవ నీయధ్వరాశ్వ ముద్వృత్తి సకల
దిక్కులను ద్రొక్క నడవిలో నొక్కవటువు
పట్టి బంధించెఁ గదళికాపాదపమున. 147

క. అట్టివడుగుపోలిక మీ
యట్టిద శిశు వయ్యుఁ గ్రతుహయానుగసేనం
గొట్టి తుది నీయనుజుచేఁ
బట్టువడియె విల్లు విఱిగి బడలినకతనన్. 148

క. శాతాసిచాపధరుఁ డపు
డాతని కొకయాప్తబంధుఁ డరుదెంచి బల
వ్రాతములపై కుఱికి తన
చేతులకసిఁ దీర్చి కూలిచెను శత్రుఘ్నున్. 149

క. అను వారిభాషణంబులు
విని రఘువరుఁ డనియె మీకు వెఱ్ఱితనము ప
ట్టెనొ భూతము సోఁకెనొ నా
యనుజుం డబ్లల చిక్కు నహితులచేతన్. 150

క. నావుడు దేవా నీపద
సేవకులకు నెందుఁ గీడు చెందునె నిక్కం
బీవిన్నప మన రామ
క్ష్మావల్లభుఁ డాత్మలోనఁ గళవళపడుచున్. 151

తే. ఎన్నఁడును నాకు నుత్తరం బియ్యఁ డెదుర
లవణు నెక్కటి దునిమె నాలమునఁ గినిసి
యట్టినాతమ్ముఁ డాజిలో నర్భకునకుఁ
జిక్కెనఁట దైవ మి ట్లెంతచేసె ననుచు. 152

రాముఁడు సౌమిత్రిని యుద్ధమున కనుపుట

ఉ. లక్ష్మణుఁజూచి భాస్కరకులప్రవరుం డనియె స్మహర్షహః
పక్ష్మగబాష్పరోధికరపల్లవుఁడై యిపు డధ్వరక్రియా
లక్ష్మము దాల్చినాఁడ దెసలం జన దీవు హతానుజన్మ జ
న్యక్ష్మనిరుద్ధవాహయమళార్భకజేతవు గమ్ము పొమ్మనన్. 153

సీ. నగరాజములకు నానగరాజసముఁ జూపు
కటుతరాష్టమదాంధ గంధకరులు
పవమానగతి నేరు పవమానపద దాఁటు
ఘాటీనిరాఘాటఘోటకములు
శరదభ్రవిభవమాశరదభ్రమును జేయు
రథికసారథిమనోరథరథములు
హరికిశోరములగో హరికిశోషిలనిదు
ర్వారగర్వాటోపవీరభటులుఁ
తే. గ్రందుకొని సేన నానాముఖముల నడవఁ
బ్రళయభైరవహుంకారభయదపటహ

నాదములతోడ సమరసన్నాహి యగుచుఁ
గదలె సౌమిత్రి రఘుకులాగ్రణికి మ్రొక్కి. 154

క. ఆక్రందదూర్మిమాలా
తిక్రాంతావధిపయోనిధిప్రతినిధియై
విక్రమరేఖార్భటి భూ
చక్రము గ్రక్కదలఁ గదలు సైన్యముతోడన్. 155

తే. వచ్చి సౌమిత్రి వాల్మీకివనముఁ జొచ్చి
ప్రస్తకచభారమేచకాస్తరణపటమ
హాహవక్షోణి వీరశయ్యాగ్రసుప్త
ధూళిధూసరగాత్రు శత్రుఘ్నుఁ జూచె. 156

ఉ. అప్పుడు వచ్చునేనఁ గుశుఁ డారసి నిర్భయతన్ సహోదరుం
దప్పక చూచి పైకొనెఁ బతాకిను లెయ్యది కార్య మిత్తఱిన్
జెప్పుము నా లవుం డిచటఁ జెప్పెడి దేమి విరోధిసేనలం
బిప్పిరి చేసెదన్ సెలవుఁ బెట్టుము నీవుఁ గడంగు మాజికిన్.

క. అని లవణాంతకుచే ము
న్నని దనకార్ముకము భగ్న మయినకతన భ
క్తినియమపురస్సరంబుగ
నినుగుఱిచి లలాటతటసమేతాంజలియై. 158

తే. సవిత మూర్తిత్రయాత్మక సప్తతురగ
చండపూషనతామరజలజమిత్ర
హంస ఋగ్వేదరూప మేషాద్యధీశ
ఖప్రకాశ హిరణ్మయ కర్మసాక్షి. 159

లయగ్రాహి.—

భాస్కర భవామయతిరస్కర నమజ్జనయ
శస్కర సహస్రకరమస్కర ధరశ్రే
యస్కర నభోమణియహస్కర చరచ్ఛరదు
పస్కర సదారుణపురస్కర సదేకా
పస్కర తమఃపటలతస్కర కిరీటగళి
రస్కర గృహీతసునమస్కర సహారో
జస్కర జనీపసవయస్కర విసర్వజగ
దాస్కర భజే యని నమస్కరణుఁ జైనన్. 160

శా. శూరాగ్రేసరుఁడైనయాలవునకుం సూర్యుండు ప్రత్యక్షమై
హైరణ్యద్రవలిప్తలస్తకము రత్నాలంకృతంబుం సమి
ద్వీరారాతినిదారణక్రమకళావిశ్రాణనాహంకృతి
స్ఫారజ్యారవభైరవంబు నగుచాపం బిచ్చి విచ్చేసినన్. 161

క. గురుఁ డగువాల్మీకిమునీ
శ్వరుఁ డొసఁగినసౌరమంత్రజపమువలన భా
స్కరుఁ డిచ్చినవిలు గైకొని
యరిగి కుశున కాధనుర్మహత్త్వముఁ జెప్పెన్. 162

మ. ధరణీజాతతనూజు లత్తఱి సుమిత్రాపుత్రునిం దాఁకినం
గరటిస్యందనఘోటవీరభటయుక్తం బైనసైన్యంబు మం
దరమై నాకమహీధరభ్రమణఘూర్ణం బైనపాథోధికిం
దరమై వ్రేల్మిడి యోజనార్ధబల మంతంబొందె నక్షోల్తలన్.

తే. ఆనెగులు చూచి కదిసె సేనాని యైన
కాలజిత్తుండు తాను లక్ష్మణుఁడు కుశుని

నొక్క మొగిఁ జుట్టుకొనె లవుఁ డెక్కువేలు
భ్రములుపరిఘాదిసాధనభ్రములు మెఱయ. 164

క. కరులు పదిపదులు కరి కల
కరదమును సహస్ర మరద మరదంబునకున్
హరిశతము హరికి హరికిం
బరివారము నూటిసంఖ్య భ్రమి యనఁబరఁగున్. 165

క. మును చి బలము లి ట్లవరో
ధించిన లవుఁ డంతకాకృతిం గనలుచు గ
ర్జించి పటుప్రహరణహతిఁ
ద్రుంచె ముహూర్తమున దశచతుష్కభ్రములన్. 166

మ. కరవాలద్రుఘణేళికానఖరచక్రప్రాసబాణాసన
చ్ఛురికాపట్టిసకుంతతోమరగదాశూలంబులం బోరి పో
రి రణోర్విం గుశుఁ డాన కా లవుఁడు వర్మీభూతనానాస్త్రజ
ర్జరితాసృగ్ఘరగాత్రుఁడై నిలిచెఁ బార్శ్వంబు ల్విలోకించుచున్.

చ. అతనిపరాకు చూచి రుధిరాక్షనిశాటుఁడు తొల్లి రాఘవ
క్షితిపతి లెంకయై శరణు చెందినవాఁడు భయంకరాహవా
యతబలశౌర్యశాలి లవణాసురుమాతులుఁ డేమఱించి తీ
వ్రతఁ గొనిపోయె నాలవకరస్థశరాసన మభ్రవీథికిన్. 168

చ. అపహృతచాపుఁడై లవుఁ డహంకృతిఁ జక్రముఁ గేలఁ బూని
చక్రిపటిమఁ జూపి దేశికవరేణ్యకృపార్జితమాతరిశ్వమం
త్రపఠనశక్తి నుప్పరము దాఁటి విహంగముఁ బట్టుజాలెడే
గపగిది దైత్యునిం దఱుమఁగా మది బెగ్గల మంది సైనికుల్.

సీ. గజశరీరములమార్గణరంధ్రములవెంటఁ
జొరఁ బాఱి దివిఁ దొంగిచూచువారు

భగ్నశతాంగకూబరచక్రముల క్రింద
నొడిఁగి చప్పుడు సేయ కుండువారు
హయకబంధములఁ బాయఁగఁ ద్రోచి యెడ నైన
యెడఁ బక్కెరలలోన నీఁగువారు
భటవిగ్రహములకుప్పలక్రేవఁ దలలపై
హరిగలు మాటుగా నడఁగువారు

తే. నైరణస్థలి నీతఁ డెవ్వారిమీఁది
కొఱఁగునో యని మది వెఱచఱచి ప్రాణ
రక్షణోపాయపరత నస్త్రములు విడిచి
కళవళించిరి శౌర్యంబు గట్టిపెట్టి. 170

తే. అంత దశరథమంత్రి సుమంతసుతులు
సాహసులు పదుగురు సింహ చంద్ర కాల
ధార్మిక మదన శత్రుసూదన జితశ
త్రూమల శరన్నద సుకేతు లాగ్రహించి. 171

క. ఉదితజ్యాఘోషంబులు
చద లందుకొనంగ నార్చి సమసమయమునన్
బదిపదిశరముల నేసిరి
చిద్రుపలుగా లవునిచేతిశితచక్రంబున్. 172

క. ఆచక్రము హతమైన ని
లాచక్రముమీఁది కుఱికె లవుఁడు లవుడి బా
హాచటులవిభ్రమభ్రమ
రీచండిమరేఖ సంతరించుచు విసరన్! 173

క. అశనిసదృక్పరిఘాతన
విశసనములఁ గూలి రొక్క వ్రేల్మిడిలోనన్

దశరథమంత్రితనూజులు
దశరథు నత్యంతశౌర్యదశరథు లాజిన్. 174

ఉ. అంత మదోద్ధతుండు రుధిరాక్షుఁడు క్రమ్మఱఁ బాఱు తెంచి దు
ర్దాంతగదాహతిన్ లవుశిరంబుఁ బగిల్చినఁ గ్రమ్మునెత్తుటన్
గొంతవిసంజ్ఞుఁడై తెలిసి కుంతముఁ ద్రిప్పుచు నార్చి దానవుం
గొంతుకద్రుంచికైకొనియెఁగొంకకతన్మషితార్కచాపమున్.

క. దైతేయు నిట్లు గెడపిన
సైతేయునిఁ జుట్టు ముట్టి సైన్యము గవిసెన్
మాతృజతరభరసదో్యో
జాతార్భకుఁ బొదువుమోహజాలము లీలన్. 176

చ. అడఁగినచంద్రనిప్పు నికటార్జునముం దెగటార్చి పేర్చి కా
ఱడవి దహించుమాడ్కి లవుఁ డంటినసేనలఁ బెక్కుభంగు
లన్, బొడ వడఁగించి మండి బలుమూకల వెంపరలాడుచుండె
న్నప్పు డెదిరె లక్ష్మణుం గుశుఁ డపూర్వమృగేంద్రపరాక్ర
మోన్నతిన్. 177

ఉ. శూరత నిల్లువిర్చినకుశుం గని లక్ష్మణుఁ డైదుతూపులన్
జేరరముం బగిల్చిన సమీరశరం బరిఁబోయుచున్ సమి
ద్ధీరుఁడవైన నిల్వుమని తెల్పుచు నేయ ముహూర్తమాత్ర మ
త్తేరు కులాలచక్రముగతిం దిరిగెన్ గడువిస్మయంబుగన్.

క. అరదము బిరబిరఁ దిరిగెడు
భరమున రథ్యములు నాల్గుఁ బంచత్వము నొం
(రణకుతూహలమున నొం
రథ మ్మపు డెక్కి లక్ష్మణుఁడు కట్టలుకన్. 179

క. క్రమమునఁ గిరీటమును గవ
చము నైదస్త్రములఁ దునుమ సంహృతనిర్మో
కమహాహిలీల విగత
క్లముఁడై కుశుఁ డనియె నగుచుఁ గాకుత్స్థునితోన్. 180

తే. మోపుచేటుగ నున్నయీమకుటకవచ
భార ముడిపినపరమోపకారి వగుట
నేను బ్రత్యుపకారినై యిపుడ తీర్తు
బాణపంక్తుల నీసైన్యభార మనుచు. 181

శా. ఆగ్నేయాస్త్ర మథర్వమంత్రమున నేయం దన్మహార్చిశ్ఛటా
భగ్నంబై నెఱి దూలుసైన్యముఁ బరిభ్రష్టాశ్వముం జేతనా
ముగ్నాగప్రకరంబుఁ జూర్ణితరథంబుక్ దగ్ధపాదాతముక్
ద్రాగ్నిర్ధూలితచామరాభరణతూర్యచ్ఛత్రశస్త్రంబుగన్. 182

క. ఆరణమున నిటు శిఖిశర
దారుణశిఖ లాక్రమింప దాశరథి కన
ద్వారుణమార్గణమున నప
వారణ మొనరింపఁ గుశుఁడు వారని కినుకన్. 183

శా. వాయవ్యాస్త్రము వింటఁ గూర్చి విమతవ్యాపాదవైదగ్ధిమై
నేయం దచ్ఛటులాశుగప్రభవబంహిష్ఠభ్రమీధూతవా
త్యాయంత్రోత్థితసైన్యమాకసముఁడాయంబోయెనా యోధన
శ్రీ యొప్పెన్మణిమండపంబునకు మాంజిష్ఠంపు మేల్కట్టనన్.

క. సేనదురవస్థఁ గని యా
సేనాధీశ్వరుఁడు కాలజిత్తు కుశు నురం
బానతపర్వశరాహతి
చే నంటఁగ నేసి పలికె సెలవుల నగుచున్.

క. నాలా వెలుఁగవు బాలుఁడ
వాలము నీ కేల తొలఁగు మనఁ గుశుఁ డలుకన్
వాలికతూపునఁ బ్రేలెడు
నాలికఁ ద్రెం చుగ్రశరమునం దలఁ ద్రుంచెన్. 186

ఆ. కాలజిత్తు కలన వ్రాలిన సౌమిత్రి
కనలి బహువిధాశుగములఁ జక్ర
శూలముసలభిండివాలఖడ్గాదిప్ర
హరణముల నిగుడ్ప వరుసఁ దునిమి. 187

సమరంబున లక్ష్మణుఁడు నిహతుం డగుట

చ. హితమతి వామలూరుభవుఁ డిచ్చినవిశ్వసదుగ్రపన్నగ
ప్రతిభటతేజితప్రదరపంచక మార్చుచు నేయ నుద్గతా
ప్రతిహతకీల లాకసముఁ బ్రాఁక నురస్థ్సలి గాఁడినన్ రణ
క్షితిఁబడె లక్ష్మణుం డనవశిష్టరుగ స్తమితార్కుఁడో యనన్.

చ. దురమున లక్ష్మణుండు నిహతుం డగుడున్ గుశుఁ డచ్చలం
బునన్, హరిగయు వాలుఁ గైకొని కులాద్రుల నిద్రుఁడు
వజ్రధారచేఁ, బొరిగొనుమాడ్కి నగ్రమునఁ బోరెడుత
మ్మునిఁ గ్రమ్ముకొన్న సిం,ధురములఁ గూల్ప నిద్దఱు నెదుర్ప
డి త్రుంచిరి సైన్య మంతయున్. 189

క. పటినచలమున నీగతి
ట్టముగా సేనఁ బిలుకుమార్చి కదలిరా
ట్టికసీలలు మదిలోఁ
శినహర్షమునఁ దమతపోవనమునకున్. 190

సీ. కాకుత్స్థుఁ డపుడు గంగాపుణ్యవాహినీ
తీరయజ్ఞవితర్దిదీక్షఁ బూని
యతులతో నర్ఘ్యాసనాసీనుఁడై భర
తునిదిక్కుఁ జూచి శత్రుఘ్ను నాజిఁ
గూల్చినహయచోరకులఁ ద్రుంచి రా కేల
తడసెనొకో సుమిత్రాసుతుండు
కల నైన నెదిరింపఁ దలఁకు ముల్లోకంబు
విరసించి యేశూరుఁ డోరయు నతని

తే. జీవితేచ్ఛల శరణుఁ జొచ్చిరొ కొమాళ్లు
లేక చలమునఁ బోరి త్రెళ్లిరొ ధరిత్రిఁ
గాక వారలతల్లి శోకమున మిగులఁ
బొగలుచును వేఁడుకొనియెనో పుత్రభిక్ష. 191

ఉ. జన్న ముపక్రమింప దివసత్రయమాత్రమ ధూర్తబాలకుల్
నన్ను విభీషణాదులఁ దలంపక లక్ష్మణుబాహువీర్యముం
సన్నముగా గణించి రవిచారతఁ దమ్ముఁడ వేగ బుద్ధిసం
పన్నులఁ బంపు మచ్చటిక్రమం బఖిలంబు నెఱింగిరాఁదగున్.

క. నావుడు భరతుం డేవుర
లావు వెరవుగలుగుదూతలను వెస రామ
క్ష్మావరుసమ్ముఖమునకుం
రావించిన వారి కాథ రావరుఁ డనియెన్. 193

మ. కొమరుల్ మిక్కిలిసాపరాధు లయినం గ్రోధాతిరేకంబునం
సమరక్షోణి వధింపఁజూడక దయం సమ్మోహనాస్త్రప్రయో
గమునం వారలఁ బట్టితెం డిటకు నాకారంబు లస్మత్స్వ
పములంచుం బలుమాఱు వేగరులుచెప్పన్వింటి నిక్కంబు

ఆ. అదియుఁగాక సీతయాస్యలక్షణము ల
క్ష్యవలమొగములందు గలవొ తెలిసి
యడవి నేల తిరుగ నంబపే రెద్ది సౌ
మిత్రి నడుగుఁ డనెడుమాత్రలోన. 195

శ్రీరాముఁడు లక్ష్మణుంగూర్చి పలవరించుట

ఉ. క్రమ్మెడుశోణితంబు గరగట్టఁగ గంటులవెంట బెట్టుగా
జిమ్మనఁ బాఱుతెంచి హతశేషులు దీఱితుఁ డైనరాముపా
దమ్ముల వ్రాలి యోరఘువతంస సుమిత్రసుతుండు నాజిమ
ధ్యమ్మునఁ గూలెఁ దత్కుశశరాభిహతిన్ లవణారికై వడిన్.

ఉ. పీలక కాలజిత్ప్రముఖవీరులు మున్న కుశాశుగాహతిన్
గూలిరి రక్తధారలు బుగుల్కొన లక్ష్మణుమ్రోల ధాతుకు
త్కీలము నాల్గువంకల నతిత్వరమాణసమీరవర్తనో
స్ఫాలితసంప్రఫుల్లసుమనోభరకింశుకవాటికై వడిన్. 197

క. ఇచ్చటికిఁ గుశుఁ డవశ్యము
వచ్చు నతఁడు రాకమున్న వలయు నెదురుగా
విచ్చేయ నేటియాగము
చిచ్చెగసినవెనుక వశమె చేటను గ్రమ్మన్. 198

క. అనుయోధవరులమాటలు
విని రఘువీరుండు వీఁపు విఱిగిపడియెఁ గ్ర
మ్మినమూర్ఛ భరతు నంతిక
మునఁ బరశుచ్ఛిన్నసాలభూజముఁబోలెన్. 199

ఉ. అప్పుడు విన్ననై భరతుఁ డన్నఁ గనుంగొని మే నికుమ్మగాఁ
గప్పిహిమాంబుపూరములు కన్నులఁ బల్మఱు నొత్తి వీనులం

గప్పురమూఁదఁగా నెఱియఁ గప్పినమూర్ఛయొకింత దేఱినన్
దెప్పిఱి లేచి వావిడిచి నిల్వక బెట్టలుఁ గత్తి యేడ్చుచున్.

మ. అనురక్తిం బదునాలుగేం డ్లడవులం దాహారనిద్రల్ దొఱం
గి ననుం గాచితి పెక్కుభంగుల సురల్ గీర్తింపనయ్యింద్రజి
త్తు ననిం ద్రుంచితి నిన్ను మాణవకమాత్రుం డెట్లు నిర్జించెరా
యనుఁ దండ్రీ యను నీవు లేనిమఖదీక్షాపేక్ష లింకేలనున్.

క. తమ్ములు పడియున్న సమీ
కమ్మున కేఁ జనెదఁ గార్ముకము నస్త్రములన్
దమ్ముఁడ యెడచేయక నా
కిమ్మనఁ గేల్మోగిచి భరతుఁ డిట్లని పలికెన్. 202

సీ. సంగ్రామభీరులై చారులు పఱతెంచి
విన్నవించిరి గాని వినఁ బొసంగ
దది మూర్ఛ గాఁబోలు నమ్మహాభుజులకు
మరణ మెక్కడిది రామక్షితీశ
లక్ష్మణశత్రుఘ్నులకు సహాయుండనై
చని తేర తురగతస్కరులఁబట్టి
బంధించి నీప్రతాపము చూపి యజ్ఞవా
హమ్ముఁ దెచ్చెద నన్ను నంపు మనిన
తే. నధిపుఁ డిట్లను నీకుఁ దో డర్కసుత వి
భీషణులు తక్కఁ దక్కిన పేరుగలుగు
వృక్షచరయామినీచరవీరయోధ
వరులు దోకొని చను మాహవమున కనిన. 203

## భరతాదులు యుద్ధంబునకు వెడలుట

తే. భరతుఁడు రఘూద్వహునకు సద్భక్తిమ్రొక్కి
సాసితూణీరచాపుఁడై యరద మెక్కి
వెడల సేనలతో జాహ్నవీవిశాల
తటమునను నిల్చి పవమానతనయుఁ బిలిచి. 204

క. ముందఱఁ జని సౌమిత్రుల
చంద మరసి రమ్మనిన వేసం బాఱి మరు
న్నందనుఁడు వారిఁ గని తన
సందిటఁ గొని వచ్చి భరతుసన్నిధిఁ బెట్టెన్. 205

తే. పెట్టి సౌమిత్రి కుశుబాణఘట్టనముల
నెంత కడునొచ్చెఁ జూచితే యితఁడు నాఁడు
నింద్రజిత్సాయకములచే నింత నొవ్వఁ
డనుచు భరతేశునకుఁ జూప నతఁడు పొగిలి. 206

క. శూరాగ్రగణ్యు లగుని
వ్వీరుల శరనిహతిఁ బరిభవించిన వారిం
దారకు లనరాదే బ్రం
దారకులో కాని యని రథముపై నిగుడన్. 207

శా. ఆఘోషించుతదుగ్రశంఖపటహోద్యద్ధ్వానముల్ దిక్తట
వ్యాఘూర్ణంబులుగా నహంకృతిఁ గుశుం డాలించి కోదండ
మౌర్వీఘంటారవముల్ చెలంగ రభసోద్రేకంబునన్ వచ్చు
చో, నాఘోరాజి దురీక్ష మన్నటు లినుం డస్తాద్రికిన్ వే
చనెన్. 208

క. ప్రాంతవననీడములను శ
కుంతములు శయించె నిరవుకొనె మృగములు వే

శంతతటకుంజముల భా
స్వంతుఁడు చరమాద్రిఁ గ్రుంకుసమయమునందున్. 209

ఉ. క్రమ్మెడుచిమ్మచీఁకటులు కార్గొన మార్గొనుచోఁ బరస్పరా
స్యమ్ములు గానరాక విరసమ్ముగఁ గైగొనునట్టిసాంపరా
యమ్మునఁ జెంగలించి లవుఁ డన్నకుఁ దోడయి దీప్తబాణజా
లమ్ముల నంధకారపటల మ్మఖిలమ్ము ఖిలమ్ము చేయుచున్. 210

క. నెఱిగొడ్డటఁ గాష్ఠంబులు
నఱికినగతి లవుఁడు వారణవిషాణములం
గఱకుటసి వ్రేయఁ గ్రొమ్మిడుఁ
గుఱు లెగసి బలంబుఁ జుట్టుకొని దహియించెన్. 211

మ. కుశుఁడుం గార్ముకటంకృతుల్ మొరయ నత్యుద్రక్రుధాహవ్య
భుక్పిశునభ్రూకుటిన ర్తనుం డగుచు నాభీలప్రచండార్కక
ర్కశబాణంబుల సేనలంబిలుకుమార్పన్ సైనికుల్పొందుదు
ర్దశ వారింప నశక్తుఁడై భరతుఁ డాత్మం బెద్ద చింతింపఁగన్.

క. మారుతి యను వీరలయా
కారంబులు రామునట్ల కాదేని హరి
ద్వారణకమఠాహికుభృ
ద్భారముగాఁ దునుము టెట్లపారబలంబున్. 213

తే. అనఁగ లవుఁ జూచి కుశుఁ డను ననఘ వీరు
సంభ్రమించెడుగతి యుద్ధసరణిగాదు
హయము నేమఱకుండు సైన్యముల సేన
ఖేచరులు మెచ్చ నుక్కడఁగింతు ననుచు. 214

క. భరతునిఁ గనుఁగొని నిజసో
దరులు వడినచోటికి పుడు దైవము నిన్నున్

బెరరేంచి తెచ్చె నిపు డెం
దరిగెదు కుశు నెదుర ననుచు నాటోపమునన్. 215

సీ. కైకేయిసుతు నేడుకాండంబుల నొగిల్చి
యన్నింటనె సుషేణు నవశుం జేసి
వాలిపుత్త్రుని వేయికోలల నొప్పించి
నూట సమీరసూనునిఁ దెరల్చి
నీలుని నేనూఱువాలుఁదూపుల గ్రుచ్చి
యిన్నూట గవయుని నేపు మాపి
పనసుని మేనఁ దొంబదిబాణములు నించి
కుముదుని మున్నూటఁ గుంటుపఱచి

తే. జాంబవంతునిఁ ద్రిసహస్రసాయకముల
బీర మెడలించి యనిఁ బ్రతాపించి నిలువ
నచ్చెరువు నొంది కురియించి రపుడు సురలు
కుశునిమీఁదను మందారకుసుమవృష్టి. 216

క. ఘోరతర మైనయక్కుశ
వీరునిసమరంబుఁ జూచువేడుక వచ్చెన్
గ్గోరి యనఁ బొడుపుగుబ్బలి
పై రవి పొడచూపుటయుఁ బ్రభాతం బైనన్. 217

మ. భరతప్రేరిత మైనసైన్య మెదిరింపన్ రాముతమ్ముల్ లవుం
డిరుమూఁడమ్ములఁ జాపముం దునుమ భగ్నేష్వాసునుం డైన
భాస్కరవంశుం గుశుఁ డుగ్రమార్గణములం గారింపఁగాఁ
దేరిపై, సొరుగం బాఱెడువానిఁ గన్గొని మరుత్సూనుండు
కట్టల్కతోన్. 218

క. పెకలించి యొక్కగిరి దా
రకులపయి నైవ్వ నంతరమునన దానిన్
శకలములుగఁ జేసి బల
ప్రకరంబుల నెల్లఁ గుశుఁడు పరిమార్చుటయున్. 219

భరతుఁడు పడుట దెలిసి శ్రీరాముఁడు యుద్ధభూమికి వెడలుట

క. హతశేషులు చని రామ
క్షితిపతి కవ్విధము దెలియఁ జెప్ప వగచి యు
ద్ధతి వెడలె విభీషణసూ
ర్యతనూజులతోడ నమ్మహారథుఁ డనికిన్. 220

చ. చతురంగవాహినీపరి
వృతుఁడై యరుదెంచి కనియె వీతభయుల న
ద్భుతచాపధరుల నాత్మ
ప్రతిబింబములై వెలుంగుబాలురఁ బ్రీతిన్. 221

ఉ. వారలఁ జూచి పల్కె రఘువర్యుఁడు మీ కిట జాతకర్మసం
స్కారము లెవ్వ రుక్తవిధిఁ జల్పి రొగిన్ ధనురాదిశాస్త్రవి
ద్యారతు లైతి రెవ్వరికతంబున నేగతి యుద్ధచాతురి
న్నేరుచుకొంటి రెవ్వ రవనిం దలిదండ్రులపేరు నావుడున్.

తే. పోరి కెదిరించి మాపుట్టుపూర్వములను
దెలియఁ బని యేమి మీకు నీతేటలకును
హయము విడుతుమె యైన మీయంతవార
లడుగఁ జెప్పమి తగవుగా దని కుశుండు. 223

మ. సరవిం జేకొని జాతకర్మముఖసంస్కారంబులున్ వేదశా
స్త్రరహస్యంబులుఁ గార్ముకాదివివిధాస్త్రప్రౌఢియుం బాపని

ర్హారణంబై నుతికెక్కు రామకథయుఁ రాజేంద్ర వాల్మీకి స
త్కారుణఁ మా కెఱిఁగించెఁ గాంచె మము సీతాదేవి యి
క్కానలోన్. 224

క. అనునప్పుడు జానకిఁ జే
ర్కొనుటయు రాఘవుఁడు మూర్ఛఁ గుంది రథముమీఁ
ద నొఱగి యొక్కముహూర్తం
బునకుఁ దెలిసి పలికెఁ దరణిపుత్రునితోడన్. 225

మ. తెలియం జూడుము వీర లెవ్వరన నాదిత్యోద్భవుం డిమ్మహా
త్ములు భావింపఁ బురాణపూరుషుని మూర్తుల్పోలికన్ మీ
కుమారులు సందేహము లేదు సంగరసమర్థుల్ నాఁగ సీతా
తనూజుల్కై యత్తఱి నీలుఁ డొక్క విపులక్షోణీధ్రమున్
వైచినన్. 226

ఉ. తూలక వారలన్నగముఁ దూపులఁ జూర్ణముచేసి యొక్కబ
ల్లోల నురంబునొంపఁ గుటిలుండగునీలుఁడుకూలెఁగూలుడు
న్నీలునిరక్తబిందువులు నీలునిరూపులు దాల్పఁగాఁ గుశుం
డాలములోన నందఱను నన్నిశరంబుల రూపుమాపుచున్.

మ. నరదై తేయకపీంద్రసైన్యముల నానాశస్త్రజాలంబులన్, బరి
మార్పన్ రఘురాముఁ డగ్రనిహతభ్రాతృవ్యథాక్రోధనిర్భ
రుఁడై యక్కుశుమీఁద హాలహాలకల్పక్రూరనారాచముల్
పరఁగింపన్ విఫలంబులై యతని నొంపన్ లేక కేడించినన్.

తే. అలిగి మఱియును నేయ దివ్యాశుగములు
కవలు నాలుగు నాల్గు దున్కలుగఁ జేయఁ
దనతనూజులసమబలత్వమ్ముఁ దెలిసి
రాముఁ డవ్వేళ యుద్ధవిరక్తుఁడగుచు. 229

శ్రీరాముఁడు మూర్ఛితుఁ డగుట

చ. అదయత నేయునక్కుశసుద గ్రశరాహతిఁ బ్రాణమర్మముల్
వదలి శతాంగయష్టి నొఱగం బడఁ గన్గొని మైథిలేయు లే
కొదయును లేక కన్గొని రఘుప్రవరుం బొరలించి కుండలాం
గదమణిహారవల్లికలు గైకొని యుల్లము పల్లవింపఁగన్. 230
క. పడినభరతాదియోధుల
తొడవులుఁ గొని లవుఁడు ముదముతోఁ గనె నొకచోఁ
గడునొచ్చి కుక్కుమి క్కన
కడఁగిన భల్లూకనాథు ననిలతనూజున్. 231
క. కని కుశునితోడ దశరథ
తనయులయీదివ్యమణిరథము లెక్కి ముదం
బున మనయాశ్రమమున కి
వ్వనచరులం గొంచుఁ బోవవలయు ననంగన్. 232
తే. అనిలజుఁడు జాంబవంతుఁ గన్గొనుచు నల్ల
పలికెఁ గంటివె రాఘవాదులయవస్థ
మన మనఁగ నెంత వనజగర్భునకు నైన
ననుభవింపక చనవు శుభాశుభములు. 233
చ. కిలుకులఁ బెట్టి వీరి నడకించి తొలంగుద మన్న వట్టిక
క్కులితియ కాని దైవ మనుకూలము గాదు లవుండు
మొక్కలిఁ, దుఱికినఁ బ్రాణహానియును నొప్పమి వచ్చు
నటంచుఁ బ్రాణముల్, దొఱఁగినభావ ముల్లమునఁ దూ
కొని చేష్టలు దక్కి యుండఁగన్. 234
ఉ. చిందముల న్నభంబుగరిసించుశతాంగము లెక్కి జానకీ
నందను లేగి యాశ్రమమునన్ రథముల్ దిగి పర్ణశాలికా

లిందము చేరి తెచ్చినవలీముఖపుంగవజాంబవంతులన్
ముందటఁ బెట్టి తల్లికిని మ్రొక్కి సమస్తము విన్నవించినన్.

సీ. విని యమ్మహీకాంత విస్మయాక్రాంతయై
కదనరంగమున రాఘవుని మీరు
గెలుచుట జింకపిల్లలు సింహము జయించు
తెఱఁగు దైవిక మెట్లు తెలియవచ్చు
వనమున నజ్ఞాతవాసనై పడియెడు
పాటు మీచే బయల్ పడియె ననుచు
లవుఁ జూచి వరుణసంభవుఁ డిచ్చటికిరాక
మునుప యీజాంబవంతుని సమీర

తే. సూను నభిమానధనుల నచ్చోటన విడిచి
వేగ రమ్మన్న నట్ల కావింపఁ దద్వృ
ధంబు నారదువలన నంతయు నెఱింగి
వచ్చె వాల్మీకి నిజతపోవనమునకును. 236

తే. వచ్చి యమ్మౌనియాశ్రమద్వారసరణి
మూర్తివంతంబులై లోకములు హరింపఁ
గడఁగునస్త్రవేదములనగ వడి వెలుంగు
నతులతేజుల జానకీసుతులఁ గాంచి. 237

మ. తనకున్ వందన మాచరించినఁ బ్రమోదం బార దీవించి ము
ట్టినకయ్యంబు ఘటిల్లె మీకు నని వింటిన్ గొంత నానాస్త్రశ
స్త్రనిపాతంబులచేత నొవ్వరుగదా సంగ్రామ మే లయ్యెఁబో
రినచందంబదియెద్ది చెప్పుఁడిఁకఁ దద్వృత్తాంతమాద్యంతమున్.

తే. అనినఁ గుశవీరుఁ డమ్మునీంద్రునకు లవుఁడు
హయముఁ బట్టుట సౌమిత్రు లంతరించు

టగచరులతోడ భరతుండు తెగుట రామ
విభుఁడు నిధనంబగుట విన్నవించుటయును. 239

## వాల్మీకి శ్రీరాములను స్తోత్రముఁ జేయుట

శా. హాహాకారమునన్ మునిప్రవరుఁ డభ్యర్ణక్షమాఖండిత
వ్యూహం బత్తఱిఁ జొచ్చి హస్తకరకాయుగ్మంత్రతోయం
బునన్, దేహక్షాళన మాచరింప సుఖసుప్తిం జెంది మేల్కాం
చినట్లాహైన్యంబు దొలంగి రాఘవుఁడు బాలార్కప్రభన్
బొల్చినన్. 240

తే. మొరసె సురదుందుభులు గళత్సురభిదుగ్ధ
కుసుమవృష్టులతోనతారొక్కనుచుఁ గురియ
నమృతధారాభిషిక్తసర్వాంగ మగుచు
బ్రదికె నరవానరాసురప్రబలబలము. 241

మ. ప్రతిసమ్రాడనుగమ్యమానుఁ డగుసవ్వాల్మీకజన్ముక్ రఘు
క్షితినాథుండు బహూకరించి యనురక్తిం దమ్ములుం దానమ
స్కృతిఁ గావించిన నత్తపోధనికిఁ డాశీర్వాదముం జేసి సం
భృతమాధుర్యసుధాపరిస్ఫురితగంభీరోక్తిమై నిట్లనున్.

శా. మృద్వైగుణ్యము కుంభకారఘటనోన్మేషంబునం బోలెఁ ద
త్తద్వేళం దిలకించు నీభువనసందర్భంబు నీచేత రా
గద్వేషాదులు నిన్నుఁ బొంది నిలువంగా నేర్చునే నీవు సా
క్షాద్విష్ణుండవు సీతలక్ష్మినిగమోక్తంబుల్ భవత్కృత్యముల్.

చ. తనయుఁడు చాపలప్రకృతిఁ దప్పి యొకానొకతప్పుచేసినన్
గని కరుణింపఁగా వలయుఁ గాని చలంబున విగ్రహింపఁగాఁ
జనదటులుండెఁ బుత్రు లనిశంబునుజూపెడుశౌర్యతేజముల్
జనకున కెయ్యెడం బరమసౌఖ్యవిశేషము లెన్నిచూచినన్.

సీ. చిఱుతప్రాయమున హెచ్చినతాటక వధించి
జమదగ్నిసూనుగర్వము గుదించి
ఖరదూషణాదులఁ గాలుని పురికన్పి
మారీచుచర్మపర్వములు చించి
యోజనబాహు సత్యుగ్రత వధియించి
యనిమిషాధీశునందను హరించి
లవణపయోరాశి నవలీల బంధించి
దశకంఠు నాహవస్థలి నడంచి
తే. నట్టిభవదీయచటులబాహాప్రతాప
విక్రమాటోపమున కంగవించి నిలువఁ
బద్మగర్భాదులకు సీతబంటి యనినఁ
జెక్కుమీటిన పసవల్పుశిశువు లేదురె. 245

క. పాతాళమునకు వరుణా
హూతుఁడనై యేను బోవ నుద్వృత్తి నప
ఖ్యాతి యిటు సంభవించెను
సీతనయులు నిన్నెఱుంగ నేరనికతనన్. 246

తే. అనినఁ బరితోషమానసుఁ డగుచు రాముఁ
డనఘ మీదర్శనం బైనయపుడ మాకు
నన్నిపనులును సఫలంబు లయ్యె వారిఁ
జూడవలెఁ బిల్వఁబంపుఁ డిచ్చోటి కనిన. 247

తే. సంతసము నొంది ముని శిష్యసమితి ననుప
నతులకోదండవల్లకీహస్తు లగుచు
జానకీసుతు లరుదెంచి సమయ మెఱిఁగి
కౌతుకంబున గురుసమక్షమున నిలిచి. 248

క. ఘోరదురితాపహం బగు
శ్రీరామాయణము చదివిరి వివిధ మగునా
నారాగరచనఁ దుంబురు
నారదు లన నఖిలజనమనః ప్రమదముగన్. 249

మ. మనువంశాగ్రణి యక్కుమారవరులన్ మన్నించి పేర్మిన్
బునః పునరాలింగన మాచరించుచుఁ బరిస్ఫోటించుసీతావి
యోగనిమిత్తజ్వరదాహముం దొఱఁగి గాద్గద్యంబునన్
హర్షబాష్పనిరోధాలసపక్ష్మనేత్రుఁ డగుచున్ సౌమిత్రితో
నిట్లనున్. 250

ఉ. ఆననవిభ్రమంబు రుచిరావయవాదికసౌకుమార్యమున్
జానకియట్ల దృప్తభుజశౌర్యజితశ్రమదివ్యబాణసం
ధానసమగ్రశక్తియును దంటతనంబును మద్విధంబ యీ
సూనులయందుఁ దేరకొనఁ జూచితి వేయనఁ బల్కె నన్నతోన్.

ఉ. దేవరయానతిన్ వసుమతీసుత నుత్కటగర్భవేదనా
ప్లావభరాలసాంగి నకృపామతి నొంటియుఁ గొంచువచ్చి నా
డీవిపమాటవి న్విడిచి యే మగుడన్ జనుదెంచునప్డు మూ
ర్ఛావివశాత్మ యయ్యెనన సంయమి రామునితోడ నిట్లనున్.

ఉ. అట మఖయూపదారుహరణార్థము శిష్యులు నేము జాహ్నవీ
తటమున కేగుదెంచి యెడదవ్వుల నొంటివిలాప మాత్మసం
కట మొనరింపఁగా వెదకి కంటిమి శోకపరీతయున్ రజః
పటలవివర్ణకీర్ణకచభారయునైనవధూలలామమున్. 253

తే. కాంచి నీ వెవ్వ రేల శోకమునఁ బొందె
దనిన నెఱిఁగించె నాకు నయ్యబల జనక

తనయను రఘూద్వహుండు మద్భర్త నింద్య
నైతినని నన్నుఁ ద్రోయించె నడవి ననుచు. 254

క. విని యూరడించి యాశ్రమ
మునకుం గొనిపోయి యుటజమున నుంచి తప
స్వినుల నియమించుటయు వా
రనువునఁ బోషింపఁ గతిపయదినంబులకున్. 255

తే. కనియె వైదేహి వంశవర్ధనుల వీరి
నాగమోక్తీన జాతకర్మాదివిధులు
సలిపితిమి పుత్రులెడ మేము జనకవిభుఁడు
దశరథుఁడు నీవు నొక్కచందంబ కాన. 256

చ. చదివిరి వేదముల్ సకలశాస్త్రములున్ బఠియించి రాహవో
న్మదరిపువాహినీ విదళనక్రమధూర్ధర దివ్యబాణసంపదలఁ
బ్రసిద్ధులైరి నరపాలక నీతనయుల్ ప్రసన్నతాహృదయులు
నీదుభాగ్యమున కెయ్యది మేర తలంచి చూడఁగన్. 257

చ. అనవుడు రాఘవుం డనుమహాత్మ భవత్కృప యొవ్వరందుఁ గ
ల్గిన గణింతింప వారు కృతకృత్యులు నిత్యము నీయనుగ్రహం
బుననభివృద్ధిఁ బొందుమముబోంట్లను బేర్కొన నేల నాఁగన
మ్మునికనుసన్న నర్భకులు మ్రొక్కి కరంబులు మోడ్చి తండ్రి
తోన్. 258

క. మోహపరవశుల నూహా
పోహపరిజ్ఞానమూఢబుద్ధుల నాత్మ
ద్రోహుల మముఁ బ్రోవుము వై
దేహీనందనుల నన ముదితహృదయుండై. 259

## శ్రీరాములు సోదరపుత్రసైన్యసమేతముగా నయోధ్యాపురంబు చేరుట

క. కమలాప్తకులీనుఁడు దన
కుమారకులఁ గౌఁగిలించుకొని మూర్ధఘ్రా
ణము చేసి యధికవాత్స
ల్యమునను మన్నించి యధ్వరాశ్వముతోడన్. 260

ఉ. దానవమర్త్యవానరపతాకినులిమ్ములఁ గొల్చిరా నయో
ధ్యానగరంబుఁ జొచ్చి రచితాధ్వరమండపవేది నిష్టభృ
త్యానుజపుత్రబాంధవసమన్వితుఁడై కొలువుండి యాత్మవి
ద్యానయశీలు నమ్మునివతంసముఁ గన్గొని రాముఁ డిట్లనున్.

తే. వరుణసంభవ నీపుత్రి పరమసాధ్వి
లంకలో నాఁడు లోకపాలకు లెఱుంగ
హవ్యవాహనముఖమునం దైనవిధము
ప్రజ లెఱుంగరు మిగుల దూరంబుగాన. 262

క. ఇందలిజనముల కెల్లను
సందేహనివృత్తి యొదవుచందముఁ జేయిం
పందగు మీరు ధరిత్రీ
నందనఁ గొనిరండు పొం డనఁగ హితబుద్ధిన్. 263

ఉ. ఆరఘురామువీడ్కొని మహర్షివరుం డరుదెంచి కాంచెఁ బె
ల్లారటఁ బెట్టుశోకవిరహంబులు రూపగుమాడ్కి నాశ్రమ
ద్వారనివిష్టదృష్టియు వివర్ణయునుం జిరబద్ధవేణికా
భారయుఁ బ్రోచ్చలద్గళితబాష్పవినేత్రయు నైన జానకిన్. 264

సీ. కని పర్ణశాల డగ్గఱఁ జూచి యమ్మహీ
తనయ వాల్మీకిపాదముల కెరఁగి

తనయులు రా కేలతడసిరి పతివియో
గమకాక పుత్రశోకంబు నకట
సిద్ధించె నను సృజించి విరోధులకు బారి
గొరియలఁ జేసెనొకో విధాత
యని విలాపింప నూరార్చి యేటికిఁ గ్రేపుఁ
బాసి గొడ్డొఅలెడుపగిది నడలె
తే. దబల నీవలె దుఃఖార్తలైనవార
లెంత మము దూఱనాడిన నెగ్గుగాదు
నీతనూభవు లున్నారు నెయ్య మలరఁ
దండ్రి మన్నింపఁగా నయోధ్యాపురమున. 265
క. కాకుత్స్థకులుఁడు నినుఁ బు
త్త్రీ కొనిరమ్మనియె నరుగు దెమ్మని కడఁకన్
సాకేతనగరమున క
న్నాకుభవుఁడు జనకనందనం దెచ్చుటయున్. 266
మ. సుతభార్యాయుతుఁడై రఘూద్వహుఁడు చతుఃప్రీతిసంధిల్లఁ
ద,త్క్రతుశేషంబు సమగ్రదక్షిణలఁ బర్యాప్తంబు గావించి
యం,చితరత్నాంబరభూషణావళులఁ బూజించెన్న ప్రశ్రేణి
నా,శ్రితమౌనీంద్రవిశిష్టబాంధవధరిత్రీదేవతాకోటులన్.
క. ఏసరవిఁ గుశలవులతో
రాసీ దుర మొనర్చె దాశరథి చేసె రణం
బాసరవిన జనమేజయ
వాసవనందనుఁడు బభ్రువాహనుతోడన్. 268
మ. అని సూతుండను శౌనకాదులకు నిట్లాతిహ్యాముం దొల్లి జై
మిని చెప్పెన్ జనమేజయుం డడుగ నిష్మేనేతదాఖ్యానమున్

వినినన్ వ్రాసి పఠించినన్ జనులకున్ సిద్ధించు నశ్రాంతమున్
ధనధాన్యాదికపుత్రపౌత్రసుఖనానాభోగభాగ్యోన్నతుల్.

క. వెలయఁగ నీకథ వినుధ
న్యులు తక్కినకథలు వినఁగ నొల్లరు మదిఁ గా
కులరొదలు విన రుచించునె
కలకంఠధ్వనులు విన్నకర్ణంబులకున్. 270

మ. కనకాద్రిప్రతిమానధైర్య జగదేకస్తుత్యసౌభాగ్యమో
హనలీలానవపంచబాణ నిజబాహాశౌర్యవీరావిరా
జినయోపాయవిహార బోనగిరిచెంచికొమ్మథారాపురీ
పెనుగొండాద్యఖిలైకదుర్గహరణప్రేంఖత్ప్రతాపోదయా.

క. అహితనృపాలమదాంబుధి
బహులహరీవిహారదంష్ట్రిభాగ్యాంకసరో
రుహమీనశంఖచక్రని
వహావిశదీభూతచక్రవర్తివిలాసా. 272

తోటకము.—

బలభిద్విభవామణిభాలలితాం
చలిసంకులకీలితశత్రుకుభృ
త్కులహాధ్వనితర్కవిధాయిఝుళం
ఝుళనాదపదాంగదసవ్యపదా. 273

గద్యము. ఇది భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్ర గాదయామాత్యపుత్ర వినయవిద్యాసముద్ర పినవీరభద్రప్రణీతం బైన జైమినిభారతంబునం దశ్వమేధపర్వంబున షష్ఠాశ్వాసము.

శ్రీ

# జైమినిభారతము

## అశ్వమేధపర్వము, సప్తమాశ్వాసము





చికురబంధగంధఫ
లీచంచద్గంధభరమలిమ్లుచ నుతవా
చాచణకవికర్ణసుధా
సేచనసల్లాప నారసింహమహీపా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున
కిట్లనియె నివ్విధంబున బభ్రువాహనుండు పాండవమధ్య
ముం దొడరుసమయంబున. 2

తే. హంసకేతుండు సుతులుఁ గయ్యమునఁ బడిన
యపుడు తనుశౌరి మన్నించినట్టితగవు
హృదయమున మాటిమాటికి నెచ్చరింప
నచ్చలంబున బభ్రువాహనునిఁ దాఁకి. 3

మ. బలిమిన్ వేవురుపార్శ్వరక్షకు లెదుర్పన్ దున్మి తూఁటాడి బి
ట్టలుకన్ వానిఁ దెరల్చి తీవ్రతరబాణౌఘంబులన్ దేరు చె
క్కలుగా నేసి తదస్త్రముల్ విఫలము ల్గావించి సంగ్రామదో
హలియై గీటణఁగించె మార్గానినపంచాక్షౌహిణీసైన్యమున్.

వ. అప్పుడు. 5

చ. చలమున నొండుతేరు రభసంబున నెక్కి కిరీటినందనుం
డలమి మరాళకేతను శతాంగము రూపఱ నేయుచున్ శరం
బులు నిగిడించి వానిఁ బెనుమూర్ఛితుఁ జేసి సహస్రమేదినీ
శులఁ గలనన్ సరథ్యరథిసూతముగాఁ దెగటార్చి యార్చినన్.

చ. కినుక సువేగుఁ డడ్డపడి క్రీడికుమారునురంబు గాఁడ బా
ణనవక మేసి మూఁడుబలునారసముల్ దొడి గాతపత్రమున్
ధనువుఁ బతాకయుం గెడపి తద్రథయోధసహస్రమున్
బృషత్కనిహతిఁ గూల్చుచున్ దశశతప్రదరంబుల ముంచె
నాతనిన్. 7

వ. ఇవ్విధంబున సువేగుండు శరవేగంబు చూపిన. 8

మ. సురరాట్పౌత్రుఁడు దావపావకపరిస్ఫూర్తిన్ విజృంభించి ని
ర్భరశౌర్యోన్నతి వానిబాహుబలగర్వప్రౌఢి వారించుచున్
శరజాలంబుల శుభ్రవారణఘటాసంఘంబులం ద్రుంచి తత్కరి
మూర్ధాశ్వకళేబరోత్కరములన్ గప్పెన్ సమిద్భాగమున్.

ఉ. వెండియు నాగ్రహంబున సువేగునిమధ్యము ద్రెవ్వ నొక్క
బల్కాండ మడర్చె వానికరలాఘవ మేమనిచెప్పఁ దూఁచిన
ట్లుండ సమంబుగాఁ దెగి రణోర్విపయిం బడ కంతలోఁ జతుః
ఖండములై సురల్ బెదరఁ గవ్వడిపట్టి యురంబుఁ దాఁకినన్.

క. నిలుపోప కతఁడు మూర్ఛా
కలితుఁ డగుచుఁ దోన తెలిసి ఘనభుజశక్తిం
బొలియించెఁ బార్థయోధవ
రులఁ బలువురఁ బ్రళయకాలరుద్రుఁడు పోలెన్. 11

తే. బభ్రువాహనుచే నాజిఁ బడినదొరలఁ
దత్పురంబునఁ జిత్రాంగదాసపత్ని
యగునులూచి క్రమంబున నరయుచుండెఁ
దగువిశల్యాదివివిధౌషధములచేత. 12

{ అర్జునుఁడు దనకుఁ దోఁచినదుర్నిమిత్తంబులు వృషకేతనుతోఁ జెప్పుట }

సీ. అపుడు ధనంజయుం డను వృషకేతుతోఁ
సైన్యనాశమకాక సకలవస్తు
వులు నష్టమయ్యె నీవును నేను శేషింపఁ
బడిరి హంసధ్వజప్రముఖు లాజిఁ
బ్రద్యుమ్నుఁడును బట్టువడియె నయ్యనుసాల్వు
క్రమ మేమియును గానరాకపోయెఁ
దనతనుచ్ఛాయ మస్తకహీనయై తోఁచెఁ
గనుఁగవ విస్ఫులింగములు దొరఁగె
తే. దుర్నిమిత్తంబు లివిగాక తోఁచెఁ బెక్కు
చావునకు నింక లంకెగాఁ జనదు మొదల
నస్త్రజర్జరితాంగుఁడ నన్వయాభి
వృద్ధికై నిల్వు నీవైన విద్రుప నీరు. 13

వ. అసిపత్రవ్రతదీక్షాపరుండై పాండవాగ్రజుండు మద్భుజా విక్రమంబు నిర్వక్రంబగు నని యొనర్చినక్రతూపక్రమం బపక్రమం బయ్యె చషాలకలితం బగుఖదిరబదరీపలాశబిల్వ యూపకలాపంబు లోపం బయ్యె వసుమతీనిలింపజంపతీ జనంబు సంపాదించు చతుష్షష్టిసలిలపాత్రాభిషేచనవిధానంబు

తిరోధానం బయ్యె నధ్వరారంభసముత్తంభితం బగువిహిత
శతశలాకారచితశార్దూలాజినోపయోజితాతపత్రవిలాసంబు
నిరాసంబయ్యె సవనమండపాభ్యంతరంబున హర్షణూణు
లయిన ప్రసూనలాజప్రవర్షిమహర్షిపుంగవుల మంగళాశీ
ర్వాదంబు లర్థవాదంబులయ్యె నవభృథస్నానసమయంబున
సముచితమాల్యానులేపనమణిమయవిభూషణాంబరవిరాజ
మానం బైన గౌరీసహస్రంబు కరకమలంబుల ధరియించు
కాంచనదండమండితచమరవాలచాలనప్రచారంబు దూరం
బయ్యె రుక్మిణీసహాయుం డగు పుండరీకాక్షు నగ్రపూజా
ప్రసంగంబును భంగంబయ్యె కావున మదీయజీవనం బప్ర
యోజనంబు తనకు సంగరమరణంబ శరణంబు నీవు కృష్ణ
ధర్మజులపాలికిం జనుమనిన వృషకేతనుండు కపికేతనున కి
ట్లనియె. 14

మ. పలుకుల్ వేయును నేల తూలి రవిబింబం బుర్విపైఁ ద్రాలినన్
గలఁకన్ వైరికి వెన్ను సూపుదునె మోకల్ గట్టి బృందార
కుల్, దలపడ్డన్ బలిమిన్ జయింపఁగల నేతన్మాత్రు లీక్షాత్ర
వుల్, నిలువన్ శక్తులె నన్నెదిర్చి కలనన్ నీప్రాపు నా
కుండఁగన్. 15

తే. స్వామి సఖి గోమహీసురసర్వప్రయోజ
నార్థమై మేను దొఱఁగుధన్యాత్ముఁ డెవ్వఁ
డతఁడు కైవల్యసౌఖ్యంబు లనుభవించు
ననుచుఁ జెప్పుదు రఖిలధర్మార్థవిదులు. 16

క. ననుఁ జిత్తగింపు మని చ
య్యన మ్రొక్కి రథాధిరూఢుఁ డై భుజగర్వం

బున బభ్రువాహు నెదిరిం
చెను వృషకేతుండు రెండుసేనలుఁ బొగడన్. 17

తే. అట్లుదిర్చిన వృషకేతు నపుడు క్రీడి
సుతుఁడు మార్కొని సాయకత్రితయ మేయ
నవి యురము గ్రుచ్చి ధరఁ దూఱె నధికతృష్ణ
భోగవత్యంబువులు గ్రోలఁ బోవునట్లు. 18

క. నరసూను నపుడు కర్ణజుఁ
డిరుమూఁడుశిలీముఖంబు లెద నించిన నొ
చ్చి రయంబునఁ గోల్కొని వా
నరదముఁ దునిమెఁ సకేతుహయసూతముగన్. 19

ఉ. ఆరవిపౌత్రుఁ డొండొకశతాంగముఁ గైకొని హేమపుంఖ
విస్ఫారశిలీముఖౌఘములఁ బార్థసుతుం దెరలించి క్రమ్మఱ౯
దే రిలఁగూల్ప వెండియును దీవ్రత నొండురథంబుతోడ న
వ్వీరుఁ డెదుర్పఁగాఁ దునిమె వేయిరథంబులదాఁక నాతఁడున్.

మ. నరరాధేయతనూభవుల్ మఱియు నానాదివ్యబాణంబుల౯
సరిపోర౯ వృషకేతనుం డనలపర్జన్యాంతకార్కాదినిష్ఠుర
నారాచపరంపరం బొదువ నాటోపంబు మీఱ౯ బురందర
పౌత్రుం డవిత్రుంచె నన్నియును దా నారాయణాస్త్రంబునన్.

తే. కర్ణజునిఁ జూచి యిట్లనుఁ గార్ష్ణి యపుడు
పొలిసె నీసేన మద్భుజావిలసనమున
వృత్రుఁ డమరేంద్రు నెదిరించు విధముగాక
యెందుఁ బోవచ్చు నీకు నాయెదుర ననుచు. 22

మ. దరహాసంబున బభ్రువాహనుఁడు రాధాపౌత్త్రు మాద్య
ద్భుజాం,తరముం దూఱ మరుచ్ఛిలీముఖముసొప్పంగ దూలి
బ్రహ్మాండక,ర్పరముం దాఁకి ధరిత్రిపైఁ బడక సర్వాస్త్రభృదా
శావధిం, శరధుల్ చుట్టుక ముమ్ముహూ ర్తమున రాజన్య
స్థలిం వ్రాలుచున్. 23

తే. కుదురుకొని కర్ణజుఁడు క్రీడికొడుకు నుద్ధ
రాస్త్రహతి నొంప నతఁడుఁ జోద్యముగ ధరణి
బింబ మొరయంగ నెగసి రథంబు దిరిగి
పడియె ధరమీఁద సంపాతిపక్షిఁబోలె. 24

వ. ఇత్తెఱంగునం బడినబభ్రువాహను నవలోకించి. 25

చ. తొడరి మరాళకేతనునిఁ ద్రుంచినదుష్కృతిఁ దీర్తునంచు బ
ల్విడివృషకేతనుం డురుశిలీముఖము న్నిగిడింపఁద్రుంచి క
వ్వడితనయుండు బిట్టగసి వానిపయిం దరికొండకై వడిం
బడి వడి గెంటి మింట శరపంచకముం దొడి గేసి యార్చినన్.

తే. క్రీడితొడుత నను వృషకేతనుండు
అరద మిలఁ గ్రుంగ రాధేయునంతవాఁడు
నిలువు మనె నిన్ను నిర్జించనలవుగంటె
యొక్క మొగిన ప్రలాపించు చున్నవాఁడు. 27

క. అనునెడఁ బార్థజుఁ డొకశర
మునఁ బగిలెచెఁ గర్ణసుతునిమూర్ధ మతఁడు నా
తని ముంచెఁ బెక్కుశరముల
జనమేజయ యిట్లు భయదసమరం బయ్యెన్. 28

చ. అరుదుగ ధాత్రిఁ గొంతదడ వంబరమార్గమునందుఁ గొంత
ప్రొద్దరదము లెక్కియుం విరథు లయ్యును బోరిరి పంచ

రాత్రముల్, శరములు తచ్ఛరీరపలలంబులఁ ద్రెంచుకపాఱి
నల్లడఁగ, గెరలి యహర్నిశంబుఁ దమకించుచుఁ బైకొనఁ
గాకఘూకముల్. 29

క. ఇప్పరుసున నయ్యిరువురు
డెప్పరముగఁ బోరునెడఁ గడిఁది బాణముల
నొప్పించి బభ్రువాహనుఁ
డప్పుడు వృషకేతుఁ బలికె నాగ్రహ మెసఁగన్. 30

క. ఇన్నిదినంబులు మాఱొ్కని
న న్నెదిరితి నిలిచి మే లనందగుఁ గలనన్
నిన్నుఁ బొరిగొనక విడువ మ
ది న్నిలుపుము నేఁడు వాసుదేవుని ననుచున్. 31

చ. కనుఁగొని యర్ధచంద్ర విశిఖం బడరించినఁ గర్ణసూతి ము
త్తునియలు సేయుచుం జెలఁగఁ దోడనె హేమవిచిత్రసా
యకం,బున మెడఁ ద్రుంపఁ దచ్ఛిరము మొండెముపై నటి
యించి చెండుభం,గి నెగసి కృష్ణుఁ బేరొ్కనుచుఁ గ్రీడి
పదంబులమీఁద వ్రాలినన్. 32

తే. అక్కబంధంబు వడుచుఁ బ్రత్యర్థిసేన
నద్భుతంబుగ మడియించె నపుడు పార్థుఁ
డతనిమణికుండలాన్వితమగుశిరంబు
కరమున ధరించి మిగుల శోకము వహించి. 33

అర్జునుఁడు వృషకేతుని మరణంబునకు శోకించుట

సీ. రక్తాక్తమౌక్తికారాతిమూర్ధాబ్జాంఘ్రి
శాలి నాఱడి రిత్తచంపుకొంటిఁ

బుత్రపౌత్రాలంభమునకు మైకొని యబ్జ
హితునితోడ విరోధ మియ్యకొంటి
నభిమన్యుపిమ్మట నన్వయస్థితికి నె
న్నఁగ నీవు గలవని నమ్మికొంటి
గుణనిధానము నిన్నుఁ గోల్పోయి హరియుధి
ష్ఠిరులచిత్తము దప్పఁజేసికొంటి

తే. నకట మఖవాజిసాధించినపుడు భీము
నెదురఁ బ్రతిపక్షులను సమయించి నేఁడు
నాకుఁ దోడయి వచ్చి జన్యమున సమసి
యిచటఁ బక్షులపాలైతివే కుమార. 34

తే. అంబుజాప్తుఁడు లేనినభంబు దివియ
లేనిగేహంబు లింగంబు లేనిపీఠ
మప్రయోజన మైనయ ట్లనఘ నాకు
నీవు లేనిజయం బది నిష్ఫలంబు. 35

వ. అని ధనంజయుండు తచ్ఛిరంబు శరీరంబునం జేర్చి మూర్ఛి
తుండై తెలిసి బహుప్రకారంబులం బలవింప నతనిం గనుం
గొని బభ్రువాహనుం డిట్లనియె. 36

తే. వైశ్యజుఁడఁగాన సంగ్రామవనధిలోని
వీరకోటీరమణులకు విలువఁ గంటి:
'గర్ణసూనునిశిర మనఘంబు దీని
భవున కర్పించి పడయుదు పాశుపతము. 37

క. అన విని కిరీటి కర్ణసు
తునిమస్తము రథముపైఁ గుదుర్పఁబెచి మఱిం

గనలుచును బభ్రువాహనుఁ
గని యిట్లనుఁ జటులసజ్యగాండివధరుఁడై. 38

చ. బిరుసుగ నేటికిం దఱచు ప్రేలెదు శూరుఁడ వైన నిల్చి నీ
పరుసఁదనంబు చూపు మని పాండుతనూజుఁడు చిత్తజల్లుగాఁ
గురియుపయోధరంబుక్రియ ఘోరశిలీముఖవృష్టిముంచినన్
దురమునబభ్రువాహనుఁడుతూలె బలంబులుగూలె నల్గడన్.

శా. మూఁకల్ గట్టినయోధయూథపసూరుల్ మొండెంబులై రా
లఁగాఁ,దూకంబుల్ సెడి తేరు లాకసమునన్ దూలంబులై
తూలఁగా, నాకౌంతేయుశరాగ్ని మించి జటిలంబై గోపురా
ట్టాలక, ప్రాకారంబులు మున్నుగా మణిపురిన్ భస్మంబు గా
వించినన్. 40

శా. ఆసంరంభము బభ్రువాహనుఁడు బాహాశక్తిమాయించి తో
డ్తోసూతాశ్వకపీంద్రులన్ వరుస మూఁడున్నాల్గునేనమ్ములన్
వే సోలించుచు నుగ్రభల్లముల నవ్వీరుండు గారింపఁగా
గాసిం బొందెఁ గిరీటి సన్నిహితగంగాశాపసంవిష్టుఁ డై. 41

క. అవ్వేళ దివ్యబాణము
లెవ్వియుఁ బని సేయకున్న నెదవడి మదిలోఁ
గవ్వడి తూలఁగఁ గని యెల
నవ్వుచుఁ జిత్రాంగదాతనయుఁ డిట్లనియెన్. 42

శా. మాతల్లిన్ వనితామతల్లిని సభామధ్యంబునం దొల్లియ ప్రీ
తుల్ పల్కినపాతకంబునకుఁ జేరెం గాల మివ్వేళ ని, న్నా
తంకంబునఁ బెట్టుచున్న పితృపుత్రాశల్ విసర్జించి నీ సూతుం
గృష్ణుఁ దలంచుకొ మ్మనఁగ నచ్చోఁ బుట్టె నుత్పాతముల్.

సీ. నెత్తురు వర్షించె నీరదంబులు వీచె
శర్కరాభీలజంఝామరుత్తు
విరివిగాఁ గప్పెఁ గావిరి దిగంతముల సం
గ్రామభూస్థలి మూఁడు ప్రయ్య లయ్యె
రాలె నుల్కాసహస్రము లెల్లెడల నిల్చి
దట్టించె భూతబేతాళగణము
పొగ లేక యాయుధంబులు మండె నుజ్జ్వల
ప్రతిసూర్యమండలప్రభలు వెలిఁగె
ఆ. బభ్రువాహనుండు పాండవమధ్యమ
ప్రాణహరణనిష్ఠురప్రచార
జాగ్రదుగ్రశరధిసంచితజ్వాలాభి
ధానశరము వింటఁ బూనుటయును. 44

శా. ఆవిఖ్యాతశరంబు హాలహలసప్తార్చిశ్ఛటల్ గ్రాయుచుఁగ
రా వీక్షించి సురేంద్రసూతి వివిధాస్త్రప్రౌఢి వారింప ది
గ్దాహ్యావాప్రథ్వ్యవరోధమై నిగిడి క్రౌర్యస్ఫూర్తిమై బంధుర
గ్రీవంబుఁగ వడిఁద్రుంచెఁ దచ్ఛిరము లక్ష్మీనాథుఁ గీర్తింపఁగన్.

బభ్రువాహనుం డర్జునుఁ దెగనేయుట

తే. అహిమకరుఁ డుత్తరాగతుం డైనశుక్ల
పక్షకార్తికైకాదశీభానువాస
రమున నిను నస్తమయవేళ వ్రాలె నతని
తలయు నట్టయు వృషభకేతనునిమ్రోల. 46

క. అప్పుడు కర్ణజపూర్వక
కుప్పసుతాస్యములు రత్నకుండలగోచుల్

గప్పుకొని మెఱసె ధరఁ బడి
యొప్పారెడు సూర్యబింబయుగళముఁబోలెన్. 47

వ. ఇవ్విధంబునం బభ్రువాహనుం డాహవముఖంబున వృష
కేతనకపికేతనుల వధించి జయోత్సాహంబునం బొదలి
మగుడునప్పు డప్పురంబున. 48

సీ. కొలఁదిఁగాఁ బన్నీరు చిలికించి కప్పురం
బున గృహాంగణముల మ్రుగ్గు దీర్చి
సమకట్టుచీనాంబరములతో బెరయఁ జి
త్రములుగా మకరతోరణము లెత్తి
యొడనెడ వారముఖ్య గేషణానృత్యయో
గ్యము లైనవివిధయంత్రము లమర్చి
సాంబ్రాణిధూపవాసనఁ గదంబించువీ
థుల మంగళద్రవ్యములు ఘటించి
తే. భూరిజయవాద్యఘోషముల్ బోరుకలఁగఁ
బౌరజను లెదుర్కొనెను సంభ్రమము బభ్రు
వాహుచే నింద్రసుతుఁ డాహవమునఁ దెగుట
గా విచారించి చిత్రాంగదావధూటి. 49

అర్జునునిమరణంబు విని చిత్రాంగదాదులగు నంతఃపురస్త్రీలు దుఃఖించుట

ఉ. ఉల్లము వ్రక్కలై కలఁగ నొత్తినమూర్ఛ వహించి ధారణిం
ద్రెళ్లినఁజేరి యుత్తరుణిఁదేర్చి యులూచి యురంబు మోము
జొత్తిల్లఁగ మోఁదుకొంచుఁ బరిదేవన మొందఁ బురీవధూ
జనం, బల్లుక చేయురోదనము లంతిపురంబున నిండఁబర్విసన్.

వ. తతోఁ కోలాహలం బాలకించి బభ్రువాహనుఁ డంతఃపురం
బుం బ్రవేశించునప్పుడు. 51

శా. నేలం రాలినహారవల్లికలు ఖండీభూతపాటీరదూ
ర్వాలాజాక్షతహేమపాత్రికలుఁ బ్రభ్రష్టార్ద్రనీరాజన
జ్వాలాకోరకితాంగణంబులు ననిశ్వాసంబునన్ భూవిభుం
డాలోకించుచు వచ్చి కన్గొనియె శోకాక్రాంతలం దల్లులన్.

తే. కాంచి యిట్లను నర్వాశ్శృంగారరచన
లెడల నేటికి నింత వావిడిచి యేడ్వ
నసదృశానంద కారణంబైన మద్వి
జయమునం దిట్లు శోకింపఁ జనునె యనిన. 53

క. తరువున జనించి వైశ్వా
నరుఁడు తరువుఁ గాల్చువిధమునను బుత్రుఁడవై
నరున కుదయించి తండ్రిన
బొరిగొంటివి విధవ కేల భూషణ మింకన్. 54

క. కాంత ధనంజయముఖమునఁ
గాంతు ధనంజయముఖంబుఁ గావునఁ గొనిపో
మ్మంతముఁ బొందినవిజయా
భ్యంతికమున కన్నఁ బన్నగాత్మజ వలికెన్. 55

ఉ. నాయెలదోఁటలో మొదల నాటినదాడిమపంచకంబు నీ
పోయినరేయి దగ్ధ మయిపోయె నిమిత్తము లేక యల్లకాం
తేయుని కీడుఁ గంటిఁ దరుణీ యనఁ దల్లి కుమారుఁ జూచి పు
త్రా యొకఁ డిట్లు చేయుపితృహత్య జయంబని కోరె దేమనన్.

క. అన బభ్రువాహనుఁడు ప
ర్వినభయమునఁ గలఁగి మోము వెలవెల వారన్

గొనిపోయె నపుడ తల్లుల
జనకుఁడు పడియున్నఘోరసమరస్థలికిన్. 57

ఆ. చేర నరుగుదెంచి చిత్రాంగదయు భోగి
రాజసుతయు దివిజరాజసుతుని
పాదపంకజములపైఁ బడి యందంద
పొదలు శోకవహ్నిఁ బొగిలి పొగిలి. 58

సీ. దివిజులఁ దఱిమి ఖాండవము సప్తార్చికి
ధారవోసినయశోధనుఁడు వీఁడె
నిటలాక్షుతోడ నెక్కటి పోరి పాశుప
తము గొన్నవిక్రమోద్ధతుఁడు వీఁడె
కాలకేయాదిరాక్షసుల నుక్కడఁగించి
జయము గైకొనినదుర్జయుఁడు వీఁడె
కలన భీష్మాదియోధులగర్వ మెడలించి
పసి మరల్చినబాహుబలుఁడు వీఁడె

తే. యగ్రజునకును రాజసూయాధ్వరప్ర
శస్తి నెరపినభ్రాతృవత్సలుఁడు వీఁడె
యదుకుమారుల సరకుసేయక సుభద్రఁ
గడిమిఁ జేకొన్న హరిచెలికాఁడు వీఁడె. 59

తే. అని విలాపించి వృషకేతనునిశిరంబుఁ
గాంచి తల్లులు దిగిచి వక్షమునఁ జేర్చి
తండ్రి పనిఁదీర్ప కిట్లు నాతండ్రి నిలువ
నగునె నీ కంచు బభ్రువాహనునిఁ జూచి. 60

మ. తనయా చంపితి కర్ణసూను బుధమందారంబు నిం దేమికీ
ర్తి నినుం జెందె హయంబువెంట నిఁకఁ గూర్మిన్ హాస్తినా

పట్టణంబునకుం బోవఁగఁగల్గె బంధువితతిం బూజింపఁగా
గల్గె నందు నిజేశుం గలయంగఁగల్గె నన్ దోడ్తోఁ ద్రుంచి
తయ్యాసలన్. 61

క. జనకునిఁ జంపినమాడ్కిని
జనయిత్రుల మమ్ము నిపుడ చంపుము జననీ
జనకవధం బొనరించినఁ
గనియెదు భార్గవునికన్న ఘనతరకీర్తుల్. 62

తే. ప్రియుఁడు పరలోకగతుఁడైనపిదప సతుల
కనుగమనమెందు నర్హాకృత్యంబు తగిన
తెఱఁగు గావింపఁ బనుపుము తీర్చికొనెద
మగ్నిముఖమునఁ బతివియోగాగ్ని యనిన. 63

శా. అంబా తండ్రికి మ్రుక్కి హాయంబుఁ గొనుచున్ సాష్టాంగ
దండప్రణామం బేఁ జేసిన నాదరింపక సభామధ్యంబునన్
దుచ్ఛవాక్యంబుల్ పల్కఁగ సంభవించెఁ బితృహత్యాలబ్ధి
యిక్కడు నా, శంబైపోదు తపోవ్రతానశనయజ్ఞధ్యాన
దానాదులన్. 64

క. మును దా నుదయించినవే
ళనె పితృఘాతుకుఁడు గాఁ గలఁడు వీఁ డని నె
మ్మనమున నెఱిఁగిన ఫణిసుత
ననుఁ జంపక పెనుప నఘమునకు లోనైతిన్. 65

క. కావున నిత్తను వనలము
లో వేల్చెద ననిన విని యులూచి పలికె నే
లా వేగపడెదు మృతసం
జీవనమణి గలదు తండ్రి శేషునినగరన్. 66

తే. కులికవాసుకిశంఖకర్కోటకాది
ఫణులు మణిదీప్తఫణపరంపరలు మెఱయఁ
గాతు రది మృతభోగిరక్షణము గాన
గరుడభయపన్నగుల కిచ్చెఁ గాళగళుఁడు. 67

{ ఉలూచి చిత్రాంగద నూరార్చి మృతసంజీవనీరత్నంబు
దెచ్చుటకు పుండరీకుని పాతాళంబున కనుచుట }

మ. భలిమిం జేకొనరాదు సామమునఁ దప్పక బుండరీకుండు దేఁ
గలఁడా రత్నముమత్ప్రిథానుఁడనియక్కల్యాణితాటంకమం
గళసూత్రంబులు చేతి కిచ్చి ఫణిలోకస్వామి కీదుర్దశల్
తెలియంగావినిపించి యమ్మణి వెసం దెమ్మంచు వీడ్కొల్పినన్.

తే. వికృతిఁ బొందకయుండ నవ్విజయకర్ణ
సుతులమేనులు మూర్కొని యతఁడు వీరి
నేమఱక యుండుఁ డని వారి నెచ్చరించి
కదలి వెసఁజొచ్చె వసుమతీగహ్వరంబు. 69

సీ. అయుతయోజనసువర్ణాశ్వత్థగహనఖే
లత్పన్నగము వితలంబు సొచ్చి
ఫలితకాంచనశమీపాదపచ్ఛాయావి
లాసవాసము సుతలంబు గడచి
శాతకుంభరసాలసాలచిత్రానేక
తరుసంకులము మహాతలము దాఁటి
మరకతమాణిక్యమయచందనద్రుకాం
తారాంతరము రసాతలము వెడలి

క. కనియె భోగవతీతీరవనవిహార
హాటకేశ్వరభవనడోలాధిరూఢ
గూఢపాత్రకన్యకాగానగుంభమాన
తాళకోలాహలమ్ము పాతాళతలము. 70

వ. కనుంగొని. 71

తే. అచట భోగవతీస్నాన మాచరించి
నియతకృత్యంబు లెన్ని యన్నియును దీర్చి
పుండరీకుఁడు హాటకపుండరీక
షండముల హాటకేశు నర్చన మొనర్చి. 72

మ. ముకుటన్యస్తకరారవిందుఁడగుచున్ ముగ్ధేందుచూడావతం
సకునిన్ వీడ్కొనినూత్నరత్నఖచితాస్థానిన్ విలోకించె వా
సుకికర్కోటకతక్షకాదిభుజగేశుల్ గొల్వ దీపించునం
దకపాణిస్మరణవ్యపోదయతవిద్యాశేషు నాశేషునిన్. 73

చ. కనివినయంబు గ్రందుకొనఁగాఁ బ్రణమిల్లి యులూచి దా
ల్చుకుం,దనపు మెఱుంగుఁగమ్మలును దాళియుఁ జూపి కిరీటి
ధర్మనం,దన మఖవాహరక్షణచణస్థితి నేగుచు బభ్రువాహు
మా,ర్కొని హాతుఁ డయ్యె నీతనయకుం బతిదానము సేయ
గాఁదగున్. 74

చ. ధరణితలంబు మస్తమునఁ దాల్చి యొనర్చితి జీవకోటికిన్
బరమసుఖానుకూలముగ మధ్యమలోకము శైలధన్వికిం
బురజయ మిచ్చి వేలుపులఁ బ్రోచితి వేగతి నెన్ని చూచినన్
బరపురుషోపకారములు పన్నగనాయక నీవిహారముల్. 75

క. కావున నీనిలయమున స
దా విషధరముఖ్యరక్షితం బగుమృతసం

జీవని యొసఁగినఁ బునరు
జ్జీవితుఁ డగుఁ బార్థుఁడనిన శేషుఁడు పల్కెన్. 76

క. హరిభక్తిపరాయణుఁ డ
న్నరుని జయింపంగ నాదినారాయణుఁ డో
క్కరుఁడును దక్కఁగ నెవ్వరి
తర మతని నెదుర్ప నద్భుతం బిది యనినన్. 77

క. ఆపుండరీకుఁ డనుఁ బృ
థ్వీపతు లెనగారు విజయు దీకొన గంగా
శాపహతిఁ బుత్త్రు చేతన
రూపఱెఁ గా కనిన విని కరుణ దళుకొత్తన్. 78

క. మృతసంజీవనమణియు న
మృతకుంభము నొసఁగెదను సమీకహతు శత
క్రతుసుతు బ్రతికించి జగ
త్త్రితయంబునఁ గీర్తి విస్తరించెద ననుచున్. 79

క. కృతనిశ్చయుఁ డగు శేషుని
ధృతరాష్ట్రుం డనెడుఫణి గదిసి యిట్లను సం
చితవస్తుజాతములలో
వితరణులకు నొసఁగ రాసివియు లే వెచటన్. 80

తే. అయిన నొకవిన్నపము మర్త్యు లనృతవాదు
లిచ్చినను వారియెడ ఫలియింపనేర
దమృతమును రత్నమును బోయినపుడ ఫణుల
బైసిచెడిపోవుఁ దుది నీరుపాములగుదు. 81

క. గరుడుఁడు తోలుక తిరుగును
పురముల నాడింతు రుదరపోషణములకై

బరిజోగులు పెట్టెల నిడి
తరుణు లొలుచుకొంద్రు మణులు తలతలవారిన్. 82

ఆ. మును మతంగశాపమున వైనతేయుఁ డి
క్కడికి రాక తక్కెఁగాక యివ్వి
ధం బెఱింగనే సుధారసరత్నంబు
లేల మనకు మగుడ నిచ్చునతఁడు. 83

క. మత్తకరివిభుఁ డమాత్యుఁడు
మెత్తనియంకుశము మేరమీఱి నడచెనే
నొత్తి మరలింపఁదగు నీ
చిత్తం బిఁక ననిన నగుచు శేషుఁడు పలికెన్. 84

తే. గోపసూనులఁ గ్రేపుల గోధనములఁ
గమలజుఁడు డాఁచి సత్యలోకమున నున్న
నపుడె ప్రతిసృష్టి యొనరించె నాప్తుఁడైన
క్రీడి బ్రతికించు టేదొడ్డు కేశవునకు. 85

క. పూరిపుడక కులిశం బగు
నారాయణుకరుణ గలిగినను లేకున్నన్
మేరువు తృణ మగు నవ్విభు
కారుణ్యము గాదె వజ్రకవచము మనకున్. 86

వ. అనిన ధృతరాష్ట్రుండు శేషున కిట్లనియె. 87

క. వనజోదరుండు వాసవ
తనయుని బ్రతికించునట సుధారసమణులన్
బనిలేనిప్రయోజన మి
చ్చి నిరర్థక మేల ఫణులఁ జెఱచెద వనినన్. 88

### పుండరీకుఁడు శేషునిచేఁ దిరస్కృతుండై మరల నులూచికడకు వచ్చుట

తే. పుండరీకునిఁ జూచి శేషుండు పలికె
మాకులమువారు సంజీవమణియు సుధయు
నీరు హారి క్రీడిఁ బ్రోచు నీవేగు మనినఁ
దిరిగి యాతండు వచ్చిన తెరువుఁ బట్టె. 89

ఉ. సంగరభూమిఁ జేరి ఘనసారసముజ్జ్వలదీపమాలికా
సంగతబభ్రువాహనిజసైన్యసురక్షితుఁ డైనపార్థుమ్రో
లం గడుఁ దూలి దీనదశలం బలవించెడు నయ్యులూచి చి
త్రాంగదలం గనుంగొని దురంతవిషాదముతోడ నిట్లనున్.

శా. తల్లీ నీజనకుండు శేషఫణి రత్నం బీక లోభంబు సం
ధిల్లం బల్కిన రోసి వచ్చితి విరక్తిం బుత్రదత్తాగ్నిలోఁ
జెల్లుం డిందఱు నన్నుఁగార్ణి చెవికిం జేదై కఠోరక్రుధా
వేల్లద్భ్రూకుటిమండలుం డగుచుఁ జేవి ల్లంది పెల్లీసునన్.

శా. ఎట్రా శేషుఁడు పోతరించి సభ నన్నొగ్గాడెనా రత్న మీఁ
డట్రా వాసుకితక్షకాదిధృతరాష్ట్రామాత్యకర్కోటకుల్
చుట్రా నిల్తురుగాక నన్ను సమరక్షోణిఁ విజృంభించి మా
గట్రాచూలివిభుం డెదిర్చిన నహంకారంబు వారించెదన్.

క. అని జనయిత్రులదెసఁ గ
న్గొని యిట్లను బభ్రువాహనుఁడు చిత్రముగాఁ
గొనివచ్చెద మృతసంజీ
వనమణియు సుధారసంబు వగవకుఁ డనుచున్. 93

—— బభ్రువాహనుఁడు నురగులతోడ యుద్ధంబున కేఁగుట ——

క. మాతంగరథభటాశ్వప
రీతుఁ డగుచుఁ దోఁ్రివ పుండరీకుఁడు చూపఁగఁ
బాతాళంబున నిలువక
పాతాళంబునకుఁ బోయి పోఁజులు సేయన్. 94

తే. శంఖభేరీమృదంగనిస్సాణభయద
రావములు దిక్తటంబుల వ్రక్కలింప
శేషుఁ డిట్లనుఁ దక్షకమూషకాద
కుళికవాసుకికర్కోటకులఁ గనుఁగొని. 95

ఉ. తెంపున బభ్రువాహుఁ డరుదెంచె రణంబునఁ బన్నగంబులన్
ద్రుంపక పోఁడు కట్టలుకతో ధృతరాష్ట్రనిదుర్వినీతు లా
లింపఁగఁబట్టి పుట్టెఁ బనిలేనివిరోధము మీర లెల్ల నా
పంపునఁ బోరికిం జనుఁ డపారబలంబులతోడ నావుడున్.

ఉ. కుండలిరాజునాజ్ఞ భుజగుల్ వరరత్నకిరీటముద్రికా
కుండలమాల్యచందనదుకూలములన్ ధరియించి వాహవే
దండరథాధిరూఢు లయి తార్క్ష్యని మార్కొన నొప్పె సేన
లా, రెండులయాంతకభ్రుకుటిరేఖల పెంపుఁద్రృణీకరించుచున్.

మ. అనికిం దూకొని దందశూకచతురంగానీకముల్ పంచయో
జనజన్యస్థలి నించి భీషణవిషజ్వాలావలిన్ బభ్రువా
హనుసేనం బరిమార్పఁ దోన ధృతరాష్ట్రా మోఘదివ్యాస్త్రశ
స్త్రనిపాతంబు లనేకవింశతిసహస్రవ్యూహముల్ మ్రగ్గినన్.

తే. విజయసుతుఁ డల్గి మాయూరవిశిఖ మేయ
ద్విత్రిశతసంఖ్యఫణములవిషధరముల

శిఖులు మర్దింపఁ జెదరుతచ్ఛీర్షమణులు
విలయమున రాలునుల్కలవిధము మెఱసె. 99

వ. ఇత్తెఱంగునం గేకిలోకంబు గడిసి చీకాకుపడం గాకోదరం బులయుదరంబులు చంచూపుటంబులం జించినఁ బ్రేవులు ప్రోవులుగడం గెడసి నాలికలు పేలికలవిధంబునం దూలం దూలుట గనుంగొని యక్కుమారుండు మధువర్షబాణంబు ప్రయోగించి. 100

క. నిలువక పిపీలికాస్త్రం
బలుక మెయిం దొడిగి యేయ నందువలనఁ జె
క్కులు చీమలు వెలువడి వడిఁ
దొలిచె శరీరాస్థులెల్లఁ దొఱటలువాఱన్. 101

క. చిలువదళవాయు లప్పుడు
తలబీకనకాయలై యథాయథలై కా
కులువత్తులునై మొనతల
నిలువక శేషాహికడకు నెటిచెడి పాఱన్. 102

వ. వారలం గనుంగొని భుజంగపుంగవుం డిట్లనియె. 103

క. మృతసంజీవని సురరా
ట్సుతునకు నిండన్న నప్పుడు కుయుక్తులు చె
ప్పితిరి నరసూనుమగఁటిమి
ధృతరాష్ట్రప్రముఖు లెఱిఁగితిరె నేఁడాజిన్. 104

బభ్రువాహనుఁడు సురగుల నోడించి జీవమణిఁ గొనివచ్చుట

సీ. అంచు వారల నిరసించి యాతఁడు మ సు
త్రామపౌత్రునకు నీఁదగినదివ్య

కవచంబు శతశలాకాఛత్త్రము సమాల్య
కుండలాభరణదుకూలమాల్య
పరిలేపనములు నుపాయనంబుగ నిచ్చి
గారవించి మనంబుకందు వాపి
గాండీవికిని మేలుకట్టనంబు లమర్చి
స్వర్ణపేటికలందు సంతరించి
తే. తత్కిరీటాదులు గొల్వఁ బాతాళగహ్వ
రంబు వెలువడి జీవరత్నంబుఁ గొనుచు
బభ్రువాహనుఁ గూడి ప్రాభవము మెఱసి
మణిపురంబున కేతెంచె ఫణివరుండు. 105

తే. అపుడు ధృతరాష్ట్రుఁ డాత్మగేహమున కరిగి
దుఃఖితుం డయి దుర్బుద్ధి దుస్స్వభావు
లను సుతులఁగాంచి బభ్రువాహనునిచేత
బవరమున నైనతనపరాభవము దెలిపి. 106

క. పాండవులకు మనకు మొదల
నుండియు నెడతెగనివైర మురగవిభుం డా
ఖండలసుతు బ్రతికించును
రం డిందుకుఁ దలపుఁ డంతరాయం బనినన్. 107

వ. వారలు తండ్రికిఁ బ్రణమిల్లి యిట్లనిరి. 108

ఉ. కుండము దాఁచినన్ ఫణివరుం డొకఁ డేల కిరీటిఁ బ్రోవఁ గృ
ష్ణుండును జాలఁ డింద్రసుతుచొప్పుఁగన్ మఖసైంధవంబు
నెవ్వండయినన్ హరింప నిలువంబడు జన్నము యజ్ఞకర్మహీ
నుం డయి చెల్లు నయ్యమతనూజుఁడు నీపగదీఱు నంతటన్.

తే. అనిన ధృతరాష్ట్రుఁ డలరి శేషాహిఁ గొల్వఁ
జనియె నెఱుఁగనియట్ల తత్క్షణమ శక్ర
తనయుతలఁ గొంచుఁ దత్సుతుల్ చనిరి గరుడ
వర్జితంబైన బకదాల్భ్యవనమునకును. 110

{ నాగకుమారులచే నపహరింపఁబడిన యర్జునతల గానక చిత్రాంగదాదులు శోకించుట }

వ. అప్పుడు. 111

క. అదరి యులూచియుఁ జిత్రాం
గదయును గాండీవిశిరముఁ గానక కలయన్
వెదకి వదనోదరము లద
వదలుగఁ దాఁటించుకొనుచు వసుధం బొరలన్. 112

వ. తత్కోలాహలంబు బభ్రువాహనుం డాలకించి. 113

క. అరుదెంచి శక్రసూనుని
శిరము వెదకి కానలేక చెందినమూర్ఛన్
ధరవ్రాలె నచటఁ గుంతియుఁ
గరిపురి నారాత్రి కీడుకల గని భీతిన్. 114

క. విన్ననయి ధర్మజాచ్యుతు
లున్నెడ కరుదెంచి యదుకులోత్తంసునకున్
విన్నపము చేసె మునుకుచుఁ
గన్నులఁ గ్రొవ్వేఁడిబాష్పకణములు రాలన్. 115

తే. కంసమర్దన నేఁడు నాకలఁ గిరీటి
తైలదీర్ఘిక మునిఁగి గాత్రమున గోమ
యం బలందుక రక్తమాల్యములు దాల్చి
యరిగె ఖరవాహనమునెక్కి యామ్యదిశకు. 116

క. అప్పాండవమధ్యమునకు
నొప్పమి పుట్టంగవలయు నుల్లము కలఁగెఁ
దప్పదు నాకల నీసఖు
నొప్పి పరిహరించి దయఁ గనుంగొను మనినన్. 117

తే. సంస్మరించిన నెదుర సాక్షాత్కరించు
తార్క్ష్యుపై దేవకీయశోదలును గుంతి
యును బకారియురా హుటాహుటిను వేంద్రుఁ
డరిగె మణిపురమునకు నయ్యపరరాత్రి. 118

చ. ఒఱగినవారణంబులను నున్నమితాతపవారణంబులన్
నుఱుమగుభీకరాసుల నణూకృతభూషణరత్నరాసులన్
దఱచగుదీపకోటుల గుణచ్యుతకర్కశచాపకోటులన్
మెఱసినబభ్రువాహనుసమిత్స్థలి శౌరి సుపర్ణు డిగ్గఁగన్.

క. బకదనుజాంతక దనుజాం
తకజనులుఁ బన్న గాశనరథంబు నిరు
త్సుకత డిగి పార్థునపమూ
ర్థకళేబర మెదురఁ గని రోదవు శోకమునన్. 120

శ్రీకృష్ణుఁడు మొదలగువా రర్జునుకడకు వచ్చుట

ఉ. శ్రీవరుఁ డప్పు డర్జునునిఁ జేరి ధనంజయ వీర కుంతియున్
దేవకియున్ యశోదయును నిన్నుఁగనుంగొని పొక్కుచుండ
నేలావగ పార్పవంచు నడలన్ విని భీముఁడు కృష్ణుఁజూచి దే
వా విజయుండు మేల్కను నవశ్యము నీవిటు పేరఁబిల్చుటన్.

సీ. అనునంత సూర్యోదయం బైన బభ్రువా
హనుఁడు వల్లులు దాను నలముకొనిన

మూర్ఛలు పర్యాయమునఁ దేఱి దురములోఁ
జిక్కినప్రద్యుమ్ను చే నెఱింగి
కృష్ణునకును దేవకీయశోదలకుఁ గుం
తికిని భీమునకు సద్వినయభక్తిఁ
బ్రణమిల్లె నప్పు డప్పన్నగాధీశుండు
చక్రిసన్నిధిఁ జేరి సమయ మరసి
తే. దేవ జీవదరత్నంబుఁ దెచ్చినాఁడఁ
గరుణ రక్షింపు నీచెలికాని నితని
మస్తకము దొంగిలిన నీచమతులఁ బట్టి
తునుము తొల్లిటిరాహుకేతువులబలెను. 122
తే. ధర్మజునియన్వయము రసాతలములోన
మునుఁగ కుండఁగ నుద్ధరింపుము కిరీటి
శిరమునకుఁ దోడ్త గానము చిత్తగింపు
దేవకీపుత్ర నీదివ్యదృష్టి ననిన. 123
మ. వినుఁడీ నాదుప్రతిజ్ఞయే నఖిలపృథ్వీబ్రహ్మచర్యవ్రతం,బునఁ
బెంపొందితి నేని కవ్వడిశిరంబుల్ వచ్చుఁదచ్చోరకుల్, పును
కల్ప్రయ్యలువాసి చత్తురన నాలోఁగ్రిడిమస్తంబుచ,య్యన
వచ్చెన్ విగతాసులైరి ధృతరాష్ట్రాపత్యముల్ కానలోన్.
వ. అంత. 125

శ్రీకృష్ణుం డర్జునుని బ్రదికించుట

క. నరవృషకేతనుల తలల్
సిరివరుఁ డంగములఁ జేర్చి జీవదమణి పే
రురమున మోప నదికెఁ ద
చ్ఛిరము లయస్కాంత మినుముఁ జెందినమాడ్కిన్. 126

ఉ. జీవదరత్నవైభవముచే వృషకేతుఁడు లేచి శ్రీహరిం, దా
వినుతించుచుఁ రిపు నదల్చ ముకుందుఁడు గౌఁగిలించె గాం
డీవియు నట్లదేఁ సుతు నెమ్మిఁ గనుంగొనెఁ దల్లి వాడు ప్రస్సా
వలి వానఁ దెప్పిఁ ఉక్రియఁ గనెఁ బాండవసైన్య మత్తఱిన్.

చ. మొరసె నసంఖ్యశంఖరవముల్ దివిఁ బువ్వులవాన సోనగాఁ
గురిసెఁ బునః ప్రజాతసుతఁ గుంతిఁ గనుంగొను వేడ్క వా
హినుల్, బెరసె మురారి పట్టి కదలింపఁ జమూపసమూహ ము
బ్బుగా, నెరసెఁ బురోపకంఠసరణిం దరుణీపరిణీతలాస్యముల్.

ఉ. అన్నగరీజనంబు నెరయం గని వాళిగఁ జల్లురత్నసం, పన్నత
యుం దదంతికహిమక్షితిభృత్తటసీమ నోలగం, బున్నకుమా
రుఁ జూచి తల లూఁచి నృపుల్ గొనియాడఁ గ్రీడియుఁ
వెన్నుఁడుఁ బభ్రువాహరమణీయసభాస్థలిఁ జొచ్చి యచ్చటన్.

క. ఘనరత్నభద్రపీఠం
బున నిరువురు నుండి రితరభూపతు లర్హా
సనులై రప్పుడు నమితా
ననుఁ డగు నరుఁ జూచి భోగినాయకుఁ డనియెన్. 130

క. ధాత్రీశుల కర్జున స
ర్వత్ర జయముఁ బుత్రుచేఁ బరాభవముఁ గనం
బాత్రము భవదీయసుత
పౌత్ర మెఱిఁగి మెచ్చు కిటు తగదు లజ్జింపన్. 131

వ. అదియునుంగాక నీకు గంగాశాపనిమిత్తంబున నిట్టివిపత్తు సంభవించె. చిత్తంబున నుత్తలంబు నొందక ముకుందుని కరుణావిశేషంబునం జెందినభవన్నందను సకలరాజ్యభోగంబులు ననుభవింపుము. నీకళత్రంబు లైనచిత్రాంగదాభుజంగ

రాజపుత్త్రికల హృజ్జనితశోకంబు లుజ్జగింప బుజ్జగింపుము. లజ్జితుం డైనబభ్రువాహను నుపగూహనంబున నాదరింపు మని వారిజోదరుం గనుంగొని. 132

సీ. దేవ కవ్వడినొప్పి దీఱ బోధింపు మి
త్తఱి దేవకీయశోదలును గుంతి
యును దండ్రి బిడ్డల నొద్దిక సేయంగ
వలయు వీరుఁడు బభ్రువాహనుండు
విష్ణుభక్తుని దయాన్వితుని భ్రాతృవ
త్సలుని నూర్జితయశోధనుని నాత్మ
జనకుని మార్కొన్న పెనుఁబాతకము వాయఁ
బ్రాచితంబుగఁ దుషారాచలంబు
తే. దండఁ దనమేను విడువంగఁ దమకపడెడు
ననినఁ జిత్రాంగదాతనూజునిమనంబు
తెంపుఁ గనుఁగొని యది నివారింపఁదలఁచి
పవనజుఁడు పల్కె గంభీరభాషణముల. 133

తే. గురుఁ బితామహుఁ దోఁబుట్టుగుల వధించి
దురితములఁ జెంద మీయచ్యుతుని భజించి
కలుషమతి వైననిన్ను డగ్గఱునె శౌరి
జీవపిత వీవు నెఱయంగఁ బావనుఁడవు. 134

క. విను నాలవయుగమున నీ
తనినామస్మరణమునఁగదా మర్త్యులు పా
వను లైరి కృష్ణుఁ గొలిచిన
మనలకు భయశోకదైన్యమగ్నత గలదే. 135

క. అని పెక్కు చందములఁ బా
వని తెలిపిన నపుడు బభ్రువాహనుఁడు మనం
బున నెగులు విడువ నందఱుఁ
గొనియాడిరి విజయుపట్టిగుణకథనంబుల్. 136

క. నానావిధభోగంబుల
నేనుదినము లుండి రేకపేాల మణిపురిఁ
దానములచేత బహువిధ
గానంబులచేతఁ గౌతుకము రెట్టింపన్. 137

క. ఆసమయంబునఁ గృష్ణుఁడు
వాసవితో ననియె నిట భవత్సూనుని యా
వాసమున సుఖింప సునా
యాసంబుగ నేగె వరుస నైదుదినంబుల్. 138

క. మనతల్లుల నీదేవుల
ననిలతనూభవునిఁ గూర్చి యశ్వము లగు నీ
ధనకనకవస్తురాసులఁ
బనుపఁదగు నజాతశత్రుపట్టణమునకున్. 139

క. వీనలు ధర్మజుయజ్ఞ
ప్రారంభము జరపెదరు తురగరక్షకు నీ
భూరమణులు భవదీయకు
మారులు రావలయుఁ గదలి మనబడి ననుచున్. 140

ఉ. దేవకి మున్ను గాఁగలసతీనివహంబు ధనంబుఁ గూర్చి య
ప్పావనివెంట నంపుటయుఁ బన్నగరాజును బభ్రువాహన
క్ష్మావరుచేతిపూజ బహుమానముగాఁ గొని సంతసిల్లి ల
క్ష్మీవరుఁ డంప భోగవతికిం జనియెన్ బరమానురక్తుఁడై. 141

క. అనవరతము నీకృష్ణా
ర్జునయుతసంజీవకథ వరుస నాకర్ణిం
చిన వ్రాసినఁ బాఠము చే
సిన ధర నపమృత్యుభయముఁ జెందరు మర్త్యుల్. 142

క. జనమేజయ విను గోవిం
దునియనుమతి విడువఁబడినతురగము నానా
జనపదములు గడచి క్రమం
బున బర్హిధ్వజునివత్నపురమున కరుగన్. 143

క. త్రోవ మయూరధ్వజవసు
ధావరుక్రతుహయముఁ బుత్త్రుఁ దామ్రధ్వజునిం
గావలిగా నిడి విడిచిన
దైవికముగ రెండు నెదురుతాఁకై నిలువన్. 144

ఉ. అమ్మఖవాజిఁ బాండుతనయాధ్వరవాహ మెదిర్చి మోము
మోవమ్మసి వెట్టి హేషితరవమ్మున వక్షముఁ బూర్వపత్ఖురా
గ్రమ్మున ద్రేయ జేసి యది కంఠము వట్టి విదల్పఁ దోన మి
త్రమ్మయి కేలికిం గడఁగి దంతములన్ గళ మప్పళింపఁగన్.

క. తామ్రధ్వజభూవరుఁ డా
తామ్రనయనుఁ డగుచుఁ గనలి తంత్రాధిపు నీ
సామ్రాణి యెవరి దనవిని
నమ్రుఁ డగుచు లీలఁ గదలి నకులధ్వజుఁడున్. 146

నకులధ్వజుఁడు పాండవహయంబుఁ బట్టుట

ఆ. చౌకళింపకుండఁ జతురంగబలముల
సారిది వేడె వెట్టి చుంచు బిగియఁ

బట్టి చదివె నొసలిపట్టికమీఁదఁ గ
నృట్టి మెఱయు బిరుదపద్య మపుడు. 147

ఉ. దుర్జయరాజమండలవిధుంతుదమూర్తి యుధిష్ఠిరక్రతూ
త్సర్జిత మైనయీహయవతంసము ద్రిమ్మర నంగరక్షగా
నర్జును డేగుదెంచె నిటలాక్షుని గెల్చినజోదువిక్రమో
పార్జితలీలఁ బట్టెఁడు రయంబున శూరులు ధాత్రిఁ గల్గినన్.

క. అది విని నృపసూనుం డను
నదనఁ గ్రతువు లేదు జరపె నధిపతి మును నేఁ
డిది దొరకుటచే నెనిమిద
వదియును సిద్ధించె ననుచు హరిఁ బట్టింతున్. 149

క. రేయి సురమౌని చెప్పెక్
బ్రాయఃపౌరుషులు లేరు పాండవసేనక్
బ్రాయి గలమగలు నరరా
ధేయసుతులుదక్క ననుచుఁ దెలియఁగ నాకున్. 150

మ. నరనారాయణు లర్జునాచ్యుతులు జన్యం బబ్బెడిం గావుఁ డీ
హరి నన్నుం దళవాయి నీబలములో నాసేన గానంగరా
దరయక్ శూరుఁడు బభ్రువాహనుఁడు గాఁడా పెట్టుముక్తా
మణుల్, పురినంతఃపురిఁ జూపుకేళికలకుం బుష్పాంజలుల్
సేయఁగన్. 151

కృష్ణార్జునులు తామ్రధ్వజునితోఁ బోరుట

క. ఆహవ మొనరింపఁగ నిఁక
సాహసు లం దెవ్వ రనుచు సైన్యాధీశుం
డాహయము నర్ధచంద్ర
వ్యూహంబునఁ బదిలపఱచె నొడయనియాజ్ఞన్. 152

ఆ. తామ్రకేతుఁ డనిఁ బ్రతాపించి మార్కొన్న
శౌరి పలికె సవ్యసాచిఁ జూచి
వీరయోధకు లనికారణంబున కెల్ల
కారణంబు తప్ప దీరణంబు. 153

క. వారు లయాంతకనిభులు మ
హారథు లని కార్ష్ణిఁ బిలిచి యస్మద్బలముం
బోరికి గృధ్రవ్యూహము
గా రచియింపు మన నట్లకాఁ జేయుటయున్. 154

వ. వారిజోదరుండును దారకప్రేరితం బైనతేరెక్కి మిక్కుటం బగురవంబుల దిక్కుడుంగంబులు వ్రక్కలింప నొక్కమొగిఁ బాంచజన్యంబు పూరించె నమ్మహావ్యూహంబునకు నను సాళ్వుండు కంధరంబును హంసధ్వజుం డీక్షణంబులును ప్రద్యుమ్నానిరుద్ధులు పక్షంబులును భోజవర్ధనుం డైన శైనేయుండు చరణమధ్యంబును జంచువు చిత్రాంగదా పుత్ర చిత్రభానుపౌత్రులును నపరిమితసేనాసమేతుం డైన కపికేతనుం డుదరంబును దదీయరక్ష యౌవనాశ్వమేఘ వర్ణులుగా నెదిర్చినం గనుంగొని తామ్రధ్వజుండు గరుడ ధ్వజున కిట్లనియె. 155

క. శూరత నను నెదిరించితి
పోరికి దివ్యాయుధములు పూని నిజముగాఁ
బౌరుషము గలిగె నేనియు
నారాయణ పట్టవలదె నాహరి ననుచున్. 156

మ. అలుకం గన్నులు విస్ఫులింగములఁగ్రాయఁ దామ్రకేతుక్ష
మాతలనాథుండు శతాంగముం దఱిమి పార్థవ్యూహరక్తం
బులన్, బలిచల్లెన్ నెలవంకబాణముల దృప్యడ్డాకినీహా
తికృద్ధళితజ్యారవఘూర్ణి తాఖిలదిశాకాశావకాశంబుగన్.

సీ. కంసారి నేడంబకంబుల స్రుక్కించి
యేనింట సూతుని నేపడంచి
తేరివాజుల నాల్గునారాచములఁ ద్రుంచి
త్రిదశేంద్రజుని డెబ్బదిటఁ గలంచి
శైనేయుఁ దొమ్మిదిశరముల సొరిగించి
కృతవర్మ నిరునాలుగింట నొంచి
ప్రద్యుమ్ను వేయిమార్గణములఁ దూలించి
శతసహస్రములఁ దత్సుతుని ముంచి

తే. యంతఁ దనియక మదిఁ జాల నాగ్రహించి
మఱియుఁ దక్కినయోధుల మద మడంచి
పగటిసూర్యునిగతి ప్రతాపమున మించి
సింహనాదంబు గావించెఁ జెంగలించి. 158

వ. అప్పుడు. 159

క. తనతనువున నంతట గ్రిఱి
కొనినశరవ్రజము దుల్పుకొని యుద్ధతుఁడై
యనిరుద్ధుఁ డెదిరివీరుల
ననిరుద్ధులఁ జేసి భీషణాశుగనిహతిన్. 160

క. గ్రమ్మన నెత్తురుఁ జేఱులు
గ్రమ్మ నఖండప్రచండకాలానలకీ

లమ్ములఁ దెగడు మెఱుఁగువా
లమ్ముల నక్షౌహిణీత్రయము మడియించెన్. 161

క. ఆయదువీరుఁడు మఱి విలు
మ్రోయిం చరిఁ జూచి తురగమును విడు లేదా
నాయెదుర బంటవై నిలు
మా యోధనమునకు నన్న నతఁ డరనగుచున్. 162

క. అలరువిలుకానికొడుకవు
బలివారఁడె నాఁడె పట్టి బాణుఁ డుషామం
గళసూత్రవైభవము నీ
తల గాచెం గాక నాకు దయలే దనినన్. 163

చ. కటువుగ నల్గి బాడబసఖం బగు క్రొవ్విశిఖం బడర్చి హృ
త్పుటముఁ బగిల్చి తొమ్మిదిటఁదొట్టినక్రొవ్వుఁగదల్చిసూతునొ
క్కటఁదలడుల్చి తేరితురగంబుల నాల్గిటఁ గూల్చి యార్చినన్
దటుకునవాలుఁ గేడెమునుదాల్చి సుచిత్రుఁ డదల్చినిల్చినన్.

క. అరిగయుఁ గృపాణియును నతఁ
డురవడిఁగొని రథము డిగ్గనుఱికిన నపు డ
య్యిరువురు సింగపుఁగొదమల
కరణి విజృంభించి తాఁకి ఖడ్గాఖడ్గిన్. 165

క. లాసియుఁ బొడిచియుఁ దట్టియు
వ్రేసియు నొడ్డించుకొనియు విసరియు మిగులం
డాసియు నొక్కటఁ గయ్యము
చేసిరి నిజసాధనములు చిదురుపలుగాఁగన్. 166

క. జేగురుఁ గోరాడినమద
నాగంబులరీతి మార్గణవ్రణజాసృ

గ్రాగములఁ ద్రొప్ప ద్రోఁగియు
లాగమునకుఁ జొచ్చియచ్చలంబునఁ బెనఁగన్. 167

క. దగద్రొట్టి శౌరిమనుమఁడు
జగతిం బడి మిగులఁ బరవశత నొంద దిశల్
వగులఁగ నార్చి సుచిత్రుం
డగలిచెఁ బ్రద్యుమ్ను వక్ష మైదస్త్రములన్. 168

ఆ. అపుడు కర్ణసూనుఁ డాసుచిత్రునిమేన
శరము లాఁఱు గ్రుచ్చి విరథుఁ జేయఁ
దెమల కాతఁ డొండుతే రెక్కి విలుగుణ
ధ్వని యొనర్పఁ దునిమె దద్రథంబు. 169

క. త్రిశతశతాంగము లీరి
తి శకలములు సేయ వేఱుతే రెక్కి నిగు
డ్చుశరాళిఁ గర్ణజుని దు
ర్దశఁబెట్టెను వ్యాధిగణము తనువునుబోలెన్. 170

వ. మఱియును. 171

క. అనుసాల్వు నైదిటను యూ
వనాశ్వు నొక్కటను భోజవరు రెంట నొగి
ల్చిన సాత్యకి మార్కొని య
జ్జనపతిరథ్యములఁ దునిమి శంఖం బొత్తెన్. 172

శా. ఆనారాచముమున్న సాత్యకియురం బాడఁ సుచిత్రుండునా
నానారాచపరంపరఁ వెగడు నందం జేయ మూర్ఛావశుం,డై
నిల్వంబడి లోచనంబు లరమూయం దోన చిత్రాంగదా,సూ
నుం డేనుశరంబు లేయ నవియుం జూర్ణంబుగాఁ జేయుచున్.

చ. చిఱునగ వొప్ప నిట్లను సుచిత్రుఁడు నీ విపు డింతలోపలన్
మఱచితె బభ్రువాహనుఁడ మాకు నుపాయన మిచ్చు ముత్యము
ల్పెఱికలఁ దెచ్చు టంచు నదలించి శిలీముఖవృష్టి ముంచి క్రే
ళ్లుఱికి మరాళకేతను మహోగ్ర శరంబులఁ దూల నేసినన్.

## సుచిత్రార్జునుల ద్వంద్వయుద్ధము

వ. అప్పుడప్పాండవసైనికులకాండతాండవోద్దండఖండపరశుండునుం బోలె విహరించు తామ్రధ్వజుం గనుంగొని గతప్రాణులై వదలుకృపాణబాణాసనాదిసాధనంబులు వీరయోధయూధప తురంగమాతంగంబులం దొరఁగురుధిరప్రవాహంబులకు జలగ్రాహంబుల యొఱవు గఱప నాలంబునకు నూలుకొనక నరునిపాలికిం జని గోత్రవధపాతకనివారణార్థం బశ్వమేధంబు సేయ సమకట్టి మమ్ము నెల్ల వీని గొఱియలం జేసి తిందు నే ఫలంబు గట్టుకొంటి వని ముట్టనాడినం గ్రీడి యోడకుండుఁడని వారి నూఱడించి తేరు వైరిసమ్ముఖంబు చేయించి సాయకనికాయంబుల నతని కాయంబు గాయంబుగాఁ జేసి విరథునిం జేసిన తేసి యతండు వేఱొండురథం బెక్కి యింక నెక్కడ వోయెదు దీసవనసైంధవంబు తోడన బంధించుకొని నిన్నుఁ గొనిపోయెద నని వసుంధరాధరంబుపైఁ గంధరంబులు వర్షించుచందంబున సంక్రందననందనునిమీఁద నందంద విశిఖబృందంబుఁ గ్రందుకొల్పిన శరవేగంబున నతండాజిరంగంబునకు యోజనంబు దక్షిణంబున కరిగి యాక్షణంబ తిరిగి నిజబలంబుల సమ

యించునప్వీరునిం దేరితోన తారాపథంబున కెగయ ఘోర
నారాచంబులు వఱపి దేవదత్తం బొత్తె నిత్తెఱంగున నెత్తిన
చలంబున నేడహోరాత్రం బొత్తె నిత్తెఱంగున బోరినం
బోరు ఘోరం బయ్యె నయ్యవసరంబున. 175

క. నరుచే సుచిత్రుఁ డెక్కుడు
నరదము లిరువేయి జమిలియక్షౌహిణియున్
ధరఁ బడియె నల్ల పోరం
దరబలములు నట్ల మడిసెఁ దామ్రధ్వజుచేన్. 176

చ. పలలము సాళువంబు కొను భంగి సుచిత్రుఁడు క్రీడిఁ దేరితో
నలమి వియత్తలంబు గదియన్ రభసంబున దాఁటి సంగర
స్థలిఁ జదియంగ వైవ నిజసైన్యము కవ్వడి చచ్చెఁ జచ్చె నం
చలఁగ మురారి గ్రక్కునఁ గరాబ్జమునన్ బడకుండఁ బట్టినన్.

క. కలుషించి తామ్రకేతుఁడు
పలికె గదాధరునిఁ జూచి పాండవుతోన
చ్ఛలమునఁ బోరఁగ దొమ్మికిఁ
దలపడితివి నీకు వీరధర్మమె యనుచున్. 178

క. అదిరిపడి వింట భాస్వ
త్ప్రదరము సంధింప శౌరి తామ్రధ్వజునిన్
గదిసి వడి నురముఁ దన్నుచు
గదఁ గొని మస్తకము గాతు కలఁగఁగ నడిచెన్. 179

క. అందుఁ జలింపక చటుల
స్యందనముం దఱిమి పాండుసైన్యవరుల నిం
దంద పరిమార్ప నప్పుడు ము
కుందుఁడు గాండీవిఁ జేరుకొని యిట్లనియెన్. 180

తామ్రకేతునితో నర్జునుఁడు పోరుట

చ. దళములు వీనిఁ గన్గొని యథాయథలయ్యె మరాళకేతనా
దులు సమరస్థలిం బడి యెదుర్కొని నీవును నేను వీనితోఁ
దలపడి పోరనున్నఁ బని తప్పు నిజం బని శార్ఙ్గ శింజినీ
కలకలముల్ కిరీటికరగాండివరావము నెచ్చరింపఁగన్. 181

క. బరవసముగ శరవిసరము
గురియఁగ నవి దునిమి సరకుగొనక సుచిత్రుం
డిరువురవిలునారులు ని
ష్ఠురగతిఁ దెగనేయ నింద్రజుఁ డుపేంద్రునితోన్. 182

క. ఇన్నీచునకై దేవర
పన్ని పెనఁగ నేల యేన పరిమార్తు ననుజ్ఞ
మన్నించి సారథివి గ
మ్మన్న హరియు నియ్యకొని శతాంగముఁ దఱుమన్. 183

క. అలిగి సుచిత్రుఁడు పదితూ
పులఁ గృష్ణుని నొంచి పాండుపుత్రునరద మ
మ్ముల ముంచి గొడుగుఁ ద్రుంచిన
బలభిత్సుతుఁ డతనితేరు భగ్నము చేసెన్. 184

క. అరదము రూపఱిన మద
ద్విరదము వెస నెక్కి విశిఖవితతి పఱపఁ ద
ద్గురుదనిలాహత జిఱజిఱ
హరిహయసుతురథము తిరిగె నాసమయమునన్. 185

క. తమమూర్ఛ లుడిగి కార్ష్ణి
ప్రముఖు లతని నిశితశరపరంపర నొంపన్

దెమలక సుచిత్రుఁ డతివి
క్రమమునఁ దద్వీరవరులఁ గలనం గూల్చెన్. 186

క. అందులకుఁ జాల నలిగి యు
కుందుఁడు చక్రంబు కేలఁ గొని పాండుసుత
స్యందనము డిగ్గి నుఱుక ర
వీందుగ్రహతారకములు నిలయుఁ జలించెన్. 187

శా. మాయూరధ్వజిశౌరిఁ జూచినగిరమ్మా కృష్ణ మున్నాజిఁగాం
తేయుం గావఁగఁబూని నీసుకృతము న్వొచ్చించి తివ్వేళ నీ
కాయంబుల్ దెగనిమ్మునాయెదురఁ జక్రంబెత్తితేచూడువా
లాయంబు న్నినుఁగ్రీడి నిప్పు డవలీలం గట్టి కొంపోయెదన్.

క. అని కరి డిగ్గ నుఱికి కృ
ష్ణునిచక్రము కేలువట్టి నులి వెట్టఁగ న
ర్జునుఁ డచ్యుతుపనుపున నా
తని నూఱస్త్రముల నొంపఁ దామ్రధ్వజుఁడున్. 189

{ తామ్రధ్వజుఁడు కృష్ణార్జునుల జయించి హయంబుఁ గొని పురంబునకుఁ బోవుట }

క. లెక్కగొనక నరుఁ గృష్ణుని
నుక్కణఁగ బిగించి మూర్ఛ నొందించి ధరన్
గ్రక్కదల వైచి హయము
న్నెక్కొనఁ గొనిపోయి జనకునిం గని మ్రొక్కెన్. 190

క. మ్రొక్కినఁ గని నకులధ్వజు
దిక్కు గనుంగొనిన వాసుదేవార్జునులన్

ప్రుక్కించి హయము దెచ్చిన
యక్కథ వినిపించె నృపతి కాతఁడు తెలియన్. 191

క. విని కన్నులఁ గెంపొదవఁగఁ
దనయుని వీక్షించి సమరతలమునఁ గృష్ణా
ర్జునుల నటు డించి తురగముఁ
గొనివత్తురె యింతపడుచుగొడుకవు గలవే. 192

చ. క్రతుఫలదాత యైనహరిఁ గయ్యములోనఁ బరిత్యజించి శూ,రతఁ గొనివచ్చి తీమఖతురంగము నెవ్వరిఁగూర్చి చేయ నీ, క్రతు వీక యంచుఁ దానుఁ గులకాంతయుఁ గూడి మయూరకేతుఁ డీ,గతి వెతఁ బొందఁ బ్రొద్దు మసకంబడె నంతటఁ బొందుసైనికుల్. 193

ఉ. బన్నపుమావుఁ గాననివిచారపుమోములఁ బంకజంబుల, న్వన్నియజాఅమార్గణగణప్రణజాస్రముసంధ్య పెంపు సం, పన్నతమిాఅ నిద్రయుఁ దమంబుఁ గ్రమంబునఁ జేర మోడుపుం గన్నులఁ గైరవంబులవికాసము దేఱఁగ మూర్ఛ దేలుచున్.

క. హరిఁ జూచి నరుఁడు మనతో
దురము సలిపినతఁడు సవనతురగముఁ గొని యే
తెరువునఁ జనె నా కెఱిఁగిం
పు రణంబున గెల్చి వాహముం దెత్తు ననన్. 195

ఆ. వీతి నిపుడు బర్హికేతుఁ డేలెడురత్న
పురికిఁ గొనుచు నతనిపుత్రుఁ డరిగె
వాని తెగువఁ జూచె దేని నావెంట ర
మ్మనుచుఁ బురముచెంత మొనల నునిచి. 196

## కృష్ణార్జునులు మాయావిప్రరూపంబుల మణిపురంబు ప్రవేశించుట

సీ. కటిఁ బ్రాతముతుకనీర్కావిదోవతిపంచె
భూరిమధ్యమున నూర్ధ్వపుండ్రకంబు
వక్షఃస్థలమునఁ బద్మాక్షమాలిక కర్ణ
బిలమున నులివాడుతోలసియెన్ను
నంసభాగంబున నాయవారపుసంచి
దోర్మూలమున నిక్షిత్తోలు సజ్జ
కుడికరంబున నలుగుడు వేణుదండంబు
గూనివీఁపునఁ జింపిగోడుగుఁ దడక

తే. తనకునలవడవృద్ధవిప్రునివిధంబుఁ
దాల్చుటయుఁ గూర్మిసఖుఁడు సుత్రామసుతుఁడు
బ్రహ్మచారియై తనవెంట రా మురారి
రత్నగరంబు సొచ్చి పూర్వత్రియామ. 197

క. పరిమళధూపము జాలక
సరణిఁ బిసాళింప సంతసముతోడుత న
న్నరనారాయణు లిరువురుఁ
జరియింపఁగఁ జంద్రకాంతసౌధములందున్. 198

చ. సురతసుఖంబులన్ మిగులఁ జొక్కుచునొక్కవిటుండు కాంతనీ
కురులకుఁ గృష్ణవర్ణమును గుంకుమగుబ్బల కచ్యుతత్వమున్
దొరకె నన న్నిజేశకరతోయరుహంబుఁ దెమల్చి నిన్ను నీ
కరముల శంఖచక్రములుగా పురుషోత్తముఁ జేసె నావుడున్.

క. సరసిజలోచనుఁ డిట్లను
హరిహయసుతుతోడఁ జూడు మాశ్చర్యం బీ
పురజనముభక్తి సురతపు
సరసతలను మామకప్రశంసలె యెపుడున్. 200

క. తలఁపులు హరిచింతనములు
పలుకులు హరికీర్తనానుభవములు పనిపా
టలు హరికృత్యంబులు భూ
తలవైకుంఠంబు పొగడఁదగు నిది యనుచున్. 201

ఉ. వేడుకతోడ నన్నగరవీథుల నీగతి సంచరించుచుఁ
గ్రీడియుఁ దాను వేకువతఱిఁ జని నర్మదలోన మజ్జనం
బాడి గమించి చొచ్చెను దదంతికరాజమరాళకూజితా
మ్రేడితకింకిణీరవపరిష్కృతఘోటము యజ్ఞవాటమున్. 202

క. చొచ్చి తదాస్థానమహిమ
కచ్చెరు వందుచు వియచ్చరాహ్వానోద్గా
తృచ్చరితసామమంత్రము
ఘోచ్చధ్వను లంతరిక్ష మూటాడింపన్. 203

మ. క్రతుదీక్షాపరు విశ్వభూవలయసమ్రాణ్మౌళి మాణిక్యభూ
షితపాదాంబుజు ఋత్విగావృతుఁ గుశాసీనుఁ బధూసంయు
తుఁ, గితవబ్రాహ్మణు లిద్దఱుం గదిసి కెంగే లెత్తి బర్హిర్ధ్వజ
క్షితినాథోత్తమ భద్రమస్తనుచు నాశీర్వాదముం జేసినన్.

క. ఆనరనాథుఁడు ప్రత్యు
త్థానం బొనరించి మ్రొక్కి ధరణీసుర ము
న్నే నతి గావింపక మును
పే నను దీవించు టిది శపించుట గాదే. 205

క. ఎందుండి యరుగుదెంచితి
వింతుల కేఁ జేయుసేవ యెద్ది యన మహీ
బృందారకుండు పరమా
నందహృదయుఁ డగుచు ధరణినాథునితోడన్. 206

క. భూవల్లభ కార్యార్థుల
మై వచ్చుటఁ జేసి మాకు నాశీర్వాదం
బీవలసె నమస్కారము
గావింపకమున్న యొగ్గుగా దిది యనినన్. 207

క. జనవరుఁడు పురాణములం
దనఘా 'యభ్యాగతస్స్వయం విష్ణువు'నా
వినఁబడు నినుఁ జూచిన నా
జనార్దనునిఁ జూచినట్ల సంతస మయ్యెన్. 208

క. కొంచక వేఁడుము తగ న
ర్పించెద నిపు డెద్ది నీయభీష్టము నాకుఁ
గించి త్తయిన మనోధన
వంచన మిచ్చోటలే దవశ్యం బనినన్. 209

సీ. భూపాల విను ధర్మపురినుండు కృష్ణశ
ర్మాభిధానుఁడ మదీయాత్మజుని వి
వాహంబునకు నీపురోహితుండు సుశీలు
నింటఁ గన్నియ గల్గుటెఱిఁగి యడుగఁ
బయనమై వచ్చుచో భయదాటవీమధ్య
సీమ నాఁకలి గొన్న సింహ మొకటి
కలిసి పుత్రుని ఘోటకముఁ గూడఁ బట్టిన
విడిపింప నా కొండు వెరవు లేక

తే. చింతతో 'నటవ్యాంనారసింహ' యనుచు
నూఁటయెనిమిదిమాఱు లెన్నుకొని వరుస
నలఁతఁ గుత్తుక యెండఁగా నవ్విభుండు
కరుణఁ బ్రత్యక్షమై నన్నుఁ గావఁ డయ్యె. 210

వ. ఇవ్విధంబున మహావ్యథం బరితాపించుచున్న నన్ను రూక్షేక్షణంబుల నిరీక్షించుచు హార్యక్షుంబు వాలవిక్షేపణంబుల నధిక్షేపించి పుత్త్రగాత్త్రంబు నఖరదంష్ట్రాంకురంబుల నప్పళించుచు మనుష్యభాషణంబుల గద్దించుచు నన్ను నుద్దేశించి నాచేఁబడిన జంతువుం గృతాంతునంతవానికైన బలవంతంబున విడిపింప నీఁతబంటి శిష్యుండురు నీవు నింటికిం జనుం డని నిరాశంబుగాఁ బలికినఁ గ్లేశంబున నా శిశువుం బాసి పోవంజాలక బాలకవిహీనులకు మానవులకు నౌర్ధ్వదైహికంబులు లేవు గావున నీవు మచ్ఛరీరంబు కబళంబు గొని సుతశరీరంబు విడువు మనిన విని యక్కంఠీరవం బకుంఠారవంబున మావంటిదుష్టజంతువు లాసన్నమృత్యువునకు మూలభృత్యు లగుటంజేసి యిట్టిగతాయుష్ప్రాణులం గని మీవంటి దీర్ఘాయుఃప్రాణులం బట్టము పట్టికొాఱకింత పట్టిపెనంగి వట్టిదురవస్థలం బొరలక మరలు మనిన మత్కృతంబు లగు సుకృతంబు లర్పించెద నెప్పాట నిప్పాపని నొప్పింపక నాకు నొప్పింపవే యనిన నీయకొనక నీయెడ నాకు నయ్యెడు ప్రయోజనంబు లెయ్యవియు లేవు మయూరధ్వజునివలనం గాని యనియె నది నీ వంగీకరించెద వేని నెఱింగించెద ననిన భూసురోత్తమునకు రాజసత్తముం డి ట్లనియె. 211

క. ఆకేసరి నరకేసరి
గాఁ గన్న మదీయదేశకాననగిరులన్
భీకరహరిదర్వీకర
సూకరనికరముల కెట్లు సుడియఁగ వచ్చున్. 212

క. అడిగినపదార్థ మెల్లను
దడయక నీ కిత్తు నని మొదల నాడితి నా
నోడువు వృథ గాదు వలసిన
నడుగుము నీ వన్న భూసురాగ్రణి విభుతోన్. 213

క. నీయెడ మముబోంట్లకు నే
లా యేసంశయము 'దుర్బలస్య బలం రా
జా' యని పలుకు విశిష్ట
న్యాయము గలుగుట మదార్తి హరియింపఁదగున్. 214

క. ఆసింహము నీదేహము
దా సగ మిచ్చినఁ గుమారు దండింప ననన్
గాసిలి రాజులతనువులు
గో సిమ్మనఁ దగునె వూనుకొని విప్రులకున్. 215

ఉ. నావుడు సింహ మిట్లను మనంబున నన్నరనాథచంద్రమున్
గేవలుఁగాఁ దలంపకు మకించనరక్షణశీలుఁ డాత్మ విద్యా
విదుఁడు త్తమోత్తముఁ డుదారుఁడు సూనృతవాది గావునన్
నీ విటు సంశయింప కతనిం గని వేఁడు ఫలించుఁ గోరికల్.

క. నీతనువు ముదిసి తపముల
చేతఁ బలలశూన్యమై కృశించిన దాథా
త్రీతలపతిగాత్రము నవ
నీతసమము బహుసుఖప్రణీతం బగుటన్. 217

క. ఇది సింహభాషితము ము
న్న దశరథాత్మజుఁడు బ్రాహ్మణుని మృతశిశువుం
బ్రదికింపఁడె రాముని కే
శౌద నీ వెట్లయినఁ బుత్రకునిఁ గావు మనన్. 218

సీ. కువలయేశ్వరుఁ డియ్యకొని మంత్రిహిత పురో
హితబంధుజనమహీపతులఁ జూచి
రాజున కర్థంబు రణమునం దైన బ్రా
హ్మణు నెడ నైన దేహంబు విడువ
మును శిబికర్ణజీమూతవాహులు పరా
ర్థమ కాదె నిజశరీరములు విడిచి
రే నీమహాత్మునకై నాతనువులోన
నర్ధ మిచ్చితి దీని కడ్డపడకుఁ
తే. డని సుచిత్రుని సకలరాజ్యాభిషిక్తుఁ
గాఁ బ్రతిష్ఠించి మేఖలకన్యకాంబు
వులఁ గృతస్నానుఁడై దానమేలు బహుప్ర
కారములఁ జేసి విప్రపుంగవునిఁ బిలిచి. 219

రాజు విప్రకార్యార్థంబు దనశరీరంబు నిచ్చుట

క. పూతజలాక్షతములు గొని
దాత 'మదీయార్ధదేహదానేన హరిః
ప్రీతో భవ' తని భూసుర
చేత నృపతి ధారవోసి చిత్త మెలర్పన్. 220

ఉ. సత్రవితర్దికాస్థలి విశంక దృఢాసనుఁడై ముకుందు లో
కత్రయవందితుఁ హృదయకంజమునం బదిలించి కేతకీ
పత్రములీల మౌళిఁ గరపత్రము పూనెడునంతఁ బుణ్యచా
రిత్రకుముద్వతీసతి యొఱంగి వడిఁ జనుదెంచి భర్తతోన్.

క. నీయర్ధశరీరము గా
నా యేను మదీయదేహ మర్పించి నిజం
బీయెడ నిలుపు మనిన విని
యాయవనీసురుఁడు పలికె నధిపునితోడన్. 222

క. సింగము నాతో నృపవా
మాంగము స్త్రీభాగ మది యనర్హము భుజియిం
పం గోఱగా దనె నీవు
న్యాంగదతను విచ్చగింప దమ్మృగ మనినన్. 223

సీ. సుతుఁడైన తామ్రధ్వజుఁడు శాంబరీవిప్రు
నకు నిట్టు లనియె వందన మొనర్చి
భూసుర 'యోవై పితాసపుత్ర' యటంచు
ననియెడుశ్రుతిరహస్యంబు వినవె
జనకుని దేహంబు సగ మేల నాశరీ
రము సింహమునకు సర్వంబు నిత్తుఁ
దడయ కేనును ఋణత్రయవిముక్తుండనై
తండ్రి కై కొన్న సత్యంబు నెఱపి
తే. శాంతనవరాఘవులకీర్తిఁ గాంతు ననిన
బ్రాహ్మణుఁడు పల్కు మృగరాజుపలుకు వినుము

రాజదేహంబుఁ దత్కళత్రంబు సుతుఁడుఁ
గోయవలె ననె నది గల్లసేయఁదగునె. 224

తే. అనిన దరహాసితాస్యుఁడై యవ్విభుండు
సుతునిఁ దనరాణివాసంబుఁ జూచి యట్ల
చేయుఁడని చేతి అంప మిచ్చిన సుచిత్రుఁ
డందనోడెఁ గుముద్వతి యందుకొనియె. 225

వ. అ ట్లందుకొని. 226

లయగ్రాహి.—
ఆరమణియుం దనకుమారకు నదల్చి యతి
దారుణతరక్రకచధార పతిమౌళిం
జేరిచి మదిన్ హరిహరీ రఘుపతీ యనుచు
వా రిరువురున్ దలుగఁగా రుధిరముల్ ధా
త్రీరమణుగాత్రమున మేరుశిఖరిం దొరఁగు
గైరికఝరంబులప్రకారముగ హాహా
కారములుచేసె హితసూరిజనబంధుపరి
వారనికరంబులు మహారవముతోడన్. 227

ఉ. ఇమ్మెయి వ్రక్కలింప ధరణీశ్వరుఁడాపలికంట బాష్పతో
యమ్ములు గ్రమ్మఁ గన్గొని ధరామరుఁ డిట్లను నార్తి నిచ్చుదా
నమ్ము పరిగ్రహింపఁ దగునా యనపత్యతవంక నూర్ధ్వలో
కమ్ములు లేకపోయినఁ బో కాలఁ గనిమ్మని యల్గి పోవఁగన్.

తే. కాంత ప్రాణేశుమస్తంబుఁ గదియఁబట్టి
యకట నీదేహ మూర కిట్లయ్యెఁగాని

బ్రాహ్మణుఁడు నిన్ను లేనినెపంబు వెట్టి
యలిగిపోవుచు నున్నవాఁ డన విభుండు. 229

మ. అపు డావిప్రునిఁ జూచి యిట్లను మహాత్మా మచ్ఛరీరంబులో
నపసవ్యాంగము దానయోగ్య మయి సవ్యాంగంబు గా
కున్న దుఃఖపడెన్ ఱంపమునొప్పి నైన నిరువంకం బాష్ప
ముల్ రావె సత్కృప నీభాగముఁ గొమ్మనన్ విజయు
తోఁ గృష్ణుండు ప్రత్యక్షమై. 230

కృష్ణార్జునులు స్వస్వరూపంబులతోఁ బ్రత్యక్షం బగుట

శా. ఆరాజన్యునిఁ గౌఁగిలించి ధరణీశా నీవు ధన్యుండ వీ
ధీరత్వంబునకున్ వదాన్యతకుఁ బ్రీతిం బొందితిన్ బుత్రసా
ధ్వీరత్నంబులతోడ నధ్వరము వీతిద్వంద్వయుక్తంబుగాఁ
బ్రారంభింపుము కర్మకర్త నయి నిర్వర్తింతు నే సర్వమున్.

క. పోర నెదిరి భవదీయకు
మారుం డొక్కరుఁడ గెల్చె మమునిద్దఱ నీ
వీరీతి దేహ మొసఁగితి
వేరీ మీసాటి వీరవితరణగరిమన్. 232

చ. అనిన నృపాలవర్యుఁ డను యజ్ఞఫలప్రదుఁ డైనదేవరం
గనుఁగొనఁ గల్గె నేటికి మఖం బొనరింపఁగ డప్పిగొన్న మ
ర్త్యునకు మనోహరాంబువులు గ్రోలక మంచున దాహ
మాఱునే, ననుఁ బ్రహసింపవే బుధజనప్రవరోదిత వేదమం
త్రముల్. 233

తే. నేర్పు దప్పి నిధానంబు నేలఁ గ్రుమ్మ
రించి కొప్పెర దెచ్చు వీఱిఁడివిధమున

నాకుమారుఁడు మిమ్ము జన్యమున నెఱుఁగ
లేక వాహంబుఁ దెచ్చె వివేక ముడిగి. 234

క. ఊహింప మర్త్యకోటికి
దేహము లస్థిరము లగుటఁ దెలియఁగ నిక్కం
బీహరిఁ జేపట్టి కదా
శ్రీహరిఁ నినుఁ గంటి హరిహరీ కృతి నైతిన్. 235

క. శరధిచరకమఠకిటినర
హరివామనభృగుజరామహలభృజ్జినక
ల్కిరుచిరరూపాయ జగ
ద్భరణాయ నమోనమోఽస్తు భవతే యనుచున్. 236

వ. బహుప్రకారంబులఁ బ్రస్తుతించి సమస్తవస్తుజాతంబుల నమ్ముకుందుఁ నానందితుంజేసి పురందరనందనుం గౌఁగిలించి బంధుజనసమన్వితుండై నిజపురంబునకుం దోడ్కొనిపోయె నందు నగ్గోవిందుండు గాండీవికి మయూరధ్వజునిభక్తిఁ దెలుపవలసి బలసమన్వితంబుగాఁ దివసత్రయం బధివసించె ననిన విని జనమేజయుండు జైమినిం గనుంగొని తరువాతి వృత్తాంతం బానతీఁ జిత్తగింపు మని యడిగిన. 237

శా. పాంచాలద్రవిళాంగమాళవశకప్రాగ్జ్యోతిషక్షోణిభృ
త్పంచాస్యప్రతివర్ష దత్తవివిధోపగ్రాహ్యరత్నాంశుమ
త్కాంచీవేంకటకాళహస్తినగరీకల్యాణసౌధాంచల
ప్రాంచచ్ఛాసనసాళ్వశంకితశశప్రాలేయరుఙ్మండలా. 238

క. రాధాతనూజశిబిధా
రాధరకల్పద్రుఖేచరప్రకటయశో
గాధాధికరణకృతసం
ధాధికరణదానశౌండ యైవరగండా. 239

భుజంగప్రయాతము.—
స్థిరశ్రీమనోహారిశృంగారగేహా
గిరీశప్రభాహాసికీర్తిప్రవాహా
నిరూఢారిబాహాసినిర్వాపణేహా
రిరంసోగ్రవాహాధరిత్రీవరాహా. 240

గద్యము. ఇది భారతీతీర్థశ్రీచరణకరుణాపాత్ర గాదయామాత్య
పుత్ర వినయవిద్యాసముద్ర పినవీరభద్రప్రణీతంబైన జైమిని
భారతంబునం దశ్వమేధపర్వంబున సప్తమాశ్వాసము.

283

శ్రీ

# జైమిని భారతము

## అశ్వమేధపర్వము, అష్టమాశ్వాసము





క. లలితశ్రవణకళా
నాళీకప్రభవపాదనఖచంద్రరుచి
క్షాళితపరనరపాలక
ఫాలఫలక నారసింహపార్థివతిలకా. 1

వ. అవధరింపుము జైమినిమునీంద్రుండు జనమేజయనరేంద్రున కిట్లనియె నిత్తెఱంగున రత్ననగరంబున వాసుదేవవాసవతనూజులు వాసరత్రయంబు గడపి మఱునాడు సముద్ధతధ్వజినీపరంపరలతో మయూరధ్వజుండు గొలిచి రా నధ్వరాశ్వంబులఁ గదలింప నవియు నానాజనపదంబు లతిక్రమించి క్రమక్రమంబున. 2

సీ. ఏరాజు పాలించు ధారణీమండలి
ధర్మంబు నాల్గుపాదముల నడచుఁ
గలవరించియు బొంకు పలుకనేరనిసత్య
సంధు లేరాజురాష్ట్రంబు ప్రజలు
యముఁ డిల్లఁ టపుటల్లుఁడై యుండి సాక్షాత్క
రించి యేరాజపుత్రిక వరించె

నేరాజు దానాంబుధారాధునీకోటి
చేత మేదిని నదీమాతృ కయ్యెఁ
తే. దత్పరత 'బ్రాహ్మణో మమ దైవ' మనెడు
బుద్ధి నేరాజు పూజించు బుధులు నట్టి
రాజరత్నంబు వీరవర్మకుఁ బ్రధాన
పురము సారస్వతముఁ జేరఁ బోవుటయును. 3

క. ఈరీతి ధర్మతనయమ
యూరధ్వజయజ్ఞవాహయుగళవిహారం
బౌరా జెటెంగి తనపరి
వారము సెల విచ్చె వారువంబుఁ బట్టన్. 4

వీరవర్మ పాండవహయంబుఁ బట్టుట

తే. అపుడు దివ్యరథారూఢులై సులోల
కువలసులలాఖ్యు లారాజుకూర్మిసుతులు
సైన్యములతోడ నరుసేన సరకుగొనక
హరులఁ బట్టింప బభ్రువాహనుఁడు దాఁకి. 5

క. వాహినుల నిష్ఠురాస్త్రస
మూహములఁ దెరల్చె నపుడు ముష్టాముష్టిన్
బాహాబాహిఁ గచాకచి
నాహవ మొనరింపఁ జొచ్చె నయ్యిరువాఁగున్. 6

శా. శక్రప్రోద్భవసూతిపై దశసహస్రస్యందనాన్వితులై
విక్రాంతిన్ నృపనందనుల్ గవిసి రవ్వేళన్ సమీకంబు రు
ద్రక్రీడన్ దలపింపఁ గార్ష్ణి విశిఖవ్రాతంబుచే వీతిహో
త్రక్రోడంబునఁ బడ్డచర్మముగతిన్ బ్రగ్గెన్ బలం బత్తఱిన్.

క. అంతకుఁడు గదిసి సేనల
నంతముఁ బొందింపఁ గ్రీడి యచ్చెరువడి కం
సాంతక చూడుము వీఁడు దు
రంతపరాక్రముఁడు మర్త్యుఁ డనఁగా దనినన్. 8

ఆ. జముఁడు వీరవర్మ జామాత నృపతికూఁ
తురు సుమాలినీవధూటిమగఁడు
రాజుచేత నితఁడు ప్రార్థితుండై పాసి
చనఁడు తద్విధంబు వినుము తెలియ. 9

ఆ. వీరవర్మ వరకుమారి సుమాలిని
పెండ్లి కెదుగఁ దండ్రి బిడ్డఁ జూచి
తల్లి యేనృపాలతనయుఁడు నీకోర్కి
యనిన నరులమీఁద మనసు లేక. 10

— కృష్ణుఁడు విజయునకు యమునివృత్తాంతంబు చెప్పుట —

చ. జనులకు నెల్లఁ జావు సహజంబు నరున్ వరియించి వానితో
ననుగమనం బొనర్చి తుది నంతకుచేఁ బడి పాపకర్మసం
జనితఫలంబు లంది బహుజన్మములం బడుకంటె కాలునిం
బెనిమిటిఁగా వరింతు నది మిక్కిలి ధర్మము నాకు నావుడున్.

చ. అలరి సుమాలినీతనయ కంతకుపైఁ దలఁ పంత కంతకున్
బలియు లెఱింగి నిచ్చలు నుపాసనకై యమసూక్తముల్ విని
శ్చలతఁ బఠింపఁ దత్సుతయు సంతతమున్ జముఁ గూర్చి నేమ
ముల్, సలుపఁగ నారదుం డెఱిఁగి సంయమనీపతిఁ గాంచి
యిట్లనున్. 12

క. చిత్రపురి వీరవర్మని
పుత్రి సుమాలిని విలాసభూమి కమలినీ

మిత్రతనూభవ నీకుఁ గ
ళత్రము గావలదె యాలలన యని మఱియున్. 13

ఉ. ఆసతి పుణ్యశీల హరిణాయతలోచన నిన్నుఁ బొంద నా
సాసలఁ జేయుదానము లనంతము లింతిఁ బరిగ్రహించినన్
నీసవతెవ్వ రన్నను మునీ భవదాజ్ఞ యలంఘనీయమం
చాసమవర్తి నవ్వి చతురాస్యతనూభవుతోడ నిట్లనున్. 14

తే. నీవు ముందఱ నెఱిఁగింపు నృపతి కేను
గదలి వైశాఖశుక్లపక్షమున వత్తు
ననినఁ జని నారదుఁడు చెప్ప నచట వీర
వర్మ సంభ్రమపడియె వైవస్వతుఁడును. 15

క. దళవాయి రాజయక్ష్ముం
బిలిచి మనము చిత్రపురికిఁ బెండ్లికిఁ బోవన్
వలె నీబలఁగము నీవుఁ గ
దలి రమ్మని పలుక నులికి తత్సభలోనన్. 16

సీ. ఆమయాగ్రణి రాజయక్ష్మధాతువులు వీ
డ్వడి తాఱఁ బెదవులు దడుపుకొనియె
నష్టోత్తరశతవ్రణాద్యత్ముఁ డగురాజ
పిటకునకును వీఁపు నెటుకు రనియెఁ
దల్లడంబునఁ ద్రయోదశవిధజ్వరునకు
విన్నమాత్రన వెఱవేఁకి దాఁకె
నుల్ల మెల్లను బెల్లగిల్లె వింశతిరూప
ధారిమేహమునకు విదాహ మొదవె

తే. నచట విప్రార్చకులె కాని హంత లేమి
గుణనిధులె కాని గురుదూషకుండు లేమి

సదయులే కాని బాలహింసకుఁడు లేమిఁ
బూజకులె కాని దేవస్వభోక్త లేమి. 17

వ. మఱియు విశ్వాసవిషదానకన్యకాగమనస్వరక్ష్యభక్షణలక్షిత త్రిశతభేదవిశాలుం డగుశూలుండు చోరకానిరుద్ధపంజరస్థపక్షిమోచకులు గలుగుటం బొలయ రాదనియు వాపీకూపతటాకభేదనంబులవణిగల గ్రహణిజీర్ణజలాశయోద్ధారకులు మీఱుటను రా సమకూఱ దనియు సాధుజనబాధాసముద్భూతం బగువాతంబు మాషమేరుశైలవాపీదానతత్పరులు తఱచు గలుగుటం దఱియఁ గూడ దనియు భూస్త్రీణహత్యాకృతాదరుఁ డగుమహోదరుం డుదకదానావధానులు చెంగలించుటం దొంగిచూడరా దనియు దాతృనిందాకందళితశరీరుం డగునపస్మారుండు కృష్ణధేనుదానపరులు హెచ్చుటం జొచ్చి మెలఁగరా దనియు నివ్విధంబున సకలరోగవిసరంబులు గుసగుసలం బోవ సమవర్తి వారలం గనుంగొని. 18

క. పాపులకు నుగ్రవిగ్రహు
లై పుణ్యుల కమలమూర్తులై మీరు మహిఁ
జూపట్టెద రేటికిఁ బరి
తాప మిపుడు కామరూపధరు లగుఁ డనుచున్. 19

ఉ. మోహనమూర్తి గైకొనియముందునరాకృతి సంగతామయవ్యూహము గొల్వ చిత్రపురి కుత్సుకతం జని మాలినీవరారోహ వివాహమై నరవరుం గని నీకు నభీష్ట మెద్ది సందేహము లేక వేఁడు కరుణింతు ననఁ ధరణీశుఁ డిట్లనున్.

చ. ఇతరవరంబు లెవ్వియును నేటికి సత్యయవేళ దేవకీ
సుతునిపదారవిందములు చూపు మనక్ దయచేసి మామచిం
తితము ఫలించునంతకును నిల్చిన యంతకుఁ డీతఁ డాజిదీ
క్షితుఁ డయి వీరవర్మయును సేనలతో నిట వచ్చెఁ గావునన్.

వ. ఇత్తఱి సముత్తుంగమత్తమాతంగనిపాతభయదయుద్ధంబు సిద్ధంబు గాఁగలదు నీవు వేడుక చూడవలయు బలియురైనబభ్రువాహనానుసాల్వకర్ణజప్రద్యుమ్న మయూరధ్వజానిరుద్ధాది యోధవీరుల సన్నద్ధులం జేసి పోరికిం బనుపవలయు నని పలికి కృష్ణుండు జిష్ణురథం బారోహంబు సేయ నవ్వీరవర్మయుం గదిసి వారిజోదరుం బేరుకొని పురందరనందనుండును నీవును మదీయశౌర్యంబును ధైర్యంబునుం గనుంగొనుం డని పుండరీకలోచను నాఱునారాచంబులం గ్రిడి నేడువాలమ్ములను మయూరధ్వజాదుల నైదైదు బాణంబులఁ గంఠగతప్రాణులం జేసిన ఁజేసి వాసవసుతుండు నవ్వీరవర్మమర్మంబులు దూఱిపాఱఁ గఱకుటమ్ములువఱపినఁ బిఱుతివియ కతండు తెఱపిగొని మాధవధనంజయుల విశిఖపుంజంబులం జిక్కుపఱచి సకలజలధరంబువిధంబు గర్జింప నర్జునుండు దోర్గర్వంబునఁ దచ్ఛరవ్రాతంబు జర్జరీభూతంబు గావించి సారస్వతపురాధీశ్వరువక్షంబు నిశితక్షురప్రపంచకంబునం జించిన నతం డించుకేనియుం జంచలింపక విచ్చ్వచ్చు నఱువదింట నచ్యుతాంజనేయుల సాయకశతంబుల నొంచి తేరివారువంబులం దక్కినవీరవరులం దెరలిచి మొనతలఁ దరలం బోరల నేసినఁ బాండవసమూహంబు సమోహం బయ్యె నప్పు డప్పురుషోత్తముండు గాండీవిం గనుంగొని.

ఉ. వంచన చేసి సైంధవువివాహములో శిశుపాలునట్లు న
మ్మించి రణంబునం గమలమిత్రజు తేరు ధరిత్రిఁ గ్రుంగఁ ద్రో
క్కించి జయించినట్టి చటుఁ గృత్రిమముల్ గొనునంచు మారుతిం
బంచినఁ దేరితో నతని బద్ధునిఁ జేసి విశాలవాలధిన్. 23

క. ద్రోణాద్రిఁ బెల్లగించిన
త్రాణ నతనియరద మంబరంబునకు జగ
త్ప్రాణజుఁ డెత్తుక చన నా
క్షోణీశ్వరుఁ డతని మొఱఁగి చూపులు బెదరన్. 24

చ. రయమునఁ దేరితో నరు మురద్విషునిం గుదియంగఁ బట్టి ని
ర్భయగతి నభ్రముం దఱిసి పావనితో నను శౌరి పార్థుపై
దయ నెడబాసి గా విరహతాపమునం బొరలాడులక్ష్మికిం
బ్రియముగఁ బట్టివైచెద హరిం గలశాంబుధి శేషశయ్యపై.

క. విడు నారథ మని హరిఁ గ
వ్వడిని౯ వడిఁ జంక నిఱికి వాయుతనూజుం
బిడికిటఁ బొడిచిన గ్రుద్దులు
మిడుకఁ గెడసి కాలు చెయ్యి మెదలుప కున్నన్. 26

వీరవర్మ కృష్ణుని తనపురంబునకుఁ దోడ్కొని పోవుట

క. అప్పుడు మధుమథనుఁడు వా
తప్పక నవ్వీరవర్మ తల పాదమున౯
గుప్పునఁ దన్నిన ధరఁ బడి
తెప్పిఱి కృష్ణార్జునులఁ గదిసి యి ట్లనియెన్. 27

సీ. బవరాన దేవదానవుల కైనను నవి
జేయుండ మును విశేషించి యిపుడు

కృష్ణునిపాదపంకేరుహంబు శిరంబుఁ
జెందెఁ గావునఁ జిరంజీవి నైతి
ననుటయుఁ బ్రీతుఁడై యచ్యుతుండు కిరీటి
తోడ నిట్లను వీఁడు దుర్జయుండు
సత్త్వసంపన్నుఁ డక్షయదివ్యమార్గణ
కృతహస్తుఁడు మయూరకేతుముఖ్య
తే. యోధుల జయించె మద్భక్తియుక్తుఁ డనిన
నరుఁడు గొనియాడె నమ్మహీవరుఁడు వారి
కిట్లు లను ముజ్జగములు మీకెదురుగావు
మిమ్ము గెలువంగ నేనెంత మేటిననుచు. 28
క. విల్లెక్కు డించి యదుకుల
వల్లభునకు మ్రొక్కి వాసవసుతు మువము సం
ధిల్లఁ గవుఁగిలింప బలము
లెల్ల నిలిచె నతనివీట నేనుదినంబుల్. 29
ఉ. ఆమఱునాఁడు సప్తతిసహస్రసితేభములుఁ దురంగముల్
శ్యామలకర్ణముల్ నవసహస్రము లష్టవిధంబు లైనము
క్తామణిరాసులుఁ మొదలుగాఁ గలసంపద లెల్ల నిచ్చి య
త్తామరసాక్షుఁ గొల్చి వసుధావరుఁ డశ్వములం దరల్చినన్.
క. కతిపయదినములకు హయ
ద్వితయము గజకబళనప్రవీణఝషగ్రా
హతిమితిమింగిలలహరిహ
సితజలనిధి యగునదంబుఁ జివ్వన దాఁటెన్. 31
ఆ. క్రీడి వీరవర్మతోడ హయంబులు
నరసి దాఁటె నెద్దివెర వటన్న

నతఁడు నావలను రయంబున దాఁటింప
సేన కౌంతలంబుఁ జేరి విడిసె. 32

క. అచ్చట హరులం గానక
తెచ్చవడి దొరలు నిలుచుతఱి వెలుఁగుచు వై
యచ్చరపథమున సురముని
వచ్చి నమస్కృతులు గాంచి వారలతోడన్. 33

చ. హయములు చంద్రహాసవసుధాధిపకౌంతలకంబుఁ జేరె దు
ర్జయుఁ డగునానృపాలునిపరాక్రమలీలకు రాజు లెల్ల నా
రయ సరి షోడశాంశమును గారు తదీయచరిత్ర మన్న వి
స్మయమిది వేళ గాదు విన సైంధవముల్ గడుదూర మేగెడున్.

చ. అనుటయుఁ బార్థుఁ డిట్లనుఁ బ్రియంబున నారద శౌరి చెప్ప
ముక్,విన మె కథాసుధారసము వీనుల కింపుగఁ బోరిలోన స
జ్జనులచరిత్రముల్ వినుట జన్మఫలంబులు గావె చంద్రహా
సనృపవరేణ్యపుణ్యకథ సత్కృప నా కెఱిగింపు నావుడున్.

నారదుఁడు చంద్రహాసుని వృత్తాంతంబుఁ జెల్పుట

సీ. విను కేరళాధీశ్వరున కాత్మజుఁడు సభా
గ్యుఁడు మూలతారయం దుదయమయ్యె
నొక కొన్ని దివసంబులకు వైరుల నెదిర్చి
జనకుండు గండదోషమునఁ దప్ప
జనయిత్రి చిచ్చుఁజొచ్చిన దాది లాఁబాల
కునిఁ గౌంతలమునకుఁ గొంచువచ్చి
వర్షత్రయము పెంచి వా రంతరించినఁ
బౌరభామిను లాకుమారుఁ జూచి

తే. కరుణ నొకపుణ్యసతి జలకంబుఁ బట్టుఁ
గూర్మి నొకలేమ కడుపారఁ గుడువఁ బెట్టు
దయ నొకవధూటి మొలవన్నెతడుపుఁ జుట్టుఁ
గోర్కి నొకయింతి కూఁకట్లు గూడఁ గట్టు. 36.

క. ఈరీతిఁ బౌరకాంతలు
గారవమునఁ బెనుచుచుండఁగా నొక్కదినం
బారాకొమరుండు యదృ
చ్ఛారతిఁ జనె దుష్టబుద్ధిసదనంబునకున్. 37

క. ఆమంత్రి కొలువులోనిమ
హామును లీక్షించి ముదితులై యెవ్వరివాఁ
డీముద్దులాడు నిఖిల
క్ష్మామండల మేలురేఖ గలవాఁ డనినన్. 38.

క. విని వినవిని వానిచందం
బున గీటునఁ బుచ్చి దుష్టబుద్ధి యతుల స
ద్వినయమున ననిపి యప్డా
తనయునకును ఋషులపలుకు తథ్యం బనుచున్.. 39.

క. దండింపఁ దలఁచి యప్పుడు
చండాలభటాలిఁ బిలిచి సచివుఁడు మీ రీ
కొండికపాపని బలి వా
రుం డని సెల వొసఁగఁ గింకరులు రభసమునన్. 40.

ఉ. పట్టి మదేభసింహశరభప్రముఖోగ్రతరాటవీతటిఁ
బెట్టి కృపాణిఁ జేత జళిపింపఁ గుమారుఁడు శౌరి నెమ్మదిఁ
గట్టిగ నిల్ప నప్డు గొడికాంద్రు కృపం బలకాలిపిల్లవ్రేల్
ముట్టఁగఁ గోసి మంత్రివరు ముందటఁ బెట్టి కృతప్రణాములై..

క. దేవర చెప్పినయుడిగము
గావించితి మనిన మంత్రి కౌతుకహృదయుం
డై వరమునిభాషితము మృ
షావాదం బయ్యె నని విశంకత నుండన్. 42

చ. అచటఁ గుమారుఁ డంఘ్రివికలాంగుళిఖేదముఖాశ్రుజాలసం
కుచితముఖాబ్జుఁడై పదశకుంతమృగీవనదేవతల్ దయా
రచితహితోపచారముల రక్షణ సేయఁ గుళిందకుండు త
త్సచివునకుం విధేయుఁ డగుశాబరదేశవిభుండు వేఁటమైన్.

ఉ. అక్కడి కేగుదెంచి చరణాంగుళివేదనఁ జాలఁ గుందియుం
స్రుక్కక శ్రీహరిం దలఁచుసూనునిఁ జూచి కృపాసమగ్రుఁడై
యెక్కడివాఁడొ వీఁడు జగదీశ్వరలక్షణలక్షితాకృతిం
జక్కనిపిన్న వాఁ డనుచు సైంధవముం డిగి బుజ్జగించుచున్.

క. హరిభక్తుఁ డితఁడు నేనును
హరిపదసేవకుఁడ నయ్యు ననపత్యుఁడనై
హరిఁ బలుమఱు సొలయఁగ శ్రీ
హరి నా కిటు కరుణ చేసె నర్భకు ననుచున్. 45

క. కుంఢుఁడు కానీనుఁడు కృత
కుండు సహోఢజుఁడు గోళకుఁడు క్రీతుఁడు ద
త్తుండు స్వయంప్రాప్తుఁడు సూ
నుం డౌరసహీనులగుజనుల కట్లగుటన్. 46

క. ఇతఁడు స్వయంప్రాప్తుండను
సుతుఁడని యంగీకరించి శోకము వారిం
చి తురంగముపై నిడి నం
దితుఁడై తనచందనావతీపురి కరిగెన్. 47

సీ. అరిగి సైనికుల నర్హప్రకారంబుల
నని పి. యంతఃపురంబునకు నరిగి
జ్యోతిష్యుల యనుమతి శుభముహూర్తంబున
రాణి మేధావినీరమణి కిచ్చి
చంద్రుని నవ్వుహాసంబు గల్గుటఁ జంద్ర
హాసుం డనెడునామ మర్థిఁ బెట్టి
దాదులచే నిరంతరము సంరక్షణ
చేయింపఁ గట్టడ చేసి వేడ్కఁ

తే. బెనుపఁగాఁ దల్లిదండ్రులు ప్రేమమునను
విదియచంద్రునిగతి నభివృద్ధిఁ బొంద
నవని దున్నక పండెఁ జన్నవిసి పిదికె
సురభులు జనంబు లానందభరితులైరి. 48

మ. కరమర్థిన్ సుతునిం గృతోపనయనుం గావించి వేదాగమా
ర్థరహస్యంబులు దెల్పి కార్ముకముఖాస్త్రప్రౌఢిమల్ నేర్పి సిం
ధురగంధర్వరథాధిరోహణసమర్థుం జేసి ధాత్రీధురం,ధరుఁ
గావించెఁ గుళిందకుండు జను లానందంబునం బొందఁగన్. 49

క. ఆచంద్రహాసవిభుఁడు
ర్వీచక్రము ప్రజల నెల్ల శ్రీవైష్ణవమా
ర్గాచరణతత్పరులుగాఁ
బ్రోచెన్ రుక్మాంగదప్రభువు చందమునన్. 50

మ. పదియాఱేడులనూఁగుమీసములలేఁబ్రాయంబునం దండ్రి
పంప దిగంతంబుల రాజులం గెలిచి కప్పంబుల్ వధూకాం
చనోన్మదమాతంగతురంగరత్ననికురుంబం బాదిగా సర్వ

సం, పదలుఁ బ్రాహ్మణరేఖ మీఱఁ గొని దృప్యత్సైన్యముల్
గొల్వఁగన్. 51

## చంద్రహాసుఁడు రాజ్యము చేయుట

చ. శతమఖవైభవుం డని ప్రజల్ జయ పెట్టుచు మ్రొక్కఁ జం
దనావతి కరుదెంచి తండ్రిపదవారిరుహంబులు గాంచి విక్ర
మార్జితబహుసంపదల్ నగరు గ్రిక్కిఱియించి కృతప్రణా
ముఁడై యతివినయంబునన్ జననియంఘ్రులకున్ బ్రణమిల్లి
భక్తితోన్. 52

క. జననీజనకులపాదము
లనవరతముఁ గొల్వఁ జంద్రహాసకుమారుం
గనుఁగొని కుళిందభూపతి
తను వెల్లను నివురుచును ముదంబునఁ బలికెన్. 53

క. జాలెలఁ బట్టింపుము పది
వేలు నయిదువేలు రెండువేలు నరయ సొ
న్నా లరి కుంతలునకు మన
యేలిక తన్మంత్రి యతనియింటికిఁ బనుపన్. 54

క. అనిన విని చంద్రహాసుఁడు
జనకుని వీడుకొని ధన మసంఖ్యము బహువా
హ్యానరోష్ట్రఖర బలీవ
ర్దనివహములచేతఁ గన్నుదనియఁగఁ బంపెన్. 55

ఆ. మూఁడువగలపగిదిముడుపులు దెప్పించి
కలయ నొక్కబదరికమున నుంచి
కౌంతలేశ్వరునినగరిపురోహితుఁ డైన
గాలవునకుఁ గౌతుకమునఁ బనిచె. 56

ఉ. పంచినఁ దీర్పరుల్ సచివుపాలికి నేగి కృతప్రణాములై
కాంచనరత్నభూషణసుగంధజటావలి వేలువేల య
ర్పించి కుళిందనందనుఁడు పెట్టినపత్రిక చూపి రాజుకుం
గొంచక దీని కేడుమణుఁగుల్ గొనివచ్చితి మంచు నిచ్చినన్.

చ. కొని చని కుంతలేశ్వరునకుర్ విపరంబుగఁ జూపి చారుల
న్మన మలరించి పంచి జననాయకు డగ్గఱి చంద్రహాసుఁ డి
చ్చినవివరంబు విన్నపము చేసి కుళిందకుఁ బట్ట రాజుచే
ననుమతుఁడై యమాత్యుఁడు రహస్యము చిత్తము నొత్త
రింపఁగన్. 58

ఆ. తమక మినుమడింప దళముతోడుత నాలు
యోజనములపయన మొక్కనాఁడె
తెరలి చందనావతీపురిముందటఁ
గాంచి యోధవరులఁ గలయఁ జూచి. 59

క. ముందు మహాటవి యిది యీ
సందున నమరావతీవిశంకటమహిమన్
గ్రందుకొనిన దారార కు
ళిందునిసౌభాగ్య మని యలీకప్రీతిన్. 60

క. అరుదేర దుష్టబుద్ధి కె
దురుగఁ గుళిందకుఁడు ప్రియసుతునితోఁ జని త
చ్చరణముల వ్రాలి నిజమం
దిరమున విడియించి భక్తి నివ్వటిలంగన్. 61

క. బహువిధమనోజ్ఞ వస్తుని
వహములఁ బూజింపఁ గృతకవాత్సల్యభర

ప్రహసితముఖాబ్జుఁడై చం
ద్రహాసుఁ గన్గొని కుళిందునకు నిట్లనియెన్. 62

క. చందురునివంటివాఁ డీ
నందనుఁ డతిభాగ్యలక్షణయుతుఁడు నీ కే
చందమునఁ గల్గె ననినఁ గు
ళిందకుఁ డాద్యంతమును దెలియ వినిపించెన్. 63

ఉ. ఏ మృగయావినోదరతి నేగుచుఁ గౌంతలకంబుదండ రెం
డామడఁగల్గు నొక్కభయదాటవిలోనఁ బదాంగుళీవ్యథన్
వేమఱు శ్రీహరిం దలఁచువీనిఁ గనుంగొని విష్ణుభక్తునిం
గా మదిఁ గాంచి యౌరసునకన్న విశేషముగాఁగఁ బెంచితిన్.

క. నాఁటి కయిదేండ్లవాఁ డను
మాట విని కృతంబు దలఁచి మానసమున న
త్తోటులమీఁదను బందులు
గీఁటుకొనుచు దుష్టబుద్ధికృత్రిమబుద్ధిన్. 65

క. ఇచ్చోట నేమి దలఁచిన
వచ్చు నపాయంబు తన కవశ్యము వీనిన్
బుచ్చెదఁ గౌంతలకంబున
కచ్చట మత్సుతుఁడు విషనిహంతుఁ గావించున్. 66

క. అని తలఁచి యొక్కపత్రిక
తనతనయునిపేర నేకతమ్ము స్వహస్త
మ్మున వ్రాసి ముద్ర పెట్టి స
వినయుఁ డగుచుఁ జంద్రహాసవిభునకు నవియెన్. 67

క. ఈపత్రిక నీ వొకఁడవ
నాపుత్రున కిమ్ము శోభనం బగు నచటన్

నీపను లన్న వినతుఁడై
వే పోయె నతండు పవనవేగాశ్వముపైన్. 68

ఆ. నిమిషమాత్రఁ గౌంతలముఁ జేరి తత్పురీ
సవిధవివిధపుష్పసౌరభప్ర
మత్తచంచరీకమండలీముఖరితా
రామమధ్యగతిసరంబుఁగని. 69

క. యువహంసచక్రసారస
నివహాగరుద్వ్యాపవికచనీరేజపుట
స్రవదమలమధుసురభిగం
ధవహాంకురసపది వారితపథశ్రముఁడై. 70

క. తురగమును నీరు జలజా
కరమునఁ ద్రావించి తా వికచపుష్పఫలో
త్కరభరవినమ్రచూతాం
తరమరకతవేది నలవునం బవళింపన్. 71

—— కుంతలేశునికూఁతురు వనవిహారమునకు వచ్చుట ——

ఆ. కుంతలాధినాథుకూఁతురు చంపక
మాలినియును నయ్యమాత్యవరుని
తనయ విషయయును మదను నోమఁ దద్వన
స్థలికి వచ్చి రాత్మసఖులతోడ. 72

సీ. అలసతఁ జూపునొయ్యారంపునడపులు
వనమయూరములగర్వముఁ గుదింప
సఖుల వేమఱుఁ బిల్చుసరసంపుఁబెలుఁగులు
మత్తకోకిలములమనసుఁ గలఁప

నిటలంబుల నటించుకుటిలాలకంబులు
షట్పదంబులవిలాసముల గెలువఁ
దరళలోచనములధాళధళ్యంబులు
హరిణులసౌభాగ్య మవఘళింప
తే. దండడించుమనోరథోద్ధతవిహార
సరణిఁ జంపకమాలినీతరుణిఁ గూడి
మానినులు గోసి రవ్వనమంజరులను
సరసిసరసిజములఁ బెక్కుచందములను. 73

ఆ. సచివపుత్రి విషయ శారీరవాసన
వనము గంధసారవనముఁ జేసె
గళితహారమణులఁ గమలాకరంబు ర
త్నాకరంబుఁ జేసె నలసగతుల. 74

క. అంగన లపుడు చతుర్విధ
శృంగారము లలవరించి చెఱకువిలుతు నో
మంగ విషయ తత్సరసీ
ప్రాంగణనిద్రితునిఁ జంద్రహాసునిఁ గాంచెన్. 75

చ. కని రశనాంఘ్రిరత్నకటకంబులు మ్రోయకయుండ నల్లన
ల్లనఁ జని యక్కుమారునివిలాసము లేకటఁ బాయఁ జూచి
మ్రోల నడవ సంచిత్రాటఁ బదిలం బగుపత్రిక వీడ్చి తండ్రివ్రా
సినకపటంపుఁబద్ధతికిఁ జిత్తమునం బరితాప మందుచున్. 76

క. విషమాస్త్రసమానునకు
న్విష మొసఁగఁ వ్రాసెఁ దండ్రి నిర్దయుఁ డని య
వ్విషమాక్షరపంక్తి దుడిచి
విషయ నొసఁగు మనుచు వ్రాసి వేడుకతోడన్. 77

క. పెన్నిధిఁ గని పోవఁగ లే
కున్న కృపణుమాడ్కిఁ జిత్త మూటాడఁగ నా
కన్నె పరాధీనత నతి
ఖిన్న యగుచు నింటి కేట్టకేలకుఁ జనియెన్. 78

క. ఆలోనఁ జంద్రహాసుఁడు
మేలు కనుచు నపుడు తత్సమీపసరఃప్ర
క్షాళితముఖుఁడై నడగని
బోలెమునఁ గదల్చి నగరముఁ బ్రవేశించెన్. 79

క. ఎడనెడ శుభశకునంబులు
పొడ గనుచును జొచ్చి దుష్టబుద్ధి నగరిచా
వడికడ వాకిటఁ దురగ
మ్ము డిగం బణిహారి గని ప్రమోదముతోడన్. 80

క. కొలు వున్న మదనుఁ గని చే
తులు మొగిచి కుళిందకునిసుతుఁ డమాత్యునిలే
ఖలు గొనుచు మననగరిమో
సల నున్నాఁ డనిన విని ససంభ్రముఁ డగుచున్. 81

ఆ. కూర్మి నతని నెదురుకొని కౌఁగిలించి యే
కాంతమండపమున నధివసించి
యటఁ గుళిందుసేమ మరయుచుఁ దండ్రివ్రా
యపముఁ జూచి భక్తి నంది యందు. 82

సీ. స్వస్తిసమస్తప్రశస్తగుణాన్వితుం
డవు దుష్టబుద్ధి నిజాత్మజుఁ డగు
మదను దీవించి ప్రేమముగఁ బుత్తెంచిన
శుభలేఖ చంద్రహాసుఁడు కుళిందు

పట్టి కులస్థానపౌరుషాధికుఁడు సి
ద్ధంబుగా మనకు నీతండ హితుఁడు
కాన సందేహంబు మాని యీపత్రిక
వీక్షించినప్పుడె విషయ నొసఁగు
తే. మనెడుపద్ధతిఁ జదివి భాగ్యంబు చేసె
నస్మదీయసహోదరి యనుచు దైవ
ఘటన నారాత్రిఁ గలుగులగ్నంబునన వి
వాహ మొనరించె దేవేంద్రవైభవమున. 83

ఉ. అంతట దుష్టబుద్ధి హృదయంబున నింతకుఁ జంద్రహాసుఁడుం
గొంతలకంబుఁ జేరుఁ దనకైతవముల్ ఫలియించు నంచు ని
శ్చింతమతిం గుళిందకుని శృంఖలబద్ధునిఁ జేసి దుర్గమా
ద్యంతము చూఱగైకొనిరయంబున మూఁడవనాఁటివేకువన్.
క. అంచల బెత్తల వడి జం
కించుచు బంగారుపల్లకీ యెక్కి ప్రయా
ణించునెడం గొంతలక
ప్రాంచలమున నొకమహోగ్రఫణి యెదు రగుచున్. 85

క. మానుషభాషల నిట్లను
నే నీసదనంబులోనినిక్షేపములం
బ్రాణమువలెఁ గాచితి నీకఁ
బో నగు నని చెప్పి కుతలముఁ బ్రవేశించెన్. 86

ఆ. పాముమాటఁ బాటిఁ బట్టక కొంతల
కంబు చొచ్చి నగరిక్రందుఁ జూచి
చంద్రహాసునకు విషయఁ బెండ్లి సేయున
వ్విధముగా నెఱింగి వీఁపు విఱిగి. 87

క. ఏనేమి చెప్పి పంపినఁ
దా నేపని చేసె నని మదనుఁ బిలిచి దురా
త్మా నేఁటిదాఁకఁ ద్రోయవు
గా నాయానతి నిదేమి గావించి తనన్. 88

క. దేవరయానతిఁ దప్పిన
యావివరం బేది యని స్వహస్తలిఖితలే
ఖావాచకంబుఁ జూపిన
నావక్కాణంబుఁ జూచి యద్భుతపడఁగన్. 89

ఆ. మఱియుఁ దండ్రితోడ మదనుండు దేవర
యాజ్ఞఁ బ్రాణమైనయనుజ నొసఁగి
హితజనంబు లెదుర నీతని కెడ రైనఁ
బ్రాణమిత్తు ననుచుఁ బ్రతినఁ గొంటి. 90

క. అనుటయుఁ దనతనయునిమీఁ
ద నవిశ్వాసంబు పొడమి తన కపటము లో
నన పడిలపఱచె నంతటఁ
దనుజయు నల్లుఁడును వచ్చి దండముఁ బెట్టన్. 91

క. బాలహరిణములఁ జూచిన
క్రోలుపులిగతిఁ మనంబు గుబ్బతిలఁగ మి
థ్యాలాలనములు సేయుచు
నాలవదివసంబు శోభనము సాగించెన్. 92

చ. మఱునటినాఁటివేకువ నమాత్యుఁడు మేల్కని వంశ మంత
యుం, జెఱిచిరి కూఁతురుం గొడుకుఁ జెల్లరె మీఁదటఁజంద్ర
హాసుఁ డెచ్చిరినఁ బ్రమాద మౌ ననుచుఁ జిత్తమునం దల

పోసి వీని నే,తెఱఁగునన్నైనఁ జంపెద యతిప్రవరోక్తులు
బొంకు చేసెదన్. 93

సీ. అని నిశ్చయించి బ్రహ్మఘ్న శిశుఘ్న గో
ఘ్నాదులఁ బలువు రంత్యజులఁ బిలిచి
కృతపడ్డతప్పు గాచితి నేఁడు నగరంబు
వెలుపలికోటలోపలిక రాళ
కాళికాభవనంబులో లీనులై యుండుఁ
డచ్చోటి కపరసంధ్యాముఖమున
నొంటి వచ్చినవాని గెంటి పోవఁగనీక
నఱకుండు కండతుండములుగాఁగ

తే. నట్లు చేసిన నర్ధరాజ్యంబు మీకు
నిత్తు మదసునితో డన నియ్యకొనుచు
నరిగి మూఁడవజామున నడఁగియుండెఁ
జండిగృహమునఁ జండాలమండలంబు. 94

దుష్టబుద్ధి చంద్రహాసుని కాళికాగృహమునకుఁ బంపుట

క. ఆవేళఁ జంద్రహాసుని
రావించి కరగ్రహాంతరంబున దుర్గా
దేవి భజించు టవశ్యము
గావున నీ వేగు చండికాగృహమునకున్. 95

చ. అనుటయుఁ జంద్రహాసవిభుఁ డట్టులకా కనె నంతఁగుంతలుం
డు నిజపురోధ గాలవుఁ గనుంగొని రాజ్యముమీఁదికోర్కి
గెం,టినది నిజంబుగాఁ దనువునీడకు మూర్ధము గానరాదు క
న్గొనఁగ నరిష్టలక్షణము కోరిక నా కెఱిఁగింపు నావుడున్.

క. దత్తాత్రేయుఁ డలర్కున
కిట్లెఱిఁగించె వసుమతీశ్వర విను నీ
పుత్త్రుల మందకు మది నీ
చిత్తసమాధాన మిపుడ చేయఁగఁజాలున్. 97

సీ. ధురివవసిష్ఠారుంధతులఁ దనుచ్ఛాయయుఁ
- గాననివాఁ డేఁటిలోనఁ గడచుఁ
గిరణాన్వితాగ్ని నిష్కిరణార్కుఁ గనువాఁడు
మఱియు నేకాదశమాసములను
బనిలేని పని బక్కబలిసిన బొసుక చి
క్కిన వాఁడు దెగు నెల లెనిమిదింట
నడుగుచొప్పునఁ బార్ష్ణియైన వ్రేళ్లయిన ఖం
డిత మైనవాఁ డేడునెలలఁ దప్పఁ
తే. గాకియైన గ్రద్దైన నులూక మైన
నెత్తి సోఁకిన వాఁ డాఱునెలలఁ గెడయు
స్నానమర్దనవేళల మేనిచర్మ
మదరువాఁ డైదునెలలకు నంతరించు. 98

క. తననీడ వేత్తె యొకలా
గున నుండిన వాఁడు నాల్గునెలలకు నీల్గుఁ
ఘనరహిత మైనమెఱుపు జ
ఘుని దెసఁ గనువాఁడు త్రెళ్లు ముమ్మాసములన్. 99

క. తనబింబ మద్దమునఁ జూ
చినఁ దల లేకున్న వాఁడు చెల్లును రెన్నె.

ల్లను దనతనువు గమరు వల
చిన పక్షములోన వాఁడు జీవము దొఱఁగున్. 100

తే. జలక మాడిన నవయవములకు మించి
హృదయమధ్యంబు జివ్వని యెండెనేని
నీరు గ్రోలిన దాహంబు నిలువ దేని
వాఁడు వేంచేయు నీరైదువాసరముల. 101

క. మనుజులలోచనములలోఁ
దనరూపముఁ గానకున్నఁ దనవీనులలో
ననువ్రేళ్లు వెట్టి చూచిన
ధ్వని వినఁబడ కున్నవాఁడు తడయక పొలియున్. 102

సీ. ఋక్షవానరముల నెక్కి పాడుచుఁ దాన
కాలునిదెస కేగఁ గంటి ననియుఁ
దనమూర్ధమున బొగ్గులును శిరోజంబులు
నుముకయు భక్షించుచుంటి ననియు
నగ్నుఁడై జైనసన్యాసి నవ్వుచు మ్రోల
గంతులు వేయంగఁ గంటి ననియుఁ
దైల మాపాదమస్తమునందు వడియంగ
నుర్విపై నిద్రించుచుంటి ననియు
తే. నతిభయంకరమూర్తులై యస్త్రధరులు
తాలఁ గొని ఉవ్వి రనియును నీలిచీర
కాంత బడి దక్షిణము వోవఁగంటి ననియు
స్వప్నమునఁ గన్నవారికిఁ జావు ధ్రువము. 103

చ. జనవర యిట్లరిష్టములు సంభవ మైన గురుద్విజామరా
ర్చనజపహోమదానముల శాంతియొనర్తు రొనర్చి సర్వసం
గనిరసనంబు నింద్రియనిరాకరముం జేయుచు నీరు నీరుగూ
ర్చినగతి జీవునిం బరముం జేర్తురు తత్త్వరహస్యకోవిదుల్.

క. అని గాలవముని చెప్పిన
జనపతి మదిం బాము కుప్పసం బూడ్చువిధం
బున రాజ్యము విడువందలంచి
తనమంత్రికుమారుం డగుమదనుం బిలిపింపన్. 105

క. చనుదెంచి మ్రొక్కి పని యే
మన మీయల్లుం డగుచంద్రహాసుని వేసం దో
కొని రమ్మిటం జంపకమా
లిని నిచ్చెద ననినం గుట్మలితహస్తుండై. 106

చ. పనివిని ప్రొద్దు గ్రుంకుపరిపాటిం బురాంతరవీథిం గాళికా
ర్చనమునకొంటినేగెడిమఱందిం గనుంగొని మంత్రియాజ్ఞ చే
కొని గమనించులాం గెఱింగి కుంతలనాథుండు నిన్నుంబిల్చితె
మ్మనెం జను మేను నీప్రతిగ నర్చన చేసెదంగాని శాంభవిన్.

తే. అని యతనిచేతి గంధపుష్పాక్షతములు
వరుసం గైకొని తాం నెక్కు వారువంబుం
జామరచ్ఛత్రములు నిచ్చి సచివతనయుం
డనిపి పంపిన నాచంద్రహాసుం డరిగి. 108

—● కుంతలుండు చంపకమాలినిఁ బెండ్లిచేయుట ●—

చ. వినతి యొనర్చి నిల్వఁ బృథివీపతి గాలవసంయమీంద్రు శా
సనమునఁ జంద్రహాసునకుఁ జంపకమాలినిఁ బెండ్లి చేసి య
ల్లునకు సమస్తరాజ్యమును లోలత నిచ్చి విరక్తుఁడై తపో
వనమున కేగెఁ బ్రాగనుభవక్షితసౌఖ్యము లేవగించుచున్.

క. అంతట మదనుఁడు నగర
ప్రాంతవనీచండికాగృహమునకు నిబిడ
ధ్వాంతమున నొంటిఁ జనఁ బశు
హంతలు పైఁబడి వధించి రాయుధహతులన్. 110

వ. ఇవ్విధంబునఁ జంద్రహాసుండు చంపకమాలినీ వివాహం బునఁ గుంతలరాజ్యసింహాసనారోహంబునను సముత్సాహంబు నొంది వందిబృందంబు పొగడ ముందటం గ్రందు కొనుసందడి జడియ వారించువేత్రహస్తులయస్తోకసాహో నినాదంబు రోదసీభేదనంబు సంపాదింప శంపాపరంపరాను రూపదీపకలాపంబు లుద్దీపింప శచీసమేతుం డగునాఖండ లుండునుంబోలె వధూసమేతుండై పాండురమత్తవేదండంబు నెక్కి యక్కజం బగువైభవంబునం జనుదెంచి దుష్ట బుద్ధి నగరిముందటఁ గుంజరంబు డిగ్గి యంతకుమున్న వచోహరులవలనం దనరాక యెఱింగి కలంగియున్న మామకుం బ్రణమిల్లి యతనికిం దనవృత్తాంతంబును మద నుండు కాళికాసదనంబున కరిగినవిధంబునుం జెప్ప నిప్పు

ద్రాక్షనపోలికం బొక్కిపడియుఁ గళవళంబు దక్కి తక్కరి
ప్రియంబున నల్లునియుల్లంబు పల్లవింపం జేసి యనిపి యయ్యా
మాత్యవరుం డత్యాహితంబున. 111

మ. తలయుం గోకయు వీడఁగాఁ బఱచి సంతాపంబునం గాళికా
నిలయం బొక్కఁడ చొచ్చి చచ్చినసుతు న్వీక్షించి శ్రీవిష్ణు భ
క్తులకుం రెండు దలంచుద్రోహులకు యుక్తుల్ గొల్పు నే
యంచుఁ దద్బలిపీఠోపలపాతభగ్నశిరుండై ప్రాణంబులం
బాసినన్. 112

చ. బలబలవేగఁ జండిక నుపాసనచేయుతపోధనుండు దే
హళిఁ బడియున్నమంత్రివరు నాతనిసూనునిఁ జూచి యొట్లొకో
పొలిసిరి నిర్నిమిత్త మని పొక్కుచు వే చని చంద్రహా
సభూతలపతితోడఁ జెప్పిన నతండురయంబునఁ బాదచారియై.

చంద్రహాసుండు దుష్టబుద్ధిని బ్రతికించుట

సీ. కాళీగృహము సొచ్చి కూలినసచివుఁ ద
త్తనయునిఁ గని శోకతప్తుఁ డగుచుఁ
గదిసి వీరల నేఁడు బ్రదికింప కుండినఁ
బ్రజలచే నాడిక పడుదు ననుచుఁ
జతురస్రకలితవిస్తృతహోమకుండంబుఁ
ద్రవ్వించి పావకుఁ దవులుకొలుపి
శర్కరాతిలపాయసఘృతంబులను గూర్చి
తనమేనికండలు దఱిగి వ్రేల్చి

తే. దేవిఁ గనుఁగొని చిచ్ఛక్తి వీవు హరికి
నగుట మచ్చిర మిత్తుఁ బూర్ణాహుతనుచు
ఖడ్గ మంకింప వైష్ణవి కరముఁ బట్టి
వాంఛితం బేద్ది వేఁడుము వరము ననిన. 114

క. వీరల మును బ్రతికింపుము
నారాయణుమీఁద భక్తి నాకి మ్మన న
వ్వారాహి యొసఁగి నీకుఁ గు
మారులు గలిగెదరు బలసమన్వితు లనుచున్. 115

మ. అకలంకస్థితిఁ జంద్రహాసవిభుఁ డాయం బిల్చి తా హస్తమ
స్తకసంయోగము సేయుచుం బరమతత్త్వజ్ఞానముం దెల్పుచం
డికయంతర్హితయైన మామయుమఱంది న్నిద్రమేల్కాంచుప్రో
లికలేవ న్దివిఁ బుష్పవృష్టి కురిసెన్ లేఖుల్ ప్రశంసింపఁగన్.

క. జనవిభుఁడు చంద్రహాసుం
డు నమాత్యుని మదనుఁ దోకొనుచుఁ బురమునకున్
జను దెంచి తల్లి మేధా
వినికిఁ గుళిందునకు మ్రొక్కి వినయముతోడన్. 117

తే. వేడ్కఁ జంపకమాలినీవిషయలందు
సొరిదిఁ బద్మాక్షమకరధ్వజులను గాంచి
హరిపరాయణుఁ డగుచంద్రహాసనృపతి
త్రిశతవర్షంబు లేలె ధాత్రీతలంబు. 118

క. ఈమహిమలఁ జెందుట సు
త్రామజ యాదుష్టమతి నటకఁ బంపునెడ౯

దా మునుభజించుసాల
గ్రామ మొకటి మ్రింగె సందుకతమున ననుచున్. 119

క. సాలగ్రామజలంబులు
మౌళిపయిం జల్లుకొనిన మానవులకు నీ
వేలాశైలావృతనిఖి
లేలాతీర్థములఫలము లేలా సేయన్. 120

సీ. మొగిఁ జతుర్దశలోకములభరించుఫలంబు
చేరు సాలగ్రామధారణమున
ధారణీచక్ర మంతయు నిచ్చినఫలంబు
దక్కు సాలగ్రామదానమునను
సకలదేవతల నర్చన చేసినఫలంబు
పొందు సాలగ్రామపూజనమునఁ
బరమపావనవేదపారాయణఫలంబు
వచ్చు సాలగ్రామవర్ణనమున
తే. యతి యనంగ సాలగ్రామ మనఁగ భోగి
తల్పునకును జరాచరతనువు లనుచు
సంతతము బ్రహ్మ గొనియాడునంతకంటెఁ
దుర్లభమని చెప్పుచుండు శ్రీతులసిమహిమ. 121

క. శిరమునఁ బింఛముఁ జెవుల మ
కరకుండలములు నురమునఁ గౌస్తుభ మర్థిన్
ధరియించు నంతకంటెను
హరి శ్రీతులసీదళంబు నవలంబించున్. 122

ఉ. ఈకథ విన్నమర్త్యుల కభీష్టచయప్రద మంచుఁ జెప్పి నా
శీకభవాత్మసూనుఁడు నిలింపపురంబున కేగె విస్మయో
త్సేకితఁ జంద్రహాసనృపశేఖరుభవ్యచరిత్రముల్ నృపా
నీకముతోడఁ బార్థుఁడు గణించుచుఁ గౌంతలకంబు చేరినన్.

క. అన్నృపతిసుతులు బలసం
పన్నులు మకరధ్వజుండు బద్ధాత్ముండున్
మున్నాడి పాఱు తెంచిన
జన్నపుహరులన్ వయాళిఁ జని కని రెదురన్. 124

చ. కనికొనిపోయి తండ్రిసముఖంబునఁ బెట్టినఁ జంద్రహాసుఁ డి
ట్లను నిది ధర్మనందనుమఖాశ్వము దీనికినై ప్రయాసమొం
దనిమిషరాట్సుతుండు తిరుగాడెడు సేనలతోడనంచుమున్
వినఁబడుఁ బట్టినం గ్రతువు విఘ్నమగున్ మనధర్మసూతికిన్.

క. మీరలు పదైదుదివసము
లీరెంటి సురక్షసేయుఁ డింతటిలో నే
వారలు రాకున్న మఖ
ప్రారంభమువేళ కనిపిపంపుద మనుచున్. 126

క. పలుకునెడఁ బార్థసేనా
కలకలముల్గు నిజపురోపకంఠసరణి ది
క్కుల ప్రక్కలింపఁగా నల
బలములతో మోహరించి బలములు నెదురన్. 127

క. శ్రీహరి సంతోషింపఁగ
నాహవ మొనరింపఁ గలిగె నర్జునుతో నం

చూపించి నృపతి రణ స
న్నాహంబునఁ దత్పురాంగణంబున నిలువన్. 128

తే. అతనిఁ గని కృష్ణుఁ డనునింద్రసుతునితోడఁ
జంద్రహాసునిఁ బరమవైష్ణవునిఁ జూడు
వీఁడు జ్ఞానతపోవయోవృద్ధుగాని
క్రూరసమరాంగణమునఁ దారుణ్యతనుఁడు. 129

మ. అని కృష్ణుండు కిరీటికిం దెలుపుచో నాచంద్రహాసుండు సై
న్యనికాయంబులముంగలన్వరశతాంగారూఢుఁడై వచ్చు దే
వునిఁ జక్రాసిగదాబ్జహస్తు మునిసేవ్యు న్భక్తితోఁ గాంచిగ్ర
క్కునమాణిక్యరథంబుడిగ్గి చని సాష్టాంగంబుగామ్రొక్కినన్.

చ. హరియును జంద్రహాసునిఁ బ్రియంబునఁ గౌఁగిటఁ జేర్చు
చుం బురంధరసుతుఁజూచి నా కితఁడు నమ్మినభక్తుఁ డవధ్యుఁ
డీవు సంగరకుతుకంబు దక్కి తనిఁ గౌఁగిటఁ జేర్చు మటన్న
నేఁడు నా, కురుకుల మెల్లఁ బావనతఁ గూడె నిజం బని
కౌఁగిలించినన్. 131

తే. చంద్రహాసుండు నరుతోడ శమనసూను
నధ్వరాశ్వంబు మామకరధ్వజునివ
శంబు చేసితి ననఁ దురగంబుఁ గొనుచు
నతఁడు నేతెంచి మ్రొక్కెఁ గృష్ణార్జునులకు. 132

వ. తదవసరంబున రాజసమాజపూజితుండై చంద్రహాసుండు
వాసుదేవు సుధామధురవాగ్విలాసంబులం బ్రస్తుతించి

మహోత్సవంబున నిజపురంబునకుం గొనివచ్చి దుష్టబుద్ధి మదనపద్మాక్షసహితంబుగా సమస్తబంధునివహంబుం గని పించి కృష్ణపూజానిమిత్తంబునం జిదానందచిత్తుం డగుగాలవ మునిసత్తముం బిలిపింప నయ్యోగివరుండు సచ్చిదానంద మూర్తి యగు నద్దేవునిం గీర్తించి ముహూర్తమాత్రంబు తన్మయుండై యుండెఁ గుంతలేశ్వరుం డొనర్చు నర్చనల సంతసిల్లుచుఁ గంతుజనకుం డచ్చట దివసత్రయం బధివ సించి నాలవనాఁడు కులిందనందనుండు తనకు నర్పించిన రాజ్యంబునం దదీయకుమారకుల మకరధ్వజపద్మాక్షులం బట్టంబు గట్టి నట్టియెడ. 133

క. నందనులఁ జూచి పరమా
నందుఁ డగుచుఁ జంద్రహాసనరపతి యాగో
విందుని భజించి మోక్షముఁ
జెందెద నాయట్లు కీర్తిఁ జెందుఁడు మీరల్. 134

మ. అని దీవించుచు బుద్ధి చెప్పి చతురంగానీకినుల్ గొల్వఁ బా
ర్థునకుం దోడయి రా మఖాశ్వములు తోడ్తోఁ జొచ్చె నే
భూము లజ్జననాథుల్ గని కప్పముల్ గొనుచు శశ్వద్భక్తి
సేవింప న్వారనివేగంబునఁ దేజు లుత్తరసముద్రం బుద్ధతిం
జొచ్చినన్. 135

ఆ. అపుడు సకలనృపులు నంబుధి సాధించు
వెరవు దెలియలేక విహ్వలింప

హరి మయూరకేతనార్జునప్రద్యుమ్న
హంసకేతుకార్షులర్హులగుట. 136

క. ఆయేవురయరదములకు
నేయెడ నడ్డంబు లేమి యేఁగి దరి మహీ
నాయకుల నిలిపి తా న
త్తోయధి వెస నమ్మహారథులతోఁ జొచ్చెన్. 137

క. మకరాలయ మటు సొచ్చి వె
దకి యొండొకదీవి జీర్ణతరఘునవటప
ర్ణకృతావకుంఠనుం డగు
బకదాల్భ్యుం గనియె వరతపఃప్రాగల్భ్యున్. 138

క. అందఱు నచ్చోట నిజ
స్యందనములు డిగ్గి మ్రొక్క సంయమి మదిలో
నిందులకును హరి యెక్కడి
సందడి గొనివచ్చె నని యసహ్యపడంగన్. 139

మ. నరుఁ డత్తాపసుఁ జేరి కేల్మోగిచి వింతల్ నీశరీరంబునం
దిరుగం బుట్టలువెట్టె సర్పములు వర్తింపన్ దరుల్ జానుకూ
ర్పరదేశంబులఁ బుట్టె గూండ్లఁ శకునవ్రాతంబు వర్తింప నీ
కరయన్ వాసము లేక నీచివికిమత్తా కేమిప్రాపయ్యెడున్.

తే. అనినఁ బార్థునిఁ గని పల్కు మునివరుండు
సంగ మతిదుఃఖ మని బ్రహ్మచర్య నున్న

నాకుఁ జాలదె యింతమట్టానకునీడ
యాయు వల్పంబు గృహ మేమి సేయ ననిన. 141

మ. బలభిత్సూనుఁడు విస్మయాత్ముఁ డగుచుఁ బ్రాయంబు నీ
కెంత నిర్మలచారిత్ర యనం దపోధనుఁడు సుత్రామాత్మజుం
జూచి లెక్క లెఱుంగఁ మృతు లైనరోమశులఁ మార్కం
డేయులం బేర్కొనఁ, నలువల్ వింశతిసంఖ్య లే నెఱుఁగ
నంతం బొందిరీసందునన్. 142

సీ. కంనిధు లేకోదకం బైన నిచటికి
వెళ్లి వెంబడి వచ్చు వేల్పునగర
మాసమయమున శాఖసహస్రాజాండ
పూర్ణమై యొకమఱ్ఱి పొదలుచుండు
నందు నేకదళంబునందుఁ జక్కనిపిన్న
బాలకుం డొక్కఁడు పవ్వళించుఁ
గోమలతరపదాంగుష్ఠంబు చిబుకుచు
నెడనెడ నవ్వుచు నేడ్చుచుండు
తే. నతనిదర్శనమున విలయార్ణవమున
నుడివడక సంచరింతు నా సుద్దు లేల
నాఁటిపిన్నాతఁ డీయదునందనుండు
సవవి మిముఁ గూడి విరిగి యీచంద మయ్యె. 143

క. బాలకుఁడు తొల్లి యిప్పుడు
తా లక్ష్మిం బెండ్లి యాడి తనయులఁ గని యీ

త్రైలోక్యగృహస్థుం డై
క్రాలెడు నని కృష్ణుఁ బిలిచి కౌఁగిటఁ జేర్చెన్. 144

తే. మదనజనకుండు మునికి నమస్కరించి
వింశతి బ్రహ్మకల్పసంవీక్షణుఁడవు
కాన విష్ణుండ వీవు నీకతన ధర్మ
పుత్త్రుమఖ మింక సఫలతఁ బొందు ననిన. 145

క. ఈగతి ననుమతి యిచ్చి మ
హాగర్వభరంబు వెట్ట నగునే నీకుఁ
వాగీశ్వరుగర్వంబును
నాగర్వ ముడిగినకథ వినవె నీ వనుచున్. 146

తే. పద్మకల్పంబునం దొక్కపద్మభవుఁడు
రాజహంసంబు నెక్కి యగ్రమున నిలిచి
చింపి మఱ్ఱాకుచాటునఁ జివికి తపము
చేసి బడలక వేఁడు వాంఛితము లనిన. 147

క. ఆతనిఁ గని యే నెఱుఁగ వి
ధాతలు చని రిరువదిటఁ గృతముకడపట నీ
చేతివరముఁ గొనుకొ ఱకునె
యీాతప మని నవ్వ నప్పు డిరువురనడుమన్. 148

మ. ధరణీచక్రము ప్రక్కలించు కొకయుత్పాతోగ్రవాతంబు ని
ర్భరవృత్తిం జనియించి వే ఱొకమహాబ్రహ్మాండభాండంబు

లోఁ,జూరు గాకుల్ వలెఁ బొఱవై చుటయు నచ్చో నొక్క-
పద్మాసనుం, డిరునాల్గోములవాఁడు మమ్ముఁగని మీరెవ్వారు
పూర్వం బనన్. 149

మ. చతురాస్యుం డను సత్యలోకనిజవాస్తవ్యుండ నాశిష్యుఁ డీ
యతివర్యుం డన నవ్వి నాయెదుర నీవా బ్రహ్మ నే నంచుఁ బ్రే
లితి నీశిష్యుఁడు నీవు నాయుడిగముల్ సేయుండు నాఁదన్మరు
ద్ధతినాతండును నేము వేఱె యొక బ్రహ్మాండంబునకా బ్రెల్లినన్.

సీ. అచ్చోట సుకృతులు నతివదాన్యులు నైన
పురుషులు మమ్ము ముప్వురను జూచి
యెక్కడివారు మీ రేలోకమున నుందు
రనిన ని ట్లనియె నయ్యష్టముఖుఁడు
బ్రహ్మలోకంబు మద్భవనంబు వీరు నా
శిష్యులు నే సరసీజభవుఁడ
నన వారు షోడశాస్యవిరించిఁ గనిపింప
నతఁడు గర్వమున మమ్మట్లపలుక
తే. నెత్తుకొని యమ్మహావాయు వేమిచెప్ప
నతని మమ్మును ద్వాత్రింశదాస్యధాత
లోకమున వైచె నిట్లు దూలుచుఁ గ్రమక్ర
మమునఁ బలువురు పద్మసంభవులతోడ. 151

క. చని కడపట సనకసనం
దనమునిసేవితుని వేయితలలవిధాతం

గన నయ్యధోక్షజుం డే
పని కిట వచ్చితిరి మీకు భద్రమె యనుచున్. 152

క. మీకృపకారణముగ నీ
లోకమ్మున నిలుతు నని పలుక నందఱు నా
ళీకభవులు మద ముడిగి వి
వేకమతిఁ మ్రొక్కి పెక్కువినుతులు సేయన్. 153

తే. ఆసహస్రాననుఁడు వారి నాదరించి
కమలజుల నెల్లఁ దత్తత్పదముల నిలిపె
నాఁటనుండియు నిచట నున్నాఁడ నేను
వారిరుహనేత్ర గర్వ మెవ్వారికి మేలు. 154

మ. అనఁ గృష్ణార్జును లాత్మఁ జొక్కుచు మునిం బ్రార్థించి య
య్యాశ్రమా,వనివర్తించుహయంబులఁ గొనుచు నవ్వా
చంయమునిం గొల్చి వా,రినిధిఁ వెల్వడి రాజలోకము ప్రహ
ర్షింప న్నిరాఘాటతం,జని పైత్రోవ జయద్రథాత్మజుని
రాజ్యం బేపునం జొచ్చినన్. 155

క. చారులచే గాండీవి మ
హారథికులతోడ వచ్చె నని విని గుండెల్
నీరై సైంధవతనయుఁడు
పేరోలగ ముండి బిట్టుపిలువడి చచ్చెన్. 156

చ. తనయునిఁజూచి దుస్సలపదంబులు తొట్రుపడంగనేడ్చుచుఁ
దననగరంబు వెల్వడి పృథాతనయుం డనిలోన మున్ను నా

పెనిమిటిఁ ద్రుంచి యిప్పు డిదె బిడ్డనిఁ జంపె ననాథఁ గావవే
ననుఁగృపనంచుఁ గృష్ణుచరణంబులపైఁ బడఁబార్థుఁడత్తతిన్.

క. అరదము గుప్పున డిగి సో
దరికిం బ్రణమిల్లి వలదు తనయవియోగా
తురత మనపాలిటికి నీ
హరి గలఁడు కృపాసముద్రుఁ డడలకు మనుచున్. 158

క. అంబుజనాభునిఁ గొల్చి ర
యంబునఁ బురి కరుగుదెంచి యాస్థానములో
నం బొలిసినసుతు శౌరి క
రంబున నిమురంగ లేచి ప్రణమిల్లుటయున్. 159

క. సభవా రందఱు నాశ్చ
ర్యభరితులై మున్ను ద్రుపదరాజుసుతకు నీ
వభిమానము గాచిన భ
క్తిభయత్రాతవుగదా గదాధర యనుచున్. 160

సీ. కృష్ణారునులకు మ్రొక్కి నుతించి బహుగీత
వాద్యనృత్యములతో వైభవములు
సేయించి రపుడు కౌంతేయుండు సుతసమ
న్వితయైనసోదరి కతిముదమున
దంతావళాశ్వయూథములు మున్నుగఁగల్గు
ధన మసంఖ్యం బిచ్చి ధర్మతనయు

యజ్ఞంబుఁ జూడ రమ్మని వేఁడుకొని వారిఁ
గదలింప నేఁడు డగ్గఱుటఁ దెలిసి
తే. వారువంబుల స్వేచ్ఛావిహార ముడిపి
కంసమథనుఁడు రాజలోకంబుఁ జూచి
ధర్మజుం డసిపత్రవ్రతంబు బడలి
సలుపుచున్నాఁడు కూర్చి కాసనమునందు. 161

క. తురగములఁ గూర్చికొని నృపు
లరుదెండు నిశాముఖంబు నప్పటికిని మీా
పరిణామస్థితులు యుధి
ష్ఠిరునకు నే నరిగి తెలియఁజెప్పెద ననుచున్. 162

కృష్ణుండు దా నొక్కరుండు కరిపురంబు ప్రవేశించుట

చ. కరిపురి చేర నేగి కుతుకంబునఁ దన్నికటస్థజాహ్నవీ
సరిదుపకంఠనిర్మితవిశంకటకాంచనరత్నమండపాం, తరమున
సంయమీశ్వర సనాథుని ధర్మతనూజుఁ గాంచి యన్మురమథ
నుండు నెయ్యమున మ్రొక్కి ప్రమోదముతోడ నిట్లనున్.

క. జననాథ నీప్రతాపం
బునకును సవ తెద్ది సకలభూపాలుర న
ల్లనగెల్చి హయముఁ గొని నీ
యనుజన్ముఁడు వచ్చె నిదె మహావిభవముతోన్. 164

ఆ. అని మరాళకేతుఁ డాదిగా సకలరా
జన్యవరులఘోరసమరవిధము
జలధిలోనఁ దపము సలిపెడుబకదాల్భ్యుఁ
దెచ్చుటయును వరుసఁ దెలియఁ జెప్పి. 165

వ. అచ్చటం బరివేష్టించినవిశిష్టజనంబులకుం గుశలప్రశ్నపూర్వకంబుగా నమస్కరించి కుంతికిం దల్లులకుం బ్రణమిల్లి తనకు మ్రొక్కినభీమసూద్రేయసుభద్రాద్రౌపదుల నాదరించి వృకోదరసహితంబుగా నిజగృహంబునఁ బ్రవేశించి రుక్మిణీసత్యభామాదిభామాజనంబులయుల్లంబులు పల్లవింప నక్కపటవల్లవుం డించుకవడి వినోదించి మణిమకరతోరణపట్టపటధ్వజవితానధూపధూమంబులం బురంబు శృంగారింప నియమించి ధర్మజానుమతంబునఁ బౌరజనబంధుపురోహిత వారవధూజనంబు లగ్రప్రకారంబులం గదల భీమాదియోధవరులతోడం జతురంగబలసమన్వితుండై బకదాల్భ్యునెదురుకొనువేడుకం గదలి నిరర్గళసౌరభోద్గారివిహారవనీసమీపంబున నర్ధచంద్రవ్యూహంబు వన్నించి నిలిచె నంతట భానుమంతుం డపరసరస్వంతంబు చెంత నిలిచె. 166

సీ. సురభిచంపకతైలపరిషేచనోజ్జ్వల
త్కరదీపికాపరంపరలతోడ
నభినవాంబరపుష్పహారాంగరాగశృం
గారితరాజలోకంబుతోడ

మందరమంథానమథితాంబునిధిఘుమం
ఘుమిత నాసీరసంకులముతోడ
నిబిడాంబుధరగర్భనిర్భేదనారంభ
చటులమాణిక్యధ్వజములతోడ
తే. హాటకానర్ఘమణిశిబికాధిరూఢుఁ
డైన బకదాల్భ్యుతోడ మాద్యత్కరాళ
పవనహయములతోడ గాండివధరుండు
కౌతుకముతోడ హరిసేనఁ గదిసె నపుడు. 167

తే. ఎదురుకొని పౌరభామిను లింద్రసుతుని
మౌళిపైఁ జల్లుకొనిరి వ్రీల్ మానికములుఁ
గ్రమ్ముకొని యమ్మహాస్థలి గంధవతియు
రత్నగర్భయు ననుట సార్థకముచేసె. 168

క. బకవైరిముఖ్యు లత్తఱి
బకదాల్భ్యమునీంద్రుపాదపద్మములకు వే
డుక మ్రొక్కి యపుడ సైన్య
ప్రకరంబులఁ గలసి కరిపురము సొచ్చుటయున్. 169

క. భూపాలకు లందఱు వివి
ధోపాయనహస్తులై యనూనక్రతుదీ
క్షాపరుఁ డగుధర్మతనయు
శ్రీపాదంబులకు నెరఁగిరి ప్రమోదమునన్. 170

ఆ. అపుడు విదురముఖ్యు లైనబాంధవసమ
త్కారముతోడ నోలగమున నున్న
యాంబికేయునకుఁ బ్రియంబున నెఱిఁగించె
శౌరి వరుసతోడ సకలనృపుల. 171

సీ. ఇతఁడు నీలధ్వజుం డీశౌర్యనిధిపుత్రి
స్వాహకు మగఁడు వైశ్వానరుండు
బభ్రువాహుఁ డితండు పార్థుని బ్రదికించె
రణములో జీవదరత్నమునను
జంద్రహాసుండు విస్మయచరిత్రుం డితం
డలిగినఁ బంకింతు రమరులైన
బర్హికేతనుఁ డీనృపాలుఁ డే నడిగిన
సగ మిచ్చెఁ దనువు నిశ్శంకఁ గోసి
తే. యితఁడు హంసధ్వజుఁడు వీనిసుతులశిరము
లాజి రుద్రుండు ధరియించె హారములుగ
వీరవర్మ జమునిమామ వీరియట్లు
యొకరికిని నొక రధికు లీయున్ననృపులు. 172

చ. అని వినిపింప నప్పు డమరాధిపసూనుఁడు వచ్చి ధర్మనం
దనునకు నమ్రుఁడై కెళవునఁ భజియింప ముదశ్రుపూరలో
చన యయి కుంతి క్రీడిబహుశస్త్రగణవ్రణితాంగముం గ
రం,బున నిమిరెం దనుం గదిసి మ్రొక్కినకర్ణజుఁ గౌఁగిలిం
చుచున్.

ఉ. ద్రౌపదియోషధుల్ గొనుచు రా ననుయాయిమురారిము
ఖ్యనా, నాపృథివీశ్వరుండు యమనందనుఁ డధ్వరభూమికి
ద్ధిగా, బాపదొడంగె నాఱువృషభంబులఁ బూనినమే
టినాఁగటం, దాపసకోటి మంత్రపఠనంబులతోఁ జనుదేర న
త్తఱిన్. 174

క. ఆదీక్షితు మణికుంభ
స్వాదువిమలగంధసారసలిలంబులఁ గుం
తీదేవకీయశోదలు
సాదరులై చేసి రప్పు డభిషేకంబుల్. 175

ఆ. తొలుత నెనుమనూటతొమ్మిదిపైఁ డిట్టి
కల సుపర్ణరూపుగా నమర్చి
యిట్టు లొకటి కొకటి కినుమడిసంఖ్యగా
గరుడవేదిపంచకంబు దీర్చి. 176

సీ. శాస్త్రోక్తి నిష్టకాచయనంబు చేసి య
ష్టద్వారసవనమండపము నట్లు
కనకంపుటిటికలఁ గట్టించి వివిధర
త్నవితానతోరణధ్వజము లెత్తి
బదరిబిల్వపలాశబహువారయూపంబు
లాఱునైదును నైదునైదు నిలిపి
స్రుక్స్రువోలూఖలజుహువులు మొదలైన
యజ్ఞసంభారంబు లలవరించి

తే. వింశతిబ్రహ్మకల్పజీవితు వివేక
పారగుం డగుబకదాల్భ్యు బ్రహ్మఁ జేసి
యాగమరహస్యనిస్సంశయక్రియాతి
చతురు సాత్యవతేయు నాచార్యుఁ జేసి. 177

ధర్మజుం డశ్వమేధంబు కావించుట

వ. వసిష్ఠ వాసుదేవ రోమశ సుమంత గాలవ కపిల సౌబరి భరద్వాజ భాగురి రైభ్య జమదగ్ని జతుకర్ణ కౌండిన్య గౌతముల ఋత్విజులంగా వరియించి, అరుణి పులహోప మన్యు విశ్వామిత్ర మధుచ్ఛంద విభాండక ధౌమ్యవాయు భక్షుల రక్షోఘ్నమంత్రంబులు పఠియించుచు బహిర్ద్వా రంబుల నుండ నియమించి ధర్మనందనుండు మృగశృంగ ధరుండును రురుచర్మవసనుండును గుశాసనుండును నై యున్నసమయంబునఁ బరాశరాత్మజుండు రాజలోకంబు నవ లోకించి మీరు కళత్రసమేతులై జాహ్నవీపవిత్రోదకం బుల నజాతశత్రు నభిషేకింపవలయు నన ననసూయాత్రులును నరుంధతీవసిష్ఠులును రుక్మిణీకృష్ణులును హిడింబాభీమసేను లును సుభద్రార్జునులును మాయావతీప్రద్యుమ్నులు నుషా నిరుద్ధులును బ్రభద్రావృషకేతులును నీలావతీమయూర ధ్వజులును బ్రభావతీయావనాశ్వులును సునందానీలకేతు లును ధమ్మిల్లానుసాల్వులును మొదలుగాఁ జతుష్షష్టిదంప తులు బద్ధపల్లవకలశంబులు గొనుచు మందమందగమనం

బునఁ గదలి ముందటఁ గ్రందుకొని గీతవాద్యనృత్యంబులు
బెరయ గజాధిరూఢలై విప్రకన్యలు చల్లుమౌక్తికంబులు
నెరయ మునిపఠితవేదమంత్రంబులు మొరయఁ గుంతీదేవకీ
యశోదలం బురస్కరించుకొని యరుగునవసరంబున. 178

క. నారదుఁడు సత్యభామా
గారంబున కరిగి పూజఁ గైకొని హరి నీ
కూరిమిప్రియుఁ డందు విపుడు
దా రుక్మిణి కిచ్చెఁ బెద్దతన మెట్లనినన్. 179

శా. రాజన్యుల్ సకళత్రులై యరుగుదేరం జామరచ్ఛత్రవి
భ్రాజిష్ణుం డగుకృష్ణుఁ గూడుకొని దాంపత్యంబునన్ రుక్మిణీ
రాజీవానన యేగ నీచనవు వ్యర్థం బయ్యెఁ బొమ్మన్న స
త్రాజిత్పుత్రి యనుఁ దనున్ మఱచునే ప్రాణేశ్వరుం డయ్యెడన్.

క. అని తనకేళీసౌధం
బున నున్నమురారిఁ జూప ముని విస్మితుఁడై
వనజోదరుఁ డెయ్యెడ లేఁ
డని కొనియాడుచు నిజేచ్ఛ నరిగెన్ బిదపన్. 181

తే. మేలములతోఁ జతుష్షష్టిమిథునములును
బద్ధచేలాంచలంబులై ప్రసవగంధ
పూజితస్వర్ణకుంభసంపూర్ణజాహ్న
వీపవిత్రోదకంబులు వేడ్కఁ దెచ్చి. 182

సీ. శుభతూర్యరవము భూనభములఁ బూరింప
విహితమంత్రములు ఋత్విజులు చెప్ప
మఖవాహమునకు హేమకటాహమునఁ బోసి
యమసూతి కభిషేక మాచరింపఁ
బూతాత్ముఁ డగుధర్మపుత్త్రుండు పరమసం
యమివరేణ్యులపదాబ్జములు గడిగి
కనకాసనము లిడి కౌశేయగంధమా
ల్యవిభూషణముల నలంకరించి
తే. యుక్తదక్షిణ లర్పించి యూపబద్ధ
హయముఁ బాంచాలియును దాను నర్థిఁ బూజ
చేసి వలగొని-వహ్ని రోచిర్ముఖమునఁ
జెంది గంధర్వలోకంబుఁ జేరు మనిన. 183

క. సాభిప్రాయత నది ప్రో
థాభినయముఁ జూప నకులుఁ డశ్వహృదయత
త్త్వాభిజ్ఞుఁ డగుట ధర్మత
నూభవునకు విన్నవించెను విచిత్రముగన్. 184

తే. క్రతువులకు నెల్ల హరి కర్మకరుఁడు గామి
స్వర్గఫలమాత్ర మిపుడు సాక్షాత్కరించి
శౌరి యున్నాఁడు మామకాస్యమున ననుచు
సభికులకుఁ జెప్పె ననఁ గృష్ణసహితఋషులు. 185

మ. క్రతుగంధర్వము మంత్రపన్నముల సంస్కారంబు గావించి
దివ్యతపోగణ్యుఁడు ధౌమ్యుఁ డాహయము సవ్యశ్రోత్ర
కోణంబు పీడితముం జేయఁ బయఃకణప్రకర ముడ్డీనంబుగాఁ
జూచి విస్మితులై పాండవముఖ్యు నధ్వరసభాసీనుల్ ప్రశం
సింపఁగన్. 186

క. మారుతి పురోధయనుమతి
దోరసిచే హయముశిరముఁ దునిమిన నది య
ద్ధారణిఁ బడక దివికిఁ దే
జోరూపముతోడ నెగసి సూర్యునిఁ గలసెన్. 187

క. మురహరుఁ డత్తురగకళే
బరము విశసనంబు సేయఁ బటుతర మగు నా
హరితేజము హరిఁ గలసెను
గర మరుదుగఁ బలలరాశి కప్పుర మయ్యెన్. 188

క. మును లయ్యపఘనసారము
ఘనసారం బైనఁ జిత్రకర మిది కుంతీ
తనయాగ్రణి నీభాగ్యం
బున కెయ్యది మేర యనుచుఁ బొగడుచు నుండన్. 189

క. ఆహయకర్పూరము ప్రథ
మాహుతిగాఁ జేసి స్రువము నాచార్యుఁడు కౌ
తూహలమున నింద్రాయ
స్వాహా యనఁ జేయి సాఁచి శతమఖుఁ డందెన్. 190

సీ. అట్లు వేదవ్యాసుఁ డాహుతు లొసఁగఁ బ
న్యాయంబున నిలింపు లందుకొనిరి
యాహోమమున సచరాచరత్రైలోక్య
మునఁ జాల సంతృప్తి పొదలె నపుడు
సురభి పురోడాశసోమపానముల నా
నందించె ఋత్విగ్గణంబు వరుస
యమతనూభవుఁడు పూర్ణాహుతి వేల్చి బాం
ధవులతో నవభృథస్నాన మాడ

తే. సోమయాజులఁ జూచి కృష్ణుండు నగుచుఁ
గదిసి యందంద బిగియారఁ గౌఁగిలించె
నాయరుంధతి యనసూయ లాదియగువ
ధూజనం బిచ్చె వివిధనీరాజనములు. 191

తే. మౌని బకదాల్భ్యునకు రత్నమయవృషంబు
దాన మిచ్చి పరాశరాత్మజున కఖిల
వసుధ యాచార్యదక్షిణ యొసఁగ నతఁడు
తిరుగ నమ్మినధన మిచ్చె దీనులకును. 192

చ. అరదము సింధురంబు ననుయాయిచతుష్కము భార మర్థము
న్మరిదశకంబు గోశతము నాలుగుమానలు ముత్తియంబులున్
గురుకులనూళి ఋత్విజులకున్ బ్రతిహారుల కర్థి నిచ్చి యం
దఱకుఁ దదర్థమున్ ధనము లన్యసదస్యుల కిచ్చె దక్షిణల్.

తే. కోటిసొన్నాలు దశశతఘోటకములు
వారణశతంబు నొక్కొక్కవరుస తోడవు

లిచ్చె వేర్వేఱనృపతుల కిందు రెట్టి
యాదవుల కెల్ల నర్పించె నాదరమున. 194

క. అనిలసుతపార్థమాద్రీ
తనయులు మన్నించి బహువిధము లగుమణిమం
డనముల రుక్మిణి మొదలగు
వనితలఁ బూజించె నధికవాత్సల్యమునన్. 195

చ. అతులితభక్తిఁ గృష్ణుఁ గనకాసనసంగతుఁ జేసి రత్నసం
తతుల నలంకరించి యమనందనుఁ డర్మిలి ధారవోసెఁ ద
త్క్రతుఫలమమ్మహాత్మునికరంబున నప్పు డనల్పకల్పక,క్షితిరు
హాపుష్పవృష్టి గురిసెన్ మొరసెన్ దగ దివ్యదుందుభుల్.

చ. మఖపరిపూర్తిఁ గన్గొని సమస్తజనంబులు నుబ్బి వేనవేల్
ముఖముల ధర్మనందనుఁ బ్రమోదమునం గొనియాడి రప్పుడ
య్యఖిలనృపాలకోటికి మహర్షులకుం దనపాకచాతురీ,సుఖ
మెఱిఁగింప గంధవహసూనుఁడు విందని చెప్పె నేర్పునన్.

క. బిరుసింతగాక నడిమికి
మురియక నను బ్రాయి వడి చిముడఁబొఱక యే
బెరికియును లేక మిక్కిలి
గరగర నగు నేఱు ప్రాలకలమాన్నంబుల్. 198

చ. సరములరీతిఁ గ్రొన్నెలలజాతి బిసంబులభాతిఁ బద్మకే
సరములభంగిఁ దారకలసంగతిఁ దార్పులమాడ్కిఁ బుష్పమం
జరులవిధంబునన్ మణులచాడ్పునఁ జెక్కులుగంధతైలపా
కరచితముల్ విచిత్రములు కమ్మనినైఁ దపుఁబిండివంటలున్.

ఆ. పత్త్రపుష్పమూలఫలశలాటువులచే
బహువిధముల శాకపాకములును
భిన్నరుచులు గానిపింప నిమేషమా
త్రంబులోన నాయితంబు సేసె. 200

క. పరిపరిధూపంబుల నర
విరుల తెరల రత్నదీపవితతుల నూర్ణా
_స్తరణములఁ బొలుచుతావులఁ
బరమఋషులు నృపులు వరుస బంతులు సాగన్. 201

తే. పసిఁడియొడ్డెనలను మించుపద్మరాగ
భాజనంబుల వడ్డించుబహుపదార్థ
వితతు లమరెను మేరుసంగతసహస్ర
కరునిఁ బొదివినచిత్రమేఘములకరణి. 202

క. అత్తఱి షడ్రసయుతము
ల్చిత్తమలర భక్ష్యభోజ్యలేహ్యాదికముల్
మత్తచకోరాక్షు లిడం
గుత్తుకబంటిగ భుజింపఁ గొందఱుతపసుల్. 203

సీ. చింపివల్కలము లేమిచేసెడి దనఁ గావు
నెఱివైనకండమండెఁగలుగాని
తెగినజందెము లేల తెచ్చెద రనఁ గావు
వినుఁ డివి సన్న సేవియలుగాని
యౌదుంబరము లనర్హము లొల్ల మనఁ గావు
నమలిచూడుఁడు మోదకములుగాని

ఫేనపుంజము లేలపెట్టెద రనఁ గావు
నీపాదమాన ఫేనికలుగాని

తే. యంచు వాచంయములు వల్క నబ్జముఖులు
నగుచు నోడఁబడఁజెప్ప నందఱు యథేష్ట
రుచుల భుజియించి వార్చి కర్పూరవీటి
కాసుగంధప్రసూనసౌఖ్యములఁ దనిసి. 204

క. అనిలజునిఁ బెక్కుభంగులఁ
గొనియాడుచు సవనవాటిఁ గొలువున్నతఱిన్
జను దెంచిరి తమలోపల
నెనయక కలహించుకొనుచు నిరువురువిప్రుల్. 205

క. ఆవిప్రు లపుడు ధర్మజు
దీవించి వివాద మొకటి తీర్ప నగు నన్నన్
మీవాదము దీర్చెదరు స
భావరు లీయరుణిపులహాబకదాల్భ్యు లనన్. 206

తే. వినుఁడు నే యజ్ఞశర్మ నీవిష్ణుశర్మ
చేత నొకవృత్తిఁ గొంటి నాక్షేత్ర మిపుడు
దున్న నం దొకనిక్షేప మున్నఁ దన్నుఁ
బిలిచి కైకొను మన్న నొప్పించుకొనఁడు. 207

క. నావిష్ణుశర్మ యిట్లను
నే వృత్తి క్రయంబునకును నిచ్చినపిదపన్
నావిత్తమె ధర్మ మెఱుఁగఁ
డీవెఱ్ఱి యటన్న వెన్నుఁ డిట్లనె నగుచున్. 208

క. తెగ దిప్పుడు మూన్నెల్లకుఁ
దగ వడుగఁగ రండు దీర్చెదను బొందు వృథా
జగడింపకుఁ డన వారలు
నగరికె నిక్షేప మొప్పనముచేసి చనన్. 209

మ. యమసూనుం డనుఁ గృష్ణుఁ జూచి బకదాల్భ్యవ్యాసకణ్వా
దిసం,యము లుండఁగా దెగుఁదెంపు సేయ కిటు లేలా వారిఁ
బొమ్మంటి వ,న్న ముకుందుం డను నీసమక్షమున నానాశా
ఖ్యగోష్ఠిఁగా వినో,దములకాఁ బ్రొద్దులు పుచ్చు నెక్కుడివివా
దం బంచు న ట్లంపితిన్. 210

క. అంతఁ గలియుగము చొర నీ
శాంత ముఁడిగి వారు మగుడ జగడింప ధనం
బంతయును బంచి యిచ్చెద
నంతియ కాదు విను కలియుగాచరణంబుల్. 211

సీ. ఆమ్నాయపథవిహీనాచారములచేతఁ
బ్రబలు నన్యోన్యవైరములచేతఁ
నన్యాయవర్తను లైననరాజులచేత
సమకొన్న దుర్వ్యసనములచేత
ధర్మపత్నీనిరాదరకృత్యములచేతఁ
బ్రభవించువేశ్యాభిరతులచేతఁ
బరధనపరదారహరణబుద్ధుల చేత
నలమినఘోరమోహములచేత

తే. జాలికాదులచేత దూషకులచేతఁ
బ్రల్లదులచేత వంశనాపకులచేత
డాంబికులచేతఁ బచ్చిబండగులచేతఁ
గల్లరులచేత దర్పించుఁ గలియుగంబు. 212

క. సోరిది ననాచారంబులఁ
మురు వగుచుం బ్రథమపాదమునఁ గలిమహిమం
బెరుఁగును వద్లును గలిపిన
కరణిన్ వర్ణాశ్రమములు కర్తరి గలయున్. 213

క. ఆసమయంబున ధర్మజ
నే సోమకులంబునను జనించి కుటిలురన్
శాసించి ధరణి పాలన
చేసెదఁ దగ సాళ్వనారసింహుఁడ నగుచున్. 214

చ. అని వినిపించి శౌరి శమనాత్మజుఁ డర్మిలి నిచ్చుపూజ గై
కొని సకుటుంబుఁడై నృపతికోటి భజింపఁగ ద్వారకాపురం
బున కనురక్తితో నరిగి పూర్వపదంబుల నిల్పె రాజులన్
జననుతుఁ డాయుధిష్ఠిరుఁడు సర్వధరిత్రియు నేలె నున్నతిన్.

మ. అనువారంబు నజాతశత్రుహయమేధారంభమున్ యావనా
శ్వనృపాలాదిమహీశవర్తనములున్ సద్భక్తిఁ బాటించి వి
న్నను రామాయణభారతశ్రవణకన్యాగోసహస్రక్షమా
ధనదానాధికపుణ్యముల్ దొరకు మర్త్యశ్రేణికశ్రాంతమున్.

క. ప్రేమమున శ్రోత వక్తకుఁ
జామీకరహయము ధవళచామరములు నా

నామణివిభూషణంబులు
గ్రామముఁ గృపసేయవలయు గ్రంథసమాప్తిన్. 217

క. అని జైమిని వినిపించిన
జనమేజయజనవిభుండు సంతసమున న
మ్మునివరుని గారవించుచు
వినియెం దరువాతికథలు వేడుక ననుచున్. 218

సీ. నీకును మల్లమాంబాకుమారునకు సో
మకులాంబునిధిపూర్ణిమావిధునకు
భరతకీర్తికిఁ దులాపురుషాదిదానాంబు
జంబాలితాస్థానసౌధునకును
బరరాజభీకరధరణీవరాహున
కాత్రేయగోత్రపవిత్రునకును
గుండయనరసింహమండలేశ్వరునకు
నభ్యుదయపరంపరాభివృద్ధి
తే. కరముగా భారతీతీర్థగురుకృపాస
మృద్ధసారస్వతుఁడు సత్కవీంద్రసఖుఁడు
కుకవిమల్లకపోల్లసత్కులిశహస్త
పల్లవుఁడు చెప్పెఁ బినవీరభద్రసుకవి. 219

శా. గౌళీమానసరాజహంసకుకురీకందర్ప చోళీకపా
లాలంకారశకీకరార్పితవిలాసాకల్ప లాటీకళా
కేళీకౌతుకమాళవీమధురసంగీతాదరస్వాంత నే
పాళీకుంకుమపంకలిప్తకుచకుంభన్యస్తహస్తాంబుజా. 220

పాదభ్రమకము.—

క. వీరవరకైరవరవీ
సారసభరసౌధయూధసౌరభసరసా
వారణరథ్యరణరవా
తారభవనతానమావతానవభరతా. 221

మత్తకోకిల.—

శర్వరీశకులావతంసయశః ప్రతాపవిభూషణా
గర్వితాహితరాయమీసరగండభీకరవిక్రమా
పూర్వవిశ్వవసుంధరాభృదపూర్వదిక్తటహార కా
నిర్విశేషవిపానుబంధురనిత్యసత్యగుణోదయా. 222

గద్యము. ఇది భారతీతీర్థ శ్రీచరణకరుణాపాత్ర గాదయామాత్య పుత్త్ర వినయవిద్యాసముద్ర పినవీరభద్రప్రణీతం బైన జైమిని భారతంబునం దశ్వమేధపర్వంబున సర్వంబును అష్టమాశ్వాసము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1953.

## నిఘంటువులు

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| వావిళ్లనిఘంటువు (అ-ఔ వఱకు) 1-వ సంపుటము ... | 10 | 0 |
| డిటో (క-ఞ వఱకు) 2-వ సంపుటము ... | 1[illegible] | 0 |
| డిటో (ట-మ వఱకు) 3-వ సంపుటము | అచ్చు[illegible] | |
| శ్రీవేంకటేశాంధ్రము, పద్యకావ్యము ... | 0 | [illegible] |
| బాలచంద్రోదయము, అలఘుకౌముది ... | 1 | 0 |
| షడ్భాషామంజరి, (ఆరుభాషల ఒకేమాటలు) ... | 2 | 8 |
| తెలుగుసామెతలు with English Translation by Captain Carr ... | 2 | 0 |
| శబ్దార్థచంద్రిక, శ్రీమహాకాళి సుబ్బారాయకృత ఆంధ్రనిఘంటువు | 10 | 0 |
| Sankaranarayana's English Telugu Dictionary, శంకరనారాయణగారినిఘంటువు (ఇంగ్లీషుపదములకు తెనుఁగు అర్థములు) ... | 5 | 0 |
| ,, (తెనుఁగుపదములకు ఇంగ్లీషు అర్థములు) | 12 | 0 |
| English-Telugu Pocket Dictionary ఇంగ్లీషు-తెనుఁగు పాకెట్టు డిక్షనరి ... | 5 | 0 |
| Translation Guide [English to Telugu & vice versa] | 2 | 0 |
| సంస్కృతాంధ్రనిఘంటువు ... | 5 | 0 |
| త్రికాండశేషము, సటీక ... | 1 | 12 |
| విశ్వకోశము, (విశ్వనిఘంటువు) సటీక ... | 2 | 8 |
| మేదినీకోశము ,, ... | 4 | 0 |
| హారావళి, ఏకాక్షరకోశము ,, ... | 1 | 0 |
| అమరము, ప్రథమకాండము మూలము పెద్ద ... | 0 | 4 |
| ,, ,, టీక ... | 0 | 10 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము .. | 0 | 3 |
| ,, టీకతో ... | 0 | 10 |
| అమరము 3 కాండలు, మూలము ... | 1 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
పోస్టుబాక్సు 1372, మద్రాసు. 1.



| మనసు ఫౌండేషన్ |
|---|
| పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RE14B02 5188 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 9,1,2024 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 365 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CJ,337 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | S.Sakshi |
| పేజీలు విడదీసినది | S.Sakshi |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | rohith |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | no |
| తప్పులు | no |
| పరిస్థితి | good |